# ఆంగ్లదేశ చరిత్ర

(విద్యార్థులచే సులభముగా పఠింపబడిన యీ గ్రంథ
మిలాగున ననుసరించి వ్రాయబడినది.)

ఆంగ్లమున గ్రంథకర్త:
ఎల్. జి. బ్రాండన్, ఎం.ఏ.

ఆంధ్ర విశ్వవిద్యాలయమందు, ఆంధ్రభాషోపన్యాసకులగు
పింగళి లక్ష్మీకాంతముపంతులు, ఎం.ఏ. గారిచే
నాంధ్రీకరింపబడినది.

(పెక్కు చిత్రపటములతోను, దేశపటములతోను గూడినది.)

చెన్నపురి:
ఇండియన్ పబ్లిషింగ్ హౌస్, లిమిటెడ్
1931

 | వెల రూ. 2—4—0.

# ఉపోద్ఘాతము

ఈ చరిత్రమును ఆంగ్లమున వ్రాసిన యైతిహాసికుడు యల్. జి. బ్రౌండను, ఎం. ఏ. అను ఉపాధ్యాయుడు. ఈయన కడు సమర్థుడని వినికి. ఈ గ్రంథ రచనవలనగూడ నట్లె తోచెడిది.

దేశభాషల మూలముననే విద్య గఱపవలె నను భావము నానాటికి పెంపొందుచున్నది. ఇది యెప్పటికి కొనసాగునో దైవమెఱుగును. కాని పురుషకారమున లోపము ఉండరాదు గనుక, మునుముందు మనము, దేశభాషలలో గ్రంథములు రచించుటయు, వానిని ఉపయోగించుటయు మేలు. గ్రంథ ప్రకాశకులు పెక్కుమంది యీ సత్కార్యమును జేయుచునే యున్నారు వారిలో చెన్నపురియందుగల, "ది ఇండియన్ పబ్లిషింగు హౌస్" వారుగూడ మిక్కిలి గణనీయులు.

వారు, ఈ యాంగ్లదేశచరిత్రను తెనిగింపవలసినదని స్నేహపూర్వకముగా నడుగ, నేను ప్రీతిపూర్వకముగా నందులకు నూల్కొని యది నెరవేర్చితిని.

మూలకర్త బహు భావబంధుర హృదయుడు. సాధారణముగ నట్టివారి రచన గంభీరమై అనువాదసులభము గాకుండును. అయినను నేను యథాశక్తి దానిని తెనిగించి యిచ్చితిని. దీన, నే నెందును మూలాతిక్రమణము చేయలేదు.

యథామాత్రృకముగానే వ్రాసితిని. అందుచేతనే వాక్యఘట నాదికమున అచ్చటచ్చట చిక్కువచ్చెడిది—నాచేత నైనంత వఱకు ఆ చిక్కు తొలగించుకొని, మన భాష కనుగుణ మగు యోజనాపద్ధతి నవలంబించి రచనను ధారాళముగా జేయ యత్నించితిని. అందు ఎంతమట్టుకు కృతార్థుడనైతినో చదువ రులు చెప్పవలెను.

మఱియు, ఇందు అర్ధానుస్వార సంధికార్యాది వ్యాకరణ నియమములను నేను పాటింపలేదు. ఎచ్చటనేని ఆ కార్యములు జరిగిన, అది బుద్ధిపూర్వకముకాదు. ఆ నియమములన్నియు సాహితీ గ్రంథములలో పాటింపవగునేకాని, విషయప్రధాన ములైన చరిత్రాదుల నక్కరలేదని బహు పండితాభిప్రాయము. అట్లని దీనిని వ్యావహారిక భాషలో వ్రాయలేదు. గ్రాంథిక పద్ధతినే వ్రాసితిని.

దీని గుణదోషములను లోకమారసి తెల్పవలెనని యాసిం చుచున్నాను. బహు ధనవ్యయసాధ్యమైన గ్రంథ ప్రచురణ మహాకార్యమును దీక్షతో సాగించుచున్న యీ కంపెనీవారికి దేశీయులు బహువిధముల తోడ్పడి వారి యాశయములు ఫలించునట్లు చేయుదురుగాక.

మదరాసు.
1—6—31.

పింగళ లక్ష్మీకాంతము.

# విషయసూచిక

శ్రీ వేంకటేశాయ నమః

శ్రీ గురుభ్యో నమః

# ఆంగ్లదేశచరిత్ర

## మొదటి ప్రకరణము

### కెల్టులును రోమనులును నాటి బ్రిటనుదేశము

బ్రిటనుదేశముయొక్క అతి ప్రాచీనచరిత్రనుగూర్చిన యథార్థాంశములు, అంతగా తెలియవు. గుహాభిత్తికలయందలి చిత్రములను, ఆ గుహల యడుగుభాగమున పూడిపోయిన శిథిలవస్తుసముదాయమును, సమాధిగతమైన అస్థిసంచయమును పరికించి, పర్యాలోచించి, ఆ వివరము లన్నియు చరిత్రరూపమున గుదిగూర్ప చరిత్రకారులు కొంత ప్రయత్నించిరి. వానిని బట్టి చూచినచో, వేనవేలసంవత్సరములకు పూర్వమే, యీ దేశమున, మానవజాతి నివసించియుండె నని గ్రహింపనగును. వా రానా డుపయోగించిన శిలాయుధములు లభించినవి. వానిని బట్టి యైతిహాసికు లాయుగమునకు "ప్రాచీనశిలాయుగ"మని పేరిడిరి. ఆ యుగమునకు పిమ్మట, చాలకాల మీదేశము నిర్జనముగా నున్నట్లును, మఱికొంతకాలమునకు మరల, జనులు చేరినట్లును తోచెడిని. ఈ జనులు యూరపుఖండములోని ఇతరదేశములనుండి వచ్చినవారు. వారు, మగటిమిగల యోధులు. వారుపయోగించిన బల్లెములును, బాణములును వాడిగల రాతిమొనలతోడివి యగుటచే, వారికాలమునకు

"నవీనశిలాయుగ" మని పేరు. ఈ యుగము వారికి, గోవులను, పందులను, కుక్కలను, మేకలను పెంచు నాచారముకలదు. కాని, నేల దున్ని, పంటలు పండించుకొనుట యెఱుగరు. ఇతరదేశములతో వర్తకవ్యాపారములు చేయుచుండువారు. ఈ మూలముగా, వా రీదేశములోనికి "కంచు" లోహమును కొని వచ్చిరి. క్రమముగా ఈ లోహమే గృహోపకరణముల కును, యుద్ధోపకరణములకును వాడిరి. దానిపేరుమీాద, చరిత్రకారులు, ఈ కాలమునకు "కాంస్యయుగ"మని పేరిడిరి. క్రీ. పూ. 1700 ఈ యుగప్రారంభదశ.

ఈ కాలమున 'కెల్టులు' అను ఒకజాతివారు సముద్రము దాటి యీా దేశముమీాదికి దాడివచ్చిరి. వారిలో కొందఱు యూారపుఖండపు ఉత్తరభాగమునుండియు, మఱికొందఱు దక్షిణ భాగమునుండియు వచ్చినవారు. కంచును వివిధవస్తువులుగా చేసి వాడుకొనుటలో వారు నిపుణులు. కాని యీా దేశ మున వారికి పూర్వమున నున్నవారు దాని యుపయోగము నప్పుడప్పుడే గ్రహించుచుండిరి. ఈ నిపుణతవలననే కాబోలు, ఈ 'కెల్టులు' ఈ దేశమున చాలభాగము జయించి లోపఱుచు కొనిరి. అటుపిమ్మట వేయిసంవత్సరములకు వేఱొక 'కెల్టు' దాడివచ్చెను. ఈ క్రొత్తవారికి ఇనుమును ఉపయోగించు నిపుణతయు కలదు. క్రమముగా యుద్ధోపకరణములకు ఇనుము నుపయోగించుచు, కంచును ఆభరణములుగా, గృహోపకరణములుగా ఉపయోగించిరి. రోమనులు, బ్రిటనుదేశమునుగూర్చి కర్ణాకర్ణిగ వినునాటికే కెల్టులు, మంచి పనితనమును, సొగసుదనమును గల కంచునగలను చేయు చుండిరి. మఱియు వీరు తగరమును, ఇనుమును కూడ కని

పెట్టిరి. ఇంతియెకాక, ఈ దేశపు దక్షిణప్రాంతముల నున్న వారు, బహుసంఖ్యాకులై భూమిని సాగుచేసి గోధుమలు మొదలగు ధాన్యములను పండించుకొనుచుండిరి. కాని ఉత్తర ప్రాంతమున అల్పసంఖ్యాకులే కలరు. వారికి వేటాడుటతప్ప కృష్యాదులు తెలియవు.

ఈ 'కెల్టులు' కేవలము దైవచింతాశూన్యులు కారు. వారిసంస్కారమననుసరించి వారికిని ఒకమతము కలదు. "డ్రూయిడులు" (Druids) అనువారు, వారి పురోహితులు. ఇంగ్లాండులో అచ్చటచ్చట, నేటికిని, తోరణాకారముగా నున్న శిలానిర్మాణములు కానవచ్చును. "స్టోనుహెంజి" అను ప్రదేశమున అట్టిది ఒకమండలమే కలదు. ఈ నిర్మాణములు అతి ప్రాచీనములయినవి. వీనిని 'డ్రూయిడు'లే నిర్మించియుందు రని ప్రజలు తలంచుచుండిరి. కాని అవి వారికంటెను ప్రాచీన తరములని, ఇటీవల నిర్ధారింపబడినది.

## జూలియసు సీజరు:—దండయాత్రలు

## క్రీ. పూ. 54—55

బ్రిటనుదేశపు 'కెల్టులు' కాలక్రమమున కొంతకుకొంత ఇనుము, కంచు లోహముల వివిధోపయోగములను గ్రహించి, వానిని వినియోగించుకొను వివేకము సంపాదించుకొనునాటికే, అతిప్రాచీనమైన రోముపట్టణము, సమగ్రనాగరకతాశోభితమై స్వీయసామ్రాజ్యమును నానాటికి విస్తరింపజేసికొనుచుండెను. పరిపూర్ణరోమనుసామ్రాజ్యనిర్మాణము క్రీస్తుశకమునకుపిమ్మట కొంతకాలమునకుగాని నెరవేరినదికాదు, కాని, క్రీ. శ. 120 సం॥ నాటికే, మధ్యధరాసముద్రతీరమును కలయనంటికొనియున్న

భూభాగములన్నియును, ఆ సామ్రాజ్యములోనివే అయ్యెను. 'జూలియసుసీజరు' అనునాతడు రోమనుసామ్రాజ్యమునకు అలంకారభూతుడగు శూరాగ్రేసరుడు. ఆతడు క్రీ. పూ. 58-వ సంవత్సరములో 'గాలు' దేశముమీదికి దండెత్తిపోయి దానిని లోపఱచికొన మొదలిడెను. ఇప్పటి ఫ్రాన్సు దేశమునకే అప్పుడు "గాలు" దేశ మని పేరు. అట్టిదే యింకొక దేశము ఉత్తరదిశగా సముద్రమధ్యమున కలదనియు, తత్ప్రజలును అన్ని విధముల గాలు దేశముప్రజల పోలియుందు రనియు సీజరు వినెను. వినుటతోడనే అతనిచిత్తమున తద్దేశమును జయింపవలె నను కాంక్ష, అలముకొని రెండువేలమంది సైనికులతోడి యుద్ధనావలను సమకూర్చుకొని, సముద్రము తరించి, శ్రుతపూర్వమును, అదృష్టపూర్వమును అగు ఆ చిన్నిలంకలో తెల్లకొండలకడ కాలిడెను. ఆత డచ్చట కొన్నిదినములు నిలిచి చూచెను గాని వచ్చినపని యగునట్లు తోచలేదు. సముద్రమున తుపాను రేగుచుండుటచే, పడవలలోని యతని యనుచరులు ప్రాణసంశయదశలో నుండిరి. ముందుదెసకు కన్నెత్తి చూడగా, దారియు తెన్నును లేని అడవియు, దానిని కలయజుట్టుకొని మన్నెపునేలయు గోచరించెను. దేశకాలములు రెండును అనుకూలములుగా లేమి, ఆతడు సకాలమున 'గాలు' దేశమునకు మరలి పోయెను.

సీజరు అంతతో విముఖుడుగాక ఆ మరుసటియేడే మఱియంతటిసేనతో సముద్రము దాటి ఈ దేశమునకు వచ్చెను. వచ్చినమొగముననే 'కెంటు' మండలజనులను జయించి, అతడు థేమ్సునదీతీరమునందలి 'బ్రెంటుఫోర్డు' (Brentford) వఱకు తరలి

పోయెను. ఆప్రదేశము ఇప్పటి లండనుపట్టణపశ్చిమభాగము. ఈ మారును సీజరునకు జయము దుర్లభమే యయ్యెను. ఏమన, ఆతడు జనపదభాగముల ఆనుపానులు బాగుగా ఎరుగడు. హఠాత్తుగా దేశీయులు ఏదెసనుండి వచ్చి పైబడి ముంచివేతురో అనుభయమున, అతనిసేనయు అనుపదమును దిగులు పడజొచ్చెను. మఱియు, అప్పుడే 'గాలు' దేశీయులును తిరుగుబాటుచేయసాగిరి. అంత సీజరు అప్పటికి ఈదేశముదెస నాసలుమాని, దానినైనను నిలుపుకొనవచ్చు నని గాలునకు మరలిపోయెను.

## రోమను జయము

### క్రీ. శ. 43 సం॥

సుమారు నూరుసంవత్సరములకు పిమ్మట నింకొక రోమను ధాటి ఈ దేశముపైకి వచ్చెను. 'ఆలసుప్లాటియసు' (Aulus Plautius) అనునతడు ఆ సేనకు నాయకుడు. ఈ సారి జరిగిన వృత్తాంతము సీజరునాటిదానివంటిది కాదు. అచిరకాలముననే, అనగా నాలుగేండ్లలోపలనే, బ్రిటనుదేశపు దక్షిణభాగమును, మధ్యభాగములును, సమగ్రముగా శత్రుహస్తగతములయ్యెను. వేల్సు (Wales) కారనువాలు (Cornwall) హంబరునకు ఉత్తరప్రాంతములును (North of Humber) మాత్రము ఆ దాడిని, నిరోధించి గట్టిగా నిలిచెను. కాని దక్షిణవేల్సు (South Wales) క్రీ. శ. 50–వ సంవత్సరమునను, ఉత్తరవేల్సు (North Wales) క్రీ. శ. 80–వ సంవత్సరమునను లోపడవలసినవియే యయ్యెను. ఉత్తరదేశము మాత్రము లోపడక ప్రబల నిరోధము చూపెను. క్రీ. శ. 61–వ సంవత్సరములో ఐసేని

రాణియైన 'బొడిసియా' (Boadicea, Queen of Iceni) అను నామె ఒక మహాభయంకరవిప్లవమును లేవదీసి అతిక్రూరవర్తనము సాగించెను. విప్లావకుల అణచి వారి దౌర్జన్యమును మాపుసరాపుటకు ఎంతోకాలము పట్టలేదు గాని, ఆకొలది కాలములోనే లండను, కోల్చెస్టరు (Colchester), సెంటు ఆల్బనుసు (St. Albans), అను పట్టణములను విప్లావకులు తగులబెట్టిరి.

నాడు మొదలు, నాల్గునందల సంవత్సరములకాలము బ్రిటనుదేశము, రోమనుసామ్రాజ్యాంతర్గతమే అయి యుండెను. క్రీ. శ. 410-వ సంవత్సరమునుండియు, రోమనుసైన్యములు, ఈదేశమును వదలి వెళ్లసాగెను. రోమునగరపు సరిహద్దులమీద వచ్చిపడుచున్న ఆటవికులగుంపుల తటిమి, ఆ నగరలక్ష్మిని కాపాడునిమిత్తము ఇచ్చటిసేనలు స్వదేశమునకు పోవలసివచ్చెను. అట్లని, అన్ని సేనలు లేచిపోయినవని కాదు. క్రీ. శ. 450-వ సంవత్సరము నాటికికూడ కొంతమందిసైనికులు ఉండనే యుండిరి. ఈ నాల్గుశతాబ్దములకాలములో మంచి నాగరకతను బ్రిటనులో విస్తరింపజేయుటకు రోమనులకు చక్కని అవకాశమేర్పడినది. ఆ యవకాశమెట్టిదో, విస్తృతమైన యా నాగరకతయెట్టిదో కనుగొనుట అవశ్యకర్తవ్యము.

## రోమనులు, ఉత్తరదిశ నాక్రమించుట

"కార్లైలు" (Carlisle) కు ఉత్తరమునగల, బ్రిటనుదేశము, ఎప్పుడును సమగ్రముగా రోమనులయధీనము కాలేదు. అచ్చట, దేశీయులతో నిరంతరయుద్ధములు తటస్థించెను. వానికొఱకు ప్రబలసేనోపసంగ్రహమును ఆవశ్యకమయ్యెడిది. జనపదభాగముల, అచ్చటచ్చట, సేనలు విడిసియుండుటకు, శిబిర

ములు నెలకొల్పబడినవి. కాని యీవిడిదలలు దక్షిణదిశయం దలి వానివలె, సకాలమున పట్టణములుగా పెంపొందలేదు. అది యునుగాక, రోమనులు, ఈ యుత్తరభూముల పాలించుటలో నేమి, తమనాగరకత గఱపుటలోనేమి, నయముకంటె భయ మునే సాధనముగాజేయుటబట్టి, వా రొనర్చిన కొంచెపుమేలై నను అచిరకాలముననే విస్మరింపబడెను.

క్రీ. శ. 122-వ సంవత్సరములో హాడ్రియన్‌చక్రవర్తి (Emperor Hadrian), సోల్వేఫర్తు (Solway Firth) మొదలు కొని టైనీ నదివరకు (River Tiney) పెద్ద గోడకట్టించెను. పిక్టులు (Picts), స్కాటులు (Scots) మొదలగు ప్రాంతీయులు దాడిగా తమరాజ్యముపై పడకుండుటకై అడ్డుకల్పించుటయే వాని ఉద్దేశ్యము. ఇప్పటికిని ఆ యా చోటుల దాని శిథిల భాగములు కానవచ్చుచున్నవి. రోమనులనైపుణికి సాక్షీ భూతములైన వస్తువులలో ఈ శిథిలకుడ్యభాగములు కొన్ని. ఆ గోడ తూర్పునుండి పడమటికి మిట్టునేలవెంట వంకరటెంకరగా సాగియున్నది. దానియెత్తు పదునెనిమిది అడుగు లుండును. వెడలుపు ఆరడుగులకు తక్కువగాక పది అడుగులకు ఎక్కువ గాక యుండును. సరిగా దాని నానుకొని దక్షిణమునకు నొకరోడ్డు ఉన్నది. ఆ రోడ్డుకుదక్షిణమున రెండువైపుల కట్టలు పోసిన కందకముకలదు. గోడకు ఆవల అగాధమైన అగడ్త కలదు. గోడవెంట సర్వత్ర అచ్చటచ్చట చిన్నదుర్గములున్నవి. ఒకొక్కదుర్గమునకు మధ్య మైలు మైలు దూర ముండుటచేసి, వానికి "మైలుదుర్గము"లని పేరు (Mile Castles). ఇవిగాక సేనలువిడియుటకు పదునెనిమిది పెద్దశిబిరము లున్నవి.

క్రీ. శ. 143-వ సంవత్సరములో ఎంటోనియసు అను ఇంకొకచక్రవర్తి (Emperor Antonius) పైన పేర్కొన్న గోడకు ఆవల ఉత్తరమున ఇంకొక గోడ కట్టించెను. ఇది ఫర్తాఫ్‌ఫోర్తు (Firth of Forth) మొదలు క్లైడునది (River Clyde) వఱకు వ్యాపించియున్నది.

## రోమనులు మధ్యభూములను, దక్షిణభూముల నాక్రమించుట

ఇచ్చటను వారు పెక్కు శిబిరములను నెలకొల్పిరి. ఆకారమున ఇవి సమచతురముగా నుండును. మధ్యభాగమున కప్పు లేని బయలుప్రదేశ ముండును. ఈ ప్రదేశమును రోమనులు ఫోరము (Forum) అనెడివారు. ఈ గర్భభాగమునుండి నలుదెసలకు ఒండొంటితలలుదాకు పెద్ద వీథులు సాగియుండును. ఆ వీథులనంటి బారులుతీరి పటకుటీరములు ఉండును. కాలక్రమమున ఆ పటకుటీరస్థానమున గృహములు వెలసినవి. మఱియు దేవాలయములు, వైద్యశాలలు, స్నానశాలలు కూడ అందు ఏర్పడినవి. దేశీయులు ఈ శిబిరములకు వచ్చి సైనికులకు అన్న వస్త్రాదు లమ్మిపోయెడివారు. నతను బాగుగా కుదిరిన వర్తకులు ఆ శిబిరమునగాని, లేక ప్రాకారసమీపమునగాని వారి సమ్మతిని నివసించుచుండెడివారు. వారిని చూచి ఇతరవర్తకులకును ఆస కలిగి శిబిరముల కాపురముచేయుచు, వర్తకముసేయుచు రాగా, కాలక్రమమున ఆ శిబిరములు సేనలకేకాక పౌరులకును ఆశ్రయమిచ్చు పట్టణములుగా పెంపొందెను. శిబిరమునకు లాటినుభాషలో 'కేస్ట్రా' (Castra) అని పేరు. నేటి మన పట్టణ వాచకములచివర 'ఛెస్టరు' (Chester) లేక సెస్టరు (Cester)

అను పదమున్నచో, అవి పట్టణములుగా పెంపొందిన శిబిర ములే యని గ్రహింపవలెను. మధ్యదేశమునను, దక్షిణదేశ మునను ఇవి సుమారు ఇరువది కలవు. యార్కు (York), కొల్చెస్టరు (Colchester), లింకను (Lincoin), సెంటు ఆల్బ నుసు (St. Albans), గ్లౌసెస్టరు (Gloucester) అనునవి, వానిలో ప్రశస్తములు. రోమను లీపట్టణముల స్వదేశమునందు వలె సుఖముగా నివసించెడివారు. వారి భవనములు విశాలరమ ణీయములై, ఆరామపరివృతములై, చిత్రితకుట్టిమ స్థలశోభిత ములై, సౌఖ్యావహములును, ఆనందదాయకములునై ఒప్పా రెడివి. మఱియు పెక్కు నాటకశాలలు, దేవాలయములు, స్నానగృహములు, విపణివీథులు కలిగి ఆ పట్టణములు సర్వ సౌఖ్యసంపాదకములుగా నుండెడివి. వాయుమార్గమున పోవు విమానమునుండి తీసిన ఛాయాపటములను చూచెదవేని, కొన్ని టియందు క్షేత్రములనాశ్రయించిన కొన్ని రేఖలు కనుగొందువు. అవి సమరేఖలై, తీర్చి దిద్దినట్లుండునేని ఆ క్షేత్రగర్భమున రోమనులనాటి పురాతనపట్టణశిథిలరూపమొకటి యున్నదని గ్రహింపనగును. చరిత్రకారులు దానిని అతిసుకరముగా కను గొందురు.

శిబిరములొండొంటిని కలుపుటకును, అటవీభూములను మన్నుపుభూములను తరించుటకును, ఆ రోమనులు వింతగొల్పు పెద్ద రాచబాటలను వేసిరి. కొన్నియెడల ప్రాతకాలిదారులనే వాడిరి. వారు వేసిన రాచబాటలు తిన్ననై, గట్టివై, సూటిగా సాగి చిరకాలము చెక్కుచెదరక ఉన్నవి. మధ్యయుగ మని చెప్పుకొను శతాబ్దులలో, ఇంగ్లండులోని రోడ్డులన్నిటిలో అవియే ప్రశస్తతరము లని ఎన్నబడినవి. ఏ నాడును మరమ్మతు

చేయకపోయినను చెక్కుచెదరలేదు. ఆ రోడ్డులే లేనిచో మధ్యయుగమున ఈ దేశమున దూరప్రయాణములు చేయుట, దుష్కరము కాదగినది. వానిలో పేర్కొనదగిన బాటలేవనగా,

(1) వాట్లింగు బాట (Watling Street); ఇది లండను నుండి ఛెస్టరు, కార్లయిలుమీదుగా యార్కుపట్టణమునకు పోవును.

(2) ఎర్మిను బాట (Ermine Street); ఇది లండనునుండి లింకను, యార్కుపట్టణములమీదుగా, హాడ్రియను గోడవఱకు పోవును.

(3) ఫాసీబాట (Fosse Way); ఇది డెవనుషైరులోని సీటనునుండి, సిరెనుస్టరు, లిసెస్టరులమీదుగా లింకను పోవును.

(4) ఇకినీల్డుబాట (Icknield Way); ఇది ఎక్సెర్టనుండి వించెస్టరు, సిల్చెస్టరుమీదుగా లండనునగరమున కేగును.

బ్రిటనుదేశము రోమనుల యధీనము కాకపూర్వమే సస్యసంపన్నమై యుండెను. రోమనులును, తమకాలమున దేశమున పంట లెక్కువగా పండునట్లుచేసి, తాము తమ సేనలును ఆప్యాయముగా అనుభవించుటయేకాక, కొలదికిమీరిన ధాన్యపుసంచులను ఓడలలోవైచి రైనునదీతీరమున నున్న తమ సేనలకును పంపుచుండెడివారు. ఈ రోమనులే ఏపిలు (Apple) మొదలగు క్రొత్తక్రొత్త పండ్లజాతులను బ్రిటనుదేశమున నాటి రని చెప్పుదురు. మఱియు వారే భూగర్భస్థములైన తగరము, సీసము, బొగ్గు, గనులనుండి త్రవ్వియెత్తినవారు. వారి కాలముననే, సామ్రాజ్యమునందలి వివిధదేశములనుండి ఎన్నియో సరుకులు బ్రిటనున దిగుచుండెడివి. ఆ యవకాశమునలన ప్రజల జీవితము సుఖావహమయ్యెను. ఒక దృష్టాంతము చూడుడు:—

ఘటసామగ్రి మొదట ఈ దేశమునకు ఫ్రాన్సునుండి వచ్చెడిది. వానిలో కొన్ని కుండలు మిక్కిలి అందమును, చందమును కలిగి వింతగొల్పునట్లుండెడివి. ఇప్పటికిని వాని ముక్కలు భూగర్భమున లభించుచున్నవి.

క్రైస్తవమతమునకు, క్రీ. శ. 309-వ సంవత్సరములో రోమను సామ్రాజ్యమున రాజాశ్రయము లభించినది. బ్రిటిషు వారు పేరునకుమాత్రము క్రైస్తవులైరిగాని రోమనుల సంపర్కము పోవుటతోనే పెక్కురు క్రైస్తవమతమును వదలివేసిరి. మత సంస్కారమేకాదు; రోమనులుచేసిన అన్నిసంస్కారము లట్లే అయినవి. వారు కట్టించిన భవనములు కూలినవి. పురములు క్రమముగా క్షీణించినవి. వాణిజ్యము సన్నగిల్లినది. ఇక మిగిలిన వేమనగా ఆనాటి గోడలును బాటలును మాత్రమే.



## రెండవ ప్రకరణము



### బ్రిటను ఆంగ్లో సాక్సనుల (Anglo-Saxons) వశమగుట రాష్ట్రసప్తకము

రోమనులు స్వదేశసంరక్షణార్థమై బ్రిటనును వదలి వెళ్లిరి. క్రీ. శ. 5-వ శతాబ్దిలో, అనాగరకులైన ఒకజాతిమానవులు గుంపులుగుంపులుగా బయలుదేరి సామ్రాజ్యపుసరిహద్దుభూములమీద వచ్చిపడి తటుమజొచ్చిరి. వాండ్రు అనాగరకులయ్యు యుద్ధనిపుణులు. ఆసియానుండి తండోపతండములుగా బయలుదేరివచ్చిన "హూణులు" అను ఒక జాతి వారు ఈ యనాగరకులను నూర్కొని పడమటియూరపు

భూములకు తఱుమఁజొచ్చిరి. అట్టిస్థితిలో వారు ద్రు దారిలో వీలైనచోటులనెల్ల నిలిచి నివాసము లేర్పఱుచుకొనఁజొచ్చిరి. అనఁగా, ఆ యాచోటుల ప్రాచీననివాసులను ఇంకను పడమటికి తఱిమిరని యూహింపనగును. ఆంగ్లులును, సాక్సనులును, జూదులును (Jutes) బ్రిటనుదేశముపైకి దాడివచ్చి ఆక్రమించుటకిదే హేతువైయుండును.

## ఆంగ్లో సాక్సనుల పూర్వచరిత్ర

ఆంగ్లులును సాక్సనులును ఉత్తరజర్మనీదేశముననుండియు, జూదులు దక్షిణడెన్మార్కు దేశముననుండియు, వచ్చిరి. పరదేశములపై బడి దోచుకొనుకోరికయు, నూతనవాసభూముల సంపాదించుకొనవలసిన యవసరమును హేతువులుగా, వారు క్రీ. శ. 499-వ సంవత్సరమున, తొలిసారి బ్రిటనుమీదికెత్తి వచ్చిరి. వారు పల్లెల నివసించుచు, ధాన్యాదులను ఎక్కుడుగా పండించుచుండువారు. పట్టణవాసము అరిష్టదాయకమని వారి నమ్మకము. కనుకనే, బ్రిటనులో రోమనులు కట్టించినపట్టణములు వీరికి అక్కఱకురాకపోయెను. తొలుత వీరికి "రాజు" అని చెప్పదగినవాడును లేడు. బలపరాక్రమసంపన్నుడైన యే శూరాగ్రేసరుడు యుద్ధవేళల వారికి సేనానిగా నగునో, వాడే వారికి శాసనకర్తయు నగును. యుద్ధసమయములనేకాక, ఇతర వేళలగూడ వానియాజ్ఞయే ఎల్లరు పాటించుటచే, వాడే వారికి పాలకుడగును. వానినే "రాజు"గా సేవింతురు. ఇంతకుమించి, వారి పూర్వచరిత్ర నెఱుఁగుటకు తగిన యాధారములు లేవు.

ఈ యాంగ్లులును, సాక్సనులును, జూదులును, బ్రిటనుదేశమును జయించి యిందే స్థిరముగా నుండ దలచి, సకుటుంబ

పరివారముగానే తరలి వచ్చిరి. వారియాసలు నెరవేరుటకు బహుకాలముపట్టెను. అంతకాలమును, దేశీయులతో హోరాహోరిగ బ్రేటులాడుచునేయుండిరి.

తొలుత వారు, పూర్వదక్షిణతీరముల దిగి, క్రమక్రమముగా పశ్చిమోత్తరముల ఒత్తుకొనజొచ్చిరి. ఎట్టకేలకు 150 సంవత్సరములలో దేశము వారియధీనమయ్యెను. ఈ లోపున, ఎన్నిచోటులనో, ఎన్నిసారులో, ఎన్నోవిధములుగానో, దేశీయులు వీరితో ఎన్నో యుద్ధములు చేసిరి. వానిలో తుది యుద్ధము క్రీ. శ. 613–వ సంవత్సరమున, ఛెస్టరునొద్ద జరిగినది. ఈ యుద్ధమునాటికి కారనువాలు (Cornwall), వేలుసు (Wales), స్కాటులెండు (Scotland), స్ట్రాతుక్లయిడు (Strathclyde) అను ప్రదేశములుదక్క, తక్కిన దేశమంతయు శత్రువశమైనది. ఈ యుద్ధమువలన ఆ కొఱతగూడ తీరినది.

ఈ 150 సంవత్సరములకాలములో, మొదటి నూరువత్సరములు బ్రిటిషువారు లెక్కకుమించిన యిక్కట్లుపడిరి. ఆ బాలవృద్ధముగా, ఎందఱో హతులైరి. ఎందఱో, జీవగ్రాహులై నిరంతరదాస్య మనుభవించిరి.

తుది 50 సంవత్సరములలో మాత్రము వారు చాటుచోటులకు పారిపోయి తలదాచుకొనగలుగుటచే ప్రాణనష్టమంతగా జరుగలేదు.

## ఆంగ్లో సాక్షనుల ఆక్రమణ ఫలితము

ఆంగ్లోసాక్షనులు క్రైస్తవులుకారు. కనుకనే ఈ దేశమున వా రడుగుబెట్టినచోటులనెల్ల ఆ మతము క్షీణించినది. అదియునుగాక, వారికి వర్తకవ్యాపారములు చేయు శక్తియు లేదు.

ఆ కాలమునను, యూరపుతో ఈదేశమునకు గల వర్తకసంబంధములు తెగిపోయినవి. వర్తకము మందగించుటచేతను, పట్టణములు నిర్జనములగుటచేతను, (వీరిపట్టణవాసవిముఖత పైన చెప్పితిమి), రోమనులనాటి మహాపట్టణములన్నియు పాడువడి కూలిపోవుచుండ, ఎల్లరును చూచుచు మిన్నకుండిరేగాని, పని కల్పించుకొని పునరుద్ధరించు దక్షులు లేరైరి. ఇటీవల చిరకాలమునకు, ఆ శిథిలముల పజ్జలనే నూతనపట్టణములు వెలసినవి.

## రాష్ట్రసప్తకము తత్పాలనము

ఆంగ్లోసాక్సను దండయాత్రలోని విశేషములేవనగా, అది ఒక్కనాడు, ఒక్కచోట, ఒకనిచేతిమీద నడచినది కాకుండుటయే. అనగా, పెక్కుసారులు, పెక్కుచోటుల, అనేకసమయముల, అనేకనాయకులు దానిని ప్రవర్తింపచేసిరి. వారిలో ఎవ్వరికిని నిరంకుశాధికారము చెల్లించుకొను శక్తిలేదు. ఎవనికి వాడే 'నాయంతవాడను నేను' అనుచుండెను. తుదకు దండయాత్ర పూర్తియై రాజ్యము రూఢముకావలసివచ్చిననాటికి, దానిని ఏడు తెగలవారు ఏడుభాగములుగా పంచుకొనిరి. ఏ తెగ కా తెగకే ఒక నాయకుడుండెను. అతడే రాజు. (1) కెంటు (Kent), (2) నార్తంబ్రియా (Northumbria), (3) మర్షియా (Mercia), (4) వెస్సెక్సు (Wessex), (5) ససెక్సు (Sussex), (6) ఎస్సెక్సు (Essex), (7) ఈస్టు ఆంగ్లియా (East Anglia)—వీనిలో, మొదటినాల్గును కాలక్రమమున ఎక్కువ శక్తిమంతములయ్యెను. ఒకొక్కయెడ ఈ రాజులలో ఎవ్వడేని అధికశక్తిసంపన్నుడైనచో, వానిని తక్కినవారు 'సామ్రాట్టు' అని పేర్కొనెడివారు. అది మన్ననచూపుటకు పిలుచు పిలుపేగాని

వాని యధికారమును శిరసావహించుటకు సూచనకాదు. అనగా, వాని సమ్రాట్టుపదము సార్థకమైనదికాదు. ఆ యేడు గురిలో ఒకప్పుడు ఒకడు సమ్రాట్టు, ఇంకొకప్పుడు ఇంకొకడు సమ్రాట్టు. తుదకు, అందరిని వశపఱుచుకొని తన అధికారము చెల్లించుకొను నదృష్టము వెస్సెక్సు (Wessex) రాజునకు పట్టినది.

## కెంటు సామ్రాజ్యము

## క్రీ. శ. 600–616. (సుమారు)

కెంటురాష్ట్రపాలకుడైన ఎతెలుబర్టు రాజు (King Ethelbert) ఇతరరాజులతో కలహింపకయే, తన యధికారము చాల దూరము వ్యాపించునట్లు చేయగలిగెను. ఉత్తరమున హంబరు (Humber) వఱకు గల దేశమంతయు వాని యానతిలోనిదే యయ్యెను. ఆంగ్లోసాక్సను రాజులలో, తొలుత క్రైస్తవమతమును బుచ్చుకొన్నవాడితడే. క్రీ. శ. 597 సం॥లో సప్తమ గ్రిగోరి (Gregory VII) అను మతపీఠాధిపతి (Pope) ఇంగ్లాండునకు క్రైస్తవమత మిచ్చునిమిత్తము, సెంటు అగస్టీను (St. Augustine) అనువానిని ఇచటికి పనిచెను. అతడును నలువదిమంది సన్యాసులతో వెడలివచ్చి, కెంటురాజ్యమున ఎబ్బుఫ్లీటు (Ebbs Fleet) వద్ద దిగి, అనతికాలముననే రాజునుత్తరువు పొంది, యాస్థాని జేరెను. రాజుగారి భార్య యప్పటికే క్రైస్తవమతావలంబినియై యుండెను. కనుక ఆ రాజును ఉపదేశమాత్రముననే ఆ మతము గైకొనెను. అతని యానతిఁ బ్రజలును అట్లేచేసిరి. అగస్టీను వెంటవచ్చిన సన్యాసివర్గము అటనుండి నార్తంబ్రియా (Northumbria) కు వెడలిరి. ఇచటను

వారి మతప్రచారము సుకరమే యయ్యెనుగాని, ఆ రాజ్యమున ఆమతి మెన్నాళ్లో నిలువలేదు. కెంటును జూచి వెస్సెక్సుగూడ ఈ మతమును స్వీకరించెను. పిమ్మట 656 సం॥లో మెర్సియా రాజ్యమును, తుదకు కొలదికాలముననే సస్సెక్సునుగూడ క్రైస్తవములయ్యెను.

## నార్తంబ్రియా సామ్రాజ్యము

### క్రీ. శ. 616—685. (సుమారు)

మొదట, బెర్నిసియా (Bernicia), డైరా (Deira) అను రెండుమండలముల యేకీభావముచే, నార్తంబ్రియా ఏర్పడినది. కాని, యా కలయిక నిత్యముగాక, ఎప్పటికప్పుడే విడిపోవ దగిన స్థితిలో నుండెడిది. అస్థిరమైన యీ పొత్తు ఇట్లుండగా వాయవ్యదిశ నున్న స్ట్రాతుక్లైడు (Strathclyde) అను కెల్టు రాజ్యమువలన నార్తంబ్రియాకు నిరంతరోపద్రవమును కలిగెడిది.

తుదకు ఎడ్విను రాజు (King Edwin 617–633) పాలనమున నార్తంబ్రియా శక్తిమంతమై యధికారప్రాబల్యము వహించెను. ఈ రాజు తొల్త పిక్టులను (Picts) జయించి యుత్తరపు సరిహద్దును సురక్షితమొనర్చెను. పిమ్మట పడమటిమొగమై స్ట్రాతుక్లైడును జయించెను. పదపడి ఒక నౌకాదళమును గూర్చికొని దానివలన ఆంగ్లేషియా (Anglesia) ను, మానవద్వీపమును (Isle of Man) లోగొనెను. ఈ జయవార్తలు నానాదిక్కులకు ప్రాకి, వాని కీర్తిని పెంపొందింప మెర్సియా, తూర్పు ఆంగ్లియా, వెస్సెక్సు రాష్ట్రములవారు ఎడ్వినురాజును సమ్రాట్టుగా గొనియాడిరి. కాని దైవవశమున 685–వ సంవత్సరమున (Nechtansmere) నెక్టాన్స్మియరునొద్ద జరిగిన యుద్ధములో నార్తంబ్రియాకు

మెరిసియావలన అపజయము కలుగుటచే ఎడ్విను ప్రాభవ మును సన్నగిల్లెను.

**విట్‌బీ పరిషత్తు. (The Synod of Waithby.) క్రీ. శ. 644 సం॥**

నార్తంబ్రియా మహాప్రాభవ మనుభవించు దినములలోనే ఇంగ్లీషుచర్చియొక్క భావివర్తనమునుగూర్చి యొక నిర్ధారణ మయ్యెను. అది మతచరిత్రలో చాల ముఖ్యమైనది.

బ్రిటనుదేశమునకు క్రైస్తవమత మిచ్చినవారు కేవలము రోమునుండి వచ్చిన మిషనెరీలు మాత్రమే కాదు. స్కాటు లాండులోని అయోనా (Iona) మొదలగు మఠములవారును ఈ మతప్రచారకార్యభారమును కొంత వహించిరి. స్కాటు లాండును, నార్తంబ్రియాలోని కొన్నిభాగములును మతము పుచ్చుకొనుట, ఆ మఠములవారి ఉపదేశముమీదనే. కాని ధర్మోపదేశమున వారికిని వీరికిని కొంతభేద ముండెడిది. వారివి కొన్ని సిద్ధాంతములు వీరును, వీరివి కొన్నిసిద్ధాంత ములు వారును ఒప్పికొనెడివారుకారు. అదియునుగాక, ఈ మఠములవారికి రోమువారిచర్చితో పనిలేదు. చర్చికి బదు లుగా వారు మఠముల నిర్మించిరి. ఆ మఠముల చేరెడువా రందఱు కఠినవ్రతాచరణముతోడి తపస్సు సల్పుచు, ఆ మఠాధి పతి (Abbot) మాటనే శాసనముగా గ్రహించి వర్తించు చుందురు. ఈ మఠాధిపతులును రోమనుచర్చివారు నియ మించిన మతాచార్యులవలన దీక్షగ్రహించువారుకారు. అనగా మఠములకును, చర్చికిని పొత్తులేదు. రెండును స్వతంత్రములే. మఠాధిపతిమాట ఒకచో శాసనము. పోపుమాట యింకొకచో శాసనము. తత్ఫలితముగా దేశమున మతవ్యవస్థ కుదరక తిక

మకలు హెచ్చెను. ఈ స్థితి బాగుగా లేదని గ్రహించి, నార్తంబ్రియారాజగు ఓస్వీ (Oswy) పూనుకొని ఇంగ్లాండు దేశము రోముగురుత్వమును అనుసరింపవలెనో, మఠగురుత్వ మును అనుసరింపవలెనో స్పష్టముగా తేలినగాని వీలులేదని ఆ నిర్ణయమునకై గట్టి యత్నము చేసెను.

664-వ సంవత్సరములో ఓస్వీ (Oswy), విట్బీలో (Whitby) ఒక పరిషత్తును కూర్చెను. రోమనుచర్చిప్రతినిధు లును, మఠప్రతినిధులును సభకు విచ్చేసిరి. అందు చాల వాదోపవాదములు జరిగినవి. కాని, తుదకు తేలిన నిర్ణయ మేమనగా, "ఇంగ్లాండు రోమనుకాథలిక్కు-చర్చివారి వశముననే ఉండితీరవలె"నని. ఒక్క-ఇంగ్లాండే యననేల, మధ్యయుగము లలో యూరపంతయు ఆ చర్చికే లోపడియున్నది. ఈ నిర్ణ యము ఇంగ్లండునకు మేలే సమకూర్చినది. దానివలన సక్రమ మైన మతవ్యవస్థ ఏర్పడినది. ఆ వ్యవస్థలో, ఇరువురు మతా చార్యుల (ఆర్చిబిషప్పుల) అధికారమునకు లోపడి పెక్కురు మతగురువులును (బిషప్పులును,) వారి చేతిక్రింద పెక్కు-రు మతప్రదర్శకులును (ప్రీస్టులును) ఉండెడివారు. ఈ విధముగా దేశమునకు మతైక్యము కుదురుటతోనే, రాజకీయముగ గూడ ఈ విధముగనుండిన బాగుండునని ప్రజలమనములలో కోరికె లీరికలెత్తినవి.

## మెర్సియా సామ్రాజ్యము

### క్రీ. శ. 685—796 సం॥

క్రమముగా నార్తంబ్రియాను, వెస్సెక్సును జయించి, మెరి సియా, ప్రాముఖ్యమువహించెను. ఆరాజ్యము నేలిన రాజు

లలో, ఓఫా (Offa) (**767—796**) అనునతడు మిగులనుప్రసిద్ధుడు. ఆతడు వేల్సును జయించి, తన దేశమునకు పశ్చిమపు సరిహద్దున గట్టి అడ్డుకట్ట పోయించి, ఆ దిశను సురక్షితము చేసెను. అది 'డీ'నది (River Dee) మొదలుకొని "వై" (River Wye) నదివఱకు సాగియుండును. ఆ కట్ట యతనిపేరిట (Offa's Dyke) వ్యవహరింపబడినది. ఇతనికాలములో, మరల ఇంగ్లాండునకు యూరపుతోడిసంబంధము ఘటిల్లినది. మహాఛార్లెసు చక్రవర్తికిని (Emperor Charles, the Great) ఓఫాకును నడుమ ఉత్తరప్రత్యుత్తరములు నడుచుచుండెడివి. వారు, ఒకరినొకరు సమానప్రతిపత్తితో మన్నించుకొనెడివారు. ఓఫామరణముతో మెరిసియాప్రాభవమును కూలిపోయినది.

## వెస్సెక్సు సామ్రాజ్యము
## 802—1017 సం॥

ఎగ్బర్టురాజుపాలనమున (King Egbert 802—839.) వెస్సెక్సురాజ్యము ప్రముఖతనహించి, దానిని ఇతరరాజ్యములకంటె ఎక్కువకాలము నిల్పుకొన్నది. ఒండొకచో లేని అనుకూలస్థితిగతులే ఈ స్థిరసంపదకు ముఖ్యహేతువులు. ఈ రాజ్యమున మంచినదులుకలవు. ఒక చోటినుండి ఇంకొకయెడ కేగుటకును, అవసరమైనచో ఇతరరాజ్యములకేగుటకును, చక్కని బాటలు గలవు. సముద్రతీరభూమియు ఎంతయో ప్రయోజజనకమైనది. తత్కారణమున, యూరపునందలి ఇతరరాజ్యములతో ఎడతెగని సంబంధమును నిలిచినది. అదియునుగాక, రాజధానీనగరమగు వించెస్టరు (Winchester), రాజ్యమధ్యస్థమై ఇంగ్లండునంతను కనుపెట్టు నట్లుగా, దృఢస్థానకమై

యున్నది. మఱియు, ఆ సింహాసనము నధిరోహించిన రాజులు, ఒకరికొకరు ఓసిపోవువారు కారు. అందరును బుద్ధిశాలురు. ఇవన్నియు నిటులుండ, ఈ రాజ్యము ఉచ్ఛస్థితికి వచ్చినపుడు, ఔత్తరాహులైన శత్రువులు, ఇంగ్లండును మహోపద్రవము పాలుసేయుచుండిరి. అట్టిస్థితిలో, ఇంగ్లండులోని ఏడుగురు రాజులును, తమలోతాము పోరాడుకొనుట మాని తమకందర కును సహజశత్రువులైన ఆ ఔత్తరాహులయత్నమును భంగ మొందించుటకు అందరును ఏకీభవించ వలసివచ్చినది. అందును, వెస్సెక్సురాజునే తక్కిన ఆరుగురును తమకు నియంతగా వరించిరి.



## మూడవ ప్రకరణము



### వెస్సెక్సు: ఔత్తరాహులు
### ఔత్తరాహుల సముద్రయానములు

నార్వే డెన్మార్కుదేశములనుండి సముద్రములు దాటి వచ్చిన వారినే ఔత్తరాహు లందుము. వీరిని "వైకింగులు" (Vikings) అనియు, డేనులు (Danes) అనియు కూడ వ్యవహ రించుట కలదు. వీరు అతిసాహసులు; చిన్న చిన్న పడవలలో, పెద్ద పెద్ద సముద్రములు తరింపగలరు. ఆ పడవలలో ప్రయా ణముచేయుట, ఇతరులకు చాలకష్టము. ఏమన, వానియందు వానకు నెండకు తలదాచుకొందగిన యాధారమేమియు నుండదు. సాహసులైన యీ డేనులు మాత్రము, ఆ పడవలమీదనే సము ద్రముల తరించి నానాదిక్కులకు బోయిరి. బాల్టిక్కుసము

ద్రముమీదను (Baltic Sea), ఆర్కిటిక్కు (Arctic Sea) సము ద్రముమీదను వారిపడవలు నిరాఘాటముగా విహరించినవి. స్పెయిను, ఫ్రాన్సు ఇంగ్లాండు, స్కాట్లాండు, ఐర్లాండు, ఐసులాండు, గ్రీనులాండు మొదలగు దేశములన్నిటికి, వారు ఆ చిన్నపడవలలోనే పోయిరి. తుదకు ఉత్తర అమెరికాలోని లాబ్రడారు (Labrador) తీరమువఱకు గూడ వారి పడవలు పోయినవి. వారు, కొల్లగాండ్రు; ఇతరుల దోచుకొనుటయే వారి వృత్తి. వారి సముద్రసంచారమంతయు దీనికొఱకే. తొమ్మిదవశతాబ్దమున, వారి దోపిడికి తాళలేక ఉత్తరపుయూరపు గడగడలాడినది. ఉత్తరపుయూరపునగల నదీముఖములన్నింటను వారు తనివితీర కొల్లగొట్టిరి. దోపిడికై, వారవలంబించుపద్ధతియు చాల వింతయైనది:—ముఖముల వెంట, నదుల బ్రవేశించి, చాలదూరము చొచ్చుకొని పోయి, అనువగుచోట పడవలు కట్టివైచి కాలినడకను జనపదములుచేరుదురు. ఆ యాతావుల చేతికందిన గుఱ్ఱముల బట్టికొని యెక్కి, వడివడి, నిళ్లిల్లు సొచ్చి, అందుగల వెండిబంగారులను, వస్తువిశేషములను కొల్లగొని, జానపదులు కుయియిడి, కూడి, వెన్నంటుటకుమున్నె, తమపడవలుచేరి, ఏటివాలున వేగమై పడవలనడిపించుకొని సముద్రమునబడి, కానరాకుండ, పోయినదె పోకగా పోదురు. ఈ విధముగా, సంపన్నులగృహములనేకాక చర్చులు (Churches) గూడ వారు కొల్లగొందురు. కొన్నిసమయముల తాము దోచుకొనిన ప్రదేశములు నివాసయోగ్యములుగనుండుటయు, తత్ప్రజలు తమ్ము మార్కొనజాలకుండుటయు జూచి, వారచ్చటనే నిలిచి, ఇండ్లువాకిండ్లు కట్టుకొనువారు. కొంతకాలము

నకు ఆ భూముల ప్రాతకాపులై, అర్థబలమును అంగబలమును సంపాదించినపిమ్మట, సేనల గూర్చికొని దాడినడచి ప్రాంతీయులరాష్ట్రముల జయించెడివారు. ఈ యాత్తరాపహులు, ఉత్తరఫ్రాన్సున స్థిరనివాసులగుట, ఈ విధముగానే జరిగినది. అది 911-వ సంవత్సరమున.

## డేనులింగ్లాండును మార్కొనుట

వీరు 789-వ సంవత్సరములో, ఇంగ్లాండును తొలిసారి కొల్లగొని తద్భాగ్యము చవిచూచిరి. ఆ రుచి మరగి, నాడు మొదలు ఏటేట వచ్చుట సాగించిరి. చిరకాలము, వారి సంచారము నిరాతంకముగా కొనసాగినది. తుదకు 851-వ సంవత్సరమున వారిలో కొందఱు సీతువుకతమున, స్వదేశోన్ముఖులుగాక షెప్పీలంకలో (Island of Sheppy) విడిసియుండిరి. అదియే వారిదేశాక్రమణవిషయమున చేసిన మహాప్రయత్నమునకు ఆరంభదశ. అలసతయు ఏమఱుపాటును లేక, ఏటేట వారు పడమటగా ఒత్తుకొనజొచ్చిరి. కొన్నియేండ్లలో, ఒక్క వెస్సెక్సు దక్క, తక్కిన మధ్యదేశమును, దక్షిణదేశమును, వారివశమయ్యెను. అప్పుడు వెస్సెక్సును, ఆల్‌ఫ్రెడ్డు అను గొప్పరాజు (Alfred the Great) పాలించుచుండెను. ఆతడు ప్రబలసేనలతో శత్రులనెదుర్కొని పరాజయముల సరకుగొనక నిశ్చలుడై నిలిచి, స్వదేశమును కాపాడుకొనగలిగెను.

## ఆల్‌ఫ్రెడ్డు (Alfred the Great) 871—901

ఈ మహారాజునుగూర్చి యనేకగాథలను పుక్కిటిపురాణములుగా జెప్పుచుందురు. ఆ గాథలనుబట్టిచూచినచో, ఆతడు శౌర్యౌదార్యసంపన్నుడనియు, దేశభక్తిదైవభక్తిప్రపూర్ణుడనియు

గ్రహింపనగును. ఔత్తరాహులవలన దేశము సోపద్రవమై యిడుములుగుడుచు కష్టసమయముల నాతడు రాజ్యమునకు వచ్చుట తటస్థించినది. అతని రాచఱికమున మొదటి యేడెనిమిది సంవత్సరములకాలము, ఔత్తరాహులతోడి యుద్ధముల తోనే చెల్లినది. ఒకదానివెనుక నొకటిగా, తొమ్మిదితడవలు, వారివలన నతనికి పరాజయములు కల్గినవి. తుదకు, శత్రువు లాతని, నెంతోదూరముగా పడమటి దెసనున్న ఎతెలునీ (Athelney) వఱకు తఱిమివైచిరి కూడ. ఎతెలునీ, సెవెరను (Severn) నదీముఖమున నున్నది. తనవారందఱును ఆసలు మాని డిందుపడియుండ నాతడుమాత్రము ధృతిగోల్పోక ఉత్సాహశాలియై, తుదిసారి పగతుర మార్కొని, వారిని నిశ్శేషముగా నోడించెను. అదియే, సుప్రసిద్ధమైన, ఎథనుడ్యూను యుద్ధము (Battle of Ethandune 878). ఈ యుద్ధజయమే, వెస్సెక్సుదక్కుటకు హేతువు. కాని యేమిలాభమున్నది? ఔత్తరాహులు తక్కుచోట్ల వేళ్లునాటుకొనియే యుండిరి. వారి నున్మూలించుటకు తగిన యంగబలము, ఆల్ఫ్రెడ్డునకులేమిజేసి, యతడు వారితో వెడ్మూరుకడ సంధి (Treaty of Wedmore) చేసికొనెను. ఔత్తరాహులు, వాట్లింగుబాటకు తూర్పుదెస నార్జించిన భూములన్నియు, వారే యనుభవించునట్లును, వెసెక్సుజోలికి రాకుండునట్లును, క్రైస్తవమతము స్వీకరించునట్లును ఆ సంధిలో సమయములుచేసికొనిరి. నాటినుండి వారు ద్రిమ్మరితనమును, కొల్లలాటయు, మాని, స్థిరనివాసము లేర్పఱుచుకొని, ఆలుబిడ్డలతో నిండ్లువాకిండ్లతో కాపురములు సేయజొచ్చిరి. తా మితరులదోచుకొనుచో, నితరులు తమ్మును దోచుకొన

బోలునను శంకచే వారు సాధువులైరి. ఇంగ్లాండులో వారు నివసించిన తావునకే "డేనులా" (Dane Law) అని పేరు.

## పరులవలన దేశమునకు భావికాలోపద్రవములు లేకుండ ఆల్ఫ్రెడు చేసిన కల్పనలు

అచిరకాలముననే డేనుల తండములు క్రొత్తవి దేశమున వచ్చిపడవచ్చునని యూహించి, వారి యారంభముల నిరోధించుటకు, ఆల్ఫ్రెడు తగినయత్నములు చేసెను. అందు మొదటిది, సేనాసంస్కారము:—పూర్వము ప్రభువర్గమనియు, ప్రజావర్గమనియు సేనలో రెండుభాగములు ఉండెడివి. అందు ప్రభువర్గమువారు రాజునాసతి నవసరమైనప్పుడెల్ల అతనికై యుద్ధసన్నద్ధులు కావలసినదే. వెస్సెక్సురాజ్యమునగల స్వతంత్రమానవు లందరు ప్రజావర్గములోనివారే. వారు సాలునకు ఒక మాసముదినములు మాత్రమే అవసరమగుచో యుద్ధము చేయవలసియుండుదురు. ఇట్టి వ్యవస్థలో ఆల్ఫ్రెడు చేసిన ముఖ్యమైన మార్పు లేవనగా, ప్రభువర్గముసంఖ్య హెచ్చించుటయు, ప్రజావర్గమును మూడుభాగములుగా విభజించి, ఒకొక్కభాగము ఒకొక్కమాసము యుద్ధము చేయవలెనని యాదేశించుటయు, తమ వంతు చెల్లినపిమ్మట ఎవరి యిండ్లకు వారు పోవచ్చును అనుటయు. ఈ సంస్కారముమూలమున, ఆ రాజునకు ఒకటికి మూడు సేనలైనవని భావించవచ్చును. ఇది మొదటికల్పన.

రెండవది, నౌకాదళమును నిర్మించుట. కనుగీటునంతలో మాయమై తప్పించుకొని పోవు డేనులను పట్టుకొనుట, భూమిమీదకంటె సముద్రముమీద తేలికయని యెంచి, అతడీకలను

చేసెను. పొడవునను, ఎత్తునను, వేగమునను శత్రునౌకల కంటె ఉత్తమము లైనవానిని ఆతడు కట్టించెననియు, ఒకొక్క నావకు అరువది, డెబ్బది తెడ్లు లుండెననియు, అప్పటి రాచ కవిలెలు (Chronicle) తెలుపును.

మూడవది, దుర్గనిర్మాణము. రాజ్యమునకు ఆయువుపట్టు లనదగు చోటులనెల్ల ఆతడు దుర్గములను కట్టించెను. శత్రువుల దాడిని అరికట్టుటకు అవి ముఖ్యసాధనములు. ప్రతిదుర్గముచుట్టును ఎత్తైన గట్టి మదురుగోడ యుండును. కాలక్రమమున, కొన్నియెడల అట్టి దుర్గములే పెద్దపట్టణము లయ్యెను.

## అతని విద్యాభిమానము

దేశసంరక్షణార్థమై చేయు ఈ కల్పనలతో మానసంరక్షణార్థమై పౌత్తరాహులతో చేయు ఆ నిరంతరయుద్ధములతో బొత్తుగా కాలవ్యవధియు, చిత్తశాంతియు లేకున్నను, ఆతడు తన విద్యాపక్షపాతమును మరవక, దానియందును వ్యగ్రుడయ్యే యుండెను. ఆతడు పండితపోషకుడగుటయేకాక, స్వయముపండితుడు. ఎందరెందరో పండితులు ఆతని ఆస్థానము నలంకరించి, ప్రసంగములు చేయుచుండ, విని యానందించుటయేకాక, తానును ఆ పండితులకు మెచ్చుగొల్పునట్లు సల్లాపించుచుండెడివాడు. అదియునుగాక, గ్రంథరచయితల పిలిపించి లాటిన్‌భాషలోని ఉద్గ్రంథములను ఆంగ్లములోనికి పరివర్తనము సేయించి సత్కారములొసంగెను. తానును కొన్ని భాషాంతరీకరించెను. ఇంతయేల తనరాజ్యమున స్వతంత్రప్రజలందరు విద్యావంతులు కావలెననియే ఆతడు సంకల్పిం

చెను. కాని, ఆ సంకల్పము సిద్ధింపకున్నను, తొల్లింటికంటె ఎన్నిమోమడుంగు లెక్కువగా విద్యావ్యాప్తి జరిగినది. అది యునుగాక, ఆతడు మిగుల ఉదారుడు. మఠములకును, చర్చికిని ఎన్నియో దానధర్మములు చేసి శిథిలములైన వానిని పునరుద్ధరించెను. ఆతని తదనంతరము చిరకాలమువఱకు ప్రజలాతనిగూర్చి సుఖశాసకుడనియు, ప్రజాహితుడనియు మంచి వేళల చెప్పుకొనుచుండెడివారు.

## ఆల్ఫ్రెడుపిమ్మటి రాజులు 901–975

ఇంగ్లాండుదేశమును, విశేషించి వెస్సెక్సురాజ్యమును జేసిన పున్నెమువలన ఆల్ఫ్రెడు పిమ్మట సింహాసన మధిరోహించిన వారును కడు సమర్థులే యగుట తటస్థించినది. వారి పరిపాలనలు దీర్ఘకాలము చెల్లకపోయినను, ఆ కొలదికాలములోనే వారు ప్రజాహితకార్యము లొనర్చిరి. వారందరును, డేనులతోడి వ్యవహారమున నప్రమత్తులై యుండి, డేనుల యుపద్రవములేక రాజ్యమును గాపాడుటయే ముఖ్యధర్మముగా భావించిరి.

## పెద్ద ఎడ్వర్డు (Edward the Elder) 901–925

ఈతడు "డేనులా" ను తిరిగి సంపాదింపవలెనని సంకల్పించి, మఱి పెక్కుదుర్గములు కట్టించి, శత్రుల నెదుర్కొని యోడించి, బెడ్‌ఫోర్డు (Bedford), హంటింగుడన్ను (Huntingdon), నార్తాంప్టను (Northampton), కేంబ్రిడ్జి (Cambridge), డెర్బి (Derby) అను ప్రదేశములు తిరిగి యార్జించెను. అప్పటికి చేయునది లేక యూరకుండియు, మఱి కొంతకాలమునకు డేనులు, సహనముదక్కి, రెండుసార్లు తిరుగుబాటుచేసిరి. అందు మొదటిది అథెల్‌స్టను (Athelstan) రాజుకాలమున.

## అథెల్‌స్టేను (925–940.)

ఈ రాజు, ఆ విప్లావకుల నెదిరించి బ్రునాంబరోయొద్ద నోడించెను (Battle of Brunamberh 937). రెండవ తిరుగుబాటు ఎడ్మండురాజు కాలమున.

## ఎడ్మండు (King Edmund. 940–946)

ఈ రాజును దక్షతమై, విప్లవము నణచి, పూర్వ్యులఖ్యాతి నిల్పెను. నాటినుండి యుభయపక్షములవారికిని విరోధములు సమసి, మనసులు కలియనారంభించెను. ఆ మైత్రి క్రమముగా పెంపొంది, డేనులు ఆంగ్లరాజుల మంత్రసభాప్రవేశమునకు గూడ నర్హులైరి. ఆ మంత్రసభకు "విటాను" (Witan) అని పేరు. ఆ సభలో డేనులమాటయు బాగుగ చెల్లుచుండెడిది. సభవారు ఎడ్రెడ్డురాజును (King Edred) ఎన్నుకొనునట్లు చేయుటలో, డేనులు చాల పనిచేసిరి. ఎడ్రెడ్డురాజును (946–955). ఇతనిపిమ్మట రాజ్యమునకు వచ్చిన ఎడ్గరు (Edgar the Peaceful 959–975) అనురాజును డేనులకు తొల్లిటికంటె నెక్కుడు చనవిచ్చి వారి నాదరించి, వారిలో యోగ్యతగలవారిని బిషప్పులుగా, శిక్షాధికారులుగా (Aldermen) గూడ నియమించిరి. క్రమముగా పెంపొందిన యీ పొత్తుకతమున, "డేను లా" వేఱు, ఆంగ్లభూమి వేఱు అనుమాటయే పోయినది.

పూర్వము, డేనుల నెదిరించి పోరాడినవారును, ఈనాడు వారిని జేరదీసి పొత్తు కలిపికొన్నవారును గూడ వెస్సెక్సు రాజులే. తక్కిన యాంగ్లరాజులుగూడ నేదో కొంచెము జోక్యము కల్పించుకొన్నను వెస్సెక్సురాజులే ముఖ్యులగుట, ఆ ఖ్యాతి వారికే దక్కవలెను. వెస్సెక్సురాజులలో నొకడగు

ఎడ్గరు డీ నదీజలముల పడవలో విహరించునపుడు, తనకు-గల యాంగ్లరాజు లార్వురును తెడ్లు వేసిరని యొక కథకూడ నున్నది. ఆ కథను యథాక్షరముగ నమ్మదగదుగాని, దానివలన వెస్సెక్సు రాజుల ప్రాభవముమాత్రము గ్రహింపనగును.

ఆల్ఫ్రెడ్డునువలె, ఎడ్గరురాజునుగూడ, ప్రజలు చిరకాలము భక్తితో దలచుకొనుచుండిరి. వారి భక్తికి నాతడు పాత్రుడు గూడను. ఆతడు ప్రజాహితకరములైన నూతనధర్మములను శాసించి, తద్ధర్మపాలనమున ప్రజలు ప్రమత్తులు కాకుండుటకై దేశము నలుదెసల సంచరించెడివాడు. ప్రజ లొండొరులయెడ నపరాధము లొనర్చుకొనకుండునట్లును, అంతగా అపరాధములు జరుగుచో, ఏ జిల్లాలోని యపరాధులను ఆ జిల్లావారే పట్టుకొని రాజపురుషులకు ఒప్పగించునట్లును ఆతడు నియమములు చేసెను. ఆతని సదుద్దేశములకు తగినట్లుగా, సదుపదేశములు గూడ చేసి రాజుచే ఈ మంచిపనులు చేయించినవాడు సెంటు డన్స్టను అను మతగురువు (St. Dunstan). ఇతడు రాజున కెంతో బాసటయై నిలిచి, యతనిచే మన్నింపబడి, తుదకు, కాంటరిబరీ ఆర్చిబిషపు గూడ నయ్యెను (Archbishop of Canterbury). డేనులతో పొందిపొసగి యుండునట్లు రాజున కితడే యుపదేశించెను. మతప్రచారకులు (The clergy) తమ విధ్యుక్తధర్మమున ప్రాలుమాలి యుండుట చూచి, వారు వివాహితు లగుటయే యీ సోమరితనమునకు మొదటి హేతువని గ్రహించి, "మతప్రచారకులు వివాహితులు కాగూడ" దని యుపదేశింప సాగెను. ఆతని యుపదేశవాక్యము లరణ్యరోదనములే యయ్యెనుగాని ఫలవంతములు కాలేదు. అందుచే నతడు

విసివి వారి పదవులు, మఠములనుండు సన్యాసుల (Monks). కిచ్చెను. ఆజన్మ బ్రహ్మచర్యము మఠనియమములలో నొకటి యగుచో, వారు శ్రద్ధతో మతప్రచారము సేయగలరని యాతని యాశ.



## నాలగవ ప్రకరణము



### ఆంగ్లో సాక్షనుల కాలమున నింగ్లాండు దేశపు స్థితిగతులు: రాజ్యపాలనాదికము

రాజులు:—

ప్రజానుశాసనము, ధర్మసంరక్షణము అను కార్యభారమును రాజులే వహించిరి. పౌరులలో పెద్దలైన వారందఱు, ఆమంత కూడికొని యాలోచించి, రాజును ఎన్నుకొనెడువారు. ఆ యెన్నుకొనుటలోగూడ, పూర్వరాజవంశమునుండి రాచఱికము తొలగిపోకుండునట్లు చేయుట సదాచారముగా భావించెడి వారు. ప్రజలపై తమ యధికారమునంతను చెల్లించుట రాజులకు దుర్ఘటముగానే యుండెడిది. ఆ విషయమున నేవేని క్లిష్ట సందర్భములు బయలుదేరుచో, చర్చివారు రాజులకు బాసటయై నిలిచి సాయ మొనర్చెడివారు. ఇతరరాజ్యములమాట యెట్లున్నను, వెస్సెక్సురాజ్యమున మాత్రము, ఈ సంగతి యథార్థమై నెగడినది.

రాజాజ్ఞను శిరసావహించుట మానవధర్మమనియు హింసావిషయికమైన యే క్రియయేని మహాపాతకమనియు, విశేషించి యట్టిక్రియ రాజధానీసమీపమున జరుగుచో నృపాలుని చిత్తశాంతికి భంగకరమగును గాన, మఱింత ఘోరతరమైన

పాతక మగుననియు, చర్చివారు, ప్రజలకు నీత్యోపదేశములు చేయుచుండువారు. ఎచ్చటనేని యిట్టి యపరాధము జరుగుచో అపరాధిని దండించుసధికారము రాజునకుమాత్రమే కలదు. తత్పూర్వము, హింసాచౌర్యాదిక్రూరకార్యములు జరిగినను, అపరాధుల దండించునాచారము లేదు. దొంగసొమ్ము తిరిగి సొంతవానికి నిప్పించివేయుటయే దొంగకు శిక్షగా భావించెడివారు. కొంత దండుగసొమ్ము (Fine) చెల్లించినచో హంతకుడును బయట బడెడివాడు. ఆకాలధర్మము లట్టివి. ఈకాలధర్మమునుబట్టి శిక్ష కొంచెము చండస్వభావమైనది. కొన్ని కొన్ని యపరాధములలో వానిసర్వస్వ మిచ్చినను అపరాధిని క్షమించెడివారుకారు. వానికి మహాపరాధము లనిపేరు. నిద్రించువానిని జంపుట చర్చిలోనున్నవానిని జంపుట యనునవి యిట్టి మహాపరాధములలో చేరినవి. వానిని విచారించుటకును, మహాపరాధిని శిక్షించుటకును, రాజునకుదక్క నితరోద్యోగిజనమునకు నధికారములేదు. "ప్రజానుశాసనధర్మసంరక్షణలకు రాజే పూట" అనుభావము ప్రజలలో నలముకొనుటకు నాడే మొదలు.

## శిష్టసభ (The Witanagemot)

వెస్సెక్సురాజులకు రాజ్యపాలనాదికము మిక్కిలి దుర్ఘటకార్యముగా తోచినది. నిత్యవ్యవహారములకుకూడ, వా రితరులసహాయమపేక్షించెడువారు. నిర్ణయము కుదరని ధర్మసందేహములలో, దక్షులైన శిష్టుల ఉపదేశములను కోరెడివారు. రాచకొలువులలో చాలకాలముండి మెప్పొందిన వివేకశాలురే శిష్టులు. కార్యావసరముల వారిని పిలిపించి సభచేసి రాజులు వారితో సంప్రతించుట తరుచుగా నయ్యెడిది. ఆ సభయే

శిష్టసభ. సాధారణముగా నూరుమంది సభికులు చేరెడివారు. వారిలో కొందఱు రాజునకు ముఖ్యమిత్రులై యుండుటయు కలదు. రాజు వారితో సంప్రతించుటమాత్రమే కాని, వారి యుపదేశమును తప్పక అనుష్ఠించి తీరవలయునని నియమము లేదు. కాకున్న, వారందరును దేశమున మంచి పలుకుబడిగల పెద్దలు గనుక రాజు, వారిమాటను త్రోసివేయక, సావధానుడై విని మన్నించుటకలదు. అదియునుగాక, శాసనవిషయికములును, సేనాదివిషయికములును, అగు వ్యవహారములు కలిగినప్పుడే, రాజు శిష్టసభవారి సలహాను అడిగెడివాడు. ఎవ్వడేని న్యాయాధికారి సరిగా తగవుతీర్పనియపుడు, రాజు దానిని పునర్విచారణ చేయవలసివచ్చెడిది. అట్టియెడకూడ, శిష్టసభికుల ఉపదేశము అవసరమయ్యెడిది.

## మండలాధిపతులు (Aldermen)

క్రీ. శ. పదివందలసంవత్సరములనాటికి, ఇంచుమించు ఇంగ్లండంతయు మండలములుగా విభజింపబడినవి. వానికి "షైర్లు" (Shires) అనిపేరు. షైరు అనగా పరిచ్ఛిన్నభాగము అని అర్థము. దండయాత్రవచ్చిననాడు, ఆంగ్లోసాక్సనులగుంపులు నివాసము లేర్పరుచుకొనిన ప్రదేశములే, కొన్ని ఇప్పటిమండలములైనవి. ఒకదృష్టాంతము చూడుడు. (North Folk) (ఉత్తరదేశపుప్రజలు) నివసించిన తావే నేటినారుఫోకు (Norfolk) అయినది. ఇట్టివి మఱికొన్ని గలవు. అవిగాక, తక్కినమండల నిర్మాణవిషయమున, ఆల్ఫ్రెడు మొదలగు రాజులు, మంచిశ్రద్ధతో, ఎంతోజాగ్రత్తగా విచారించి యెల్లలను నేర్పాటుచేసిరి. వారు దుర్గములు నిర్మించిననాడు, కొన్నిదుర్గములకు తత్పరిసరభూముల

మీద నధికారములిచ్చిరి. ఆగతి, తద్దుర్గాధిపత్యమునకు లోనైన ప్రదేశములును మండలములైనవి. అట్లుకాగా, బెడుఫోర్డునాధిపత్యము క్రిందిప్రదేశము బెడుఫర్డుషైరనియు, నటింగుహాము నాధిపత్యముననున్నది నటింగుహాముషైరనియు వ్యవహరించిరి. ఈ మండలములలో ఒక్కొక్కదానికి ఒక్కొక్క అధికారి కలడు. వాడే మండలాధిపతి (Alderman). కొంతకాలమునకు, ఒక్కమండలాధిపతియే పెక్కుమండలముల ఏలుబడియు తటస్థించెను. డేనిషుభాషలో వానిని "జరలు" (Jarl) అందురు. ఆ శబ్దవికారమే నేటి మన 'ఎరలు' (Earl) శబ్దము. మండలాధిపతివిధు లేవనగా, తనమండలప్రజలు అన్యోన్యపీడ గావించుకొనక, శాసనానుసారము వర్తించునట్లు చూచుటయు, తన్మండల న్యాయసభను సమావేశపరచి, అచ్చటి బిషపుతోకూడి తత్సభాధిపత్యము వహించుటయు, "ప్రజావర్గసేన" యుద్ధమునకు వెడలునపుడు, తాను నియంతగా నడిపించుటయు.

## షెరిఫులు (Sheriffs)

వెస్సెక్సురాజులకు ప్రతిమండలమునను, కొంత సొంతకముండెడిది. ఆ కమతము నేల, పయిపరామరిక చేయుటకు ఒక అధికారియు నుండును. ఆతడు "కమతముదారు" (Steward). కొంతకాల మగునప్పటికి, (సుమారు 950 సంవత్సరము) రాజాకమతముదార్లకు మఱికొంత యధికార మొసగ, వారును తధికారమును నిర్వహించుచు నానాట, మండలాధిపత్యమును గూడ వహించిరి. అంతట, నిక వేఱే మండలాధిపతులుండవలసిన (Aldermen) అవసరము లేకపోయినది. ఒకవంక కమతమును పరామరికచేయుచు, నొకవంక మండలాధి

పత్యమునకు సంబంధించిన విధులన్నియు నెరవేర్చుచు, వేఱొక వంక పన్నులు పోగుజేయుచు వారు సర్వతోముఖమైన ప్రాభవమునెఱపి "షెరిఫులు" అను పదమునువహించిరి. భూమి శిస్తువలన వచ్చుదానికంటె, నపరాధులుచెల్లించు దండుగసొమ్ము రూపమున రాజునకు ఎక్కుడుధనము వసూలయ్యెడిది. ప్రతి మండలముననను, ఒకన్యాయస్థాన ముండును. న్యాయాధిపతులు, తాము విచారింపదగిననేరములు విచారించి, యపరాధులకు దండుగ విధించెడివారు. దండుగవిధించుటయే సాధారణశిక్షయగుటయు, దానివలని రాబడియు నెక్కుడగుటయు జూచి ప్రజ లొక చక్కని సామెతను గల్పించిరి. "న్యాయ విచారణకంటె, లాభదాయకమైన వర్తకములేదు" అని.

### "బరోలు" (Boroughs)

ఆంగ్లోసాక్షనుబాసలో "విక్"అనగా "పల్లె" యని యర్థము. జనపదస్థానములో ముఖ్యమైనవి "బరో"లు. (Burhs (or) Boroughs) రోమనులశిబిరములు కాలక్రమమున పట్టణములైనట్లే, ఆంగ్లోసాక్షనురాజులు కట్టించిన "మట్టిగోడల దుర్గములును" బహుజననివాసముకతన పట్టణములైనవి. ఇంగ్లాండులోని యిప్పటి పట్టణవాచకశబ్దములలో దేననైన చివర "బెరి" (Bury) అను సంజ్ఞ యున్నచో, దాని పుట్టు పిట్టిదిగా గ్రహింపవలెను. "బరో"యనునది, రాజుసొంతము. అందుచే దానిచుట్టును, రాజరక్షణ (King's Peace) అను వ్యవస్థ యుండును. ఈ వ్యవస్థ యొసగు రక్షణవలన, దాని నాశ్రయించి విపణివీథులు వెలసినవి. దినవెచ్చములకుగాని, వస్తువిశేషములకుగాని చాలమంది జను లచటికివత్తురు. నల్వురు

చేరినచోట నాలుక లూరకుండవుగనుక తిట్లాటలు, కొట్లాటలు రేగవచ్చును. వాని నణచుటకును, తగవులుదిద్దుటకును, ఒకొక్క "బరో"లో ఒకొక్క న్యాయస్థానము వెలసినది. ఆ కోర్టులకు నిత్యవ్యవహారము లేదు. అవి సాలునకు మూడు సార్లు మాత్రమే పనిచేసెడివి. ఆ సమయముల "బరో"లోని స్వతంత్రులైన గృహస్థులందఱు సభతీర్చుటయు "షెరిఫు" తీర్పుసేయుటయు నాచారము.

## సీమలు. (ఫిర్కాలు) (Hundreds)

ప్రతిమండలమును, ఫిర్కాలనబడు కొన్ని యంతర్భాగములుగా విభజించిరి. అవియు కొన్ని పెద్దవిగను, మఱికొన్ని చిన్నవిగను నుండును. ఏ ఫిర్కాకు ఆఫిర్కా తానుచెల్లించవలసిన శిస్తు వసూలుచేసి మండలాధిపతికి (Sheriff) పంపును. తమ గ్రామములలో నపరాధములు జరుగకుండునట్లును, జరుగుచో నపరాధులను దామే పట్టుకొని శిక్షించునట్లును ఎల్ల ఫిర్కావారును పూచీపడవలెను. ఈ అధికారము నెఱపుటకు ఫిర్కాలలోగూడ కోర్టులు వెలసినవి. అందు నెల కొకతూరి విచారణలు జరుగును. సొంతపొలముగల గృహస్థులుగాని ప్రతినిధులుగాని యాసభకు పోవలెను. తలకుమించిన పెద్ద నేరములలో "ఫిర్కాకోర్టు"వారు జోక్యముమాని, వానిని షెరిఫుకోర్టుకు బంపెడివారు.

ఈ విధముగా, ఫిర్కాలలోను, బరోలలోను, షైరులలోను కోర్టు లేర్పడి, న్యాయముకలిగించుచు, ప్రజల చక్కని కట్టుబాటులలో నుంచజూచినవి. ఆ దినములలో రాజోద్యోగులు, న్యాయముతీర్చు, న్యాయస్థానము లెల్లెడలలేవు. అట్టిది

యొక రాజధానీ నగరమునమాత్రమే యుండును. రాజపరోక్షమునగూడ, ఆరీతిని చేతనగునంతవఱకు న్యాయముపాలించుచు ఆ కోర్టులు చిరకాలము వర్ధిల్లినవి. పిమ్మట కొంతకాలమునకు "హెన్రీ"రాజును (King Henry), అతనిసంతతివారును, ఆ ప్రజాసంస్థలలో "షెరిఫుకోర్టు" అనుదానిని రాజసంస్థగా మార్చి, వారే యా కార్యభారము వహించిరి. మధ్యయుగములో ఒకొక్కప్పుడు అపరాధులు (Criminals) తప్పించుకొనిపోవుటయు గలదుగాని, "రాజుగారికోర్టులు" వెలసినపిమ్మట, ఆ లోకువ కొంత తగ్గినది. అప్పటికిని, క్రూరకృత్యములు జరుగుచునేయుండుటయు, దొంగలును, హంతకులును తప్పించుకొనిపోవుటయు గూడ కలదుగాని, యయినను ఆంగ్లోసాక్జనుల నాటికంటె చాల నయ మని చెప్పవచ్చును.

ఈ యాంగ్లోసాక్జనులకోర్టులు, ఎన్నివిధముల పాటుబడుచున్నను, ప్రజలలో సద్వర్తనము సమగ్రముగా నలవడనే లేదు. కోర్టులకును పని యెక్కువయైనది. ఆ పనియొత్తిడివలన, వారికి తాముచెప్పుతీర్పులు న్యాయములో అన్యాయములో యోచించిచూచుకొను నవకాశమును లేదు. చాలభాగము, తీర్పులు, అవిచారమూలకములుగానే యుండెడివి. శిక్షావిధానమున, వారవలంబించిన సరణి జూచితిమేని, యీ విషయము తెల్లమగును:—

"ఎ" అనువాడును, "బి" అనువాడును ఉన్నారనుకొనుము. వారిలో "బి" అనువాడు, ఎచ్చటనో హత్యచేసెనని, "ఎ" అనువాడు, వానిపై నేరము పెట్టదలచుచో, ఆతడు "షైరుకోర్టు"కు పోయి, సభికులకభిముఖుడై, వినయవాక్య

ముల, తాను తెచ్చిన యభియోగవివరణము సేయవలెను. అప్పుడు "బి" కోర్టువారియెదుటికి వచ్చి, సహజముగ తాను నిరపరాధి ననియే చెప్పికొనును. ఉభయవాదులును, అతివిన యముగా మాటలాడవలెను. కొంచెము వాచాదోషము తోచెనా వానివాదము ఓడినట్లే. అప్పుడు వారియిరువురిలో నెవనిమాటను పరీక్షించవలెనో, ఆ పరీక్ష యెట్టిదిగానుండ వలెనో సభికులు నిర్ణయింతురు. ఆ నిర్ణయమునుబట్టి "బి" అనువానినే పరీక్షింపవలసివచ్చిన దనుకొనుము; వెంటనే యాతడు పండ్రెండుగుర, తన్నెఱిగినవారిని, సాక్షులను దెచ్చి కొనవలెను. ఆ సాక్షులకు "ప్రామాణికులు" (Oath--Helpers) అనిపేరు. ఆ సాక్షులందఱును ప్రమాణపూర్వకముగ, "బి చాల మంచివాడు. బొంకువాడు గాడు" అనవలెను. అందులో నొక్కడైనను దానికి విపరీతముగ బల్కినను, యెవ్వడేని మాట లలో కొంచెము, తడబాటు పొరబాటులు పడినను, "బి" యపరాధి యన్నమాటయే. ఇదియొకపద్ధతి. ఇంకొకటి శుద్ధి ప్రక్రియ. దానికే "శుద్ధిపరీక్ష" యనిపేరు (Trial by Ordeal). అందును జాల భేదములుగలవు. 'ఉష్ణోదకశుద్ధి,' 'అలాతశుద్ధి,' 'శీతోదకశుద్ధి,' 'అన్నశుద్ధి' యని.

**అన్నశుద్ధివిధానము:—**

"బి"యనువాడు, చేత నొక రొట్టెముక్కను గ్రహించి "దైవమా, నే నపరాధినైతినేని, నా గొంతు నొక్కి, యూపిరి యాడకుండ జేయుదువుగాక" అని శపథముచేసి, యా ముక్కను తినవలెను. ఆ తినుటలో, కొంచెము, పొరమారి దగ్గినను, డోకినను, వాడపరాధి యనియే నిర్ణయము.

శీతోదకశుద్ధి:—

కాలుసేతులు కట్టి వాని నొక చెఱువులో త్రోయుట దీని విధానము. వాడు తేలెనా యపరాధి, మునిగెనా నిరపరాధి. పావనోదకములు, వాని సంపర్కము నొల్లక త్రోసివైచుటచే తేలునని వారిభావము.

అలాతశుద్ధివిధానము:—

ఎఱ్ఱగ కాలిన యినుపముక్కను దోయిటబట్టి, వాడు కొంచెముదూరము నడిచిరావలెను. వెంటనే వాని చేతులకు గుడ్డకట్టి ఆ కట్టును మూడునాళ్లకు విప్పుదురు. అప్పటికి చేతి పుండు మాను పట్టెనా వాడు నిరపరాధి; యుఱిసియుండెనా యపరాధి.

ఉష్ణోదకశుద్ధి:—

దీనికిని, అలాతశుద్ధివిధానమునకును ఎంతో భేదములేదు. అందు, ఎఱ్ఱగ కాలిన యినుపముక్కను గైకొనవలెను. ఇందు, పొంగులారు వేడినీట కాలిన రాతిముక్కను గైకొనవలెను. "అథెలుస్టను" (Athelstan) రాజుశాసనములలో, నొక శిక్షాశాసనము నుదహరించెదము, పరికింపుడు.

"ఉష్ణోదకశుద్ధికై పొంగులారువఱకు నీరు కాచవలెను. నేరము మోపిన వాడి, యొక్కడేయగుచో, రాతిముక్కకై చేతిని, మణికట్టుదాక ముంచినజాలును. వాదులు ముగ్గురగుదురేని, మోచేతివఱకు, చేయి ముంచవలెను. ఆ సమయమున నెవ్వరును నోరుమెదపరాదు. అందఱును, సత్యదర్శనమునకై భగవంతుని, భక్తిపూర్వకముగా ప్రార్థించుచుండవలెను."

పైన పేర్కొన్న పరీక్షావిధానములలో దేనినైనను ప్రయోగించి, అపరాధి యని తేలినచో శిక్షించుటయు, నిరపరాధి యని తేలినచో వదలివేయుటయు నాచారము. శుద్ధిపరీక్షలో నెగ్గనువచ్చును, నెగ్గకపోవనువచ్చును. న్యాయనిర్ణయమున, దాని కంటె సాక్ష్యవిచారణయే ఉత్తమపద్ధతి. ఏమనగా, ఆ పురుషుని పూర్వవర్తనముబట్టి, వాని మంచిచెడుగులు, ఇరుగుపొరుగు వారు ఎరిగియుండవచ్చునుగాన, ఆ సాక్ష్యమును నమ్ముటలో దోసగు లేదు. అదియునుగాక, అందును కొంత లోపమున్నది. ఒక సాక్షికి నిబ్బరములేక సభాకంపము కల్గి దృఢముగా మాట లాడనిచో, అదియు 'బి'కి అనిష్టదాయకమే యగును.

ఏమైనను, ఈపద్ధతులు అనాగరకము లనకతప్పదు. ఇటీవలిరాజులు సంస్కరించువఱకు, ఆ పద్ధతు లమ్లే చెల్లినవి.

## వ్యవసాయము

ఆంగ్లోసాక్సనులకు వ్యవసాయమే ప్రధానవృత్తి. వారిలో చాలమంది కృషికి ననువగు బయళ్లలో గ్రామములు నిర్మించుకొని, నివసించిరి. కొన్ని గ్రామములు చిన్నవి; కొన్ని గ్రామములు పెద్దవి. చిన్నగ్రామములు ఒకదాని నొకటి అంటుకొని కూడలిగా నుండును; పెద్దవి ఎడముగా నుండును. గ్రామము చుట్టుగల భూమిని, రెండు, మూడు ఖండములుగా విడదీసి, ఒకొక్క ఖండమే మరల ఎకరము ఎకరము పరిమాణము గల చెక్కలుగా ఏర్పాటుచేసిరి. తన శక్తికి తగినట్లు, కొన్ని చెక్కలు ఒకొక్కరైతు వ్యవసాయమునకు తీసికొనును. అనేకగ్రామములలో 'ప్రభువు' అని చెప్పుకోదగిన పెద్దరైతు

ఉండుటయు కలదు. గ్రామమంతయు వానివశముననే ఉండును. ఇవి నార్మనులనాటి జమీనులను పోలియుండును.

## వర్తకము

రోమనులనాటి వర్తకసంపద వారితోనే అస్తమించినది. వర్తకనాశనమే పట్టణములు క్షీణించిపోవుటకు గల కారణములలో నొకటి. అంతయేల, ప్రజలు, రాతిని ఇటుకను వాడుటయే మరచిపోయిరి. నార్మనుల ప్రవేశమువఱకు, కట్టడములన్నియు దారుమయములే. పురాతనమైన రాతికట్టడమును చూచి, విస్మితుడై ఒక ఆంగ్లోసాక్సనుకవి దానిని 'అసురకృతి' అనివర్ణించెను. పట్టణపునరుద్ధరణమునుగూర్చి వెనుకకొంత జెప్పితిమి. క్రొత్తగా వెలసిన ఆపట్టణములలోని పౌరులు ఎవరికి కావలసినవస్తువులు వారే చేసికొనువారు. క్రమముగా అవసరమునుబట్టి, ఇతరవస్తువులు బయటనుండి రాసాగెను. మఱికొంతకాలమునకు, లోహకారులు, కాచకారులు, కుంభకారులు మొదలగు వస్తునిర్మాణకుశలులును వచ్చిచేరిరి. క్రీ. శ. 1000 సం॥ నాటికి రొట్టెలవారు, ఉప్పుచేయువారు, కమ్మరులు, వడ్రంగులు, చర్మకారులు కూడ ప్రవేశించిరి. మొదట ఒకొక్క పనికి, ఒకొక్కపట్టణమున, ఒకొక్కడే ఉండువాడు. ఒకేవృత్తిగల ఇరువురు, ముువ్వురు పనివాండ్రుండుట, ఎన్నటికో జరిగినది. పట్టణములు నానాటికి వృద్ధిపొందకుండుటకు డేనుల రాకయే కారణము.

## ఆంగ్లోసాక్సనుల నాటి ప్రజల తరములు

రాజులును, ప్రభువులును ప్రజలలో ఉత్తమోత్తములు. వారతిమాన్యులు. బానిసలు అధమాధములు. ఇక మిగిలినవారు

మధ్యములు. వారిలోను చాల అంతరము లున్నవి. కొందఱు సమగ్రస్వాతంత్ర్యులు. కొందఱు స్వతంత్రప్రాయులు: కొందఱు ఈషత్స్వాతంత్ర్యులు. నార్మనులప్రవేశానాంతరము, ఈ అంతర ములు క్రమముగా సమసిపోదొడంగినవి.



## అయిదవ ప్రకరణము



### డేనులదండయాత్ర, జయము; వెస్సెక్సు క్షీణదశ

### ఎథెలురెడ్ (Ethelred The Unready 978--1016)

ఈతడు 978-వ సంవత్సరములో, వెస్సెక్సురాజయ్యెను. ఇతడు జ్ఞానశూన్యుడగుటయే కాక దురుపదేశములగూడ జెవి యొగ్గి విని, యా ప్రకారము వర్తించెడివాడు. అందుచేతనే ప్రజలాతనిని "చపలచిత్తు"డనిరి (The Unready). డేనులతో నితడు వర్తించిన విధముచూచినచో, నితని తెలివిలేమి తెల్ల మగును. ఇతనికాలమున మరల క్రొత్తగా డేనులగుంపులు దాడిరాదొడగినవి. వాని నెదిరించి పోరుటకంటె, లంచమిచ్చి పంపుట మంచిదని, యీ రాజు ఆసొమ్ము సంతనచేయుటకు "డేనులంచము" (Danegeld) అను నొకపన్ను ప్రజలపై వేసి వసూలుచేసి, శత్రువులకిచ్చి సంతోషపెట్టి పంపెను. అంతతో దనివిచెంది వారిక రారని యితని యాస. కాని డబ్బురుచి మరగి వారు మరల మరల రాదొడగిరి. వచ్చినప్పుడెల్ల, ఎథెలు రెడ్ లంచము లిచ్చుచునే యుండెను. ఈ విధముగా నైదు తడవలు జరిగినది. మొత్తమున డేనులకు 30,000 వెండి పౌనులసొమ్ము ముట్టినది. అప్పటి కాతడు కన్ను తెఱచి, యీ

యాటలు ఇక సాగనీయకూడదనుకొని, దానోపాయముకంటె దండోపాయమే యుక్తమమని దాని నవలంబించెను. (1022) పోనీ, యిప్పుడైనను ఆతడు తెలివినైన వర్తించనేలేదు. మొన మొన్న జేసికొన్న సంధిసమయముల ననుసరించి, తనరాజ్యమున ప్రజలలోప్రజలై కాపురములు చేయుచున్న డేనుల నందఱిబట్టి యాతడు వధింప బనిచెను. ఆగతి హతులైన వారిలో డెన్మార్కు-దేశపురాజుచెల్లెలొకతె. ఆ రాజుపేరు "స్వెయిను" (Sweyn). ఆస్వెయిను ప్రతీకార దీక్షపూని, ఇంగ్లండుపై దాడి నడిచెను (1013). ఆతనిరాక విని ఎథెల్‌రెడ్డు, నార్మండికి (Normandy) పారిపోగా, అతనికొడుకు ఎడ్మండు (Edmund) శత్రువులమారొకని పోరెను. ఈ యెడ్మండునకు "ఉక్కుతున్కు" (Ironside) అను బిరుదుగలదు. ఈ 'యుక్కుతున్కు' మెన్నిమారులో హోరాహోరి పోరాడెను గాని, తుదకు 'స్వెయిను'కొడుకగు "కెన్యూటు" (Cnut) వలన పరాజితుడయ్యెను. (1017) ఆ యుద్ధమునకు "అస్సండను యుద్ధ" మని పేరు (Assandun). ఆ ప్రదేశమునే యిప్పుడు "ఆషింగుటను" (Ashington) అనుచున్నాము.

## కెన్యూటు (1017–1035)

ఈతడు పదునెనిమిదిసంవత్సరములు ఇంగ్లాండును పాలించెను. ఈ రాజు ఇంతకుమున్నె, డెన్మార్కు, నార్వే, దేశములకును, స్వీడనులో కొంతభాగమునకును పాలకుడగుటచే, ఆతనివలన ఇంగ్లాండునకు, యూరపుతో తీరనిబాంధవ మేర్పడినది. ఆ కారణమునను, దేశమున భద్రత నెలకొనుటచేతను, మరల వర్తకవ్యాపారములు సాగినవి, పట్టణములును బెరిగినవి.

ఇంగ్లాండునుండి తగరము, సీసము, తోలు, గుఱ్ఱములు, ధాన్యములు పరదేశముల కెగుమతియయ్యెడివి. జిగురు, లక్క, చేపలు, పట్టుబట్టలు, సుగంధవస్తువులు లోనగునవి దిగుమతి యయ్యెడివి. పట్టుబట్టలు చీనాదేశమునుండియో, కాన్స్టాంటి నోపిలు (Constantinople) నుండియో వచ్చెడివని యూహింప నయ్యెడిని. శీతకాలమున, నిలవయుండు మాంసము చెడి, దుర్వాసన కొట్టకుండుటకై, అందు సుగంధవస్తువులు కలిపెడి వారు. అందుచే వానియవసరముకలిగెడిది.

రాజును, ప్రజలును, అన్యోన్యవిశ్వాసముతో నుండిరి. రాజు తనయంగరక్షకులుదక్క తక్కిన సేనలన్నియు, డెన్మార్కునకు బంపివైచెను. ఆ యంగరక్షకులలోను కొందఱాంగ్లేయుల నియోగించెను. పూర్వపు "రాష్ట్రసప్తక" మిప్పుడులేదు. ఇంగ్లాండంతయు నొకేదేశము, దాని కొకడేరాజు. కాని "కెన్యూటు," దేశములో కొంతభాగమును "జాగీరులు"గా (Earldom) జేసి, వానిని పాలించుటకు డేనుదొరల (Danish Earls) కొందఱిని, ఇంగ్లీషుదొరల కొందఱిని నియోగించెను.

అతనిపిమ్మట నతని యిద్దఱుకొడుకులును రాజ్యమునకు వచ్చిరి. కాని వారిరువురును 1042 సం॥ లోనే చనిపోయిరి. అంతట ఎథెలురెడ్డుకొడుకగు ఎడ్వర్డు రాజయ్యెను.

### ఎడ్వర్డు ది కన్ఫెసరు (Edward the Confessor) 1042—1066

ఈ రాజతిసాధువర్తనుడు, పావనచరిత్రుడని, మెచ్చి, యతని తదనంతరము ప్రజలాతని, సత్యసంధుడని (Confessor) చెప్పుకొనసాగిరి. నిజమే, ఆరాజు ఋషికల్పుడు. కాని ఋషులందఱు రాజులుకాగలరా? కనుకనే యీ ఋషికల్పు

డును, రాజ్యసంరక్షణార్థముకంటె, నాత్మరక్షణార్థమెక్కుడు సాధనసల్పెను. మనమెఱిగినంతవఱకు, ఈతడు చేసిన యొక సంస్కారముగాని, యొక్క శాసనముగాని లేదు. అనగా ఐహికముగా నీతడు సాధించినది బహుస్వల్పము. దీనికి తోడతడు కర్తవ్యవిముఖుడుగూడనయ్యెను. నార్మను లీదేశము పైకి దండెత్తివచ్చుట, యీతనిపరిపాలన దుష్ఫలమే. ఆంగ్లదేశ చరిత్రమున నాతనికి దక్కినకీర్తియిదియే.

ఈతని తల్లి యొక నార్మండి జమీనుదారుని (A Duke of Normandy) కుమార్తె. ఎడ్వర్డు, చిన్ననాట తాతగారి యింట పెరిగెను. అప్పు డాతనికి, ఫ్రెంచిభాషయు, వారి నడ వడియు బాగుగ నలవడెను. కనుకనే, ఇంగ్లాండునకు రాజయ్యు గూడ, నతడు ఫ్రెంచిలోనే మాటలాడెడివాడు. మాటలే యేల, యతని తలపులును ఆభాషనే యాశ్రయించెడివి. ఆత నికి ఆభాషయందును, ఆప్రజలయెడను పక్షపాతము మెండు. అవకాశము కలిగినప్పుడెల్ల నార్మనుల బిలిపించి యీదేశమున పెద్ద పెద్ద యుద్యోగము లిచ్చెడివాడు. ఆతని యేలుబడిలో నెందఱో నార్మనులు బిషప్పులైరి, సంపన్ను లెందఱో యిచట కోటలు, ప్రాసాదములు కట్టుకొనిరి. ఇవన్నియు నిటులుండ దక్షిణతీరమునగల రేవుపట్టణములన్నియు, వానియానతిని వారికిదక్కినవి. ఇదియంతయు ఇంగ్లీషువారికి నచ్చక, వారు నార్మనులను ఏవగించుకొనజొచ్చిరి. వారి యాచారములను, నడవడిని అసహించుకొనసాగిరి. అసూయాంధకారులై, వారి వలన నేర్చుకొనదగిన మంచివిషయముల సైతము తిరస్కరించిరి. గుఱ్ఱములెక్కి పోరాడుటలో, నార్మనులు కడు కుశలులు. ఆ విద్య ఇంగ్లీషువారు, వారివలన నేర్చుకొనదగినది. కాని వారియాచా

రము దేనిని అవలంబింపగూడదని భీష్మించి, యింగ్లీషువారు చెడిరి. హేస్టింగ్సు యుద్ధములో (Battle of Hastings) దెబ్బ తినునప్పుడు, 'కాల్బలముకంటె, నాశ్వికదళమే, సమర్థమును అపాయకరమును' అనిగ్రహించి, ఆంగ్లేయులు తమతప్పు తాము తెలిసికొనిరి.

## హెరల్డు (Harold)

ఎడ్వర్డురాజునసమర్థతనుబట్టి, రాజకార్య నిర్వహణభార మంతయు దొరలే (Earls) వహింపవలసివచ్చినది. వారిలో గాడ్విన్ (Godwin) అనునతడు ప్రముఖుడు. వెనుక ఎడ్వర్డు రాజ్యమాశించినప్పుడు, వానికి బాసటయై నిలిచి రాజుగా చేసినవాడు గాడ్వినే. అట్టి ఉపకారితో కలహించి, ఎడ్వర్డు వానిని రాజ్యమునుండి తరిమివేసెను. (1051). అంతతో నూరకొనక, నార్తంబ్రియా, మర్షియా దొరలను ప్రోత్సహించి, వానితో కలహించునట్లుచేసెను. కాని మరుసటిసంవత్సరమే, గాడ్విను తనకుమారుడైన హెరల్డుతో తిరిగివచ్చి, నార్మనుల లోలో విద్వేషించుచున్న ప్రజలనందర నొకపక్షముగా చేర్చి తాను వారికి నాయకుడయ్యెను. ఆపక్షమువారందరు ఆతడు చెప్పినట్లు నడుచుకొనుచుండిరి. కాని, ఆ ప్రాభన మెన్ని నాళ్లో సాగకమునుపే, ఆతడు గతించెను. (1053). తదనంతర మాతనికుమారుడు, హెరల్డు పైతృకమైన అధికారమును వహించి, తనపక్షమువారిని చెదరకుండబట్టెను. తాను రాజయ్యు, ఎడ్వర్డు, హెరల్డును ఎన్నడు తిరస్కరించలేక పోయెను. పండ్రెండుసంవత్సరము లిట్లు జరిగినపిమ్మట, 1066-వ సంవత్సరములో ఎడ్వర్డును గతించెను. అంత, శిష్టసభవారు హెరల్డునే తమకు రాజుగా వరించిరి.

విలియము (William) నార్మండి జమీందారుడు (Duke of Normandy)

ఇంగ్లండులోని స్థితిగతు లిట్లుండగా, విలియము, ఈ దేశముమీదికి సేనలను నడిపించుటకు, వలయు ఓడలు మొదలగు సాధనములతో నాయత్తపడుచుండెను. ఇంగ్లండునకు తాను రాజుకావలెననియు, పూర్వమెప్పుడో ఎడ్వర్డు తనకు రాజ్య మిత్తునని వాగ్దానము చేసెననియు అతనివాదము. ఎడ్వర్డుకాక, హెరల్డుకూడ అట్టివాగ్దానమే చేసెనట. ఆతని మాటలు నమ్మి రోములోని పోపు, "ఇంగ్లండుదేశమున కభిషిక్తుడవగుదువుగాక," అని అతని నాశీర్వదించిపంపెను. పోపునకు కూడ అవ్యాజప్రేమకాదు. దానికి కొంత హేతువున్నది. ఏమన, ఆరోములోనే, తనకు పోపుపదవి కావలెనని ఆశించు నింకొక మానిసికలడు. వారి కొండొరులయెడ మత్సరము మెండైనది. ఆ మానిసికిని, కాంటర్బరీ ఆర్చిబిషప్పు (Archbishop of Canterbury) అయిన స్టిగాండు (Stigand) నకును, మైత్రి యుండుటచే పోపునకు ఇంగ్లండునెడ ప్రీతిలేదయ్యె. విలియము సేనాసన్నాహములనుగూర్చి ఒక ఫ్రెంచిచరిత్రలో నిట్లున్నది. "తనపైప ఇంగ్లండురాజ్యము నపహరించిన హెరల్డుమీదికి దండెత్తిపోవు నార్మను జమీందారుని ఖ్యాతి నానాదిశల వ్యాపించెను. ఆ మాట వినుటతోడనే, ఒక్కడొక్కడు, ఇరువురిరువురు, నల్వురునల్వురు, అయిదుగురయిదుగురు, ఆరుగురారుగురు, ఏడుగురేడుగురు, ఎనమండ్రెనమండ్రు, తొమ్మండ్రుతొమ్మండ్రు, పదుండ్రుపదుండ్రుగా యుద్ధభటులు తమంత వచ్చిచేరిరి. ఆతడు వారికందరికి వలయునంత ధనమిచ్చి, వలసిన ఇంకను ఇత్తు నని చెప్పి, అందరిని నిల్పుకొనెను. మొత్తమున, ఆతనిసేనలో

సుమారు 12,000 మంది కలరు. వారిలో, ఇంచుమించు సగముమంది ఆశ్వికులు.

హేస్టింగ్సు యుద్ధము (Battle of Hastings, 14th October 1066.)

ఎదురుగాలివలన, విలియముసేనలు ఆరువారములవఱకు సముద్రమును దాటలేకపోయెను. ఇంతలో నార్వేరాజైన, హెరల్డుహారద్రద (Harold Hardrada) ఉత్తరదిక్కున సముద్రముదాటి ఇంగ్లండులో సేనలతోవచ్చి విడిసెను. మెర్సియా, నార్తంబ్రియా దొరలైన, ఎడ్వీను, మార్కరు (Morcar) లు తమ తమ సేనలతో నార్వేరాజును మార్కొని, యార్కు పట్టణము నొద్ద ఓడిపోయిరి (Battle of York). ఈ దుర్వార్తవిని, ఇంగ్లండురాజగు హెరల్డు, తన అంగరక్షకులతో తరలిపోయి, నార్వేరాజును తాకి, వానిసేనల నిశ్శేషముగా నోడించెను. అదియే "స్టాంఫర్డు బ్రిడ్జి" యుద్ధము (Stamford Bridge.) ఆ రీతి, వచ్చిన పనిని వెంటనే చక్కజేసికొని నాల్గు దినములలోనే ఆతడు లండనునగరమును చేరెను. అంతలో విలియముకూడ సముద్రముదాటి పెవెన్సీ (Pevensey) యొద్ద విడిసెను. అప్రతర్క్యమైన ఈ ఉపద్రవమును గడవనెంచి, హెరల్డు ససైన్యముగ రాష్ట్రమునంతయు కలయ తిరిగి, అచ్చటి ప్రజాసేనను సమకూర్చుకొని, ఒకగుట్టమీద విడిసి, 'విలియము'రాక నిరీక్షించుచుండెను. ఆప్రదేశము హేస్టింగ్సునకు వాయవ్యమూలగా ఆరుమైళ్లదూరమున కలదు. అంతట, విలియముసేనలును చేర వచ్చెను. సేనాముఖముననున్న ఆశ్వికదళము నాల్గుగంటల సేపు నిరంతరముగా భల్లప్రయోగము చేసియు, పెట్టనికోట వలె నున్న ఇంగ్లీషువారి డాలువరుసలను భేదింపలేకపోయెను.

ఆశ్వికదళమును వెన్నంటినిలిచిన విలుకాండ్రు, దానిచాటున నుండి బాణపరంపరలు కురియగా, ఇంగ్లీషువారి సేన తాళలేక క్రమముగా నశించెను. ప్రొద్దుక్రుంకినది; హెరల్డును చచ్చెను. చీకటిపడినది. జయోల్లాసియైన 'విలియము' యుద్ధభూమిని విడిచి, నిరాటంకముగా లండనునగరమునకు పయనమయ్యెను.

## విలియము రాజగుట

విలియము, యుద్ధభూమిని విడిచి, యుత్తరముగా నడిచి, "వాలింగుఫోర్డు" (Wallingford) నొద్ద, తేమ్సునదిని దాటి లండనునగరముచుట్టును, సేనలతో కాపుండెను. ఎడ్విను మార్కరులు (Edwin and Morcar) ప్రతీకారార్థము, సేనలతో వత్తురని యాతడు శంకించెను గాని వారు రానేరాలేదు. అంత 1066-వ సంవత్సరమున క్రిస్టమసుపండుగనాడు, ఆతడు పట్టాభిషిక్తుడయ్యెను.

దేశమున, నేకీభావములేకుండుటయు, యుద్ధతంత్రమున ప్రాచీనపద్ధతులేకాని, నవీనసరణి యెఱుగకుండుటయు, ఇంగ్లాండు ఓడిపోవుటకు ముఖ్యహేతువులు. ఎడ్వినుమార్కరులకు హెరల్డునెడ విశ్వాసముకుదరక 'మనకేమిపోని'మ్మన్నట్లుగా తొలగియుండిరిగాని, యతనికి బాసటగా, కూడిరారైరి. యూరపున నెల్లరును, యుద్ధతంత్రమున నాశ్వికదళమునే ప్రధానముగా పెంపొందించుకొనెడి యానాళ్లలో, ఇంగ్లీషువారు దానిపేరైన నెఱుగని స్థితిలో నుండిరి.



## ఆఱవ ప్రకరణము

### నార్మనురాజుల పరిపాలన

“భగవద్భక్తులయెడ నతిసాధువు. తనయాజ్ఞ మీఱిన వారియెడ నతికఠినుడు.......ఆతనిరాజ్యమున, నెట్టివాడేని ఒడినిండ బంగారముతో, నెంతదూరమేని, నిర్భయముగా ప్రయాణముచేయవచ్చును. ఆతనిరక్షణ యిట్టిది. ఆతని ధనతృష్ణకును, భూకాంక్షకును మేరలేదు.......మృగయావినోదార్థము అడవులుకల్పించెను. అందు లేళ్లు తిరుగుచుండెడివి. పెద్ద పెద్ద దుప్పులయెడ నాతనికి ప్రేమ యెక్కువ. వానిని తండ్రివలె నాదరించెడివాడు.” ఆనాటి యొక రాచకవిలెలో మొదటి విలియమునుగూర్చి యీ వాక్యములు వ్రాసియున్నవి.

పట్టాభిషిక్తుడైనవెంటనే, యాతడు, ఇంగ్లండులోని తక్కిన రాష్ట్రముల జయింపగడగెను. పూర్వపశ్చిమోత్తరభాగముల, జయము దుష్కరమేయయ్యెను. హెరివార్డు (Hereward) అనునతడు ఎలీ లంకలో (Island of Ely) విలియముసేనల, ప్రతిఘటించి నిల్చి, చాలకాలము లొంగనేలేదు. తుదకు విధిలేక, 1072-వ సంవత్సరమున వీగిపోయెను.

అంతతోను, విలియముపని సుకరముకాలేదు. 1074-వ సంవత్సరములో, ‘హెరిఫోర్డు,’ ‘నార్‌ఫోకు,’ ‘హంటింగుడను’ దొరలు (The Earls of Hereford, Norfolk and Huntingdon) కూడి, యొక పెద్ద తిరుగుబాటును లేవదీసిరి. విలియము, ఆ విప్లవమును గూడ నణచి, దేశమున శాంతిభద్రతలు నెలకొల్పెను. ఆపై నతని యేలుబడిలో నలజడి యన్న మాటలేదు.

'విలియము' రాష్ట్రములను జయించుటయేకాక, యుద్ధములో తన యెదిరిపక్షముచేరినవారి భూములనుగూడ లాగికొనెను. ఆభూములలో కొంతభాగము, సొంతకమతముక్రిందను, కొంతభాగము అడవులుపెంచుటకును, తానుంచుకొని, మిగిలినది తనపక్షమున పోరాడినవారికి, కానుకలుగా నొసంగెను. కాని వారికా పొలములపై సర్వాధికారము లేదు. వా రాపొలములు పండించుకొని తినవచ్చును, అందు రాజాజ్ఞగైకొని భవనములు కట్టుకొని యుండవచ్చును, కొంత యితరులకు నివాసస్థలములుగా నొసగవచ్చును. అంతియేకాని భూమిహక్కు రాజుదేకాని వారిదికాదు. వారి రాజభక్తి చలించెనేని, వా రాభూములు గోల్పోదురు. ఇది విలియముచేసిననిర్ణయము.

ఈ భూదానమిచ్చినందులకు ప్రత్యుపకారముగా రాజునకు వారు కొంత సేవయు జేయవలెను. అదియేదన, 'రాజు కోరినచో, వారు సాలునకొక నలుబదినాళ్లు రాజుపక్షమున యుద్ధము చేయవలెను. వారు కత్తిగట్టి పోరాడుటయెటులున్నను, ఎవరికి లభించునంత వారు మంచి యాశ్వికవర్గమును దోడ్కొనిరావలెను. అదియునుగాక అవసరవేళల వారు రాజునకు కొంత సొమ్ముకూడ చెల్లింపవలెను. రాజు శత్రువులచే జిక్కినపుడు, వానిని వదిలింపించుటకును, రాజుగారిపెద్దకుమారుని వివాహవేళ నాతడు పౌరప్రముఖుల కిచ్చు విందుసందర్భముననుు, ఆ పెద్దకుమారునికి శూరపట్టము కట్టునపుడును (Knighting) వారు సొమ్ముచెల్లింపవలెను. అవసరవేళలనగా నివియే. ఈ విధముగా నిచ్చుధనములకు "సాయములు" అని పేరు. ఈ సమయములమీరక భక్తితో వర్తింతురేని, వా రాపొలము లెన్నినాళ్లైనను అనుభవింపవచ్చును. వారితదనంతరము, వారి కొడుకులును

'రాజభక్తిశపథము' చేసి ముందు కొంత మొత్తము రాజునకు కానుకగా నిత్తురేని, తండ్రులవలె నా భూముల ననుభవింప వచ్చును. ఈ యొడంబడికలతో భూము లనుభవించు రాజభక్తు లకు "పెద్దకౌలుదారులు" అనిగాని "ప్రధానక్షేత్రస్వాములు" అనిగాని పేరు. (Tenants-in-chief, or Principal Landholders.)

అట్లుగాక, భూదానములు గ్రహించినమఱికొందఱు, వారి వారి యెత్తునుబట్టి, వేరు వేరు సేవలును చేయఁజెల్లును. కొందఱు ఇంటిపనులు చక్కబెట్టుదురు; కొందఱు రాజు సొమ్మును లెక్కించుదురు; కొందఱు వ్యవహారముల తోడ్పడుదురు. ఈ పద్ధతిని బట్టి పిన్నలుమొదలు పెద్దలవఱకు రాజపరివార మంతయు పొలములు ఈనాములుగా పుచ్చుకొని పనిచేయు వారేకాని జీతములు పుచ్చుకొను వారు లేరు.

ఆ పెద్ద రైతులును, తమ పొలమంతయు సొంతముగా వ్యవ సాయము చేసికొనెడివారుకారు. అంతపొలము వారికక్కఱ లేదు. కావలెననుకొన్నను దాని సాగునుజేయ లేరు. అందు చేత, వారు తమకు కాబట్టినంత తమక్రింద నుంచుకొని, తక్కి నది మఱికొందఱికి కౌవులిచ్చెడివారు. ఆ చిన్నకౌవులుదారు లును, పెద్దకౌవులుదారునకు కొంతసేవచేయుటయే, కౌవులు ప్రతిఫలము. ప్రధానభూస్వామి యొకడు, తాను రాజుతోచేసి కొన్న యొడంబడికనుబట్టి యుద్ధసమయమున తనవెంట నిరు వదిమంది యోధుల దీసికొనిపోవలసియున్నదనుకొనుము. అప్పు డాతడు తాను కౌవులీయనెంచినపొలమును, ఇర్వదిమంది యోధులకే, అవసరమగునపుడు తనకొఱకు పోరాడు సంకేత ముతో, నిర్వది భాగములుగా నిచ్చును. లేదా, దానిని నాల్గుభాగములుగా జేసి, తలకొక యైదుగురు యోధులను గొని

రాగల నల్వురకు ఆనాల్గు భాగములనిచ్చును. ఉభయపక్షముల నెట్లయినను ఆతనికి గావలసిన ఇరువదిమందియు లభింతురు. ఆ చిన్నకౌవులుదారును, అదేరీతిగా, తనపొలములో మఱికొంత యింకొకనికి కౌవులిచ్చుకొనవచ్చును. అయ్యెడను, నౌకరీచేయుటయే ప్రతిఫలముగాని ధనధాన్యములుగాదు.

ఈ పద్ధతినిబట్టి, ఎల్లరైతును ఒరుడిచ్చినపొలమును వ్యవసాయముచేయువాడే. వానికిసొంతపొలమన్నదిలేదు. ఆ పొల మిచ్చినవాడు, పుచ్చుకొన్నవానికి "ప్రభువు." ఎల్లవాడును తన ప్రభువునకు భక్తుడై, వాని విరోధులనెఱిగి ప్రభువుతో జెప్పుచుండవలెను. దీనియర్థము 'దాసోహ' మనుట.

భూవిభజనపద్ధతిని, చరిత్రకారులు "పార్థివపద్ధతి" యని వాకొనిరి (Feudalism). లాటినుభాషలో 'Feodus అనగా 'పృథివి' యని యర్థము. తత్సంబంధమైనపద్ధతిగనుక, నిది "పార్థివపద్ధతి" యయ్యెను. ఆంగ్లోసాక్సనురాజులే యీ పద్ధతి కొంత ప్రారంభించిరి. కాని వారిదినములలో నది బాగుగ నెరవేరలేదు. నార్మనురాజు, "భూమియంతయు నాదే. ఇతరుల కొకయంగుళమేని లేదు. దీని నంతను నేను జయించితిని" అని ప్రకటించుటఁ బట్టి యిప్పు డది సమగ్రముముగా ఫలించినది.

## రాజుయొక్క విశేషాధికారములు

ఈ పార్థివపద్ధతి, యొక ఇంగ్లాండులోనేకాక, ఇంచుమించు, యూరపులోని యన్ని దేశములలోను గలదు. ఆ యా దేశముల కాలక్రమమున, రాజు భూస్వాములయెడ చూపవలసిన యాదరమునుగూర్చియు, వారి యధీనమునగల భూముల నేలుకొనుటలో వారికిగల యధికారమునుగూర్చియు, కొన్ని

నియమములును, ఆచారములును బయలుదేరినవి. ఇంగ్లాండులో, నార్మనురాజుమాత్రము "ఆ నియమములు నిత్యములు గావనియు రాజు తన యిచ్చవచ్చినట్లు రాజ్య మేలవలసినవాడే కాని, ఆ యాచారనియమములకు బద్ధుడు కాడనియు, ఏ యాచారమేని, దేశమునకు ననిష్టదాయకమని తోచినప్పుడు రాజు, దానిని సంస్కరింపవలెననియు" ప్రకటించెను. దానిం బట్టి 1-వ విలియము మఱికొన్ని యధికారములు దక్కించుకొనెను. అవియేవనగా:—"ప్రజాపక్షుసేనవారు, తాను కోరినప్పుడు, విధిగా తనకై కత్తిగట్టి రావలయుననుట, దేశమునగల యన్ని కోట్టలమీదియధికారమును తనదేయనుట, ప్రతిభూస్వామియు, పొలము తిన్నగా చూచుచున్నాడో లేదో యని పైపరామరికచేయుటకు దగిన యుద్యోగులను తాను పంపుచుండవలెననుట." పైపరామరికచేయు నీ యుద్యోగులకు "కమిషనరులు" అనిపేరు.

## "డూమ్సుడే లెక్క" Domesday Book (1086)

తొల్లింటి "డేనులంచము" వంటి యొకపన్నును విధింపనెంచి, యే భూస్వామిక్రింద నెంత పొలమున్నదో, యెవడెంత పన్ను చెల్లింపవలసియుండునో విచారించుటకు విలియము, పలువురు కమిషనరులను నలుదెసలకు బంపెను. వారు ప్రతిగ్రామమునకు బోయి, యీ వివరముల వ్రాసికొనిరావలెను. "గ్రామస్థులలో నొకొక్కని కెంత పొలమున్నది; ఎడ్వర్డుది కన్ఫెసరునాడాపొలమువెల యెంతయుండెను. ఇప్పు డెంత వెల వచ్చును? వానికి పశువు లెన్నికలవు; ఆ పొలమున నెన్ని యిండ్లున్నవి; ఎందఱు జనులున్నారు;" అని. ఆ నాటి యొక

రాచకవిలెలో నీ వివరమంతయు చక్కగా నిట్లు వర్ణితమై యున్నది.

"ఒక చేరెడునేలగాని, యొక యెద్దుగాని, యొక యావు గాని, యొక పందిగాని, ఆ లెక్కలోనికి రాకుండబోలేదు. ఆవిచారణ, యంతసూక్ష్మముగా నున్నది."

కమిషనరులు, ఈ వివరములు వ్రాసికొనిరాగా, గుమాస్తాలు లాటినుభాషలో లెక్కలు తయారుచేసిరి. వానిలో కొన్ని నేటికిని ఉన్నవి. ఆ లెక్కలసంపుటమే "డూమ్సుడే బుక్కు."

## చర్చి

దండయాత్రాముహూర్తమున, విలియమును 'పోపు' ఆశీర్వదించి పంపెను గనుక, నాతడాతనియెడ సహజముగ, భక్తిశ్రద్ధలు చూపితీరవలసినదే. కాని యొక్కవిషయమును మాత్రము, ఆతడు పోపుతో స్పష్టముగా దెల్పెను. ఏమన, "కలహాకారణములైన సంకటావస్థలు వచ్చినపుడు, మతప్రచారకులు (Clergy) తనయాజ్ఞను పాలింపవలెనుగాని పోపునానతిని గాదు" అని. ఇది సాధించుకొనునిమిత్తము విలియము, చర్చిని గుఱించి మూడు గట్టిచట్టములు చేసెను.

మొదటిది:—పోపుపదవికై యిర్వురు ప్రత్యర్థులు బయలు దేరునెడ, తా నెవని నంగీకరించునో, మతప్రచారకులును వానినే యంగీకరించవలెనుగాని, వారు రెండవపక్షము చేర గూడదు.

రెండవది:—రాజునిష్టములేనిది, మతప్రచారకులు, చర్చికి సంబంధించి యేనియమములు, శాసనములు చేయగూడదు.

మూడవది:—రాజునిష్టములేనిది, యే బిషప్పుగాని, యే భూస్వామిని, వెలివేయుగూడదు.

నార్మనులపరిపాలనలో, ఇంగ్లీషుచర్చిలో మఱియు పెక్కు-తెఱగుల మార్పులు జరిగినవి. "లాన్‌ఫ్రాంకు" (Lanfranc) అనునతడు విలియమునకు సర్వవిధముల సాయమొనర్చు హితుడు. ఆతడు, నార్మండిలోని "బెక్కు" మఠమునుండి వచ్చిన వాడు. ఆతనికి విలియము, కాంటరుబరీ ఆర్చిబిషప్పుపదవి యొసగి మన్నించెను. అతడేకాక, మఱి చాలమంది నార్మనులు ఇంగ్లండులో బిషప్పులైరి. ఇట్లు జరుగుటచేత, ఫ్రెంచిచర్చి ప్రభావము, ఇంగ్లీషుచర్చిమీద నెక్కుడుచెల్లెను. ఆ దినములలో, మతప్రచారకులయెడ, రాజులు నెఱపుచున్న యధర్మ ప్రభావమును అరికట్టవలెనని పోపుకూడ ఒకవంక నాయత్తపడుచుండెను. 'బెక్కు' మఠస్థులు, పోపుప్రయత్నము చాల ధర్మమని కొనియాడిరి. బిషప్పుపదవు లిచ్చునపుడు పాత్రతాపాత్రతల, రాజులు విచారింపలేరనియు, ఆ పదవుల వారీయదగదనియు మఠస్థుల యభిప్రాయము. కొంతమంది యింగ్లీషు బిషప్పులకు గూడ నట్టి యభిప్రాయమేకలదు. కాని, లాన్‌ఫ్రాంకును, విలియమును మాటపొందుగల మిత్రులగుట, ఆతని పరిపాలనలో నట్టితగవు బయలుదేరలేదు. 'మతప్రచారకులు వివాహము లాడగూడదు' అను సిద్ధాంతమువంటివే మఱికొన్నిటిని వారిరువురును గలిసియే ప్రవర్తింపజేయుచుండిరి.

ఇది యిటులుండ, క్రొత్తగా వచ్చిన నార్మనుబిషప్పులు, సాధారణముగ పెద్ద పెద్ద పట్టణములలో నుండెడివారు. ఆంగ్లోసాక్సనుబిషప్పులు ప్రశాంతములైన జనపదముల నుండెడివారు. నగరవాసులగుటబట్టి నార్మనుబిషప్పులు, ఆముష్మికచింతల

మఱచి, వైహికవ్యవహారములలో జోక్యముకలిగించుకొన సాగిరి. వారందఱు రాజుగారి 'పెద్దకౌలుదారు'లైరి. వారిలో పెక్కురు, యథార్థముగ రాజుపక్షమున యుద్ధములుగూడ జేసిరి. ఈ దుష్పరిణామమువలన కలిగినకీడు 1-వ హెన్రిపరిపాలనలో విదితమగును.

ఆంగ్లోసాక్సనులనాడు, బిషప్పులు, మండలన్యాయస్థానములకేగి, న్యాయనిర్ణయమున, తదధికారులకు తోడ్పడుచుండెడివారు. ఎవడేని చర్చినియమముల నుల్లంఘించినచో, వానిని కోర్టుకు బిలిపించి బిషప్పే విచారించి, యే తేలికశిక్షయో విధించి పంపెడివాడు. సాధారణముగా తపశ్శిక్ష విధించెడివాడు. ఈపద్ధతిలో, 1-వ విలియము కొంతమార్పు కలిగించెను. ఏమన 'బిషప్పు లెల్లరు తమ సొంతకోర్టుల నేర్పాటుచేసికొని, మత విషయకములైన తగువుల, తామే యచట విచారించవచ్చును' అని. ఈ బిషప్పులకోర్టుల విషయమున, రెండవహెన్రీకాలములో నొక పెద్ద తగాయిదా జరిగినది. అది ప్రస్తుతమైనప్పు డెఱుగనగును.

## రాజసభ (Curia Regis: Council of the King)

విలియము, బహుకార్యవ్యగ్రుడు. అందుచే, వ్యవహారములయం దతనికి నితరులసాయ మావశ్యకము. ఎవనిచే నెంత వీలగునో యంతపని చేయించుకొనెడివాడు. అందును ఏదో ఒక నియమమున్న బాగుగనుండునని యెంచి, యాతఁడు "ప్రధానభూస్వాములు, రాజాజ్ఞయైనపుడు రాజసభకు వచ్చి, రాజకార్యనిర్వాహణమున నాతనికి తోడ్పడి తీరవలె"నని యాదేశించెను. అట్లయ్యు నాతడు వారిని మాటిమాటికి బిలిపిం

చెడివాడుకాడు. నిత్యవ్యవహారములన్నియు నతని సమీప గతులగు నుద్యోగులే చక్కబెట్టెడివారు.

కోశాధికారి (Treasurer), అశ్వాధికారి (Constable) కరణాధికారి (Chancellor, who looked after his writing work) లోనగువారే, సన్నిహితోద్యోగులనగా. వారికి "ఇంటియుద్యోగులు" అనిపేరు. అవసరమైనప్పుడు రాజు వారినందఱిని నొకచో గూడజేర్చి, వారిసలహాల నడుగుటయు గలదు. ఆ గతి వారు నల్వురు గూడి మంతనముసేయు సభకే "రాజసభ" అనిపేరు. ఈ సభవారికి ఏ విషయమునుగూర్చియైనను ముచ్చటించు నధికారముగలదు. ఒకవంక ఆయవ్యయముల విచారించవచ్చును, ఇంకొకవంక చర్చివ్యవహారములు తడవవచ్చును. వేఱొకవంక "న్యాయస్థానముల తనకు నన్యాయముజరిగినద"ని విన్నపము చేసికొనువాని మొఱ్ఱ నాలకింపవచ్చును. రాజు, విశేషావసరముల మాత్రము, ప్రధానభూస్వాముల బిలిపించెడివాడు. అప్పుడు 'రాజసభ'వారును వారును గలిసి సభదీర్చి, రాజడిగిన విషయముల నాలోచించెడివారు. దానికి 'మహాసభ' యని పేరు. మహాసభవారు చేయునాలోచనలు, యుద్ధము మొదలగు పెద్దవ్యవహారములకు సంబంధించియుండును.

## 1-వ విలియము సంత్యదినములు

విలియము, ఇంగ్లాండు దేశమున, శాంతిభద్రతలు నెలకొల్పి, ప్రజలకు భరణపోషణాలోనంగెను. అట్లయ్యు ప్రజల కాతనియెడ నభిమానము లేదు. తన కెదిరిపక్షమున పోరాడిరను నెపమున విలియము, యార్కుషైరుప్రజలకు విధించిన క్రూరదండనయు, సస్యసంపన్న కాదగిన భూమినంతయు

'వేటయడవి' యనుపేరితో బీడువెట్టె ననియు వా రాతని నస హించు కొనిరి. 'వేటయడవి' మొత్తముమీద దేశములో మూడవవంతున్నది. "దాని హద్దులలోని ప్రజలెవ్వరును ఏ పందిని, ఏ లేడిని ఏ కుందేటిని గొట్టకూడదు. వారియొద్ద స్వరక్షణార్థమైనను, కత్తికటారులు లోనగునవి యుండగూడదు. వారి కుక్కలకాళ్లకు వాడి గోళ్లుండరాదు. ఆ గోళ్ల నెప్పటి కప్పుడు కత్తిరించవలసినదే." ఇవి యడవిచట్టములలో కొన్ని. ఎవ్వడేని ఏమరుపాటుననో, సాహసముచేతనో, ఆచట్టముల నుల్లంఘించునేని, వానికి మరణదండనకంటెను క్రూరతరమైన శిక్ష యయ్యెడిది. సాధారణముగ నట్టివానికి గ్రుడ్లతోడిం చెడివారు. తుదకు 1087-లో విలియము గతించినపుడు, ప్రజలలో కంటతడిపెట్టినవారు లేరు.

## విలియము రూఫసు 1087—1100 సం॥ (William Rufus)

మొదటి విలియము కుమారుడైన, విలియము ది రెడ్డు (William the Red) తనకాలమంతయు ధనార్జనయత్నముల తోనే గడిపెను. ఆ దినములలో, రాజనువాడు రాజ్యపాల నాదికమునకువలయు సొమ్మంతయు, తనచేతిదే వెచ్చించవలసి యుండునుగనుక, ఆతడు ధనమార్జించుయత్నమొనర్చుట తప్పు గాదు. కాని యం దీతడవలంబించిన పద్ధతులుమాత్రము మిక్కిలి యనుచితములగుట, విశేషించి చెప్పికొనవలసినచ్చినది. ఆతడు ప్రజలకు నభిమతుడు గాకుండుటయు నందువలననే. రానల్ఫు ఫ్లాంబర్డు (Ranulf Flambard) అనునతడు వీనికి దుర్మం త్రముపదేశించి, భూస్వాములపీడించి, ధనమురాబట్టుకొను మార్గముగజూపెను. "పార్థివపద్ధతి"కి మూలభూతమగు ధర్మ

మును కలుషితమొనర్చి, దానివలననే డబ్బు రాబట్టుకొనుటకు గడంగిన రూఫసు యత్నములు మెచ్చదగినవి కావు. ఒక దృష్టాంతము చూడుడు:—

ఎవ్వడేనొక "పెద్దకాలుదారు" చనిపోయి, వాని కుమారుడు పసివాడుగా నుండుచో, రాజు వాని పొలమంతయు తాను స్వాధీనముచేసికొని ఆ కుఱ్ఱవానికి యుక్తవయస్సు వచ్చునంతదనుక, దానిని సొంతకమతములో గల్పికొనెడువాడు. ఒక బిషప్పుగాని, ఆర్చిబిషప్పుగాని చనిపోయెనేని, వాని చర్చికి సంబంధించిన పొలమంతయు లాగికొని ఎంతోకాలమువఱకు ఇచ్చెడివాడుకాడు. గతించినవాని స్థానమున నింకొకని నియమించినను, వానికాపొలము స్వాధీనముచేసెడివాడుకాడు. ఎవ్వడేని కొంతశిస్తు బకాయిపడి యుండునేని దాని కెన్నిరెట్లో అదనపుపన్ను కట్టి వానిని పీడించెడివాడు. ఈ విధముగా నతడు, చిరకాలాగతములైన "ఫ్యూడవపద్ధతి" ధర్మములన్నియు చెఱచి, రైతునకును రాజునకును ఉండవలసిన పొత్తును పాడు చేసెను.

## రాబర్టు చేయించిన తిరుగుబాటు

## (Rebellion of Robert of Normandy)

అంతతో, చాలమంది పెద్దరైతులు, రెండవవిలియముపై శత్రుత్వముదాల్చిరి. వారిలో కొందఱికి, నింగ్లాండునందే కాక, నార్మండిలోగూడ భూములు గలవు. ఆదేశమునకు 'రాబర్టు' రాజుగా నుండెను. రాబర్టు రెండవవిలియమునకు అన్నగారే. అతడు సమర్థుడుగాడు. అలసుడు, భోగపరాయణుడు. ఆతడు, ఇంగ్లాండునకు రాజైనచో, అనుకూలముగా

నుండునని యూహించి పెక్కురు భూస్వాములు గూడి, బర వసముచేసి, రాబర్టు పేరుమీద ఒక విప్లవము సాగించిరి. రాబర్టును ఇంగ్లీషురాజునుగా జేయుటయే దాని ప్రయోజనము. స్కాటులాండు రాజుకూడ తన సేనలతోవచ్చి విప్లావకుల గూడెను. పెద్దయత్నమే జరిగినదిగాని ఫలితము సున్నయై నది. పోయినవారుపోగా, మిగిలిన భూస్వాములందరు మిక్కిలి లొంగిపోయిరి. అంతతో రెండవవిలియము, నిష్కంటకముగా, నిరుపద్రవముగా రాజ్య మనుభవింపసాగెను. కాని, మఱి కొన్నినాళ్లకే యతడు చేతులార చర్చితో విరోధము తెచ్చి కొనెను.

## ఆర్చిబిషప్పు ఆన్సేలము (Archbishop Anselm)

మొదటి విలియముకాలములో కాంటర్బరీ ఆర్చి బిషప్పు యిన లాన్ఫ్రాంకు 1089-వ సంవత్సరములో మరణించెను. రూఫసు, లాన్ఫ్రాంకు స్థానమున నింకొకని నియమింపక, కాంటర్బరీయాలయపు భూములన్నియు స్వాధీనముచేసికొని యూరకుండెను. పిమ్మట నాలుగేండ్లకు (1093) అతనికి పెద్ద జబ్బుచేసి, తనచేసిన పాపము స్మృతి దగిలి, పాపనిష్కృతి కిగా శుద్ధవర్తనుడైన ఆన్సేలమును ఆర్చిబిషప్పుగా నియమింప నెంచెను. ఆన్సేలము ఇటలీ దేశీయుడు. అతడీ పదవి తనకు వలదని నిరాకరించెను. కాని రాజు కాదు కూడదని పట్టుబట్టి వానినే నియమించెను. కొన్నాళ్లకు దైవానుగ్రహమున రాజు నకు ఉసులుచిక్కినది. అతనికి పూర్ణారోగ్యము కలిగినవెం టనే ఆన్సేలముతో నొక కలహముపెట్టుకొనెను. దానిహేతు విట్టిది:—పోపుపదవికి నిర్వురు ప్రత్యర్థులు బయలుదేరిరి. వారిలో

2-వ అర్బను (Urban. II) నకే యీ పదవి నొందుటకు నర్హత్వ కలదని ఆన్సేలము నభిప్రాయము. ఆ యభిప్రాయానుసారముగ నతడు అర్బనునకే విధేయుడగుట కంగీకరించి, తన యభిప్రాయమును రాజునకు స్పష్టముగా నెఱిగించెను. 1-వ విలియముచేసిన "పోపుపదవికై యిర్వురు ప్రత్యర్థులు బయలుదేరునెడ తా నెవని నంగీకరించునో మతప్రచారకులును వానినే యంగీకరింపవలెనుగాని వారు రెండవపక్షము చేరగూడదు" అను చట్టముప్రకారము, తన యిష్టములేకయే, ఆన్సేలము అర్బనునధికార మంగీకరించె నని, రూఫసు ఆగ్రహాపరవశుడయ్యెను. వారికిరువురకు కొంత వివాదము జరిగినది. ఆన్సేలము శాంతముగా నచ్చజెప్పి, తనమాట నెగ్గించుకొనెను. ఆపుండు అప్పటికి మానెనుగాని మరల సెలవేసెను. ఒక్కబిషప్పు, ఇద్దరు మానుసులపెట్టు. అత డొకవంక, మతాధికారి, ఇంకొకవంక పెద్ద కౌలుదారు. మతవిషయమున నతడు పోపునకు విధేయుడు, భూవిషయమున రాజునకు విధేయుడు. ఒకొక్కయెడ వాని యీరెండు ధర్మములకును సంఘట్టన రావచ్చును. ఆసంకటసమయమున నతడు పోపునకో, రాజునకో యవిధేయుడగుట తప్పదు. కాని సాధారణముగ రాజాజ్ఞనే తిరస్కరించెడివాడు. 1097-వ సంవత్సరములో ఆన్సేలమునకును అట్టి సంకటస్థితియే తటస్థించెను:—విలియము, వేల్సుమీదికి దాడివెడలుచు 'నీవంతుయోధుల గొనిరమ్మ'ని ఆన్సేలమునకు కబురంపెను. ఆతడాపని చేయలేదు. రాజునకు గోపమువచ్చి "నీవు యోధుల నేల కొనిరాలేదో, రాజసభకు వచ్చి సమాధానమిమ్ము" అని యాజ్ఞచేయగా, ఆన్సేలము దానికిని రాక, "ఇచట నా యునికి దుర్భరముగానున్నది. నీ వంగీక

రింతువేని నేను రోమునగరమునకు పోయెదను" అని రాజునకు మాటపంపెను. రాజందులకంగీకరింప నతడు ఇంగ్లాండువిడిచి స్వదేశమునకు బోయెను. పదపడి కొలదినాళ్లకు, 'క్రొత్త యడవి'లో వేటాడుచు, డబ్బాటుగా నొక తుపాకిదెబ్బ తిని విలియము మరణించెను. ప్రజానురంజనమున నితనికంటె, నితనితండ్రియే నయమనిపించెను.

## మొదటి హెన్రీ. (Henry I 1100--1135)

రెండవవిలియము చనిపోయినపుడు, అతని సోదరుడగు రాబర్టు స్వదేశమున లేడు. క్రైస్తవులు తురకలతో జేయుచున్న "ధర్మయుద్ధము"లో (Crusade) నతడు పాలస్థానమున బోరాడు చుండెను (Palestine). దేశము విడిచి యుద్ధముచేయబోవు, నాడే యతడు నార్మండిని నిజముగా విలియమునకు అమ్ముకొని పోయెను. అయినను విలియము మరణించుటచే ఇంగ్లాండునకు రాజగుటకు నతనికి నధికారమున్నది. కాని యతడు దేశాంతర గతుడై యుండుటబట్టి 2-వ విలియము తమ్ముడగు హెన్రీ ఇంగ్లాండునకు రాజై, భూస్వాములందఱికి ననుకూలుడై వారి మనస్సులు నొప్పించుపనులు సేయక, కడుజాగరూకతమై నడుచు కొనజొచ్చెను. అట్లే నడుచుకొననిచో నతనిపదము దృఢము కాదు. అతడు తనస్థితిని బాగుగగుర్తించి "నేను, రెండవ విలియమువలె ననుచితధనసంగ్రహము చేయగలవాడనుకాను" అని యొక 'పత్రము' (Charter) వ్రాసి సంతకముపెట్టెను. క్రమముగా నతని ప్రాభవము హెచ్చినది. అయినను, నతడు దర్పితుడుగాక మర్యాద మీరకయే వర్తించెను. ప్రాచీన "పార్థివపద్ధతి" మర్యాదలకతడెన్నడును భంగము కలిగించ

లేను. పదపడి రాబర్టు తిరిగిరాగా, హెన్రీ యాతనిని టెంచి బ్రయి యుద్ధములో నోడించి (Battle of Tenchebrai, 1106) ఇంగ్లాండును, నార్మండిని, నిష్కంటకముగా నేలుకొనెను.

## నార్మనులు, ఆంగ్లోసాక్జనులు

ముప్పదిసంవత్సరములకాలము, ఇంగ్లండుదేశము నిరుపద్రవముగా వర్ధిల్లెను. ఆ శుభదినములలో నార్మనులును, సాక్జనులును పొందిపొసగి మనిరి. నానాటికి వారి మైత్రి పెంపొంది, సంబంధబాంధవములును నెలకొనినవి. హెన్రీ, ఒక సాక్జను కన్యను పెండ్లియాడెను. ఆమెపేరు 'మాటిల్డా' (Matilda) స్కాట్లండుదేశపురాజుకుమార్తె. అతనిని జూచి మఱికొందఱు నార్మనులును, సాక్జనులతో వియ్యమందిరి. కాని, ఫ్రెంచిభాషను సంపన్నులైన కులీనులుమాత్రమే మాట్లాడుచుండిరి. ప్రాయును, చదువను నేరని పేదలు ఆంగ్లోసాక్జను భాషనే మాట్లాడుచుండిరి. ఈ కారణమున, దేశభాషలో ఎన్నో మార్పులు కలిగినవి. ఫ్రెంచిమాటలు ఎన్నో వచ్చి యీ భాషలో చేరినవి. కాలక్రమమున, ప్రజాబాహుళ్యమున ఒక నూతనభాష వెలసినది. దానికే 'ఇంగ్లీషు' అనిపేరు. నేటి మన ఇంగ్లీషుభాషలో అవయవార్థమునుబట్టి విచారించుచో, ఫ్రెంచిభాషాజన్యములైన పదములు చాల కానవచ్చును.

## చర్చియు, హెన్రీయును. (Henry I and the Church.)

రాజు, చర్చితో నింకొకమారు కలహించుట యనునది యితని పరిపాలనలో ముఖ్యవిశేషము. యూరపునందెల్లెడల, చర్చి, నానాటికి నధికారప్రాబల్యము వహించుచుండెను. ఇతర దేశములవలె ఇంగ్లాండులోగూడ, అది రాజాధికారమును

ప్రతిఘటింపదొడగెను. హెన్రీ, తనరాచరికమును, పెక్కువిధముల సార్థకముచేయసాగెను. రాజు, ప్రబలుడగుచో నూరకపోడు. వాని ప్రాబల్యము చాల అపాయకరము. అందుచే, దానిని గట్టిగా నిరోధించుటకు చర్చి పూనుకొనెను.

ఆన్సెలము, ఇంగ్లాండునకు తిరిగివచ్చెను. బిషప్పులు, రాజునకు 'దాసోహ'మనగూడదని పోపు, కట్టడచేసెనుగనుక, ఆన్సెలము హెన్రీకి దాసోహమనలేదు. రాజు, కోపపరవశుడై దాసోహమననిచో బిషప్పులకు భూములుండవని బెదిరించెను. అసలు, పోపు, అట్టి కట్టడచేయుటకు హేతువు, బిషప్పులు కేవలము ఐహికవిషయాసక్తులగుదురను శంకచేత. అతని శంకయు నిర్హేతుకముగాదు, అదియునిజమే. తమకు యుద్ధసమయముల నక్కరకురాగల బలశాలిని జూచి రాజులు వానిని బిషప్పుగా నియమించుచుండిరి. అతడధ్యాత్మవిదుడా, కాడా, యను విచారము వారికి పట్టదు. పోపు, ఈ పద్ధతి ధర్మలోపమని యెంచి, బిషప్పుల నియమించునధికారము రాజులకు గూడదనియు, వారిని ఒక్కొక్క యాలయమునాశ్రయించియున్న మతప్రచారకవర్గమే ఆర్చిబిషప్పుననుమతినిపొంది, తన బిషప్పునుతాను వరించుకొనవలెననియు శాసించెను. ఆన్సెలముకూడ, ఈ విషయమున, పోపుతో నేకీభవించెను. అందుచే రాజునకును అతనికిని కలహము రేగినది. కొన్ని యేండ్లవఱకును ఆ తగవు తెగలేదు. తుదకు ఒకవిధమగు సంధిచేసికొని చక్కబడిరి. ఆ సంధిసమయము లివ్వి:—మతప్రచారకులే, బిషప్పును వరించుకొనవలెను. కాని ఆ వరణసమయమున రాజాధికారి యొకడు సమక్షమున నుండవలెను. బిషప్పు రాజునకు దాసోహమనవలెను గాని, యతనిని బిషప్పుగా జేసినవాడు, ఆర్చిబిషప్పుగాని రాజుకాదు,

అనుసంశము మఱవఁగూడదు. ఈ సంధివల్ల, చర్చిపై రాజాధి కారము కొంత తగ్గినదన్న మాటయే కాని, రాజున కిష్టములేని వానినైనను బిషప్పుగా జేయునధికారము చర్చికిరాలేదు.

చర్చి తన యధికార మప్పుడప్పుడే చెల్లించుకొనసాగెను. అది క్రమముగా వృద్ధిపొంది, మఱుసటితరమున, చర్చి చాల శక్తివంతమయ్యెను.

## స్టీఫెన్. (Stephen 1135–1154)

తన యనంతరము తనకుమార్తె మాడ్ (Maud) సింహాసన మధిష్ఠించవలెనని 1–వ హెన్రీ కోర్కె. అతఁడు తన మనోరథమును, ముఖ్యులైన జమీందారుల కెఱిగించి వారిచే సందుల కొప్పించెను. కాని యామె, అంజౌ జెఫ్రి (Geoffrey of Anjou) అను నొక ఫ్రెంచి మండలాధిపతిని (Count) వివాహమాడెను. అతఁడు చాలప్రబలుఁడు, పైపెచ్చు జమీందారులనిన గిట్టనివాఁడు. జమీందారులు మాత్రము సామాన్యులా? వారు ప్రధానభూస్వాములలో ప్రధానతములు. అదియునుగాక, స్త్రీకి రాజ్యపాలనాదిసమర్థత లుండవని వారిసందేహము. ఈ రెండుకారణములచేతను, మాడ్ రాణియగుటకు జమీందారులంగీకరింపక స్టీఫెన్ అనువానిని రాజుగా వరించిరి. ఆ స్టీఫెను, 1–వ విలియము దౌహిత్రుఁడు. అడెలా (Adela) అను నామెపుత్రుఁడు. మాడ్ అంతతో నూరకొనక యెట్లయినను రాజ్యము సంపాదించవలెనని యెంచి, స్టీఫెనుతో పోరాడసాగెను. ఉభయపక్షములవారికిని, 1153–వ సంవత్సరము వఱకు యుద్ధములు జరుగుచునేయుండెను. కాని చర్చివారి యండలేనిదే యేపక్షమును జయింపజాలదను సంగతి యానాఁడు

లోకవిదితమయ్యెను. ఇంగ్లాండు, అంతశ్ఛిద్రములలో మునిగి యున్న యవకాశముచూచి, స్కాట్లండురాజు, డేవిడు (David) అను నతడు, అదియ యదనని, ఇంగ్లాండుపై నెత్తివచ్చి 'నార్తంబరులాండు'ను (Northumberland) 'కంబరులాండు'ను (Cumberland) ముట్టడించెను. కాని యతని యాసలు ఫలింపలేదు. స్టాండర్డుయుద్ధములో (Battle of Standard) అతడు పరాజితుడై మరలిపోయెను.

ఈ సంకట సమయమున, స్టీఫెను, చర్చివారి ప్రాపు సంపాదించుకొనుటకు బదులు, కొంతమంది పెద్ద పెద్ద బిషప్పులతో కలహించెను. తుదకు నతనికిని వారికిని 'లింకాను' (Lincoln) నొద్ద యుద్ధముకూడ నైనది. అందతడే యోడిపోయి వారిచే, బందిగా పట్టుబడి, చెఱయందు నుంపబడెను. అతడు బుద్ధిహీనుడై యట్లుకాగా నతని జూచియైనను వివేకము తెచ్చుకొనక మాడ్ తానును చర్చివారితో పోరాడి యోడిపోయెను. తుదకు, తనయనంతరము, మాడ్ కుమారుడైన హెన్రి యను వాడు రాజగుటకు స్టీఫెను అంగీకరింపగా ఆ పోరు చల్లారినది. ఈ సంధికి 'వెల్లింగు ఫోర్డుసంధి'యని పేరు (Treaty of Wellingford).

## మెత్తనివాని యేలుబడి

అవి చెడుదినములు. ఆ కాలపుప్రజలు చాలమంది దుష్టబుద్ధులు, క్రూరస్వభావులు. అట్టిచో రాజ్యమేలుటకు, రాజు మంచివాడైనంతమాత్రమున చాలదు; సమర్థుడుకూడ గావలెను. స్టీఫెను మంచివాడేకాని యసమర్థుడు. ఇంగ్లాండునేలుటకు గట్టివాడు కావలెనుగాని, మెత్తనిరాజు పనికిరాడని, స్టీఫెను నేలుబడినాడే తేలినది.

ఆనాటి యొక రాచకవితలో నతనిపరిపాలననుగూర్చి యిట్లు వ్రాసియున్నది:—

"రాజు, సాధువనియు, సజ్జనుడనియు గ్రహించి, కృతఘ్నులెంతలెంతలో వింతలుచేసిరి.....వారు, దేశమందెల్లెడల, తమ యిచ్చవచ్చినచోటుల కోటలగట్టికొనిరి. నిర్భాగ్యులైన, నిరుపేదల నెందఱినో బాధించి యూరక పనిచేయించుకొనిరి. అవి దుష్టులకును, దయ్యములకును, నిలయములైనవి. ఎవనియొద్దనేని కొంచెము ధనమున్నట్లు జాడదెలిసినచో, వానిని పట్టుకొనిపోయి కోటలో చెఱనుంచెడివారు. అట్లు పట్టుపడిన మందభాగ్యు లెందఱో కలరు. వారిడబ్బులాగుటకు ఆదుర్మార్గులు చేసిన ఘోరకృత్యములు నోటవచింపరాదు. కొందఱిని తలక్రిందుగా వ్రేలాడగట్టి ముంతపొగ బెట్టిరి. కొందఱిని తలకు ఉచ్చుపోసి వ్రేలాడదీసి కాలిక్రింద మంటలుగాల్చిరి. కొందఱితలలకు ముళ్లత్రాడు కట్టి, పుఱ్ఱె బీటలువాఱు దనుక మెలిపెట్టిరి. కొందఱిని, పాములు, తేళ్లు, గల చీకటికొట్టుల ద్రోసి తలుపులుబిగించిరి."

## చర్చి

ఈ పందొమ్మిదిసంవత్సరముల దుష్పరిపాలనలో, మంచి యవకాశము చిక్కి, చర్చి గొప్ప యధికారమును సంపాదించినది. అది ప్రబలుడైన రాజునుగూడ ప్రతిఘటింపగలదని, 1-వ హెన్రికాలముననే విదితమయ్యెను. అదిగాక, దుర్బలుడైన రాజువలన, చర్చి యెట్టి వరదానములేని గ్రహింపగల్గునని స్టీఫెనుకాలమున స్పష్టమయ్యెను.

స్టీఫెను బిషప్పులకు మూఁడు వరము లిచ్చెను:—

1. మతప్రచారకులే, బిషప్పుల నెరించుకొనవచ్చును. అందు రాజుజోక్యము లేదు.

2. ఒక బిషప్పు చనిపోయినపుడు, వాని స్థానమున నింకొకఁడు వచ్చువఱకైనను, రాజు వానిభూములు స్వాధీనము చేసికొనరాదు.

3. చర్చికోర్టులు, తమయిష్టవచ్చిన కేసులు విచారింపవచ్చును. రెండవహెన్రీ, చర్చిప్రాబల్యము నరికట్ట యత్నించుటకీమూఁడవవరమే కారణము.



## ఏడవ ప్రకరణము



## రాజాధికారవర్ధనము

"శాంతుఁడై యున్నపుడు, అతనికన్నులు, పావురము కన్నులవలె నెంతో సౌమ్యముగానుండును; ఉద్రిక్తుఁడైనపుడు, అగ్నికణములవలె తీక్ష్ణముగానుండును. విపులవక్షమును, మాంసలబాహువులును ఆతనిబలశౌర్యాదుల జెప్పకయెచెప్పును. భోజనముసేయునపుడును, స్వారిచేయునపుడును దక్క, నాతఁడు కూర్చుండియుండఁడు; అవసరమగుచో నాల్గునాళ్లప్రయాణము ఒక్కనాఁడే చేయును. అతనికి అటవీసంచారము మిక్కిలి ప్రియము. యుద్ధములులేనిచో నాతఁడు పిట్టలను కుక్కలను వెంటగొని యడవులకుబోవును. చదువుకొనునపుడును మాటలాడునపుడునుదక్క, ఎల్లవేళల నాయుధపాణియయ్యే యుండును." 'రెండవహెన్రీ'ని (Henry II, 1154—1189) బాగుగ

నెఱిగినవాడొకడు చేసిన వర్ణనయిది. ఈరాజే, రాజాధికారము ఇట్టిదని దేశమెల్లెడల గ్రహింపజేసినవాడు.

## హెన్రీసామ్రాజ్యము

హెన్రి యేలిన సామ్రాజ్యములో, ఇంగ్లండొక చిన్న భాగము. అతనికి ఇంగ్లాండును, నార్మండియు, తల్లివైపునవచ్చినవి. తండ్రివైపున మెయిని (Maine), అంజౌ (Anjou), టురైని (Touraine) యును వచ్చికలిసినవి. ఇవిగాక భార్యవైపున అక్విటైని (Aquitaine), పొయిటౌ (Poitou), సెయింటౌని (Saintonge), లిమోసిన్ (Limousin), అనునవియు లభించినవి. ఇవన్నియు గలిసి యాతని కొక సామ్రాజ్యమయ్యెను. ఫ్రాన్సులో, ఫ్రెంచిరాజునకుకంటె నతనికే యెక్కువ దేశము కలదు. దానివలన నతనికిని, అతనిసంతతివారికిని పెక్కుచిక్కులు తటస్థించినవి. ఇంగ్లీషువారిని, తమదేశమునుండి యెట్లయినను పారదోలవలెనని ఫ్రెంచిరాజులు చాల యత్నమొనర్చిరి. కాని ఇంగ్లీషువారు కదలెడివారుకారు. ఒకవేళ లేచిపోయినను, మరల తిరిగివచ్చెడివారు. ఈ కారణముచేత ఆ రెండుదేశములకును, ఎనిమిదవహెన్రీకాలమువఱకు బద్ధవైరము ప్రబలినది. ఆ వైరమువలన ఇంగ్లీషురాజులకు అమూల్యమైనకాలమును మితిలేనిధనమును వ్యయమయ్యెను.

## న్యాయాధికారి

స్టీఫెనుకాలమున గలిగిన సంక్షోభమును మాపి దేశమున మరల శాంతిభద్రతల నెలకొల్పి, ప్రజలను జమీందారులను తనకు విధేయుల జేసికొని పాలించవలె నని, హెన్రీలక్ష్యము. ఈ మనోరథసిద్ధికై యతడు మొదట చేసినపని, గతదుష్పరి

పాలనలో లేచిన కోటలన్నియు పడగొట్టించుట. రెండవది న్యాయస్థానముల సంస్కరించుట. ఒకొక్క జమీందారునకు, ఒకొక్క బిషప్పునకు, నొకొక్క కోర్టుండెను. దేశమున అన్ని కోర్టులుండినను, అపరాధులు తప్పించుకొనిపోవుచునే యుండిరి. ఎచటజూచినను, చౌర్యహింసాదిదారుణకర్మలు జరుగుచునే యుండెను. ఈ దుస్థితిని చక్కజేయుటకు అతడొక ఆలోచన చేసెను:—ప్రతిమండలమునను తనకోర్టుల నేర్పాటుచేసి, బిషప్పుల కోర్టులకును, జమీందారులకోర్టులకును పని తగ్గించవలె నని. ఈ యాలోచనలోని రహస్యమేమనగా, ఆమూలమున, దండుగ సొమ్ములరూపముగ రాజునకు కొంత ధనమునులభించును, జమీందారులకోర్టులకు పని తగ్గుటచే వారిప్రాభవమును కొంతక్షీణించును. కాని తనకోర్టునధికారమును గోల్పోవుట కేజమీందారుడంగీకరించును? 'పార్థివపద్ధతి' ననుసరించి యెన్నాళ్లనుండియో నెగడుచున్న యాచారమది. దానిని తటాలున భంగముచేసినచో, జమీందారులు తిరుగబడుట తప్పదు. అందుచే హెన్రీ, యీవిషయమున కడు జాగరూకుడై మెలగవలసివచ్చెను. అతడు, తాననుకొన్న సంస్కారములను, రాజులకు, 1-వ విలియమునాటినుండి వచ్చుచున్న విశేషాధికారములద్వారమున చేయుట మంచిదని యూహించెను. రాజు, నలుదెసలకు, కమీషనరుల బంపి వివరములారయుచుండుట, ఆ విశేషాధికారములలో నొకటి. మొదటి హెన్రీకాలమున గూడ, కమీషనరులు 'షైరుకోర్టు'లకు బోయి కేసులు విచారించుటయు, న్యాయనిర్ణయమున, జమీందారులు చేయు లోపముల గ్రహించుటయు జరిగెను. తన తాత యాచారమే రెండవహెన్రీకి గూడ నక్కరకువచ్చెను. 'రాజ

సభలోని కొందఱు జడ్జీలను నతడు షైరుకోర్టులపరామర్శకై పంపెను. వారు ఒకకోర్టునుండి యింకొక కోర్టునకు పోయి, జమీందారులు విచారించు కేసులు విమర్శించుచు, తాము కొన్ని విచారించుచు తిరుగుచుండెడివారు. వారున్నంతసేపును అది 'రాజుగారికోర్టుగాని,' 'షైరుకోర్టు' అనజెల్లదు. ప్రజలు రాజునకు చేసికొనవలసిన విన్నపము లున్న నవి ఆ జడ్జియెదుట చెప్పుకొనవచ్చును. ధర్మశాస్త్రసంబంధములైన ఏ వ్యవహారము నైనను నతడుపరిష్కరించును. అట్టి వ్యవహారము లున్నవారు అతనియొద్ద కేసులుపెట్టుకొనవచ్చును. ఈ పద్ధతి కొన్నాళ్లు సాగునప్పటికి 'షెరిఫ్పు'లలోపము లెన్నియో బయటపడినవి. తుదకు 1170-వ సంవత్సరములో ఒక విచారణచేసి, రాజు చాలమంది షెరిఫ్పుల పదభ్రష్టులజేసి క్రొత్తవారిని నియమించెను.

జడ్జీల సంచారములోకూడ, కొంత దేశకాలనిర్ణయ ముండుట బాగని తోచి, హెన్రీ వారిసంచారమునకు అనువగునట్లుగా, దేశమును ఆరు ఖండములుగా భాగించి మేర లేర్పరిచెను. అందు, ఒకొక్క ఖండమున, సంవత్సరమునకు ముగ్గురు, ముగ్గురు జడ్జీలు తిరుగుచుందురు. వారెంతతిరిగినను, ప్రజలు తమ జమీందారికోర్టుల వదలిపెట్టి, వీరువిచారించు షైరుకోర్టులకు రావలసిన అవసరములేదు. వారి నెట్లయినను ఆకర్షించి, జమీందారులకోర్టులు మూలబడునట్లు చేయుటయే హెన్రీ అభిప్రాయముగనుక, అతడు తనకోర్టులో విచారణ పద్ధతి సుకరముచేసి, తీర్పులు న్యాయముగనుండునని పించెను. దృష్టాంతముకొఱకు, ఆపద్ధతిని కొంత వివరింతుము:—'బి' అనువాడు తన పొలము నాక్రమించుకొనెనని, 'ఎ' అనువాడు ఒక

అభియోగమును తెచ్చునను కొనుము. అది ఇరువురుమనుష్యులకు కలిగిన సామాన్యపు తగువుగనుక, దానికి 'వ్యవహారము' అనిపేరు. (Civil Case) ఈ తగువులలో, 'అపరాధము' (Crime) ఏమియు లేదు. ఇక దానిని విచారించుపద్ధతి ఇట్లుండును.

'ఎ' అనువాడు, 'కేసుపెట్టుకొనుటకు అనుమతిపత్రము నొసంగుడ'ని 'కరణాధికారి' (Chancellor) అను రాజోద్యోగికి విన్నపము పంపుకొనవలెను. ఆత డిచ్చిన అనుమతిపత్రమునకు రిట్ (Writ) అనిపేరు. అట్టి 'రిట్టు' లేని ఏ కేసును పట్టరు. తరువాత, 'బి' చేసిన తప్పును 'ఎ' వివరించును. 'బి,' తాను తప్పు చేయలేదనును. పిదపడి, తన దోషరాహిత్యమును రుజువు పరుచుకొనుటకు, ఎట్టివిచారణపద్ధతి తనకిష్టమో తెల్పుమని 'బి'ని అడుగుదురు. అత డే పద్ధతినైనను కోరుకొనవచ్చును. అందొకటి 'ద్వంద్వయుద్ధము,' ఈ పద్ధతిననుసరించి 'బి' సీసపు పొన్ను వేసిన ఒక బారుకఱ్ఱ చేగొని, 'ఎ'తో పోరాడవలయును. ప్రొద్దు పొడిచినది మొదలు ప్రొద్దు క్రుంకువఱకు, దెబ్బతినకుండ పోరాడగలుగుచో, అతడు నిర్దోషియని నిర్ణయము.

రెండవపద్ధతి "సాక్షివిచారణ" (Trial by Grand Assize) దీని క్రమమెట్టిదనగా:—వాదిప్రతివాదులచరిత్రమును, బాగుగ నెఱిగియున్న పండ్రెండుగురు, దీక్షాశూరులు (Knights), కోర్టువారి యనుమతిని సాక్షులుగావచ్చి, వారిరువురి వాదములలో నేది సత్యమో తెల్పవలెను.

ఈ రెంటిలో, 'ద్వంద్వయుద్ధపద్ధతి' అతిప్రాచీనమైనదే. హెన్రీ, యందు కల్పించినవిశేషమేమియులేదు. అదిగాక ఎల్ల జమీందారులకోర్టులలోను, ఆ పద్ధతి నడుచుచునేయున్నది.

కాన నదిప్రజల నాకర్షింపజాలదు. ఇక రెండవది కేవలము నూతనసంస్కారము. దానివలన తప్పక న్యాయము కలుగునని, వ్యాజ్యెగాండ్రు "రాజుకోర్టుల"కు మూగుదురు.

ద్వంద్వయుద్ధమున బలము గెల్చునుగాని సత్యము గెల్వదు. కనుక ఎల్లప్రతివాదియు సాక్షివిచారణయే కావలెనను. వ్యాజ్యెము పుట్టునాటికి, భూమి ప్రతివాదియధీనమున నున్నది గనుక నతని పక్షపుసాక్ష్యమునే విచారింతురు. అట్లుగాక, 'ఎ' (వాది) వ్యాజ్యెము నేట రేపట పుట్టుననువఱకు భూమి తన యధీనముననే యుండెననియు, అప్పుడు 'బి' యకస్మాత్తుగా దాని నాక్రమించుకొనెననియు జెప్పికొన్నచో, నతనిపక్షమున నింకొక పండ్రెండుగురు సాక్షులరప్పింతురు. 'ఎ'వాదము నిజమని వారన్నచో, పైనపేర్కొన్న రెండువిచారణపద్ధతులలో నేది కావలెనో కోరుకొను నవకాశము వానికే యిత్తురు. ఈ పండ్రెండుగురు సాక్షులకు 'ఉపసాక్షులు' అనిపేరు. విచారణ జరుగుచుండగా, నడుమ నింకొక బలవత్తరమైన సారాంశము బయలుదేరునెడ, దాని సత్యాసత్యములు 'ఉపసాక్షులే' నిర్ణయింతురు. ఇదియంతయు 'సివిలుకేసు' సంగతి.

ఇక 'అపరాధవిషయమును' (Criminal Case) గూర్చి విచారింతము. హింసావిషయికమైనది యపరాధము. దానికి "రాజశాంతిభంగము" (Breaking the King's peace) అని ఒక సంకేతనామము. 'డి'యనువాడు, 'సి'యనువానిని చంపెనను కొనుము. ఆ హత్యకు సంబంధించిన వివరము లన్నియు లోతుగా విచారించి, హంతకుని కనుగొనుట, యా ఫిర్కావారి విధి. వారిలో పండ్రెండుగురకు, ఈకార్యభారము విధింతురు. వారు, నిదానముగా ఆచూకి దీసి, 'డి' అనువాడే హంతకుడని

యనుమానింతు రేని, వానిని, పట్టుకొని రాజుగారిజడ్జి యున్న పుడు 'షైరుకోర్టు'నకు గొనిపోయి వానిపై నేరము మోపు దురు. వాడు 'నిర్దోషి'ననును. అప్పుడు విచారణ ప్రారంభ మగును. అందును రెండువిధములు గలవు. ఒకటి 'శుద్ధిపరీక్ష' (Ordeal), రెండవది 'నిర్ణాయకవిచారణ' (Trial by Jury) 'డి' యిష్టప్రకారము ఈ రెంటిలో నేదోయొకటిజరుగును. 'శుద్ధిపరీక్ష'నుగూర్చి పూర్వమువివరించితిమి. 'డి'ని ఎఱిగి యున్న, పండ్రెండుగురు పెద్దమనుష్యులు, కోర్టులో సభ తీర్చి, అతడపరాధియో, అనపరాధియో నిర్ణయించి చెప్పుట 'నిర్ణా యకవిచారణ.' జమీందారికోర్టువారికి అట్టివిచారణచేయు నధికారములేదు. వారు ప్రాతపద్ధతుల నవలంబించవలసినదే. 1217-వ సంవత్సరమునకు పిమ్మట, నిర్ణాయకవిచారణయే సాధారణాచారమైనది. అప్పటినుండి 'రాజుకోర్టు'లలో 'శుద్ధి పరీక్ష' లేనేలేదు. రెండవహెన్రీకి పూర్వము, అపరాధవిషయ మున నేరము మోపవలసినవారు, చనిపోయినవాని బంధుగులు. నూతనసంస్కారమునుబట్టి, యా యపరాధిని పట్టుకొని కోర్టు నకు తీసికొనిరావలసినవారు, ఫిర్కా పెద్దమనుష్యులు. అట్టి వారు ఒకొక్కఫిర్కాలోను పండ్రెండుగురుచొప్పున నుందురు. వారు అప్రమత్తులై హంతకుల పట్టుకొనవలెను. అది వారివిధి. ఈ విధముగా, నానాటికి, రాజుకోర్టులకు పని హెచ్చి, జమీం దారికోర్టులకు పని తగ్గినది. అదియునుగాక, రాజుకోర్టువారు, కేవలము కేసులువిచారించుటయేకాక రాజోద్యోగులమీదను, జమీందారులమీదను వచ్చు ఫిర్యాదుల కూడ విచారించు చుండెడివారు. సర్వథా రాజాధికారమును, రాజహితమును కాపాడుటయే వారిధర్మము. ఆకోర్టులు, రాజునకు, నలుదెసల

జూడగల కన్నులవంటివి. నలుదెస లందుకొనగల చేతుల వంటివి.

## రెండవహెన్రీయు, తామసు బెకెట్టును
## (Henry II and Thomas Becket)

నిజాధికారము నానాటికి ప్రబలమై హెన్రీకి రాజశబ్దము సార్థకమయ్యెను. అతని చిత్తముచొప్పున నిరంకుశుడై వర్తించి నను కాదనువారుండరా యనునంతగా ప్రజలలో సందేహము కూడ కలిగినది. అంతలో, నతనికి చర్చితో నొక కలహము సంఘటిల్లి, కొంత ప్రాభవము తగ్గించినది. అదియు తాత్కాలికమే. ఆ కలహబీజముకూడ నిప్పటిదికాదు; మొదటి విలియమునాటిది. ఒకొక్క బిషప్పున కొకొక్క కోర్టుండుటయు, అందాతడు పాపుల విచారించి శిక్షించుటయు నను నాచారము విలియమునాటినుండి వచ్చుచుండెను. బిషప్పులు అంతతో తనివిసెందక, ఎట్టి యపరాధములుచేసినను, మతప్రచారకుల రాజుకోర్టులు విచారింపగూడదనియు, తామేవిచారించునధికారము కావలెననియు పట్టుపట్టి నెగ్గిరి. 'రాజుకోర్టు' వారికి, అపరాధమునుబట్టి యెట్టి శిక్షనైనను విధించునధికారము కలదు, ఒకనిని ఉరిదీయవచ్చును. లేదా ముక్కుచెవులు కోయవచ్చును. చర్చికోర్టువారికి నంత యధికారములేదు. అత్యాచారుల వెలివేయుటయే వారు వేయదగిన పెద్దశిక్ష. ఈ భేదమునుబట్టి యొకేనేరమునకు, ఒకచో తక్కువశిక్ష. వేఱొకచో నెక్కుడు శిక్ష జరుగుచుండెను. ఈ లోకువనుబట్టి మతప్రచారకులలో నెందఱో మహాపరాధములొనర్చియు, తగిన దండనలేక చెల రేగిరి. రెండవహెన్రీ రాజ్యమునకువచ్చిన మొదటిపదియేండ్లలో, మతప్రచారకులు చేసినహత్యలు నూటికిపైగా లెక్క

తేలినవి. ఈ పద్ధతి బొత్తుగా బాగుగలేదని యెంచి, హెన్రీ, మతప్రచారకుల చర్చికోర్టులోనేకాక రాజుకోర్టులోకూడ విచారింపవలెనని నిశ్చయించెను.

హెన్రీ, 1162-వ సంవత్సరములో, తామసుబెకెట్టు అను నతని కాంటర్బరీ ఆర్చిబిషప్పుగా జేసెను. వారి కిద్దరకును చాల మైత్రికలదు. తత్పూర్వము, బెకెట్టు కరణాధికారిగాకూడ పనిచేసి, మిక్కిలి సంపన్నుడయ్యెను. ఆతడు దంభవస్తనుడు. తన సంపద మెఱయవలెనని యతనికోర్కె. ఒకయుద్ధములో నతడు రాజునకై, ఆఱువేలమంది భటులను తీసికొనివచ్చి, వారి బత్తెములకు తన చేతిసొమ్మిచ్చుకొని రాజును మెప్పించెను. అట్టి వాడు, ఆర్చిబిషప్పుకాగానే, యెంతో విరాగియయ్యెను. అతని వర్తనమంతయు క్షణములో మారిపోయినది. అతనివేషభాషలును ఆహారవిహారములును, కేవలము సాత్త్వికములైనవి మనోవికారము పుట్టకుండుటకును, ఉదారభావములు కలుగుటకును అనువగునని, చలికాలమునగూడ ఉత్తనేలమీదనే పరుండెడివాడు. ఇవన్నియు నటులుండ, రాజుతోడితొల్లిటిమైత్రి మఱచి, యుదాసీనుడయ్యెను. రాజుకంటె చర్చియే యతనికి ఆదరణీయమయ్యెను. రాజు మతప్రచారకుల యపరాధవిచారణవిషయములో జరుగుచున్న అక్రమమును చక్కజేసి కొన్ని నియమములు చేయనెంచెను (1164). బెకెట్టు అందులకు సమ్మతింపలేదు. అతనిచే నెట్లయినను ఒప్పించవలెనని హెన్రీ యెన్ని విధములనో నచ్చజెప్ప జూచెనుగాని, బెకెటు ఇంచుకేని యంగీకరింపడయ్యె. హెన్రీ చేయనెంచిన సంస్కార మెట్టిదనగా:—

"మతప్రచారకునిపై అపరాధపుకేసు వచ్చుచో వానిని 'రాజుకోర్టు' వారు విచారించి, 'దోషి'యని రుజువగుచో, వాని నప్పుడు

చర్చికోర్టునకు పంపవలెను. అచ్చట వారు వానిని వెలివేసి, మరల రాజుకోర్టునకే పంపవలెను. అంతట, వారు, తక్కిన యపరాధులకు విధించుదండనయే వానికిని విధింతురు.” ఈ పద్ధతినిబట్టి, యొకనేరమునకు రెండుశిక్షలగుచున్నవిగనుక నిది సమంజసముగా లేదని బెకెట్టు ఎంతమాత్ర మంగీకరింపలేదు. మాటిమాటికి, చర్చికి రాజునకు జరుగుచున్న కలహమునకు మూలకారణ మొకటి కలదు. ఏమన, మతప్రచారకులు ఒక వంక చర్చికిని, ఇంకొకవంక రాజునకును భక్తులు. రెండుధర్మము లును, సమానముగా వర్తింపనపుడెల్ల, ఈతగువులు వచ్చుచునే యుండెను. ఈరెంటిలో, చర్చిధర్మము నెరవేర్చుట ప్రథమకర్తవ్య మనియు రాజధర్మము రెండవదియనియు బెకెట్టువాదన. మతా పేక్షచే అతనివాదన సమంజసమే. ఈ వాదమును హెన్రీ, ఈ రీతిగా ఖండించెను. “రాజునకు, మతప్రచారకుల శిక్షించునధి కారము లేనిచో, రక్షింపనవసరమును లేదు. అదియునుగాక, బిషప్పును ఎన్నుకొనుటలో రాజునకధికారములేనిచో ఆతని పొలములలో నడుగుబెట్టుటకధికారము బిషప్పునకును లేదు.” ఈ విధముగా నొకరికి నొకరు వీగిపోక ఆరుసంవత్సరములు వాక్కలహములు చేసిరి. తుదకొకనాడు, హెన్రీ ఆగ్రహాపర వశుడై బెకెట్టుపరోక్షమున, నతనిగూర్చి ఏమేమో పరుషభాష ములు పలుక, సన్నిహితులై వానినాలకించిన నలుగురు దీక్షా పరులు, ఆ వాక్యములకు అపార్థములు కల్పించుకొని, ‘బెకె ట్టును వధించుటకు రాజాజ్ఞ యైనది’ అని భ్రమించి ఆ ఘోర కార్య మొనర్చుటకు కాంటర్బరీ కాథిడ్రల్‌కు ఉరికిరి. వెళ్లిన మొగముననే, వారు బెకెట్టును పట్టుకొని ‘రాజాజ్ఞకు లోపడు దువా, లేదా?’ అని బెదిరించిరి. ‘లోపడను’ అని అతడు ఖండి

తముగా చెప్పెను. 'అగుచో, మంచిది.' అనుచు వారు వధో పకరణముల తేరబోయిరి. తప్పించుకొన దలచుచో, బెకెట్టు నకు అది మంచి అవకాశము. కాని ఆనిస్పృహునకు దేహా పేక్షలేమి, నిశ్చలుడై కూర్చుండి హంతకుల కత్తులకెరయ య్యెను.

ఈ ఘోరకార్యమువలన, ప్రజలలో మహాసంక్షోభము కలిగినది. రాజునకును తీరని దుర్యశము వాటిల్లినది. ఆనాడు, బెకెట్టుమహాపురుషుని కీర్తింపనివాడును, హెన్రీని, నిందింపని వాడును లేడు. చర్చితో మరల మైత్రినెరపినగాని ఈ మచ్చ మాయదని రాజు గ్రహించెను. నిజముగా, అతడు అనుతప్తుడు కూడ అయ్యెను. 'నా తల్లితండ్రులమరణము కూడ నాకింత వేదనాపాదకము కాలేదు' అని అతడు బాహిరముగా విలపింప జొచ్చెను. చర్చివారును అతనిని క్షమించి, పాలస్థానములో జరుగుచున్న ధర్మసంగ్రామమున పోరాడు యోధులలో రెండు వందలమందికి అగు వ్యయమును రాజు భరించవలెననిరి. రాజును దానిని, సంతోషపూర్వకముగా నంగీకరించెను (1172.)

అటుపిమ్మట, నాలుగేండ్లు గడిచినను, హెన్రీకి, అను తాపము శమింపలేదు. తనకేదేని ప్రాయశ్చిత్తము విధింపు డని, యతడు కాంటర్బరీమఠస్థులనడుగగా, వారాతని బాహిర ముగా బెత్తపుదెబ్బలుకొట్టి 'నిష్కృతికలిగె' పొమ్మనిరి (1176). ఆ నాడే, రాజునకును, చర్చివారికిని, కొన్ని యొడంబడికలు జరిగి పూర్వకలహమును అంతరించినది.

## ఒడంబడికలు

ఒకమాత్రపునేరము లన్నిటికిని, మతప్రచారకుల చర్చి కోర్టులోనే విచారించనచ్చును. కాని మూడునేరములకు మాత్రము రాజుకోర్టులోనే విచారణ జరగవలెను:—

అంశ,

### మొదటిది

రాజద్రోహము అనగా, రాజ్యచ్ఛిద్రముల వెల్లడించుట, రాజుపై కుట్రపన్నుట.

### రెండవది

రాజ భూము లనుభవించుచున్నందులకు, రాజునకొసర్ప వలసిన సేవాలోపము సేయుట.

### మూడవది

అటవీశాసనము లుల్లంఘించుట.

ఈ సంధివలన, రాజు, నిజముగా ఓడినవాడే యయ్యె గాని, యతనికి లబ్ధి యేమియులేదు. దీనివలన, రాజుకంటె, చర్చియే బలవత్తరమని వెల్లడియయ్యెను. రాజు ఉత్తరత్ర, పార్లమెంటునకు విధేయుడగునట్లు, ఆ నాడు చర్చికి విధేయుడు కావలసివచ్చినది.

## రెండవ హెన్రీయు, వానిసేనయు

దేశమునగల దీర్ఘాశూరులందఱికిని, నానాటికి యుద్ధాభిలాష సన్నగిలజొచ్చినది. నెత్తురుకూటివిందారగించుటకంటె, పొలముదున్నకొని గంజిద్రావుట మేలని తోచి, వారు యుద్ధవిముఖులైరి. తప్పనిసరిగనుక, యుద్ధభూమిలో నిల్చినను, వారి మనసులుమాత్రము ఇండ్లమీదనే యుండెడివి. ఇట్టి యుద్ధా

సేనుల గొని, పోరాడుట, యపజయ హేతువని గ్రహించి హెన్రీ, పెద్దకౌలుదారులతో, "మీరు యోధుల గొనిరావలదు, డబ్బు తెండు, చాలును" అనెను. వారును అంగీకరించి డబ్బు కట్ట దొడగిరి. దానికి 'యుద్ధధనము' అని పేరు. ఆ డబ్బుతో నతడు జీతములిచ్చి సేనల నిల్పవచ్చును. వారును ధనాశచే గట్టిగా బోరాడుదురు. అదియునుగాక, దీక్షాశూరులును, పోరాడునల వాటు తప్పి క్రమముగా ఉద్ధతి గోల్పోయి శాంతులగుదురు. ఇక వారివలన రాజు, భయపడవలసిన యవసరమునుతప్పెను. ఈ యుద్ధధనము పిథించుటచే రాజాధికారము మరల కొంచెము ప్రబలసాగెను.

అదియునుగాక, యతడింకొకటి యేర్పాటుచేసెను:— దేశమున గల ప్రతిస్వతంత్రపురుషుడును, పిలిచినపుడు వచ్చి, తనకై, పోరాడవలెనని. తదనుగుణముగ, 1181–వ సంవత్సరములో "ఆయుధశాసనము" అనుపేరితో కొన్ని నియమములు చేసెను. ఆ శాసనమునుబట్టి ప్రతిస్వతంత్రుడును, ఏదో యొక యాయుధోపయోగమును నేర్చియుండవలెను. ఈ శాసనఫలితముగా, పూర్వకాలపు "ప్రజాపతుసేన" వంటి సేన యొకటి కల్పింపబడుటయేకాక, ప్రతిస్వతంత్రుడును, తాను రాజుకోసము అవిధేయులైన జమీందారులమీద కత్తికట్టవలసిన వాడే అని గ్రహించెను.

## హెన్రీకుమారులు

ఈ విధముగా కల్పితమైన సేనతో, హెన్రీ, ఒక పెద్ద తిరుగుబాటు నణచివేయగలిగెను (1174). ఆ తిరుగుబాటును, హ్యూ బిగాడ్ (Hugh Bigod), హ్యూ ఆఫ్ చెస్టరు (Hugh

of Chester) రాబర్టు మౌబ్రే (Robert Mowbray) అను ముగ్గురు దొరలు లేవదీసిరి. వారు ముగ్గురును మంచి పలుకుబడి గలవారు. హెన్రీ యధికారమును అతని యిచ్ఛవచ్చినట్లు సాగనిచ్చినచో తమకు ముప్పువాటిల్లునని వారు భయపడిరి. స్కాట్లాండు రాజు (William the Lion) కూడ వారితో నేకీభవించెను. హెన్రీ కొడుకులు నల్వురుగూడ, తండ్రిదెస భేదము వలచి, తిరుగుబాటులో నే కలిసిరి. (Henry; Geoffrey; Richard and John). ఈ రాజపుత్రులకు ఫ్రాన్సులో భూము లుండెను. కాని ఆ భూముల నేలుకొను నధికారము, తండ్రి, వారికీయలేదు. వారిద్రోహచింత కిదియే కారణము. ఇంగ్లీషురాజును ఎట్లయినను ఫ్రాన్సునుండి తరిమివేయవలెనని తలపోచియున్న ఫ్రెంచిరాజును, ఇదియె యదనని, ఆ రాజకుమారుల ప్రోత్సహించి రెచ్చగొట్టెను. కాని యీ మహావిప్లవమును హెన్రీ, దక్షతమై నణచివేసి, స్కాట్లాండురాజును జీవగ్రాహిగా బట్టుకొని చెఱలో నుంచెను. అతడును హెన్రీయాజ్ఞను శిరసావహించి సామంతుడై యుండుటకు నంగీకరించి యతనితో సంధిచేసికొని బయటబడెను. దానికి 'ఫలైజు' సంధి యని పేరు (Treaty of Falaise, 1174). కాని జీవితాంతమువఱకు హెన్రీకి పుత్రులవలనిదుఃఖము పోనేలేదు. వారిలో యువరాజగు హెన్రీ 1183–వ సంవత్సరములో మరణించెను. మఱి మూడేండ్లకు (1186) 'జెఫ్రి' చనిపోయెను. మిగిలిన యిర్వురును (Richard and John) నిరంతరము తండ్రియెడ భేదము తలచుచునేయుండిరి.

హెన్రీకిని, పట్టుదల మెండు. పోయినవారు పోగా, మిగిలిన కొడుకులనైనను అత డాదరింపడయ్యెను. వారును

పుత్రవాత్సల్యములేని తండ్రియెడ భక్తియన నెట్టిదని, యతనిని సర్వవిధముల వేధింపదొడగిరి. ఈ విధముగా, వార్ధకమున గూడ, నతనిజీవితము పుత్రులవలన కేవలము దుఃఖభాజనమే యయ్యెను.

## ఐర్లాండు

ఇంగ్లాండుతో పోల్చిచూచినచో, ఐర్లాండు, ఆ కాలమున, అన్నివిధముల వెనుకబడియున్నదనియే చెప్పవచ్చును. ఆ దేశమున, బహుజనమునకు, పశుపాలనమే జీవనాధారము. వాణిజ్యము చాలతక్కువ; ఆ యున్న కొలదిమాత్రముగూడ తూర్పుతీరమున గల, డబ్లిను (Dublin), వాటరుఫర్డు (Waterford), వెక్సుఫర్డు (Wexford), లిమెరిక్కు (Limerick) మొదలగు ఏ నాలుగైదు పట్టణములనో జరుగుచుండెడిది. ఆ పట్టణవాసులుగూడ కేవలము దేశీయులుగారు. వారు, తొమ్మిదవ శతాబ్దిని, వచ్చిచేరిన 'డేనుదండుల' సంతతివారు. కాని యొకప్పుడా దేశము, ఋషులకును, విద్వాంసులకును నిలయమై యుండెను. ఆంగ్లోసాక్సనులు, బ్రిటనుదేశమును జయించు నాటికే, ఐర్లాండు, అధ్యాత్మసంపదతో తులతూగుచుండెను. అట్టి దేశము కాలక్రమమున ప్రాచీనగౌరవమును గోల్పోయినది. ఐరిషు చర్చివారు, అలసులై, మతమునే మఱచునట్లుండిరి. హెన్రికాలమున, నాలవ ఆడ్రియను (Adrian IV) అను నొక 'ఇంగ్లీషుపోపు' రాజును జేరవచ్చి ఐర్లాండును జయించి స్వాధీనముచేసికొమ్మని హెచ్చరించెను (1169). కాని యితనికి, ఉన్నరాజ్యమును చక్కజేసికొనుటకే వ్యవధి చాలకుండుట బట్టి, తానై ఐర్లాండుమీదికి పోజాలక, వేల్సుసరిహద్దుల గల జమీందారులదాడికి సమ్మతించెను. ఎందఱో జమీందారులు

చాల సేనలతో దాడివెడలిచిరి. 'రిచార్డు డి క్లేరు' (Richard de Clare) అను పేరుగల, 'పెంబ్రోకు'దొర (Earl of Pembroke) ఆదాడికి, నియంత. అతనికి "ధృడధన్వి" (Strongbow) అను బిరుదనామముగూడ గలదు. ఆసేనలో, ధనుర్ధరులును, కవచ ధారులునునైన పదాతులును ఆశ్వికులును పెక్కురు గలరు. వారికి ఐర్లాండును జయించుట అతిసుకరము. వారు, దేశము చాలభాగము నాక్రమమున జయించి యాక్రమించుకొని, యచట నొక వలసరాజ్యము (Colony) నేర్పఱిచిరి. అది డబ్లినునగరము నాశ్రయించి తూరుదెసల కలయవ్యాపించి 'పేలు' (Pale) అను పేర నొప్పెను. ఆవలసరాజ్యమున ఇంగ్లీషుశాసనాచారములు చెల్లుచుండెను. పడమటిదెసగల రాజ్యములు దేశీయుల యధీన మును బాయము, సందు పూర్వాచారములే నెగడుచుండెను. పడమటిదానిని ఐరిషురాజ్యమనియు, తూర్పుదానిని ఇంగ్లీషు రాజ్యమనియు ననదగును.

ఈ రెంటికిని మధ్యగల దేశముల జొచ్చి, యింగ్లీషు జమీనుదారులు కొందఱు, ఎవనికి అందినది వాడు లోపఱుచు కొని యనుభవింపసాగిరి. కాలక్రమమున వారు, దేశీయు లతో గలిసిపోయి, వారి యాచారవ్యవహారములనే యవలం బించిరి. వలసరాజ్యమువారికి, ఆ సాంకర్యము నచ్చక, వారిని గూడ దేశీయులతోపాటు ఏవగించుకొనిరి. ఐర్లాండునంతను లోగొని యేలుటకు, 'పేలురాజ్యము'నకు శక్తిచాలదు; స్వదేశ రాజులలోను నంతసమర్థుడెవ్వడును లేడు. అథవా, అట్టివా డెవ్వడేని యొకడున్నను ఇంగ్లీషువారు, వానిప్రాబల్యము సహిం పరు. స్వతంత్రుడైన ఐరిషురాజు, తన శత్రులజేరి, యెన్నటి కేని తనకు ముప్పుకలిగించవచ్చునని యింగ్లాండునకు శంక.

అందుచే, ఆ దేశమున ఇంగ్లీషువారి యధికారప్రాభవములు నెగడుచునే యుండవలెను. "అసలు, ఐర్లాండు నేలుటకు ఇంగ్లాండున కేమియధికార మున్నది?" అను ధర్మసందేహము నాటినుండి నేటివఱకును అట్లేయున్నది.

## మొదటి రిచర్డు (Richard I, 1188—1199)

రెండవహెన్రీ, రాజాధికారమును ఎంత పెంపొందించెనో, యతనికొడుకు, రిచర్డుపాలనమున గ్రహింపనయ్యెను. రిచర్డు రాజయ్యెనన్న మాటయేకాని, యతడు దేశమున నిలకడగా లేనేలేడు. ఆత డెప్పుడును దేశాంతరగతు డయియే యుండెను. ఆతనిపరోక్షమున, హ్యూబర్టు వాల్టరు (Hubert Walter) అను కాంటర్బరీ ఆర్చిబిషప్పు రాజ్యభారము నిర్వహించెను. ప్రజలును నతనిమాటను మిగుల మన్నించిరి. రాజు దేశమునలేని యవకాశము చూచుకొని, యతని తమ్ముడు జాను (John) రాజ్యాశచే నొక విఘ్నము లేవదీసెను. కాని యతడు పరాజితుడై విఫలమనోరథు డయ్యెను.

ఆ సమయమున, రిచర్డు పాలస్థానమున జరుగు ధర్మసంగ్రామమున వ్యగ్రుడై యుండెను. మొదట, పదునొకండవ శతాబ్దిని, తురకలు పాలస్థానమును జయింప, క్రైస్తవులు, వారి నోడించి మరల దానిని గైకొనిరి (1099). అందు ఎక్కుడు పాటుపడినవారు నార్మనుగోథులు. పిమ్మట బహుకాలము తురకలు దానిజోలికి రాలేదు. అట్లుండగా 1187-వ సంవత్సరములో, సాలడీన్ (Saladin) అను తురకసర్దారుడు, యెరూషలేమును (Jerusalem) ముట్టడించి స్వాధీనముచేసికొనెను.

ఆ క్షేత్రమును తిరిగిసంపాదించుటకు, యూరపులోని పెద్దరాజులందఱును కలిసి, దండయాత్ర యేర్పాటుచేసిరి. ఫ్రాన్సు దేశపురాజును, ఆష్ట్రియాడ్యూకును, ఫ్రెడరిక్కు- చక్రవర్తియును ఆ దండునకు నాయకులు. ఇంగ్లాండురాజు (రిచర్డు) కూడ దండులో జేరెను. అతడు 'ఏకరు' (Acre) అను ప్రదేశమును ముట్టడించి లోగొని, శత్రుదుర్నివారుడై తన పరాక్రమమును జూపెను. సాలదీను, అతని నోర్వలేక, సంధికి రాగా రిచర్డును ఒడబడెను. కాని యొక కుటుంబకలహము కలిగి, ఆష్ట్రియా ఫ్రాన్సురాజులు రిచర్డుతో విరోధించిరి. అంత రిచర్డు స్వదేశమునకు మరలివచ్చునపుడు మధ్యమార్గమున అతనియోడ ఆష్ట్రియాదేశపు తీరమున మెట్టబట్టి బ్రద్దలైనది. ఆ డ్యూకు, అప్రయత్నముగా, శత్రువు వంటయిల్లు చొచ్చెనని సంతోషించి యతని బట్టుకొని చక్రవర్తికి విక్రయింప, నతడును, రిచర్డును చెఱసాలలో నుంచెను. ఈ దుర్వార్త, ఇంగ్లాండుచేరగా, హ్యూబర్టు వాల్టరు ప్రజలవలన, పెద్దమొత్తము సొమ్ము వసూలుచేసి, యా మొత్తము చక్రవర్తికి పంపి, రిచర్డును వదిలించెను. అప్పటికిని రిచర్డు, ఇంగ్లాండునకు రాక ఫ్రాన్సునకు బోయి, యచట నెవనిచేతులలోనో మృతి పొందెను (1199).

## హ్యూబర్టు వాల్టరు (Hubert Walter)

ఇతడు దేశమును కడుసమర్థతతో బాలించెను. రెండవ హెన్రీ ప్రారంభించిన సంస్కారము లన్నియు కొనసాగించుటయే, యతని ముఖ్యోద్దేశము. అతడు సర్వదా, ఆ లక్ష్యమున చూపుపెట్టియే వర్తించెను. ఆ ఫలసిద్ధికై, యతడు

మునుముందు, తొల్లిటి "నిర్ణాయకవిచారణ" "సాక్షివిచారణ" అను పద్ధతుల ఎల్లెడల ప్రయోగించుటయేకాక, దేశసంచారముసేయు 'రాజుజడ్జీ'లకును ఎక్కుడు పని గల్పించెను. 'షైరు'లలో నుండు కొందఱు 'దీక్షాశూరులు' విధిగా 'రాజసమయముల' పాలించవలెనని యతడు 1194-వ సంవత్సరములో నొకయాదేశముచేసెను. 'రాజసమయములు పాలించుట' (To keep the pleas of the Crown) అనగా, అపరాధములు జరిగినపుడు, అపరాధులను పట్టుకొని కోర్టుసకు తీసికొనివచ్చుట, దానికి తగిన సాక్ష్యమును ప్రోగుజేయుట. ఆ శూరులు, ఆ షైరులోని పొలముల పండించుకొనుచుందురు గనుక, వారికి వేఱే జీతము లుండవు. వారు మఱికొన్ని రాజప్రయోజనములు గూడ సాధింపవలసియుందురు. దేనికిని వారికి జీతములీయబడవు. ఈ పద్ధతి, కొంతమార్పుతో నేటికిని జరుగుచునే యున్నది. నేటి ఇంగ్లీషు మేజస్ట్రేటులకు జీతములుండని యాచారమానాటిదే.

మఱియు, నతనికాలమున చాల "బరో"లు కూడ ఉన్నతస్థితికి వచ్చెను. ఒకొక్క 'బరో'కు, ఒకొక్క ప్రభువు (Lord) ఉండుటయు, ఆ 'బరో' నాశ్రయించి యున్న భూమియంతయు నతని యధీనమున నుండుటయు, చిరకాలాగతమైన యాచారము. ఆ భూమిని అతడు మఱికొందఱికి పండించుకొనుట కిచ్చి, వారివలన పన్నులు పుచ్చుకొనెడివాడు. ఆ విధముగా నతనికి చాల రాబడియుండెడిది. ఆ కౌలుదారులకు, పొలము పండించుకొనుట దక్క, ఉద్యోగుల నెన్నుకొనుట లోనగు రాజకార్యములలో జోక్యము లేదు. అట్లు జరుగుచుండగా, కొందఱు ప్రభువులు, రిచర్డుతో గలిసి ధర్మసంగ్రామములకు బయలు

చేరిరి. అందులకై ముందు, వారికి చేతినిండ డబ్బు కావలెను. ఆ డబ్బు సంగ్రహించుకొనుటకు వారు, తమ హక్కులలో గొన్నిటిని క్రైస్తులకు అమ్ముకొనిరి:—కొందఱు ఉద్యోగులనెన్ను కొను నధికారములను అమ్ముకొనిరి. కొందఱు, ఉత్తరత్రనియ తముగా ఏటేట కొలదిమాత్రపుపన్ను పుచ్చుకొను నెపమున ప్రస్తుతము పెద్దమొత్తములు పుచ్చుకొనిరి. ఈ రీతిగా ప్రభువులేకాక, రాజుకూడ 'బరో'నంటియున్న సొంతకమతపుహక్కులను కొన్నిటిని అమ్ముకొనెను. లండనుప్రజలు, మేయరు (Mayor) నెన్నుకొను నధికారము, ఆనాడు రాజునొద్ద కొనుగొన్నదే. ఆదినములలోనే 'బరో'ల వాణిజ్యమును వృద్ధి పొందినది. పాలస్థానమున కేగిన ప్రభువులును, యోధులును అచ్చటి భోగములకలవాటుపడి, తిరిగి స్వదేశమునకు వచ్చియు ఆ రుచులకే యంగలార్పసాగిరి. వారికోసమని, వర్తకులును తూర్పుదేశములనుండి వస్తుసంభారములు తెప్పింపదొడగిరి.

ఈ విధముగా, రెండవహెన్రీ పాలనలోను, మొదటి రిచర్డు నేలుబడిలోను, రాజాధికారము ప్రబలుటయు "బరో"లకును ప్రాధాన్యమువచ్చుటయు నైనది. ఆ దినములలో రాజును కేవలులును (Middle Class) మైత్రితో నుండిరి. దేశము నెమ్మదిపై నుండుట రాజునకును, వర్తకులకును గూడ నభిమతము. ప్రభువులో, యుద్ధప్రియులు; ఏమన, యుద్ధములగుచో, దేశములు కొల్లలాడి బొక్కసములు నిండించుకొన వచ్చునని వారి యాశ. వారి దురాలోచనలు కనిపట్టి, రాజును, కేవలులును ప్రభుజాతివారే, దేశద్రోహులని భావింపసాగిరి.

కాని, మఱునటితరమున అనగా, జాను (John) రాజైనపుడు ప్రభువులును, కేవలులును ఏకమై రాజుమీద కక్ష

బూనిరి. జానునవివేకమే దానికికారణము. అతడు నూటి మాటికి ధర్మలోపములు చేయజొచ్చెను. ప్రజ లదిసహింపక ప్రభుజాతిపురస్సరులై యతనిచే బాసలుపుచ్చుకొనిరి. అతడును, మాటిమాటికిని వా రడిగిన బాసలిచ్చియు, వెంటనే వాని నుల్లంఘించెడివాడు. ప్రజలును, విసువుజెందక, చలపట్టి మరలమరల నతనిచే, వాగ్దానములు గొనసాగిరి. ఈ విధముగా, మూడవ ఎడ్వర్డుపాలనవఱకు ప్రజలెట్లో కాలముగడిపిరి. రాజును మేరమీరకుండునట్లు జేయగల యొకపద్ధతి నప్పటికి గ్రహించి, దానిననుష్ఠించిరి. అదియే "పార్లమెంటు" వ్యవస్థ.



## ఎనిమిదవ ప్రకరణము

### అధికారప్రదానపత్రము. జాను

### (The Great Charter: King John 1199—1216)

జాను, ప్రజలకు చేసిన వాగ్దానము లన్నియు, వ్రాసి ముద్రవైచియుంచిరి. ఆ వ్రాతలకు, "అధికారదానపత్రము" లని పేరు (Charters). వానిలో మిక్కిలి ముఖ్యమైనదానిని "అధికారప్రదానపత్రము" అందురు. (The Great Charter of King John) జాను చాలదక్షుడైన రాజే. అయినను, చేసేతల దేశమునకు విరోధి యయ్యెను. ఆబాలగోపాల మతని నసహించుకొనిరి. అందుచేతనే, జమీందారు లందఱును అతని చేత అధికారప్రదానపత్రమును వ్రాయించగలిగిరి. దక్షుడైన రాజేమి? ప్రజలు కోరిన పత్రము వ్రాసియిచ్చుటేమి? అతనికి, ఆ సంకటస్థితి యెట్లువచ్చినది? ముందు ఈ రహస్యమును గూర్చి విచారింతుము.

### ఫ్రాన్సులోనిచిక్కు, నార్మండిని గోల్పోవుట 1204 సం॥

ఫ్రాన్సురాజైన రెండవఫిలిప్పు (Phillip II) ఇంగ్లీషు వారి నెల్లయినను తరిమివేయవలెనని దీక్షనహించెను. ఇంతకు ముందే పాలస్థానములో అతనికిని రిచర్డునకును కలహము జరిగినది. ప్రస్తుతరాజైన జానుతో కూడ కలహముపెట్టుకొనుటకు అతడు సందువేచియుండెను. అదియు సుకరముగానే లభించినది. జాను తనభార్యయైన ఆవిస్ ఆఫ్ గ్లవుసెస్టరు. (Avice of Gloucester) అనునామెను విడిచిపెట్టి ఇసాబెలా ఆఫ్ అంగోలిమి (Isabella of Angouleme) అను కన్యను పెండ్లియాడెను. ఆకన్య ఒక ఫ్రెంచిజమీందారునకు భార్య కాదగినది. పెండ్లిమాటలును జరిగినవి. ఆ స్థితిలో జాను ఆమెను దక్కించుకొనెను. ఆ జమీందారుడు జాను తనకుచేసిన ద్రోహమును ఫిలిప్పుతో విన్నవించుకొనెను. జానుచేసిన పని అశాస్త్రీయమనియు, చక్రవర్తిసమక్షమున దాని కతడు సమాధానము చెప్పవలెననియు ఫిలిప్పు ఆదేశించెను. అది తనకు పరాభవహేతువుగనుక జాను ఆ యాదేశమును తిరస్కరించెను. మిష దొరకనేదొరకినదని ఫిలిప్పు చక్రవర్తి యుద్ధమునకు సన్నద్ధుడయ్యెను. జానుమేనల్లుడైన ఆర్థరు ఆఫ్ బ్రిటనీ (Arthur of Brittany) కూడ ఫ్రెంచిచక్రవర్తితో చేరెను. జానుకూడ వెనుకదీయక యుద్ధసన్నాహమొనర్చి తొల్త తనమేనల్లుని పట్టుకొని చంపించెను. అటుపిమ్మట జాను యుద్ధమున జయమన్నమాట ఎరుగడు. నార్మండీ, టురెయిన్, మెయినీ, అంజౌ, ఉత్తరపు ఎక్విటయిన్ అనునవి ఒకదానివెనుక ఒకటి పోయినవి. బోర్డ్ (Bordeaux), దక్షిణపు ఎక్విటయిన్ "ఛానల్ ద్వీపములు"

మాత్రమే రెండవ హెన్రీనాటి సామ్రాజ్యములో అతనికొడుకు జానునకు ఫ్రాన్సులో మిగిలిన భాగములు.

ఆ కొలదిమాత్రము కూడ మిగులక నిశ్శేషముగా పోయినచో, ఇంగ్లండునకు ఎంతో మేలయ్యెడిది. ఏకొంచెమో ఉన్నది గనుకనే, దానిని గొప్పదిచేయవలెనని, ఇంగ్లీషువారికి ఆశలు పుట్టినవి. తదనంతరము జరిగిన నిరంతరయుద్ధముల కిదియే కారణము. అగుగాక, రాజునకు, ఫ్రాన్సులో కలిగిననష్టము ఇంగ్లండునకు లాభము. ఎట్లన, కొందరుజమీందారులకు ఇంగ్లాండులోను, భూములుకలవు; నార్మండీలోనుకలవు. ఇప్పుడా రెండు దేశములును భిన్నములైనవి గనుక, వారు దానినో, దీనినో వదలుకొనవలయును. ఇంగ్లండులోనిభూములను నిల్పుకొన్నవారు చూపంతయు వానిమీదనే పెట్టుకొని, పెంపొందించుకొనజొచ్చిరి. అదియునుగాక, రాజుయొక్క అనుచితాధికారము వృద్ధిపొందకుండ నిరోధించుటకు, ఇంటిపట్టున నుండుటచే మంచి అవకాశము ఏర్పడినది. ఆ రీతిగానే రాజునకును స్వదేశవ్యవహారములు చక్కబెట్టుకొనుటకు తగిన అవకాశము ఏర్పడినది. 1066–వ సంవత్సరమునకు పిమ్మట, ఇంగ్లండుదేశము నంతను కలయసంచారముచేసిన రాజే లేడు. ఒక్కనికిని తీరుబడి లేకుండెను. ప్రస్తుతము జానునకు అట్టియిబ్బంది లేదుగనుక, అతడు మాటిమాటికి దేశమెల్లెడల సంచారము చేయుచుండెడివాడు. ఒకవిధముగా ఆ సంచారములును అతనికి అనర్థకములైనవి. సకృద్దర్శన మీయవలసిన రాజు పదింపది పర్యటనములు సేయుచు, జమీందారులకు అతిపరిచితుడగుటవలన వారతని స్వభావలోపములు గుర్తించుటకు ననువైనది. వారతనిని ధిక్కరించుటకు గల కారణములలో నదియు నొకటి.

## చర్చితో జగడము 1205—1213 సం॥

హ్యూబర్టువాల్టరు 1205-వ సం॥లో మృతినొందెను. కాంటర్బరీలోని మతప్రచారకులందరుకూడి, అతనిస్థానమున ఇంకొకని ఎన్నుకొనగా జాను, అది కూడదని, ఇంకొకని నియోగించెను. దానితో తగవు వేర్పడినది. దానిని తీర్పవలసినవాడు 'పోపు' గనుక, ఇరుపక్షములవారును అతనికి విన్నవించుకొనిరి. అతడును వీనిని, వానిని కూడ కాదని, మూడవవానిని నియమించెను. అతనిపేరు స్టీఫన్ లాంగ్టన్ (Stephen Langton). తన మాట నెగ్గనికోపముచే జాను, లాంగ్టనును ఇంగ్లండులో అడుగు పెట్టనీయననెను. పోపుకూడ వెనుదీయక, లాంగ్టనుదక్క ఇంకొకడు ఆర్చిబిషప్పగుటకు వల్లకాదనెను. ఈ తగవు పరిష్కారమగు సూచనలు లేక, పోపు ఇంగ్లండును ఆంక్షలో నుంచెను. దానినిబట్టి, "కాన్కలుపుచ్చుకొనునప్పుడు తప్ప చర్చిలు అన్నివేళలయందును మూసియే యుండవలెను. ఏ చర్చిలోను పెండ్లిండ్లగుటకు వీలులేదు. మృతులైన వానినెవ్వని అందు భూస్థాపితముచేయుటకు వీలులేదు." బిషప్పులు పోపునకు విధేయులై ఆతని ఆజ్ఞానుసారము వర్తించుచుండిరి. రాజును చేతచిక్కినంతవఱకు వారిమాస్తిని లాగికొనుచుండెను. తుదకు 1213-వ సంవత్సరములో, పోపు, "ఇంగ్లండురాజును చర్చినుండి బహిష్కరించితి"నని ప్రకటించి, వానిని సింహాసనభ్రష్టుని చేయుమని రెండవఫిలిప్పును ప్రోత్సహించెను.

అట్లయ్యును, జాను, వీగిపోక చాలకాలము పోపుతో పెనగుచునే యుండెను. కాని అతనిపని వలలోచిక్కినట్లయినది. అతనికన్ని దెసలను శత్రుదర్శనమే. చర్చి యొకవంక, జమీం

దారు లొకవంక, ప్రజ లొకవంక, ఫ్రాన్సు ఒకవంక, ఇంత మందితో తూగుట కష్టమని యెంచి ఆతడు చర్చితో సంధి చేసికొని, ప్రతిసంవత్సరము పోపునకు కొంత కప్పము కట్టుట కును, అతనికి విధేయుడై వర్తించుటకును నంగీకరించెను. పోపు నకు విధేయుడగుటయనగా, భక్తిచూపుటమాత్రమే కాదు. "నేను నీ వాడను, ఇంగ్లండునీది; దానిని నీవొసంగిన వృత్తిగా నే నేలుచున్నాను." అని పోపునుద్దేశించి ప్రకటించవలెను. అట్టిప్రకటనయు జరిగినది. పోపుతో ఇప్పుడు మైత్రి కుదిరినది కనుక, ఫ్రాన్సులో తాను గోల్పోయిన దేశములు మరల సంపాదించుటకు జాను యత్నించెను. ఓటోచక్రవర్తియు (Emperor Otto) ఫ్లాండర్సుకవుంటు (Count of Flanders)ను జానునకు సాయమువచ్చిరి. ముగ్గురునుకూడి రెండవఫిలిప్పును ఎదిరించిరి. ఫిలిప్పు, తప్పక, యోడిపోవుననియే లోకము భావించెను.

## జమీందారులతో, మతప్రచారకులతో, వర్తకులతోను కలహము

జానుదురదృష్టవశమున, అతనిమిత్రమండలివారును, అత డును ఫిలిప్పువలన, 'బొవినెను' యుద్ధమున, పరాజితులైరి (Battle of Bouvines, 1214) చేయునది లేక జాను, స్వదేశము నకు తిరిగివచ్చునప్పటికి ఇచ్చట వారువీరని లేక, ప్రజలందఱును గూడి, యతనిమీద పగబూనియుండిరి. అన్నివర్గములవారును అతని ద్వేషించినవారేకాని భూషించినవారు లేరు. అతడు జమీందారులకు విరోధియయ్యెను. చర్చివారిని చెడగొట్టు కొనెను, వణిక్సంఘమువారికి నష్టదాయకుడయ్యెను. ఎవరికి

తగిన కలహకారణములు వారికేయున్న వి. రాజు "పార్థిపద్ధతి" మర్యాదల కన్నిటికి భంగము కలిగించెననియు, ఏదో మిష చెప్పి తమ సంపదనంతయు నపహరించెననియు, అభిజాత్యము గల కన్యలను, లంచములిచ్చిన నెవరికేని యిచ్చి పెండ్లిండ్లు చేయించెననియు, "యుద్ధధనము"ను వసూలుచేయునపుడు నియమరహితముగా వర్తించెననియు, జమీందారుల కలహకారణములు. బిషప్పుల నెన్నుకొనునపుడు, అతడు అనుచితాధికారమును జూపి, పూర్వాచారములకు భంగము కలిగించెననియు, తమ పొలములన్నియు హరించుటయెకాక అశాస్త్రీయశుల్కములు విధించెననియు చర్చివారితగువు. ప్రజలకు, తలకుమించిన పన్నులువేయుటచే, తమ వ్యాపారము మందగించినదని వణిక్సంఘమువారి మిష.

ఈ యిక్కట్టులన్నియు గుదిగూర్చి, వానిపరిహారములన్నియు వారొక పత్రమున వరుసగా వ్రాసిరి. తొల్లి, మొదటి హెన్రీకాలమునగూడ, రాజు, పార్థిపద్ధతిమర్యాదలకు భంగము కలిగింపకుండునట్లు, ఒక పత్రము వ్రాసి యతనిచే ముద్ర వేయించిరి. వయోవృద్ధుడగు, స్టీఫన్ లాంగ్టను ఆ సంగతి యెఱుగును. అట్లే యీరాజుచేతను చేయింపవచ్చునని, ప్రజలు తాము వ్రాసిన పత్రముమీద, జానుచే బలవంతముగా రాజముద్రవేయించిరి. ఆ దినము, ఇంగ్లీషుచరిత్రమున, మహాపర్వదినము. అది 1215-వ సంవత్సరము, జూనునెల 15-వ తేది.

## అధికారప్రవానపత్రము 1125-వ సంవత్సరము

ఈ పత్రమునందు, రాజుచేసిన వాగ్దానములు, అరువది మూడు గలవు. అవన్నియు జమీందారులయు, వర్తకులయు,

చర్చివారియు సక్తుములకు పరిహారరూపములు. ఏయొకటి రెండో తక్క, నందు సామాన్యులకు లాభించు విషయములే లేవు. ఇక బానిసలమాట చెప్పనేల. అట్లయ్యును, ఆ పత్రము రెండువిధములుగా మిక్కిలి యుపయోగకారి యయ్యెను:— ఇంగ్లీషుచరిత్రమున సందేహాపదములును, సందిగ్ధావస్థలును తట స్థించినపుడు, ఆ పత్రమునందలి వాక్యములు ప్రామాణికము లుగా, నుదహరించుచుండిరి. కనుక అది ప్రమాణగ్రంథమగుట యొకయుపయోగము. కొంతకాలము గడచినపిమ్మట, ఒకొక్క ప్పుడు, అందలి కొన్ని వాక్యములకు ఉద్దిష్టమైన యర్థము తెలి యక, ఇంకొక యర్థము చెప్పికొని పనులు గడిపికొనుట తట స్థించినది: — అందలి, పంన్రెండవ, పదునాల్గవ యవయవము లలో "ప్రధానభూస్వాముల సమ్మతిలేనిదే రాజు, యుద్ధధన ములు వసూలుచేయగూడదు" అనియున్నది. దీనికే "పార్ల మెంటు సమ్మతిలేక రాజు, ఎట్టిపన్నులును వసూలుచేయగూడ" దని అర్వాచీనులు, అర్థముచేసిరి. ఇట్టివి, ఏ రెండు మూడో తక్క, మిగిలినవాక్యములకు తొల్లిటి యర్థమే నిల్చినదిగాని, మార్పురాలేదు: — అందలి, ముప్పదితొమ్మిదవ నలుబదియవ, అవయవములలో "న్యాయమైన విచారణలేనిదే రాజు, ఎవ నిని, చెఱలో నుంచగూడదు" అను వాగ్దానము గలదు. మొదటి చార్లెసు కాలమున, అవసరముగల్గినప్పుడా వాక్యములకు ఆ యర్థమే చెప్పికొనిరి.

ఇక రెండవయుపయోగ మేమనగా, రాజాధికారము మేర మీఱకయుండ, ఆ పత్రము నిరోధహేతువైనది. అందువలన, దేశమున మాటిమాటికి తిరుగుబాటులును పోయినవి. రాజ్య పరిపాలన, కొన్నినియమములకు బద్ధమైయుండవలెననియు, ఆ

నియమములు, రాజునిచ్ఛకంటె బలవత్తరములు కావలెననియు జమీందారులును వర్తకులును, చర్చివారును పట్టుపట్టిరి. రాజునకు కొన్ని విశేషాధికారము లుండుననియు వానిని ట్టి యతనికి నిష్టమగుచో, పార్లమెంటువ్యవస్థలోని కొన్ని యాచారములకు భంగముకల్గింపవచ్చుననియు, రెండవహెన్రీ, వాదించుచుండెడివాడు. అట్టి వాదనలు, బయలుదేరకుండుటకై, ఆ విశేషాధికారములును నియమబద్ధములయియే యుండవలెనని, ఆ పత్రములో వ్రాయించిరి. ఎన్నడేని రాజు తనవాగ్దానములు తప్పుచో, జమీందారులు అతనికి నయమునను భయమునను జెప్పి, నియమపాలనము చేయించెడివారు. కొంతకాలమగునప్పటికి, రాజులు, తమ యిచ్ఛవచ్చిన నియమభంగము సేయుట మొదలిడిరి. అప్పుడు, జమీందారులును, చర్చివారును, వర్తకులును మార్గాంతర మాలోచించి, రాజును పార్లమెంటునకు విధేయుని జేసిరి.



## తొమ్మిదవ ప్రకరణము



### పదునొకండవ పండ్రెండవ శతాబ్దుల ఆర్థికసాంఘిక స్థితిగతులు: ఖండ్రిక

ఆ దినములలో, పొలము గల యెల్లవాడును, తన జీవికకై ధాన్యాది పదార్థములను, వీలైనంత వఱకు, తన పొలములో పండించుకొని తీరవలయును. తలకు మించిన పెద్ద పొలములు గలవారు, స్వయముగా నంతయు సేద్యము చేయుట పొసగదు గనుక, తమ భూమిలో కొంత యితరుల కీయ

వచ్చును. ఆ పాలికాపు తనకు పొలమిచ్చిన భూస్వామి పక్షమున యుద్ధము సేయుటయే దానికి ప్రతిఫలము. కాని, వారు తమ పొలము లన్నియు, ఆ పద్ధతినే ఇతరులకు అంటగట్టక కుటుంబభరణార్థము కావలయు నంత స్వంత సేద్యమునకు అట్టిపెట్టుకొనియే మిగిలినది ఇతరుల కిచ్చెడివారు. దేశమున వ్యవసాయ యోగ్యమైన భూమి యంతయు కొన్ని ఖండ్రికలుగా విభజింప బడినది. ఆ ఖండ్రికకు "మేనరు" అని పేరు. 'మేనరు' అను పదము 'చావడి' యను నర్థము గల ఒక లాటినుభాషాపదము నుండి వచ్చినది. భూస్వామి నివసించుటకు అనువుగా, ఒకొక్క ఖండ్రికలో ఒకొక్క యిల్లుండును. ఆత డా యింట, సకుటుంబముగా, అప్పు డప్పుడు, కాపురము చేయుచుండును. ఆ యిల్లు, కొంత కలపతోను, కొంత మంటితోను కట్టి యుండును. కొన్ని కొన్ని యిండ్లు రాతితో గూడ కట్టుట కలదు. ప్రతిగృహమునను ఒక పెద్ద చావడి యుండును. అదియే యింటివారి కందఱికి భోజనశాలగా నుపయోగించెడిది. అందే వారు పనిపాటులు కూడ చేసికొందురు. ఒకొక్కప్పుడు అందే పరుండుదురు. బల్లలును కుర్చీలును కొయ్యతోనే చేసెడివారు గాని బొత్తుగా పనివానితనము ఉండెడిది కాదు. నేలమీద జమ్ము పరిచి యుంచి, అది యెంత ప్రాతగిల్లినను తీసి వేసెడివారు కారు. కొన్ని కొన్ని యిండ్లలో చావడికి మీదుగా ఒక గది కూడ నుండును. అందు యజమాని తన యాలుబిడ్డలతో అభ్యంతరవినోదముల ప్రొద్దుపుచ్చు చుండువాడు. మఱి కొన్ని యిండ్లలో తల కొక పడకగది యుండును కాని సాధారణముగ నెల్లరును చావడిలోనే గడ్డి చాపల మీద పరుండుదురు. ఆ యింటిని అను

కొని ప్రత్యేకముగా ఒక వంట యిల్లు, ఒక గుఱ్ఱపుసాల, ఒక పసులపాక, కొన్ని ధాన్యపు గాదులు నుండును.

### మేనరుచుట్టును ఉండు పొలములు

ఖంత్రికలో మిక్కిలి సారవంతమైన పొలమును మూడు భాగములుగా విభజింతురు. ఒకొక్క యేడు, ఒకొక్క భాగమును దున్నక, బీడుగా వదలుదురు. తక్కిన రెండింటను, గోధుమ, బార్లీ మొదలగు పంట పండింతురు. ఏ పొలమునను, ఒక ఏడు వేసిన పైరు రెండవ యేడు వేయరు. అదియును గాక, ఒకొక్క భాగమునే పెక్కు చెక్కలుగా విడదీయుదురు. చెక్కకు చెక్కకు నడుమ ఎత్తుగా గడ్డి పెరిగియుండును. అదియే దాని కాడిగట్టు. సాధారణముగా, ఒక చెక్క, పొడవున 220 గజములును, వెడల్పున 22 గజములును కలిగి చదునుగా ఉండును. కొన్ని చెక్కలు ఆ వైశాల్యములో సగముండుటయు కలదు. పొలము మొత్తముమీద, మంచిమంచి చెక్క లన్నిటిని, యజమాని తనక్రింద నుంచుకొని, తక్కినవి ఇతరుల కిచ్చును. అతనివలన పొలము పుచ్చుకొను రైతులలో స్వతంత్రులు, అస్వతంత్రులు అను రెండు తెగల వారుందురు. 'స్వతంత్రుడు' ముప్పదిచెక్కలు వ్యవసాయము చేసికొనవచ్చును. అస్వతంత్రులలో "విల్లీను" లనియు, "కొట్టారు" లనియు, బానిస లనియు మఱి మూడు తరము లుండును. బానిసలకు పొల మిచ్చుటయే ఉండదు. తక్కిన యిరువురిలో, కొట్టారులకు నైదేసి చెక్కలును, విల్లీనులకు పదునైదేసి చెక్కలును ఈయబడును. ఒకొక్కయెడ, విల్లీనులకు నంతకంటె

ఎక్కువ ఇచ్చుటయు కలదు. కాని, ఎవ్వని కేనియు, అన్ని చెక్కలును ఒక్కచోట ఈయబడవు.

ఒక ఖండ్రికలో పంటపొలములే కాక యితరభూములు నుండును. అందు కొంత బీడునేల దానిని గూడ పంటపొలము వలెనే చెక్కలుగా విడదీసి, వంతుల చొప్పున పంచుకొందురు. ఆ చెలికనేలలో మంచి గడ్డి పెంచి, కోసి, పసుల మేతకు నిలువ చేసి యుంచుకొందురు. మఱికొంత చిట్టడవి. దాన నెల్ల రును కొంత కొంత కలపయు, కట్టెలును తెచ్చికొందురు. బీడు నేలగా కొంతయు చిట్టడవిగా కొంతయు పోగా మిగిలినది మఱి కొంత బంజరు నేలగా నుండును. అందు ఎల్లరును తమ పసులను గొఱ్ఱెలను మేపుకొనవచ్చును. కోతలై, నూర్పిడి జరిగిన తరువాత, పంటపొలములలో గూడ పసుల తోలి మేపు కొందురు.

## ఖండ్రికలోని జనుల విధులు

భూస్వామివలన, పొలము కట్టుబడికి తీసికొన్న యెల్లవా డును, అతనికి కొంత సేవ చేయవలసిన విధి యుండెను. "విల్లీనులు" (Villeins) అనువారు వారమునకు మూడునాళ్లు యజమాని పొలములో పాటు పడవలెను. అరకలు సాగు నపుడు, యజమానికి తమ యెడ్లను తోలిపెట్టవలెను. కోత కాపున గూడ అతనికి పని చేసిపెట్టవలెను. ఈ కాయకష్ట మిట్లుండ, వారు పండుగలు పబ్బములు వచ్చునపుడు, అతనికి కొన్ని కానుకలును పంపవలెను. కానుక లనగా కాయలు, కూరలు, పండ్లు మొదలగునవియే కాని, ధనము కాదు. గోధు మలు, బార్లీ మొదలగు ధాన్యపు గింజలు పిండి విసిరించుకొను

టకు, తమ యజమాని మరకే తీసికొని పోయి పిండి చేయించు కొనవలెను గాని యింకొక మఱొక మరకు గొనిపో గూడదు. తగువులు తీర్చుకొనుటకు, అతని కోర్టుకే పోవలెను గాని, దాని దాటి పోరాదు. ఇవన్నియు నిటులుండ, వారు ఆ ఖండ్రిక విడిచి వే ఱొకచో కాపురము చేయరాదు.

“కొట్టారులు” (Cottars) అను వారికిని, ఇట్టి విధులే యుండును గాని వారికి, విల్లీనులకంటె కాయకష్టము తక్కువ; అందుచలన తీరుబడియు నెక్కువ. ఆ వ్యవధిని వారు వృథ పుచ్చక, సంఘప్రవృత్తికి అక్కరకువచ్చు కొన్ని చేతిపనులు నేర్చుకొనిరి. కొందఱు, గుఱ్ఱములకు నాళములు వేయుట నేర్చిరి. కొందఱు బట్టల నేత నేర్చిరి. మఱి కొందఱు నాగళ్లు కట్టిరి. కుండలు సేయుటకు వే ఱొక కొంద ఱైరి.

ఇక స్వతంత్రు లను వారికి, కాయకష్టరూప మైన చాకిరి మఱియు తక్కువ. కోతలలో మాత్రము యజమానికి వారు కొంత సాయపడ వలసి యుండును. “పన్ను” అను పేరున కొంత డబ్బు చెల్లింతురు గనుక, వారికి చాకిరి తగ్గినది. యజమాని, కేసులు విచారించు నపుడు, “స్వతంత్రులు” తప్పక వెళ్లి సభ తీర్చ వలెను. అదియు ఇరువది దినముల కొక సారి తటస్థించును.

ఈ విధముగా, స్వామియెడ భక్తి గలిగి, సోమరితనము లేక, తమ పనులు తాము చేసికొనుచో, అం దెవ్వారికిని ఏ లోపము లుండవు. తిన్నంత తిండియు, కట్టినంత బట్టయు నై యుండును. కాని, ఉప్పుతో తొమ్మిదియు సొంతపొలముల లోనే పండవు గనుక మనుగడకు నవసరము లగు నితర వస్తువులను సమీప పట్టణములకు బోయి కొనుగొనెడివారు.

కుటుంబభరణమునకు సరిపోగా మిగిలిన ధాన్యాదులను గూడ ఆ పట్టణములకే గొంపోయి అమ్ముదురు. ఇంగ్లాండులో నిట్టి ఖండ్రికలు, పండ్రెండు పదమూడు శతాబ్దుల నెన్నో యుండెడివి. అప్పుడే కాక, నార్మనుల రాకకు పూర్వము గూడ నట్టివి కొన్ని యున్నటుల సూచనలు గలవు. కాని, యాచార వ్యవహారములలో, ఆ ప్రాతవానికిని, ఈ క్రొత్తవానికిని కొంత వ్యత్యాస ముండి యుండెను. ఇన్ని సదుపాయములును, ఇన్ని నియమములును, ఆ నాడు ఉండియుండవు. అట్లుండకుండుటయు కాలప్రభావముననే.

## పట్టణవాసము

ఆ దినములలో పట్టణము లనునవి పేరునకు మాత్రమే పట్టణములు గాని, నిజముగా నిప్పటి పట్టణముల వంటివి గావు. బరోలును అట్టివే. అవి పెద్ద గ్రామము లని చెప్పవచ్చును. ఏ పట్టణముననను, ఒకటి, రెండు వేలకు మించిన జనసంఖ్యయే యుండదు. ఆ పట్టణనామకములకును ఖండ్రికలకును నెంతో దూరము కూడ నుండదు. పట్టణవాసులకు వాణిజ్యాదులే బ్రదుకు తెరువుగాని, వారికి పొలము లుండవు, పంట లుండవు. వారు తిండిగింజలు విలిచి తెచ్చుకొన వలసినదే. భూస్వాములు తెచ్చి విక్రయించు ధాన్యములను వారు విధిగా కొనవలసినదే. చూపులకును పట్టణములు రమ్యములుగా నుండవు. అందలి వీథు లనునవి సందులే కాని, వీథులు గావు. అవియు మురికితో నిండి దుర్వాసన గొట్టుచుండును. వీథి వీథికిని ఒక వైపున ఒక మురికి కాలువయు, నింకొక వైపున మంచినీటి కాలువయు నుండును. ఆ మురికి కాలువ, ఎప్పుడు చూచినను,

జనులు పోసిన పెంటకుప్పలతో నిండి యుండును. ఆ కాలువలను, ఏ గాలిదేవుడో, ఏ వానదేవుడో తుడిచివేయ వలెనే కాని, ప్రజలు తామై వానిజోలికి పోయెడివారు కారు. రెండవ కాలువలో త్రాగుట కనువైన తెలినీరు ప్రవహించుచుండును. ఆ నీరు, పట్టణమునావల నుండు మంచినీటి యూటలనుండి వచ్చెడిది. ఆ కాలువలనుగూడ, బోదెలకంటె ఎక్కువ ప్రమాణము గలవానినిగా ఊహింపరాదు.

సాధారణముగ నిండ్లన్నియు దారుమయములే. అవియు కుటీరము లని చెప్ప దగినవే కాని, పెద్ద పెద్ద భవనములు కావు. మిక్కిలి ధనికులైన వర్తకులు మాత్రము భవనములలో నివసించెడివారు. అట్టివి ప్రతిపట్టణమునను నాలు గైదు కంటె నెక్కువ యుండవు. దుకాణము లన్నియు వీధిమొగనై యుండును. వానిలో కొన్నిట, బట్టలనేత, బల్లలచేత మొదలగు చేతిపనులు గూడ జరుగుచుండును. ఆ పనులను గూడ, వీధుల వచ్చి పోయెడి వారు చూడవలె నని ప్రకటముగానే చేసెడివారు.

## వర్తకగణము

ధనికుడు కాగోరు వాడు వర్తకము చేయవలెను. ధనార్జనకు ననుకూలము లగు నవకాశములు, వాణిజ్యము నాశ్రయించి యున్నవే కాని, యితరకృషులలో లేవు. వర్తమాన కాలమునకంటె, వర్తకునకు నట్టి యవకాశము లా దినములలో మఱియు గలవు. కాని, ఎల్లవాడును తన యిచ్చ వచ్చినపుడు వర్తకము పెట్టుటకు వీలు లేదు. దానికిని కొన్ని నియమము లున్నవి. వర్తకము సాగించ దలచుచో మున్ముం దతడు 'వర్తకగణము'నకు కొంత రుసుము చెల్లించి ఆ గణమున జేరవలెను.

'వర్తకగణ' మనగా, బరోబర్ గల వర్తక లంపటము కలిసి యేర్పాటు చేసికొన్న యొక సంఘము. ఆ సంఘమువారు తక్క ఇతరు లెవ్వరును వస్తువు లమ్మగూడదు. ఏమైని అమ్మ దలచువారు ఆ సంఘమువారికే అమ్మవలెను. వ్యాపారము నియతముగా నున్నచో పరపతి యుండుటయె కాక లాభ మును గల్గునని, యీ గణమువారు క్రయవిక్రయములకు సంబంధించిన కొన్ని నియమము లేర్పాటు చేసికొని, యీ ప్రకారము వర్తించెడివారు:—వారపుసంతలో గణాధ్యక్షుడు తనకు వలయు సామగ్రి యంతయు కొనుచుండగ, నితరసభికు డెవ్వడును ఏమియు కొనగూడదు. సాధారణముగ గణాధ్యక్షుడే తమ సంఘమునకు గావలసిన సమస్తవస్తువులు మొత్తముగా, తానే కొని, యితర సభికులకు ఎవరి కెంత కావలసిన అంత పంచి యిచ్చును; మఱియు బజారునకు వచ్చు సరకులను దారిలోనే యెవ్వడును బేర మాడ గూడదు; అదియునుగాక, ఏ వస్తువునేని కొన్నచోటనే యమ్మగూడదు. వర్తకు లొకరితో నొకరు నుచ్చరింపక, పొత్తు గూడి వర్తించుటకు ఏర్పఱిచిన నియమము లివి. కాని యేడాది కొక సారి జరుగు పెద్ద సంతలో ఈ నియమములు పాటింప నక్కఱలేదు. అందు ఎవని లాభము వాడు చూచికొని వ్యవహరింప వచ్చును. ఆ పెద్ద సంతలకు "సాలుసంతలు" అని పేరు. వానికి దేశమున నలు దెసలనుండి ప్రజలు గుంపులు గుంపులుగా వత్తురు. గణసభికు లలో నింకొక సదాచార ముండెను:—ఎవ్వడే నొక వర్తకుడు జబ్బుపడి లేవలేక యున్నపుడు, గణవ్యవహర్తలు వాని కుటుంబ మునకు అన్నవస్త్రాదిదైన్యము రాకుండ నసయుచుందురు. వాడు మరణించుచో అంత్యసంస్కారము లన్నిటికి వారే ఆదు

కొందురు. ఇట్టి గణములు ఒకొక్క బరోలో ఒకొకటి చొప్పున నుండెను.

వ్యాపారస్పర్ధలు

ఏ గణమునకు ఆ గణమున ఇంత సంఘీభావ మున్నను, ఒక బరోలోని గణమునకును, ఇంకొక బరోలోని గణమునకును స్పర్ధయే యుండెడిది. ఒక బరోలోని వర్తకుడు, ఇంకొక బరోలో, అమ్ముటకో కొనుటకో పోయినచో వానిని "పరుడు" అని వ్రేలుపెట్టి చూపించెడివారు. వాడును అచ్చటి గణము వారికి కొంత సుంకము చెల్లించికాని క్రయవిక్రయములు సేయుటకు వీలులేదు. ఈ పోరుపువల్ల గణమునకును గణమున కును వ్యాపారసంబంధము పెంపొందకుండ బోయినది. అవ సర మగుచో సుంకము చెల్లించి పరగణములతో వర్తకము సేయవచ్చును. కాని కొన్ని బరోలవారు తమ యిచ్చచొప్పున నెచ్చటనేని క్రయవిక్రయములు సేయుటకు రాజువలన కొన్ని యధికారపత్రములు గైకొనిరి. ఆ పత్రములు గలవారు సుంకము లీయ నక్కరలేదు.

ఈ వర్తకస్పర్ధల కతమున, జాత్యైకభావము కుదురుటకు నవకాశము లేకపోయినది. అట్లుండగా కాలక్రమమున, పెద్ద బరోలవారు పార్లమెంటుకు తమ ప్రతినిధుల పంపుట తట స్థించినది. పెక్కు బరోలనుండి వచ్చిన పెక్కురు వర్తకప్రతి నిధులు, పార్లమెంటులో నొకటియై రాజాధికారమును నిరో ధించు యత్నములు సేయుట మొదలిడిరి. పార్లమెంటులో, ఆ విధముగా కుదిరిన సంఘీభావము వలన వారి తొల్లిటి వ్యాపారస్పర్ధలును క్రమముగా సమసి పోయినవి. మఱి కొన్ని నాళ్లకు "కామన్సుసభలో" (House of Commons) పెం

పొందిన యేకీభావము వలన, జాత్యైకభావము ప్రాప్తిగా నెల కొనియెను.

---

## పదియవ ప్రకరణము

### పార్లమెంటు క్రమాభివృద్ధి

### మూడవ హెన్రీ 1216—1272 సం॥

మూడవ హెన్రీ జానుకుమారుడు. తండ్రి చనిపోవు నాటికి అతనికి తొమ్మిది యేండ్లు. ఆ సంవత్సరముననే యతడు రా జయ్యెను. రాజ్యభారవహనమునకు ఆ బాలుడు చాలడు గనుక, ఆ తంత్రము కొంతకాలము 'విలియము మార్షలు' (William Marshal) అను వాని వశమున నడచెను. 1232-వ సంవత్సరమునాటికి గాని హెన్రీ సార్థకముగా రాజు కాలేదు. జాను చనిపోయినప్పుడు ఫ్రెంచిరాజు ఇంగ్లండులోనే యుండుట తటస్థించినది. రాజ్యము తనకు రావలెను గాని, హెన్రీకి పో గూడ దని యతడు కలహించి యుద్ధమునకు సన్నద్ధుడై 'లింకాను యుద్ధమున' (Battle of Lincoln) దెబ్బతిని యోసలుడిగి, ఫ్రాన్సుకు లేచిపోయెను. విలియముమార్షలు కడు సమర్థుడు. జానునాడు ఛిన్నాభిన్నము లైన రాజ్యతంత్రమును మరల చక్కదిద్ది అవక్రమార్గమున నడిపింపవలె నని యాతని యాశ యము. ఆ గుఱి మీదనే చూపు పెట్టి యతడు మూడు సంవత్సరములు ప్రవర్తించిన పిమ్మట, అతని కంటెను సమర్థుడును వివేకియు నైన హ్యూబర్టు (Hubert de Burgh) అను నతడు తా నా భారము పూనెను. అతని యేలుబడి ప్రజల

కెంతో సుఖప్రద మయ్యెను. 'పియేడెరోషీ' (Pierre des Roches) అను నొక ఫ్రెంచివాడు, హ్యూబర్టు నడకను తిన్నగా సాగనీయక, మాటి మాటికి అడ్డు తగులుటబట్టి కాని, లేనిచో దేశము అంతకంటెను సౌఖ్యభాజన మయ్యెడిది. రోషీ అను వాడు వించెస్టరు బిషప్పు; విశేషించి మూడవహెన్రీకి విద్యాగురువు. ఆ గురువు చేయు నుపదేశముల బట్టి బాలరాజు, ఫ్రెంచివారియెడ నెక్కుడు ఆదరము గలిగి, వారితో మైత్రి నెఱపి, వారి ప్రియవచనములు హితోపదేశములుగా విన గడగెను. తుదకు, 'ఎలీనరు ఆఫ్ ప్రావెన్సు' (Eleanor of Provence) అను నొక ఫ్రెంచికన్యనే పెండ్లియాడి, ఆమె బందుగులకు ఇచట స్థిరనివాసము లేర్పఱిచి, పెద్ద పెద్ద ఉద్యోగపదముల గూడ నిచ్చెను. ఈ పద్ధతి ఇంగ్లీషు ప్రజలకు అభిమతము గాలేదు. రాజుగూడ వారిని అనురంజింప బూనలేదు. అంత 1232-వ సంవత్సరములో నతడు హ్యూబర్టునకు పదభ్రంశము కలిగించి తానే స్వయము రాజ్య మేలుకొనజొచ్చెను. అప్పటికిని, రాజు ఫ్రెంచివారితోనే మంత్రాలోచన సేయుటయు వారు సేయు దురుపదేశములు కొనియాడుటయు ప్రజలకు మిక్కిలి దుస్సహ మైనవి. తుదకు దేశ మంతయు గూడ అసంతుష్ట మైనది.

### మూడవహెన్రీ మన్ప్రరిపాలన 1232—1258 సం॥

రాజ్యభారము వహించిన వెంటనే ఆతడు చేసిన ఘనకార్యము ఫ్రెంచిరాజుతో యుద్ధము సేయుట. ఆ యుద్ధమున లాభించినది తృణము లేకపోగా, నష్ట మైనది కొండంత. అందులకై, యతడు ప్రజలపై, దుర్భరము లగు పన్నులు వేసెను.

దానికి తోడు, రాజధనము సంతయు, అతని ఫ్రెంచిమిత్రులు మ్రింగివేయు చుండిరి. ఇది ప్రజల యవిశ్వాసమునకు మఱింత ఉపోద్బలకమైనది. ఎక్కువపన్నులు విధించినందులకు, రాజును కేవలము నిందింపరాదు. ఆనాడు ప్రతివస్తువునకు నానాటికి వెల హెచ్చుపెరిగి పోవుచుండెను. రాజునకు దానితోపాటు పెరగవలసిన రాబడి పెరగలేదు. ఆయమునకు మించిన వ్యయ మగుచున్న యీ సందర్భములో, నాతడు పన్ను హెచ్చించు టయు కొంతవఱకు న్యాయమే. రాజునకు మూడు విధము లుగా ఆదాయము వచ్చును:—సొంతికమతమునలన కొంత; పెద్దరైతులు చెల్లించెడి పలువిధము లైన కప్పముల వలన కొంత; కోట్టలలో వసూ లయ్యెడి సొమ్ము మఱికొంత. ఈ మొత్తము రాజ్యపాలనాదికమునకు వలయు వ్యయమునకు సాధా రణముగా సరిపోవును. యుద్ధములు మొదలగు అసాధారణ కృత్యములకు అది చాలదు. అట్టియెడల పెద్ద కౌలుదారులు "నజరానా" అనుపేర దానరూపముగా కొంత సొమ్మిత్తురు. వారి వారి సంపదనుబట్టి ధనికులును కొంత అదనపు పన్నును భరింతురు. హెన్రీ కైన వ్యయము ఈ పరిమితిని మించినది. అతనికి సాధారణముగ వచ్చు నాయము నిత్యవ్యవహారములకే చాలుట లేదు.

ఇది యిటు లుండ, ఇంగ్లండునలన 'పోపు' అధికధనము లాగు చుండెను. అదియు హెన్రీసమ్మతివినాదనే. జాను చేసిన సమయముప్రకారము, పోపునకు కొంత కప్పము చెల్లవలెను. అది చెల్లుచునే యుండెను. దానికితోడు, హెన్రీసమ్మతిని, పోపు, ఇంగ్లీషుచర్చికి ఒక అదనపు పన్ను విధించి దానిని ఏటేట వసూలు చేయజొచ్చెను. ఆ చర్చివారును తాము

చెల్లించ వలసిన మొత్తమును, ప్రజలలో సామాన్యులవలనే గుంజుచుండిరి. ఇది యిటు లుండ, క్రీస్తు లందఱిని పోపే నియోగించు చుండెను. వా రందఱు విదేశీయులే. ఒక్క సంవత్సరములో మూడువందల మంది యిటలీదేశీయులు ఇంగ్లండులో క్రీస్తు లైరి. వారైనను ఆ పదవు లధిష్ఠించుటయె కాని, ఈ దేశమువంక కన్నెత్తిచూచిన పాపమున బోలేదు. చర్చివల్ల వచ్చు డబ్బు రాబట్టుకొని, హాయిగా నింటిపట్టుల సుఖ మనుభవించెడివారు. వా రిచ్చు కొద్ది జీతములు పుచ్చుకొని, ఇట గల యితములవారు చర్చిపనులు సేయు చుండిరి. దేశమునకు గలిగిన అనర్థకములలో నిది మఱొకటి.

ఈ దుస్థితి యంతయు, రాజునకు ఫ్రెంచిమిత్రులు సేయు దురుపదేశఫలితమే యని ప్రజలు గ్రహింప గలిగిరి. వారిలో గొప్పవారు, తమకు పెద్ద పెద్ద ఉద్యోగపదవులు రాలే దనియు అవి యన్నియు పరదేశీయులకే పోవుచుండె ననియు మఱింత కొరకొర లాడ జొచ్చిరి. రాజునకు గల 'ఇంటియుద్యోగు' లెవరో, ఎవ రెవ రే యే కార్యములు నెరవేర్చు చుండిరో ఎవరిని అవు నన వలెనో, ఎవరిని కాదన వలెనో, ప్రజలకు బొత్తుగా తెలియకుండెను. పరిపాలనయు నానాటికి అధోగతి పాలగుచుండెను. ప్రజలకు కోపము రగులుచును ఉండెను. తుదకు 1258-వ సంవత్సరములో హెన్రీ ఒక పెద్ద సభను సమావేశ పరిచినపుడు, జమీందారు లందఱును గూడి అతడు తన దుష్పరిపాలనాపద్ధతిని సంస్కరించుకొనునట్లు ఒప్పించవలె నని కృతనిశ్చయులై యా సభకు వెళ్లిరి.

## 'ఆక్సుఫర్డు షరతులు' — 1258 సం॥

ఆ పెద్దసభ ఆక్సుఫర్డులో జరిగినది. 'సైమను డి మాంటుఫర్టు' (Simon de Montfort) అను యతడు జమీందారుల కందఱకి నాయకుడుగా నుండెను. అతడు లీసెస్టరుకు దొర; విశేషించి రాజునకు బావమఱది కూడ. హెన్రీ చెల్లెలైన 'ఎలినరు' అను నామెను సైమను పెండ్లియాడెను. అతని జీవితములో చాల కాలము ఫ్రాన్సులోనే గడచినది. అదియు రాజకార్యముమీదనే. 'గాస్కొనీ'లోని జమీందారులు తన యాజ్ఞనుల్లంఘించి చెలరేగుచున్నారని విని, హెన్రీ, తన బావమఱదిని, వారి యల్లరి నణచుటకు ఫ్రాన్సుదేశమునకు పంపెను. సైమను ఆ కార్యమును నిపుణతతో సాధించుకొని 1257-వ సంవత్సరములో, ఇంగ్లాండుకు తిరిగివచ్చెను. అప్పటికి ఇచటి స్థితిగతులు విషమించియున్నవి. రాజునకును, ప్రజలకును అనుకూల్యము లేదు. ఈ స్థితి నెట్లయినను చక్కదిద్దవలెనని సంకల్పించి, యతడు, జమీందారులకు నియంతయై, ఖడ్గకవచాదుల ధరించి, ఆక్సుఫర్డు మహాసభకు వెళ్లెను. కవచశిరస్త్రాణాదుల ధరించుట, కార్యము సామముగా చక్కబడక పోవచ్చునను శంకచేత. కాని సభలో ప్రవేశించిన పిమ్మట నతడు సామమునే ప్రయోగింపనెంచి స్థితి యంతయు రాజునకు నయమున నచ్చజెప్పి, పూర్వాచారమునుబట్టి, కొన్ని సమయములు గల పత్ర మొకటి వ్రాసి రాజుచే ముద్ర వేయించెను. ఆ పత్రమునకే "ఆక్సుఫర్డుషరతులు" అని పేరు: — రాజు ఏ కార్యములయందును పరదేశీయులతో నాలోచన చేయరాదు. "రాజునకు వచ్చు నాదాయ మంతయు కోశములో చెల్లవలెనే కాని, రాజగృహమున చెల్లించ గూడదు."

కోశముమీద కొందఱు జమీందారులే అధికారులుగా నుందురు. ఏ విధముగా ఎంత సొమ్ము వచ్చుచుండెనో, ఏ విధముగా నెంత ఖర్చు అగుచున్నదో వారికి మంచి ఆకళింత యుండును. తన యనుచిత వ్యయరహస్యమును వా రెఱిగి పోదు రని, హెన్రీ, ఆదాయము రాజగృహమునకు రావలెను గాని కోశమునకు పోగూడదని యొక మార్పు చేసెను. ఆ పద్ధతిని సంస్కరించి పూర్వాచారము నెలకొల్పవలెననుట ఆక్స్‌ఫర్డుషరతులలో నొకటి. అందుచేత హెన్రీ అవలంబించిన పద్ధతిని మానవలెనని కోరిరి. రాజు ఈ షరతుల కంగీకరించి, యట్లే వర్తించుటకు వాగ్దానము సేయవచ్చును. కాని, యా షరతుల ప్రకారము వర్తింపనిచో చేయ దగినది ఏముండును? అందుచేత సైమను ఇంకొక నియమము చేసెను:—"పదునైదుగురు జమీందారులుగల ఒక 'విశేషసభ' యుండవలె ననియు, ఆ సభకునే రాజోద్యోగుల నియోగించుచుండవలె ననియు వారి యనుమతి లేక రాజు ఏ రాజకార్యమును చేయగూడ దనియు; అదిగాక సంవత్సరమునకు మూడు సార్లు "మహాసభ" జరగుచుండవలెననియు."

ఈ సంకేతము లన్నియు సదుద్దిష్టములే. కాని ఏమి లాభము? అవి నిశ్శేషముగా వ్యర్థమైనవి. రాజు తన వాగ్దానము లన్నిటిని పొల్లుచేసెను. ఒక్కటి నైనను నిల్పుకొనలేదు. 'విశేషసభ'వారు ఆతని వారింప లేకపోయిరి. వారి కనుగప్పి వర్తించుటలో అతనికి మంచి నేర్పుగలదు. రాజకార్యములలో వారి యాలోచనలతో నతని కేమియు పనిలేదు. అతని ఇంటి యుద్యోగులే యన్నిటికి చాలిన మానుసులు. సామము

నిష్ఫల మగుటచే, దండోపాయము తప్పనిసరిదైయై జమీందా
రులు యుద్ధమునకు దిగిరి.

## జమీందారుల యుద్ధము, 1264—1265 సం॥

1263-వ సంవత్సరములో క్రొత్తపోరాట ఆరంభ మైనది. జమీందారుల పక్షమునకు సైమనే నాయకుడు. కాని కొందఱు జమీందారులు, ప్రభువులమీద కత్తిగట్టుట అనుచితమనియు, సైమనుచేతలు అతికఠినము లనియు మనసుల నొచ్చుకొని యుద్ధమునకు దిగరైరి. మిగిలిన యతని యనుచరులు ముదల కించగా, సైమను, మరల నింకొక మారు సామమునైయె కార్యము నడపుటకు సమ్మతించి రాయబారములకు దిగెను. ఇరు పక్షములవారును తగవు తీర్చ వలసినదిగా ఫ్రెంచిరాజగు "సెంటు లూయీ"ని మధ్యస్థునిగా గోరుకొనిరి. (1264) "ఆక్సుఫర్డు షరతులు హెన్రీని బాధింప వనియు, అవి తాత్కాలికములే కాని నిత్యములు గావనియు, 'అధికారప్రదానపత్రమునకు' గాని మఱి యే పూర్వసదాచారమునకు గాని భంగము కలుగ నంత వఱకు, జమీందారులు సణగవలసిన పని లే దనియు" ఆ రాజు తీర్చెను. హెన్రీ చాల నిపుణుడు. ఈ తీర్పు, అతని వర్తన కనుగుణముగానే యున్నది. అతడు ఆక్సుఫర్డుషరతు లుల్లంఘించు చుండెనే కాని, పూర్వాచారములకు భంగము కలిగించుట లేదు. మధ్యవర్తి తీర్పు, తమకు అనుకూలింపమి జమీందారు లందఱును మరల నేకీభవించి సైమను నడపినట్లు నడచుకొన నిల్చిరి. వర్తకులును, సామాన్య గృహస్థులును గూడ అభిమానించి సైమను అడిగిన సొమ్ము ఇచ్చుటకును, యుద్ధము సేయుటకును గూడ ఉద్యుక్తులైరి. ససెక్సులోని "ల్యూయెస్"

(Lewes in Sussex) వద్ద మొదట ఇరు పక్షములవారును తలపడిరి. రాజుపక్షమున అతని జ్యేష్ఠపుత్త్రుడు ఎడ్వర్డు యువరాజు దండనాయకుడు. అతడు విక్రమించి శత్రుసేనలోని యొక మొనను యుద్ధభూమినదలి యింటిమొగ మగుడ దనుక తఱిమెను. అది లండను నగర ప్రజల దళము. కాని ఆవల ఇంకొక చోట హెన్రీ శత్రువుల జయింపలేక తూలిపోయెను. యువరాజు బాసట వచ్చు నప్పటికే రాజు పరాజితు డయ్యెను. ఎడ్వర్డుగూడ పగులవలన జీవగ్రాహి కాగా, సైమను వానిని చెఱలో నుంచెను. హెన్రీయు, జమీందారులకు లోబడి ఆక్స్ఫర్డు షరతుల ప్రకారము నడచుకొనెద నని యంగీకరించెను.

ఆ సంవత్సరము (1264) జరిగిన మహాసభకును ఆ మరుసటి సంవత్సరము జరిగినదానికిని, జమీందారులే కాక నడిమి రకమువారు గూడ సభికులుగా వచ్చునట్లు, సైమను ఏర్పాటు చేసి, రక్షించెను. సామాన్యులకు గూడ రాజసభాప్రవేశము కలిగించు నదుద్దేశమే ఈ యేర్పాటునకు ముఖ్యకారణము. అది యటు లుండ జమీందారులలో కొందఱు సైమనుతో విరోధింప సాగిరి. అతడు, రాజును కీలుబొమ్మను జేసి యాడించుచు తా నెచటికి నేగినను అతనిని వెంటబెట్టుకొని పోవుచు తన ప్రాభవమును, అతని విధేయతను మెఱయించు చుండెను. శక్తిభాజను సైమ, రాజు కేవలము అవమానపడు చుండుటయు, యువరాజు చెఱ దగిలి యుండుటయు, కొందఱు జమీందారులకు మనస్కరించలేదు. జమీందారులు సైమనుతో విరోధించుట కిదియే కారణము. సైమను నీతిపరుడు గనుక, ఎప్పటికేని తనకు సామాన్యులయండ కాబట్టు నని యూహించి, వారికి సభాప్రవేశము కలిగించెను. దానికి ఉదారత, మొదటి

కారణమును, స్వార్థపరత రెండవకారణమును నయ్యెను. ఈ రహస్యము గ్రహించి, ఎడ్వర్డు జమీందారులతో రాయబారములు సాగించెను; సైమనును విడి తనకు బాసటవై వత్తురేని, ఆక్సుఫర్డు షరతులు యథాపూర్వముగ నెగడునట్లు చేయుదు నని యతడు వారికి కబు రంపెను. వారికి అతని మాటయెడ విశ్వాసమును గలదు. తుదకు చాలమంది జమీందారులు ఆ పక్షము చేరిరి. ఏదో మాయ పన్ని ఎడ్వర్డు చెఱ తప్పించుకొని బయట బడి సైమనుపై పగ సాధింప నుద్యోగించెను.

తన కొడుకులును, రైతులును దక్క సైమనుపక్షమున నిక వేఱే జనములేక, వేల్సుప్రాంతముల కేగి కొంత జనమును సేనలో చేర్చవచ్చు నని యాతడటకు వెళ్లెను. ఆ వేల్సుప్రాంతములవారు, యుద్ధప్రియులు, దోపిడిగాండ్రు. సైమనుతో జేరినచో, వారు భుజకండూతి దీరునట్లు యుద్ధములు సేయవచ్చును. జమీందారుల యిండ్లలో బడి చేతులకొలది దోచుకొనను వచ్చును. సైమను వారి కీ యాస చూపి పెక్కుమందిని పోగు జేసి తీసికొని రా దలచెను. ఈ లోపుగ, సైమనుకొడుకును అప్రమత్తుడై "కెనిలువర్తు"నొద్ద ఒక సేనను గూర్చెను. ఎడ్వర్డు, ఈ వృత్తాంతములు విని, ప్రబలసేనతో వెడలి, మున్ముందె కెనిలువర్తు నొద్ద, సైమనుకొడుకును దాకి యతని పరాజితు జేసి, అటనుండి తరలి సైమను వచ్చు మార్గమున కెదురునడచెను. ఉభయసేనలును, వార్సెస్టరుషైరులో, ఈవుషామునొద్ద తలపడినవి (Battle of Evesham in Worcestershire 1265). సైమను, శక్తికొలది పెనగియు, శత్రువుల చేత జిక్కి హతు డయ్యెను.

1265-వ సంవత్సరము మొదలు, 1272-వ సంవత్సరము వఱకు యువరాజగు ఎడ్వర్డే నిజముగా రాజ్యభారము వహించెను. జమిందారులకు తాను చేసిన వాగ్దానము లన్నియు నప్పటికి నతఁడు తప్పక పాలించి, సైమను, తొల్లి సూచించిన ఉత్తమసంస్కారము లన్నియు ఆదరించి యనుష్ఠించెను.

## 1264, 1265 సంవత్సరముల పార్లమెంటు సభలు

మొదటివిలియమునాటి నుండియు, ఇంగ్లీషురాజులు తమ నిత్యవ్యవహారములయందు, రాజసభవారి ఉపదేశముల ననుసరించి వర్తించి రనియు, ఒకొక్కప్పుడు పెద్దరైతు లందరు, ఆ సభకు రావలసి యుండుననియు, మనము గ్రహించితిమి. పెద్ద రైతు లందరు వచ్చిన సభకు 'మహాసభ' అని పేరు. మహా కార్యావసరముల దక్క, మాటిమాటికి మహాసభ జరగదు. ఆ "మహాసభవారి సమ్మతిమీఁదనే రాజు, యుద్ధధనములు వసూలు చేయవలెను గాని స్వతంత్రుడై వర్తింపరాదు" అని అధికార ప్రదానపత్రపు సమయములలో నొకటి. తమకు ఇంత యధికారమున్నను, పెద్దరైతులు ఆ సభకు పోవుటకు ఇంచుకేనియు కుతూహలపడెడి వారు కారు. దూరప్రయాణశ్రమ కోర్వ లేక, దారిబత్తెములు భరించలేక, వారు దానియెడ ఉదాసీనులు కాజొచ్చిరి. వారు వచ్చితీరవలె నని రాజు కోరి నప్పుడు మాత్రము విధిగా పోవుట కలదు. సభలో కూర్చుండి నపుడు, వారు నెరవేర్చవలసిన కార్యములు పెక్కు విధములుగా ఉండును. రాజు అడిగిన సలహాలు చెప్పుట, అతనికి వలసినధన మొసంగుట లోనగు నవి యటుండ, సందిగ్ధము

లైన కేసులు నిర్ణయించుటలో కూడ, అతనికి మాటసాయము చేయుదురు.

కొన్ని యెడల, రాజు, "నజరానాలను" తీసికొను పలుకులను గూడ వారే చెప్పుదురు. 'నజరానా' అనగా, దేశమున గల ఎల్లవారును తన సంపదను బట్టి రాజునకు కానుకగా నొసగవలసిన ధనము. వారి వారి సంపదల విచారించి, వారు వారు ఈయవలసిన నజరానా మొత్తములను నిర్ణయించుటకు, కొందరు యోధులు రాజుచే నియోగింపబడుదురు. వారు ఒకొక్క షైరుకు ఇరువురుగాని, నలువురుగాని తిరిగి వివరములారసి రావలయును. తలచుకొన్నచో, వారు రాజు నెంతైన వంచింపవచ్చును. అయినను రాజునొద్ద పెక్కుమంది ఉద్యోగిజనులు లేనందున వారినే నమ్మవలసి వచ్చెను. అదే విధముగా, ఒకొక్క 'బరో'లోని వివరములు కనుగొనుటకు, ఆ 'బరో'లోని కొందరు పెద్దలు నియమింపబడుదురు.

1254-వ సంవత్సరములో మూడవ హెన్రీకి చాల సొమ్ము కావలసివచ్చెను. నజరానాల హెచ్చించి దానిని రాబట్టుకొన వలయునని అతడు తలచెను కాని, ఎవ రెంత నజరానా ఈయవలెనో, నిర్ణయించవలసినవారు, షైరులలో నియుక్తులైన యోధులు గనుక, వారి మూలముగాని హెన్రీకి ఆ డబ్బు సమకూరదు. అత డా సంగతి ఎరిగి, వారికి దర్శన మిచ్చి తొల్త వారితో ముచ్చటించినగాని, కార్యము సానుకూలము కాదని యెంచి, ఒకొక్క షైరునుండి నలుగురేసి యోధులు మహాసభకు రావలె నని ఆదేశించెను. తమ తమ షైరులు ఎంతెంత నజరానాలు చెల్లించ తగునో, వా రా సభలో వివరించి చెప్పిరి. ఎక్కువ నజరానాలు వసూలు చేయవలసి

యుండు నని రాజు సూచింపగా, వా రందుకు సమ్మతింపక, స్వాతంత్ర్యించి అతనితో వాదించిరి. వారు మహాసభవారికి గాని, రాజునకు గాని సేవకులు కారు. ఎవరి ఆదేశమును శిరసా వహించవలసిన పనియు వారికి లేదు. ఎంత నజరానా యిచ్చుకొనుటకు తమకు శక్తి గలదో, ఆ విషయములగూర్చి ముచ్చటించుటకే వా రా సభకు వచ్చిరి గాన, రాజుతో వాదించినయెడల వారు తమ ధర్మమును నెరవేర్చుకొనిరి. వారు ఒప్పడక పోవుటచేతనే, హెన్రీకి నజరానాయు దక్కలేదు.

1264–న సంవత్సరములో, సైమనుకూడ, మహాసభకు దీక్షాశూరులు రావలె నని యాదేశించెను. చాలమంది జమీనుదారులు, రాజుపక్షము చేరుచుండుట చూచి, సైరుల నైనను తన పక్షమునకు రాబట్టుకొనదగు నని, యాతడు సైరుల ప్రతినిధులుగా ఆ యోధులను సభకు రప్పించెను. ఆ సభవారే, రాజుతోడి సంధిసమయముల నిర్ధారించిరి. మరుసటిసంవత్సరము (1265) సైమనుపక్షము మఱియు క్షీణించెను. ఇరువదిముగ్గురు తక్క జమీనుదారు లందఱు రాజభక్తు లైరి. మహాసభ కూడవలసిన ఆవశ్యకమును అప్పుడే కలిగినది. ఇరువదిముగ్గురు జమీనుదారులును, ఏ కొలదిమందియో బిషప్పులును మాత్రమే ఆ సభకు రానై యుండిరి. బహుజన సమావేశముగాని, మహాసభ యనిపించుకొనదు. అందులకై, ఒకొక్క సైరునుండి, ఇర్వు రిర్వురు యోధులను, ఒకొక్క బరోనుండి ఇర్వు రిర్వురు పెద్దలను ప్రతినిధులుగా రప్పింపవలెనని, సైమను సంకల్పించెను. కాని బరోలలో గూడ కొన్ని యతని పక్షమున లేవు. అది గ్రహించి, యతడు తనకు మిత్రము లైన బరోలనే యాహ్వానించెను. అది యొక వింత

నైన మహాసభ. అది సర్వజనసమ్మతము కాదు. అయ్యు ఆ సభయే వ్యవహారము నడపి, సైమను రాజుతో చేసికొన్న సంధి శాస్త్రీయమే యని నిర్ణయించెను.

షైరుల ప్రతినిధులును, బరోల ప్రతినిధులును సభికులుగా నున్న ఆ మహాసభకే 'పార్లమెంటు' అని పేరిడిరి. పార్లమెంటు పదమునకు "గోష్ఠి" యని యర్థము. సైమనుయాజమాన్యము న జరగిన ఆ రెండుసంవత్సరముల సభలును పార్లమెంటులే. అవి చరిత్రప్రాధాన్యాధిష్ఠితములు. షైరులయోధులును, బరోల పెద్దలును, జమీందారులతో సమానప్రతిపత్తినై రాజకార్యముల సంప్రతించుటయే ఆ రెండు పార్లమెంటుల విశేషము. తత్పూర్వము, వారికి అట్టి యధికారము లేదు. తాము వసూలు చేయదగిన పన్నునుగురించి వివరములు తెల్పుట తక్క, తక్కిన రాజకార్యములతో ఆ ప్రతినిధులకు జోక్యము లేదు. ఆ కార్యము లన్నియు జమీందారుల వశమునను, రాజు వశమునను ఉండెను. సామాన్యులకు గూడ ఆ గౌరవ మొసంగినవాడు సైమను. మొదటి ఎడ్వర్డు కూడ, పార్లమెంటు వ్యవహారములలో సైమను తీసిన దారినే యనుసరించెను. పార్లమెంటుమొలకను గిల్లివేయక, అతడును చేతనైనంతవఱకు దానిని పెంచి పెద్ద జేసెను.

## పదునొకండవ ప్రకరణము

### ప్లాంటజెనెటు క్రమసంతతి II
### మొదటి ఎడ్వర్డు 1272—1307 సం॥
### రెండవ ఎడ్వర్డు 1307—1327 సం॥

మొదటి ఎడ్వర్డు కడు సప్రమత్తుడు; వివేకశాలి. అతడు ఫ్రాన్సు, వేల్సు, స్కాటులాండు దేశములలో యుద్ధములు చేసెను. దేశక్షేమ మభిలషించి పెక్కు సంస్కారములును, శాసనములును జేసెను. జమీందారుల యధికారములు మితిమీరి పోకుండ నిరోధించెను. పార్లిమెంటుసంస్థను పోషించెను. ఈ మహాకార్యము లన్నిటిని వేర్వేఱ వివరింతుము.

#### శాసనములు

రాజోద్యోగులు, షైరులలో అక్రమముగా ధనములు వసూలు చేసి యపహరించు చుండి రనియు, వారికి లేని యధికారములు నెఱపి, ప్రజల పీడించు చుండి రనియు, సామాన్య గృహస్థులు వారి బారిబడి నలిగిపోవు చుండి రనియు, పెద్ద కౌలుదారులు గూడ దేశ మెల్లెడల అనుచితాధికారము వహించి షెర్కా కోర్టుల వ్యవహారము లన్నియు తమ వశముననే యుండ జూచుచున్నా రనియు, లోపగు నేరములు ఎడ్వర్డు రాజ్యమునకు వచ్చిన వెంటనే వినెను. విని, యుపేక్ష వహింపక, ఆతడు అతిసూక్ష్మముగా విచారణ చేసి సత్య మారసి, యుద్యోగిజనులు ధర్మబద్ధులును, కర్తవ్యపరాయణులును అగు నట్లు శాసించి కొన్ని నియమములు చేసెను. పిమ్మట పెద్ద

కౌలుదారుల అత్యాచారములు విచారించి, ఏ కోర్టులు వారి వశమున నుండ దగునో ఏవి యుండ దగవో, రాజుకోర్టుల కును వారికోర్టులకును అధికారప్రయోగమున నెంత వ్యత్యాస ముండునో స్పష్టముగా వివరించి తెల్పి దాని కనుకూల మగు కొన్ని నియమములు నిర్దేశించెను. ఈ నిర్దేశముకతన, జమీం దారికోర్టుల ప్రాభవము తగ్గెనది. రాజుకోర్టుల ప్రాభవము హెచ్చినది. అవి యింకను వృద్ధినొందు నవకాశములును ఏర్ప డినవి.

పదపడి, అతడు భూస్వామ్యమునుగూర్చి విచారించి దానిని సంస్కరించెను. ఎవడేని ఒక భూస్వామి తనపొలము కొంత ఇంకొకనికి అమ్మదలచుచో రాజునకు కొంత దండుగ సొమ్ము చెల్లించి మఱి యమ్మవలెను. ఇది ఎడ్వర్డు రాజగు నప్పటికి ఉన్న ఆచారము. ధనికులైన వర్తకులు, పొలముమీాద మనసుపుట్టి కొన దలచినను, దండుగసొమ్ము చెల్లించుటకు నిష్ట పడక అమ్మువాడు ఉండెడివాడు కాడు. అంతగా పొలము మీాది మనసు పోనిచో, ఆ వర్తకులు ఏ ఖండ్రికకో నైనను కట్టుబడిదారులుగా చేరవలెను. అటుగాక ఇంకొక విధముగా పొలము సంపాదించుకొను నవకాశము లేదు. 1290-వ సంవత్సరములో ఎడ్వర్డు ఈ పద్ధతిని సంస్కరించెను. నూతన శాసనము ప్రకారము భూస్వాములలో చాలమంది తమపొల ముల నెట్టి ఆటంకములు లేక అమ్ముకొన వచ్చును. కట్టుబడుల కిచ్చి తమవశమున కొండఱ పాలికాపుల నుంచుకొనుట, వారి వలన పనులు చేయించుకొనుట లోనగు పూర్వపద్ధతులు చెల్లవు. కాని కొందఱు అసలే అమ్మరాదు. అమ్మరానిపొలము లకు "అధికృతభూములు" అని పేరు. ఈ శాసనమువలన

మంచి ప్రయోజనములు నెరవేరినవి:—భూకాంక్ష యున్న వారికి అది లభించు టొకటి; జమీందారులు తమ యిచ్చవచ్చినట్లుగా పొలములు పెక్కుమంది దీర్ఘాయోధులకు పండించుకొన నిచ్చి వారిని తమవశమున నుంచుకొని, వారి యండచూచుకొని మాటిమాటికి రాజద్రోహు లగుచుండిన పూర్వపురాచార మును అరికట్టు టొకటి; ఎవనిచేతికింద ఎంతమంది పాలి కాపు లుండిరో ఎందఱు ఉండ దగుదురో నిర్ణీత మగుట యింకొకటి.

ఈ శాసన సౌలభ్యమునుబట్టి, వర్తకులును పొలములు కొనుగొని, రాజ్యతంత్రమున, వారును, జమీందారులతో సమప్రతిపత్తిని పొందగల్గిరి.

జమీందారుల నెయ్యముకంటె, వర్తకులమైత్రియే వాంఛ నీయ మని యెడ్వర్డు ఊహించి, వారికి అనుకూలించు శాసన ములు మఱికొన్ని చేసెను:—వారు సులభముగా ఋణములు రాబట్టుకోగల మార్గములు కల్పించెను; వర్తకులు శూరతా బిరుదములు కొనుగొనవచ్చు నని నిర్దేశించెను. వారేకాదు, ఏ మాత్రమైనను పొలమున్న వారెల్ల ఆ బిరుదము కొన వచ్చును. దానివలన రాజునకు ధనముగూడ లభించును; ఎట్లన, శూరు లైన వారెల్ల రాజునకు కొంత సొమ్ము చెల్లించ వలెను. అగుగాక, అతని ధనము లభించినను వర్తకులకు తొల్లిటికంటె గౌరవము లభించినది. వారును శూరు లనిపించుకొనిరి; భూస్వాములైరి; జమీందారులతో సరిగా తూగిరి. ఈ సంస్కా రము జరగకుండ చేయవలె నని పెద్దకౌలుదారు లెంతో యత్నించిరిగాని, రాజు వారియాటంకముల సరకుసేయక తన సంకల్పము నెరవేర్చుకొని వర్తకకులమునకు ఉపకారియై, వారి సందడిని గుత్తగొని నట్లుగా వశపరచుకొనగలిగెను.

## పార్లమెంటు

"మాతో గూడ రాజ్యవ్యవహారము లాలోచించుటకు, మీరు పార్లమెంటుసభకు రావలయును" అని, ఎడ్వర్డు 1275-వ సంవత్సరములో దీవాను యోధులను, బరోల పెద్దలను ఆహ్వానించెను. పరదేశముల కెగుమతి చేయు ఒక ఉన్నిమూట కింత యనియు ఒక గొఱ్ఱె చర్మమున కింత యనియు, వర్తకులు రాజునకు సుంకము చెల్లించవలెనని యీ పార్లమెంటు ఒక నిర్ణయము చేసెను. ఈ పన్ను, ఇటీవల "పన్రెండువందల డెబ్బదియైదవ సంవత్సరపు సుంకము" అను పేర బరగినది. ఆ యేడు మొదలు, ఇరువది యేండ్లలో (1275—1295) ఎడ్వర్డు పార్లమెంటులో ఎన్నెన్నో మార్పులు కలిగించెను. ఒక యేడు యోధులను, బరోలప్రతినిధులను గూడ సభకు పిల్చెడివాడు; ఒక యేడు యోధులను మాత్రమే పిల్చెడివాడు; ఇంకొక యేడు బరోలవారిని మాత్రమే రప్పించెడివాడు; మఱొక యేడు పెద్దకౌలుదారుల మాత్రమే పిల్చి, యితరుల మానెడివాడు. ఈ విధముగా ఏడాది కొక మార్పు చొప్పున జరుగగా, జరుగగా, తుదకు 1295-వ సంవత్సరమున మాత్రము అందఱు ప్రతినిధులు గల నిండు పార్లమెంటుసభ జరిగెను. ఆ సభకు, ఏబదియేడు షైరులనుండి యోధులును, నూట యిరువది బరోలనుండి ఇద్ద రిద్దరు చొప్పున బరోల పెద్దలును, పెద్దకౌలుదారు లెల్లరును, చర్చివారి ప్రతినిధులు పెక్కు-రును వచ్చిరి. అది పరిపూర్ణమైన పార్లమెంటు. అట్టిది, తత్పూర్వమెన్నడును జరగలేదు. అందువలననే దానిని "దృష్టాంతపు పార్లమెంటు" అని పేర్కొనిరి. దానిపిమ్మట, ఆ రాజు ఇర్వది పార్లమెంటుసభలు జరపెనుగాని, వానిలో "దృష్టాంతపుపార్ల

మొంటు౯ను బోలినవి నాలుగు మాత్రమే కలవు. పార్లమెంటు చరిత్ర ఎడ్వర్డు నాటినుండియే ప్రారంభమైన దని చెప్పెదరు. కాని నిజమునకు పార్లమెంటుపద్ధతికి దారి తీసినవాడు సైమను డీ మాంటుఫోర్టు. అట్లయ్యు అతనికి ఆ కీర్తి దక్కకపోవుటకు కారణము, అతడు రాజు కాకుండుటయే. అత డొక విప్లవక నాయకుడు. అతనికి మహాసభలనుగాని, పార్లమెంటులనుగాని జరుపు నధికారము లేదు. ఎడ్వర్డు చూపిన దారినిబట్టి తదనంతర రాజులు కూడ, నానాటికి ఎక్కువమంది యోధులను బరోల పెద్దలను మహాసభలకు పిల్వ జొచ్చిరి. వారివలన రాజు, పరోక్షవృత్తాంతము లన్నియు వినగలుగును. రాజోద్యోగులు ప్రవర్తించు తెఱగు, జమీందారులయధికారము నెగడుచున్న విధము, రాచరికమునుగూర్చి ప్రజ లనుకొను సంగతులు, మొదలగు రహస్యము లన్నియు వారే, రాజుతో విన్న వింతురు. అదియునుగాక యుద్ధావసరముల, ఇది తగును, తగదు అని వారే యతనికి హితము గఱపుదురు. నూతన సంస్కరణల విషయమునను వారికి తోచిన సలహాల నిత్తురు. కాని వారి ఉపదేశములను రాజు, అనుష్ఠించి తీరవలె నని లేదు. ఇంతకును, ఎడ్వర్డు చేసిన పార్లమెంటుసభలవలన తేలునది యేమనగా—అతడు సామాన్యులతోడి మైత్రి అభిలషించె ననియు, వారి పలుకుబడి హెచ్చించి జమీందారుల పలుకుబడి తగ్గింప యత్నించె ననియు; ప్రజలు లేచుట, ప్రభువులు క్రుంగుట అనియు. ఇంతకు ఎడ్వర్డురాజునకు పార్లమెంటులవలన ముఖ్యముగా కావలసిన ప్రయోజనము ధనసంపాదనము. అతడు ఆ మూలమున ఎంత డబ్బు రాబట్టు కొనవచ్చునో యంత రాబట్టుకొనెను. అతని పిమ్మటి రాజులు, ఒక్క పార్లమెంటు

ద్వారముననే కాక, మఱి పెక్కు విధములుగా గూడ ధనార్జన చేసిరి. ఆ పద్ధతులు బొత్తుగా శాస్త్రీయములు గామి, కాలక్రమమున పార్లమెంటు వానిని అరికట్టి రాజధనాగమనమును నియతము చేసెను. మొదటి ఎడ్వర్డు కాలములో, కొందఱు పార్లమెంటుసభికులు, రాజు చేయు పనులలో కొన్నిటిని నిషేధించిరి. నార్మనుదండయాత్ర నాటినుండియు, రాజులు "పార్థివపద్ధతి" మర్యాదలకు భంగము కలిగింప గూడ దను సదాచార మొకటి యుండనే యుండెను. కాని ఆ పార్థివపద్ధతియు, ఆ మర్యాదలును, ఏ కొలదిమంది సంపన్నులకో వర్తించును గాని, ప్రజల కందఱికి అనన్వితములే. ఎడ్వర్డుకాలమున పార్లమెంటు నానాజనప్రాతినిధ్యము గలది యగుట, అది ప్రజ లందఱి మేలును విచారించి ప్రజాబాధకము లగు పనులు నిషేధించి ప్రజాక్షేమకరము లగు సదాచారములు పాలింపవలసినదిగా రాజు నడిగెను. ఎడ్వర్డురాజునకు, ధనలోపము గల్గుటయు, ఆ లోపము పార్లమెంటే తీర్పవలసి యుండుటయు, ఆ యధికార ప్రభావమును చూచికొని, పార్లమెంటు, రాజు పురాతన మర్యాదాబద్ధుడై వర్తించునట్లు చేయగల్గుటయు, అతని మేలుబడి తుది దినములలో జరిగిన వ్యవహారములవలన విదితమగును.

## అధికారపత్ర స్థిరీకరణము 1297 సం॥

మొదటి ఎడ్వర్డునకు, చర్చితోను, జమీందారులతోను, వర్తకులతోను పెద్ద కలహములు తటస్థించినవి. వారు రెండేండ్లు (1295—1297) హోరాహోరిగా తగువు లాడిరి. అందు చర్చివారితోడి తగువునకు కారణము, 1279-వ సంవత్సరములోనే అంకురించినది. ఆ సంవత్సరము, అత డొక శాసనము

చేసెను. దానివలన, చర్చివారికి, ఎక్కువభూదానములు గ్రహించు నవకాశము పోయినది. అదియునుగాక, అతడు వారివలన వీలయినంత సొమ్ము గైకొన దొడగెను. 1296-వ సంవత్సరములో, పోపు, రాజులకుగాని జమీందారులకుగాని, మతప్రచారకులు, తన సమ్మతి లేనిది ఏ విధమైన ధనములును చెల్లింప గూడ దని ఆదేశించెను. అది ఒక్క ఇంగ్లాండునకే కాక యూరపుఖండమునకు అంతకును అన్వయించు నాదేశము. తదనుగుణముగ ఇంగ్లీషుచర్చివారు, ఎడ్వర్డునకు ఎక్కువ సొమ్ములు చెల్లించుట మానిరి. అతడును ప్రతీకారార్థము, "చర్చివారికి రాజరక్షణము లేదు" అనెను. అనగా, దుష్టుల వలన చౌర్యాదిపీడలు కలిగినను రాజు చర్చివారియెడ ఉదాసీనుడై యుండు ననుట. ఇది చర్చివారికి దుర్భర మైన విషయము. రక్షణము లేని రాజ్యమున నెవరును ఉండజాలరు. అందువలన, వారు పోపునాదేశము తిరస్కరించి, రాజునకు సొమ్ము చెల్లింప బూనుకొనిరి. గత్యంతరము లేక యప్పటికి లోగిరి కాని, వారికి లోలోన కసి రగులుచునే యుండెను.

ఇంతలో, రాజు ఫ్రాన్సుమీద దండెత్తిపోవ సంకల్పించి తాను ఫ్లాండర్సుదెసకు నడచువాడై, కొందఱు పెద్దరైతులను గాస్కొనీకి పొండని యాదేశించెను. "మేము నిన్ను అనుసరించి నడవవలసిన వారమే కాని, వే ఱొక చోటికి పోజాలము" అని వారు గాస్కొనీకి పోరైరి. అంతట రాజు మార్గాంతరము ఊహించి, ఏడాదికి ఇరువది పౌనుల ఆదాయము వచ్చు పొలము గల వాడెల్లను, తన తన యుద్ధపరికరములతో లండను నగరమునకు వచ్చితీరవలె నని శాసించి అట్టి వారి సందడిని

సంగ్రహించి తీసికొని రావలసిన భారమును పెద్దలపై నిడెను. ఆ సేవకు జీతములు బత్తెములు నుండవు. అది నిష్కామముగ ఫ్రాన్సులో యుద్ధము సేయవలెను. ఈ శాసనము, కడు బెట్టిదముగా నున్న దని ప్రజలు తల్లడిల్లిరి. పెక్కుమంది "రాము" అని నిరాకరించిరి. తుదకు రాజును ఆజ్ఞావిధేయులై వచ్చినవారికి, బత్తెము లీయవలసివచ్చెను.

ధనతృష్ణచే నత డింకొక లోపపు పని చేసెను. ఇంగ్లాండు లోని ఉన్నివర్తకు లందఱు, తా మెగుమతి చేయ దగిన సరకు అంతయు, నిర్దిష్టము లైన యేవో కొన్ని రేవులకు మాత్రమే కొనిరావలె నని, యాదేశించి, ఆ సరకులు నచ్చి రేవుల నిల్వ యుండగా, అతడు వానిలో చాలభాగము అపహరించెను. వర్త కులు గోలపెట్టగా వెల యిచ్చెద నని త్రోపు మాట లాడి, గడపి పుచ్చెను. వారికి సరకునుపోయినది. దాని వెలయు దక్కలేదు. వారిలో కొందఱు మొఱ పెట్టుకొనగా మూటకు నలుబది సిల్లింగుల సుంకము లిచ్చినవారి సరకు తిరిగి యిచ్చి వేసెను. మూటకు నలుబది షిల్లింగు లనగా మామూలు సుంకమునకు ఆఱు రెట్లున్న మాట.

అంత ఎడ్వర్డు ఫ్లాండర్సు దెసకు సేనలతో నడచెను. అతడు దేశాంతర మేగిన యవకాశము చూచికొని, పెక్కుమంది పెద్ద నైట్లులును, బిషప్పులును, వర్తకులును లండనునగరమునకు వచ్చి, ఒక పార్లమెంటుసభ తీర్చి, అందు తమ తమ కష్టము లన్నియు కూడబలుకుకొని, రాజు దేశమునకు తిరిగివచ్చిన వెంటనే అధి కారప్రదానపత్రమును స్థిరీకరించునట్లు చేయవలె నని నిర్ణ యించుకొనిరి. ఆ పత్రమును స్థిరీకరించుట యనగా, దాని

మీఁద ఇంకొకనూరు రాజముద్ర వేయుట; ప్రస్తుతావసరము నకు దగిన మఱికొన్ని సమయముల నందు జేర్చుట. ఆ చేర్చ వలసిన క్రొత్తషరతులలో, నిది చాల ప్రధానమైనది:—"ఇక ముందు, "సర్వజనసమ్మతము"గాని పన్ను ఏ రాజును క్రొత్తగా విధించి వసూలు చేయరాదు" అనునది. ఈ సూత్రము ప్రకారము, వర్తకులు "1275-వ సంవత్సరపు సుంకము"నకు మించి రాజున కేవిధమైన సుంకమును చెల్లించవలసి యుండదు. పదపడి రాజు దేశమునకు వచ్చి, పార్లమెంటువారి నిర్ణయము నకు అంగీకరించెను. కాని, ఆ వాక్యములో "సర్వజనసమ్మతము" అను పదమునకు స్పష్టార్థము లేదు. "దేశములోని సమస్తప్రజలయనుమతి" యని పార్లమెంటువారి భావము; "వేయ దలచిన పన్ను భరించు సర్వజనుల యంగీకారము" అని రాజు చేసిన వ్యాఖ్యానము.

తదుపరి తాను చేసిన వ్యాఖ్యానమును పురస్కరించు కొనియే, అతఁడు వర్తింప యత్నించెను గాని, అంతమాత్రమున ఆ పార్లమెంటునిర్ణయములు వ్యర్థము లని భావింపరాదు. రాజు తన యిష్టానుసారము వలసినంత డబ్బు ప్రజలవలన రాబట్టు కొనకుండ పార్లమెంటు నిరోధింప గల దనియు, రాజునకు ఎక్కువ డబ్బు ఆవశ్యక మగుచో పార్లమెంటే యొసగవలె ననియు, అత డా సభామనోరథములు తీర్చనిచో ఆ డబ్బు లభింప దనియు నాటి పార్లమెంటువలననే లోకవిదిత మైనది. ఇదియే 1297-వ సంవత్సరపు పార్లమెంటు వ్యవహారములవలన తెలిసిన విశేషము.

ఎడ్వర్డు చేసిన నానావిధయుద్ధములే, యతని అమితధన వ్యయమునకు కారణములు. మొదట వేల్సుతో, పిమ్మట

స్కాటులాండుతో, అటుపిమ్మట ఫ్రాన్సుతో అతడు చేసిన యుద్ధములు ధన మంతయు హరించివెట్టెను.

## వేల్సుతోడి యుద్ధములు

మొదటివిలియము ఇంగ్లాండును జయించిన పురుషు, వేల్సును జయింపలేదు. ఆ దేశమునుండి ఇంగ్లాండునకు ఉపద్రవము రాకుండుటకై, ప్రబలు లైన పెద్దకోలుదారులకు ఆ సరిహద్దు భూములను జాగీరులుగా పంచి యిచ్చి, ఆ భూములకు అవల నున్న వేల్సుమీద వారు దండెత్తిపోయి జయించి అనుభవింప వచ్చు నని యనుజ్ఞ యిచ్చెను. ఆ సరిహద్దుభూములకు "దేశసంధులు" అనియు అచ్చటి జమీందారులకు "దేశసంధ ప్రభువులు" అనియు పేర్లు. కొన్నాళ్లకు ఆ ప్రభువులు మెల్లమెల్లగా, వేల్సుదేశములోని కొండకనుమలలోనికి చొచ్చుకొని పోయిరి.

అచ్చట వారి నెదిరించి పోరగల వా రెవరును లేరు. కొలదిమంది పంటకాపులును, పెక్కుమంది పసులకాపరులును మాత్రమే ఆ కనుమలలో నివసించుచుండిరి. ఆ సాధుజీవనులు ఈ యోధుల మార్కొ-నజాలరు గనుక వారిలో పలువురు భయపడి కొండల బడి పారిపోయిరి. మిగిలినవారు శత్రువులకు లోబడి సేవకులైరి. నిర్నిరోధముగా లభించిన యీ భూములలో, ఆ ప్రభువులు కోటలు మేడలు కట్టుకొని రాచరికము నెఱపసాగిరి. కాని కొండలలో ఆటవికజనములు కొందఱు స్వేచ్ఛమై వర్తించుచునే యుండిరి. ఇంగ్లీషుప్రభువులు వారిజోలికి పోలేదు. అదియునుగాక, ఆ రాజ్యమున వాయవ్యదిశ యంతయు స్వదేశీయుల వశముననే యుండెను. దానిని ఇంగ్లీషుప్రభువులు ముట్టలేదు. ఆ భాగమునకు గ్వైనెడ్డు

(Gwynedd) అనిపేరు. దానికి ఒక రా జనువాడు లేడు. అందలి ప్రజలు ఒండొంటికి సంబంధము లేని గుంపులు గుంపులుగా నుండిరి. ఆ గుంపుల నన్నిటిని కూడగట్టి యేల గల సమర్థు డొకడు కొన్నాళ్లకు బయలుదేరెను. అతని పేరు 'లెవెలిను' (Llewelyn the Great 1194—1249.) అతడు గ్వినెడ్డు దేశమునకు సంతకును రాజయ్యెను. అతనిమనుమడు "లెవెలిను ఆఫ్ గ్రిఫిత్తు" (Llewelyn of Griffith, 1246—1283.) అనువాడు సైమను డి మాంటుఫోర్టునకును మూడవహెన్రీకిని జరిగిన యుద్ధములలో సైమనునకు తోడ్పడెను. పదపడి, మొదటి ఎడ్వర్డు కాలమున, ఆ గ్రిఫిత్తు దేశసంధులప్రభువుల సందటిని వేల్సునుండి తరిమివేయ సంకల్పించి ఎడ్వర్డును తిరస్కరించెను. అది కారణముగా ఇరువురకును యుద్ధము తటస్థించెను. పార్వతికులను పర్వతభూములలో మార్కొని జయించుట చాల దుర్లభము. ఎడ్వర్డు ఆ రహస్య మెఱుగని యవివేకి కాడు. అతడు కొంత సేనను గ్వినెడ్డుసరిహద్దులకు బంపి, కొంత నౌకాదళమును ఆ రాష్ట్రపు సముద్రతీరమున నిల్పెను. రెండుదెసల శత్రువు క్రమ్మి యుండుటచే గ్రిఫిత్తునకు సంకటమై అటునిటు మసల వీలులేక పగవానికి లొంగిపోయెను. అంత ఎడ్వర్డు వేల్సు సంతను స్వాధీనము చేసికొని, దానిని షైరులుగా విభజించి అందు వేల్సువారి శాసనాచారముల రద్దుచేసి, ఇంగ్లీషువారి పద్ధతులు నెలకొల్పెను.

కాని గ్రిఫిత్తు, అంతతో ఊరకొనక 1282-వ సంవత్సరములో తిరుగుబాటు చేయ, ఎడ్వర్డు వానిని చంపి, ఉత్తరపు వేల్సును రెండవమారు జయించి వలయు చోటుల నెల్ల గట్టి కోటలు కట్టించెను. 'కాన్వేకోట,' 'హార్లెచ్ కోట' అను రెండును

నాటి గట్టిపనమునకు తార్కాణగా నేడును నిలిచియున్నవి. ఇంతకును, వేల్సు అంతయు ఇంగ్లండులో అంతర్భూతము కానే లేదు. ఆ దేశాచారములు కొన్ని కొన్ని నెగడుచునే యుండెను. పిమ్మట ఎడ్వర్డు జ్యేష్ఠపుత్రుని వేల్సుయువరాజుగా నొనర్చెను. నేటికిని ఆ బిరుదు ప్రతినృపాలుని పెద్దకొమరునకును చెల్లుచునే యున్నది.

## స్కాటులాండుతోడి యుద్ధము

స్కాటులాండులో జరిగిన కథ ఇంకొక విధమైనది. ఆ దేశమున పురాతనకాలమునుండియు వేర్వేరుగా, 'పిక్టులు' 'స్కాటులు' అను రెండు స్వతంత్రజాతు లుండెను. ఆ రెండు జాతులవారును 844-వ సంవత్సరమున ఒకరాజునేలుబడిని ఏకమైరి. మఱికొంతకాలమునకు 'కెనూర్మెట్టు' అను రాజుకాలమున, దక్షిణస్కాటులాండు ఆంగ్లోసాక్సను భాష నేర్చుకొనెను. దానితో ఇంగ్లీషువారి సంప్రదాయములు కొన్ని యచటికి ప్రాకినవి. అటుపిమ్మట మఱికొంత కాలమునకు, మూడవ మాల్కాము నేలుబడిలో (1057—1093) ఆంగ్లప్రభావము, ఆ దేశమున మఱికొంత వ్యాపించినది. దానికి కారణము, మాల్కాము, బాల్యమున ఇంగ్లాండులో పెరుగుటయే. పదపడి, ఇంగ్లాండును 'స్టీఫెను' పరిపాలించు నపుడు, 'మొదటి డేవిడు' అను స్కాటులాండు రాజు, ఈ దేశముపైదండెత్తి 'కంబరు లాండు' 'నార్తంబరులాండు' 'డరహాము' అను వానిని జయించెను. కాని యీ జయము దైవవశమున లభించినదేకాని, తన మూకలు, యుద్ధపరికరసంపన్నులైన ఇంగ్లీషుయోధుల నిక నెన్నడును జయింప జాలరని గ్రహించి, యతడు, కొందఱు నార్మనుప్రభువులను, తన దేశమునకు ఆహ్వానించి, వారి కచట

స్థిరవసతు లేర్పఱిచెను. 'బ్రూసు' వంశమును, 'బాలియాలు' వంశమును స్కాటులాండుచేరిన నార్మనుకుటుంబములలో ప్రధానములు. వారి యునికివలన, నాటినుండియు స్కాటులాండు దేశములోని పల్లపుభూములలో నార్మనుల పార్థివపద్ధతి సంప్రదాయములె చెల్లెను. కాని ఆ దేశములోని మిట్టభూములలో పూర్వాచారములే నెగడెను. 1746-వ సంవత్సరమువఱకు ఇవి ఇంగ్లీషు వారివశము కానేలేదు.

సాధారణముగా, స్కాటులాండురాజులును, ఇంగ్లాండు రాజులును బంధుమిత్రభావముతోనే వర్తించిరి. మొదటిహెన్రీ, మొదటిజేవిడు చెల్లెలి పెనిమిటి. కాని రెండవహెన్రీకాలమున ఉభయదేశములకును మిత్రత్వము పోయి శత్రుత్వము కలిగినది. ఆ హెన్రీ 1174-వ సంవత్సరమున స్కాటులాండురాజైన విలియము సింహుని ఓడించి తనకు విధేయుని జేసికొనెను. విధేయుని జేసికొనుటేకాదు, 'దాసోఽహ' మనిపించెను. దీనివలన, రెండవహెన్రీ, స్కాటు లాండునకు సమ్రాట్టు అను గౌరవ మేర్పడినది. తత్పూర్వముకూడ ఇంగ్లీషురాజులు తమకు అట్టి సమ్రాడధికార మున్నదని పేరునకు చెప్పికొనుచుండిరి కాని ఆ మాటలవలన ప్రయోజన మేమియు లేకపోయెను. రెండవ హెన్రీకి పిమ్మట మఱల మొదటి ఎడ్వర్డు ఆ గౌరవ మాసించెను.

## నార్హాము తీర్పు 1291 సం॥

స్కాటులాండురాజగు మూడవ అలెగ్జాండరు మరణింపగా (1286) అతని మనుమరాలు, మార్గరేట్ (Margaret of Norway) అను నామె ఆ దేశమునకు రాణి యయ్యెను. ఆ కన్యను, తన పెద్దకుమారు డైన, వేల్సుయువరాజున కిప్పించి

పెండ్లి చేయవలెనని ఎడ్వర్డు ఆశపడెను గాని, ఆమె నార్వేనుండి స్కాటులాండు పోవుచు మార్గమధ్యమున మృతినొందెను. పిమ్మట, "రాజ్యము నాకు రావలె నాకుగా నాకు రావలె"నని మువ్వురు ప్రభువులు తగవు లాడ వొచ్చిరి, (1291). ఆ మువ్వురును, 'జానుబాలియలు' 'రాబర్టుబ్రూసు' 'హేస్టింగ్సు' అను వారు. ఎంతకును వారి తగవు తెగమి, తమ తమ అర్హానర్హతల నిర్ణయించుటకు మొదటి ఎడ్వర్డును మధ్యవర్తిగా కోరి కొనిరి. అతడును 'నార్హమ్ము'వద్ద కొలువు తీర్చి 'బాలియలు'నకే అర్హత గలదని నిర్ధారించెను. వారతనిని మధ్యవర్తిగా నుండ గోర, అత డాకొల్వులో చక్రవర్తిగా నటించెను. అతడు ఆ నాడు చేసిన ప్రసంగములును చక్రవర్తులు చేయదగినవిగానే యుండెను. నాడే కాక, పిమ్మటకూడ నతడట్లే ప్రవర్తింప దొడగెను:—బాలియలునకును ఇంకొక సంపన్నునకును ఏదో కలహము రాగా, ఎడ్వర్డు దానిని పరిష్కరించుటకు వారి నిర్వురను ఇంగ్లాండునకు రండని యాదేశించెను. బాలియలు, అది తనకు అవమానముగా భావించి నిరాకరించెను. అప్పట్లి ఫ్రెంచి రాజునకును ఎడ్వర్డునకును యుద్ధములు గూడ జరుగుచుండుట చూచి బాలియలు, ప్రబలుని యంత క్షేమకర మని గాబోలు ఫ్రెంచిరాజుతో మైత్రి నెఱపెను (1295). అది నెపముగా ఎడ్వర్డు, స్కాటులాండు మీదికి దండెత్తి పోయెను. స్కాటులాండు రాజునకు దేశములోని గొప్పవా రెవ్వరును సాయపడ రైరి. దానివలన ఎడ్వర్డుపని మఱియు సుకరమై అతడు ఆ రాజు సేనలను రెండుచోటుల నోడించి అతనిని పదభ్రష్టుని జేసెను (1296). ఆ రెండుయుద్ధములును బెర్విక్కు, డన్బారు (Berwick and Dunbar) అను ప్రదేశముల జరిగెను.

## 'విలియము వాలెసు' (William Wallace)

స్కాటులాండులోని జమీందారులు లోనగు గొప్ప వారు 'బాలియాలు'నకు సాయపడ కుండుటకు రెండు హేతువులు గలవు:—వారిలో చాలమంది, ఇంగ్లండులోని భూస్వాముల సంతతివారే యగుట యొకటి; పరరాజు తమ రాజ్యమేలుట తమకు న్యూనతగా భావింపమి మఱి యొకటి. వారి యుదాసీనతయే, సామాన్య ప్రజలకు గూడ చుట్టుకొనెను. దాని వలన స్కాటులాండురాజు నిస్సహాయుడై పడిపోయెను. కాని, ఉన్నటు లుండగానే సామాన్య ప్రజలలో ఒక విచిత్రమైన పరివర్తనము కలిగి, ఎల్లరును వీరావేశపూరితులై ఒక్కమాటమీద నిలిచి, ఇంగ్లీషువారి నోడించి, దేశమునకు పరతంత్రత బాపవలె నని సమకట్టిరి. వారికి మంత్రోపదేశము చేసినవాడు "విలియము వాలెసు." అతడే వారికి దండనాయకు డయ్యెను. స్కాటులాండువారి సేనలో బల్లెములవారు అధికసంఖ్యాకులు గలరు. వారు ఒండొరుల భుజములు రాయుచు సాచిన బల్లెములతో నిల్చి, ఇంగ్లీషువారి గుఱ్ఱపుదాడిని సుకరముగా వారింపగలిగిరి. 1297-వ సంవత్సరములో, ఉభయపక్షముల కును 'స్టర్లింగు బ్రిడ్జి' (Sterling Bridge) వద్ద గొప్ప యుద్ధము జరిగినది. అందు ఇంగ్లీషుసేనలు నిశ్శేషముగా పరాజితములై విరిసిపోయెను. అప్పుడు, ఎడ్వర్డు దేశమున లేడు. అతడు ఫ్లాండర్సులో నుండెను. అతడు స్కాటులాండులో జరగిన పరాభవ వృత్తాంతమును విని, శీఘ్రమే ఇంగ్లండు చేరి తగిన బలముల గూర్చుకొని స్కాటులాండు మీద నడచెను (1298). ఆ బలములలో అశ్వికులే కాక, విలుకాండ్రును పెక్కురు గలరు.

వా రుపయోగించు ధనువు, దృఢమై, దీర్ఘమై, మధ్భేద్య ముగా నుండెను. దానికి "దీర్ఘధనువు" అని సంకేతనామము గలదు. ఆ ధనువు, వేల్సువీరులకు అభిమానాయుధము. దాని నిర్మాణప్రయోగాదికమును, ఇంగ్లీషువారు, ఆ వేల్సువారి గురుత్వ మునసే నేర్చిరి. స్కాటిషుబల్లెములవారు, బాణప్రయోగమున కును, అశ్వధాటికిని నిల్వలేరు. ఆ కతమున, ఎడ్వర్డు ఫాల్కిర్కు- నొద్ద వాలెసుసేనల నోడించి జయముగాంచెను (Battle of Falkirk 1298). అంతమాత్రమున, అతనికి ఆ దేశము దక్క లేదు. మఱి యేడేండ్లవఱకు వారికిని వీరికిని యుద్ధములు జరుగు చునే యుండెను. నానాటికి స్కాటులాండు వా రెల్లరును దేశ రక్షణార్థము నడుములు గట్టి "వాలెసు"పక్షమున నిల్చి పోరిరి. ఇంగ్లీషువారి సేనలు వారిని జయించుటకు చాలినన్ని లేవు. ప్రజలు సమసి, యేకమై ఎదిరించిన యే దేశమును, ఎంత ప్రబలుడైనను, ఏ పరరాజు అదిమి పట్టగలడు? నీతికోవిదు డైన ఎడ్వర్డు భేదోపాయము ప్రయోగింప, వాలెసుపక్షములోని కొందఱు కృతఘ్నులాతని బట్టియిచ్చిరి (1305). రాజద్రోహి యను నేర మతనిపై మోపి, ఎడ్వర్డు అతని తల గొట్టించెను.

## రాబర్టు బ్రూసు

వాలెసునకంతరము 'రాబర్టుబ్రూసు' అను నతడు, దేశ స్వాతంత్ర్యతా సంపాదనార్థము నాయకత్వము వహించెను. 1291-వ సంవత్సరములో తనకు రాజ్యార్హత కల దని కల హించిన బ్రూసున కితడు మనుమడు. వాలెసు పోరు దినము లలో బ్రూసు చంచలుడై, ఒకసారి స్వదేశీయులపక్షమును, మఱి యొక మాఱు ఇంగ్లీషువారి పక్షమును జేరెను. తుదకు

1306-వ సంవత్సరములో అతనొకని హత్య చేయగా, ఎడ్వర్డు అతని శిక్షింప నెంచెను. అంతట బ్రూసు స్వాతంత్ర్యించి, వాలెసు లేని లోపము తీర్చి, స్కాటులాండు ప్రజలకు నియామకుడై ఇంగ్లీషువారి నెదిరించెను. నాడు మొదలు అతని మరణ పర్యంతము (1329-వ సంవత్సరము), ప్రజ లతని యాజ్ఞ శిరసా వహించి వర్తించిరి. అతని యుద్ధతంత్రము కడు చిత్రమైనది. అతడు పరులతో ముఖాముఖిని పోరక, వారు సమయము పాటున నున్న యెడ దెబ్బగా వచ్చి పైబడి కనిముగను. మఱియు, శత్రుసేన లరుదెంచు మార్గము లారసి, వారి కచట అన్నపానములు లేకుండ జేసి మాడ్చి చంపును. ఎంత పెనగినను ఎడ్వర్డు అతని జయింపలేక పోయెను. ఎడ్వర్డు మరణించిన పిమ్మట, మఱుతరమున గూడ బ్రూసు కలహించుచునే యుండెను. తుదకు అతడే ఆ దేశమునకు రాజై, ఇంగ్లీషువారి బారి తొలగించెను. ఎడ్వర్డునుద్దేశము నెరవేరకుండుటకు కారణము స్కాటులాండువా రందఱు ఏకమగుటయే. ఇంతవరకు ఆ దేశమును ఇంగ్లీషువా రెన్నడును జయింపనే లేదు.

## ఫ్రాన్సుతోడి యుద్ధములు

ఎడ్వర్డు, స్కాటులాండును జయింపలేకపోవుటకు గల కారణములలో, పలువంకల యుద్ధములు తటస్థించుట యొకటి. అతడు, ఫ్రాన్సులోను స్కాటులాండులోను ఏకకాలముననే పోర వలసి వచ్చినది. ఫ్రెంచిరాజగు నాలుగవ ఫిలిప్పు, ఇంగ్లీషువారి బారి తొలగవలె నని గట్టి యత్నము చేసెను. ఫ్రాన్సు దేశమున, ఎడ్వర్డు సామంతరాజేకాని, స్వతంత్రుడు కాడని యతని వాదము. అది సత్యముకూడ. ఇంగ్లీషురాజునకు

ఫ్రాన్సున స్వతంత్రాధికారము [illegible] అది యెట్లనగా, ఇంగ్లీషు వారి కేలుబడిలోని ఫ్రెంచిమాండలికము [illegible] చుండెనని, [illegible] అప్పుడు [illegible] మును విచారించి [illegible] ఆదేశించెను. ఆ సమయమున ఎడ్వర్డు [illegible] కార్యస్వతంత్రుడై యుండుట [illegible] తనకై యొక రాజోద్యోగిని [illegible]. దానివలన మొదలే అడను వేచి యున్న ఫ్రెంచిరాజునకు సమయము దొరకెను. సామంతరాజు చక్రవర్తియొక్క [illegible] చేసెనని మిష కల్పించి అతడు గాస్కనీ యను ఇంగ్లీషురాజ్యభాగ మును పట్టుకొనెను. దానికి తగినట్లుగా, అప్పుడే, స్కాటు లాండువారికిని ఫ్రెంచివారికిని మైత్రి పొసగినది. వారి కిద్దరకు సాధారణశత్రు వగుట ఇంగ్లాండునకు సంకటస్థితి. ప్రబలులైన యిద్దరు శత్రువులు, ఉత్తరదిశ నొకరును, దక్షిణదిశ నొక రును కత్తులు దూయుచుండగ, ఎడ్వర్డునకు ఊపిరి యాడలేదు. ఫ్రాన్సునకును స్కాటులాండునకును నాడు పొసగిన మైత్రి నానాటికి పెంపొందెనేకాని క్షీణించలేదు. ఆ క్లిష్టసమయ మున, ఎడ్వర్డు చేసిన మంత్రాలోచన కొనియాడ దగినది. ఫిలిప్పుచేతను, నూాఱుసేతగా, ఎడ్వర్డు ఫ్లాండర్సుకౌంటుతో మిత్రతాసంధి చేసెను. తొల్లిటినుండియు, ఇంగ్లండునకును, ఫ్లాండర్సునకును వాణిజ్యబాంధవము కలదు. ఏటేట, ఇంగ్లాండు నుండి ఆ దేశమునకు ఎంతో ఉన్ని యెగుమతి యగును. దానితో ఫ్లాండర్సువారు చక్కని ఉన్నిగుడ్డలు నేసి, దేశదేశ ముల కెగుమతి సేయుదురు. అందును, చాలసరకు ఇంగ్లం

దుకే ఎగుమతి యగును. ఈ విధముగా, ఆ రెండు రాజ్యములకును స్వతోరూఢమైన మైత్రి పూర్వమే కలదు. ఎడ్వర్డు నాలోచన యేమనగా, ఫిలిప్పు స్కాటులాండుమీదుగా వచ్చి, ఇంగ్లాండును కొట్టుచో, తాను ఫ్లాండర్సుమీదుగా పోయి, ఫ్రాన్సును కొట్టవచ్చు నని. పిమ్మట జరిగిన యుద్ధములలో ఎడ్వర్డునకుగాని, ఫిలిప్పునకుగాని లభించిన దేదియు లేదు, లబ్ధిలేమికి తోడు, నష్టపాటును అగుచుండ ఇర్వురును విసివి సంధి చేసికొనిరి (1298). ఈ సంధివలన ఈ వంక ఒత్తిడి, మానినది గాన, ఎడ్వర్డు ఆ వంక స్కాటులాండునకు పోయి ఫాల్కర్కు-యుద్ధము సేయగల్గెను.

1302-వ సంవత్సరములో, ఫిలిప్పుసేనలు ఫ్లాండర్సువారి చేతులలో బడి, 'కోర్టురయి' యుద్ధమున మిక్కిలి హాతమైనవి (Battle of Courtrai). కాల్బలమును, అశ్వబలమును, పరస్పరము మార్కొను నపుడు కాల్బలమే జయించుట, ఆ యుద్ధము నాటికి అశ్రుతపూర్వము. ఆ యుద్ధమున ఆ వింత జరిగినది. కాల్వీర సమర్థతయు ప్రకట మైనది. 'కోర్టురయి' సమరమున ఓడినవా డగుట వల్లనే, ఫిలిప్పు ఎడ్వర్డునకు గాస్కొనీ తిరిగి ఈయ వలసి వచ్చెను. ఎడ్వర్డుకూడ, అతనికి సామంతుడై యుండ నంగీకరించెను. ఇదియే వారు చేసికొన్న సంధిఫలితము. కాని యేమి లాభము? అచిరకాలముననే రెండు దేశములకును మరల వైరము ప్రజ్వలించినది. ఇంగ్లీషు వారు నిశ్శేషముగా ఫ్రాన్సు విడిచి లేచిపోవు వఱకు ఫ్రెంచి రాజులు నిద్దుర పోవరు. అది వారి మతము, నీతియు.

ఈ విధముగా, మొదట వేల్సు, పిదప స్కాటులాండుతో అటుపిమ్మట ఫ్రాన్సుతో ఎడ్వర్డు చేసిన యుద్ధములు ధనమంతయు తుడిచిపెట్టినవి. అందుకు అంత్యదినములలో, ఆయవ్యయపు లెక్కలు చూచుకొనుటకు కూడ, అతడు భయపడెను. ఆయముకంటె వ్యయము పెంచుట అతని కన్నులకు గోచరించుచునే యుండెను. అయినను, లెక్కలు బయట బడుచో, ఆ రహస్యము జమీందారులకు తెలిసి పోవు నని యీ భయము. న్యాయమునుబట్టి చూచినచో, ఆయమంతయు కోశాధికారిపరమున చెల్లించవలసి యుండెను. కాని అచ్చటి వ్యవహారములు ఎప్పటి కప్పుడు జమీందారులకు తెలియవచ్చును. కనుకనే, ధనమంతయు "వస్త్రగృహము" నకు చెల్లవలె నని ఎడ్వర్డు పెద్దలకు ఆదేశించెను. వస్త్రగృహ మనగా, రాజులు, వస్త్రపరిష్క్రియ చేసికొను గది. అది పూర్వాచారము. ఎడ్వర్డునాటికి, ఆ గది కేవలము పరిష్క్రియార్థమే కాక, ఇతరప్రయోజనములకును పనికివచ్చెను. బుద్ధిశాలురును తరుణవయస్కులును నగు కొందఱు రాజోద్యోగులు అందు చేరి, రాజు స్వకార్యములు చేసిపెట్టుచుందురు. ఫ్రాన్సు యుద్ధమునకు కావలసిన ధనమంతయు, ఆ వస్త్రగృహము మూలననే అతనికి వచ్చినది. ఈ జాడ కనిపట్టి జమీందారులు కొరకొరలాడ దొడగిరి. కాని అభ్యంతరగృహములలో జరుగు వ్యవహారములు తడవుటకు వారి కేమి యధికారము? ఇంతలో రాజు పరలోకగతు డయ్యెను (1307). పిదప జమీందారుల కోపతాపములకు రెండవ ఎడ్వర్డు గుఱి యయ్యెను.

## రెండవ ఎడ్వర్డు. 1307—1327 సం॥

వేల్సు యువరాజులలో ప్రథము డైన ఈ యెడ్వర్డు, తండ్రి యనంతరము రాజై, రెండవ ఎడ్వర్డు అనుపేర బరగెను. ఇంగ్లాండుకురాజ్య మేలిన రాజులలో, రాజకార్యములయెడ నింత అశ్రద్ధాపరుడు ఇం కొకడు లేడు. అతనికి ఆటపాటలయందు ప్రీతి మెండు; క్రీడాపరాయణుడు; సోమరి; దుష్టసహవాస ములు చేసి కాలము వ్యర్థపుచ్చువాడు. "పయెర్సు గావెస్టను" (Piars Gaveston) అను ఒక ఫ్రెంచివాడు, అతని నర్మసఖు లలో ముఖ్యుడు. వాడు కేవలము వ్యర్థుడు; అవినయదూషి తుడు; రాజున కెప్పుడును దుర్బుద్ధులు గఱపుచుండువాడు. మీదుమిక్కిలి రాజాశ్రయగర్వమున నతడు జమీందారుల నందఱిని తిరస్కరించెను. వాని యునికి జమీందారులకు దుస్సహముగా నుండెను. వాని బోధలు మరగి, రాజు ఏదో యొక తప్పుపని చేయుచుండువాడు. ఆ పనులన్నియు మనము తడవనక్కరలేదు. అవి యప్రస్తుతములు. కాని రాజ్యవ్యవ హారముల నతడు చేసిన ప్రథమలోపము మనకు ప్రస్తుతము. తండ్రివలెనే యీతడును రాబడి యంతయు వస్త్రగృహముననే చెల్లించుకొనెను. ఈ దురాచారమును నాడు గాకున్న నేడేని ఆగవలె నని జమీందారులు సంకల్పించిరి. రాజు దుర్బలు డగుటయు, వారి సంకల్పసిద్ధికి ననువైనది.

## "ప్రభు నియామకులు" 1311 సం॥

1310-వ సంవత్సరము జరగిన పార్లమెంటుసభకు, జమీం దారులు ఆయుధపాణులై వచ్చి, రాజు చేసిన లోపములును, అతని యసమర్థతయు చూపి చెప్పిరి. ఆ సభా నిర్ణయముల

బట్టి రాజు కొంత కాలము పరిపాలన మానవలసి వచ్చెను. అతని పరోక్షమున "ప్రభు నియామకులు" అను పేర, కొందఱు సమర్థులైన జమీందారులు రాజ్యాధికారమును వహించిరి. వారు, రాజకార్యముల జరగుచున్న లోపము లన్నియు దిద్ది, అట్టివి మరల మరల జరుగకుండుటకై, ఒక కార్యప్రణాళికను వ్రాసి జమీందారుల కిచ్చిరి (1311). అందు వారు సూచించిన నియమములను రాజు తప్పకూడదు. ఆ నియమములకు బద్ధుడైనచో యతడు రాజ్యమును మరల పూనవలెను:— "గావెస్టనువంటి దుష్టులైన రాజమిత్రు లందఱు దేశమును విడిచి పోవలెను; ధనమంతయు దేశమునకే చెల్లవలెను గాని, వస్త్రగృహమునకు చెల్లరాదు; రాజోద్యోగుల నియమించు నప్పుడు, రాజు పార్లమెంటువారి సమ్మతిని పొందవలెను." ఇవియే, ప్రభునియామకులు సూచించిన నియమములు. ఈ ప్రకారము వర్తించుటకు రాజును అంగీకరించెను. ఈ నియమములలో కడపటిది చాల ముఖ్యమైనది. ఉద్యోగము లిచ్చుటలోగూడ పార్లమెంటువారి సమ్మతి యుండవలెననుటవలన, నృపాలుని "ఇంటియుద్యోగులు" గూడ పార్లమెంటు చేతిలోని వారే యగుదురు. వస్త్రగృహమున ధనవిషయికములైన రహస్య వ్యాపారములు జరుగుటకు అవకాశము లుండవు. దేశమునకు కలుగుచున్న ధననష్ట మంతయు ఆ మూలముననే జరుగుచుం డెను గాన ఆ దారి మూసివేయుటయే యీ నియమము లోని రహస్యము. ఈ రహస్య మెఱిగియు విధిలేక రాజు వానిని అంగీకరించి మరల రాజ్యము పూనెను. కాని చేతనైనప్పు డెల్ల నతడు నియమభంగము సేయుచునే యుండెను.

### బానక్‌బరన్ 1314–వ సం॥ (Bannockburn)

స్కాటులాండుదేశరాజగు రాబర్టుబ్రూసు, ఇంగ్లీషు వారిని తమదేశమునుండి పారదోల బూని, వారివశమున నున్న ప్రదేశముల నొకదాని వెంట నొకటిగా జయింప దొడగెను. రెండవ ఎడ్వర్డు వాని యుద్ధతిని అణచివేయవలె నని క్రొత్తసేనల సంగ్రహింప పూనగా జమీందారులలో మిక్కిలి ప్రముఖుడైన 'తామసు' అను నతడు (Thomas, Earl of Lancaster), రాజు నకు సాయము చేయ నిరాకరించెను. ఎట్లో కొందఱిని కూర్చుకొని, ఎడ్వర్డు స్కాటులాండుమీద ఎత్తిపోయెను. బ్రూసు కూడ ఆయత్తపడి 'బానక్బరను'నొద్ద శత్రువు నెదుర్కొని పోరి నిశ్శేషముగా నోడించెను. ఇంగ్లాండు, స్కాటులాండును, ఎన్నటికిని జయింపజాల దని నాడు విదిత మయ్యెను. మూడవ ఎడ్వర్డు నిరంతరము ఫ్రాన్సుతో యుద్ధములు సేయవలసివచ్చుటచే, నతనికి స్కాటులాండువిషయ మాలోచించుటకు తీరుబడియే లేకపోయెను. అతని తరువాత వచ్చిన రాజులకును అట్లే తటస్థించినది. అందుచే, ఆ రెండు దేశములును 'ఆఱవ జేమ్సు' కాలమువఱకు వేర్వేఱ స్వతంత్రములుగా నుండెను. ఆఱవజేమ్సు (James VI) స్కాటులాండుదేశరాజు. ఆతడు ఇంగ్లాండునకు గూడ రాజై ఈ దేశచరిత్రమున 'మొదటిజేమ్సు' అన నొప్పెను.

### 'తామసు పరిపాలన'

బానక్బరనుపరాజయముతో ఎడ్వర్డు కేవలము శక్తిహీనుడయ్యెను. దానివలన జమీందారుల ప్రభావము హెచ్చినది. రెండేండ్లు (1314—1316) రాజు, వారు చెప్పినట్లు చేసెను.

అనగా 1311-వ సంవత్సరమున వ్రాసిన నియమము లన్నియు పాటించెను. నిజముగా ఆ దినములు ఇంగ్లండుపాలిటికి చెడ్డ రోజు లనియే చెప్పవలెను. రాజు హద్దుమీఱి ప్రవర్తింపకుండునట్లు చూచుటకై 1316-వ సంవత్సరములో ఒక అధికారివర్గ మేర్పడినది. దాన, పదునాఱుమంది జమీందారు లుండిరి. అందు తామసునకు ప్రధానపద మిచ్చిరి.

రాజునకు హితము గఱపు నెపమున, ఆ వర్గమువారే, నిజముగా పరిపాలకు లైరని చెప్పవచ్చును. వారిలో తామసు, ముఖ్యుడు గనుక అది తామసు పరిపాలన యనిరి.

రాజును, తామసును, సర్వవిధముల సమానులు. ఇరువురును శక్తిహీనులే. అట్లయ్యు ఇద్దరును స్వతంత్రులు. ఒకరి మాట ఒకరికి సరిపడదు. ఒకరి సేవ నొకరు అరికట్టుదురు. ఇరువురును ఒకదారిని పోరు. ఇద్దరి నడుమ ప్రజలు నలిగిపోవుటయే నాటి యేలుబడి ఫలితము. అందుచేతనే ఆ దినములు ఇంగ్లాండుపాలిటికి చెడ్డరోజు లంటిమి.

## "డెస్పెన్సరులు" (Dispensers)

పదవడి రెండేండ్లకు (1318) ఎడ్వర్డునకు ఇద్దరు క్రొత్త హితులు లభించిరి. వారు వేల్సు సరిహద్దురాష్ట్రవాసులు. ఇద్దరును తండ్రికొడుకులు, 'డెస్పెన్సరు' అను పేరివారు. వారు రాజునకు చేసిన యుపకారము, జమీందారులబారినుండి యతని తొలగించుట. వారి యండవలన, ఎడ్వర్డు జమీందారుల ప్రభావమును తిరస్కరింపగలిగెను. పరిపాలనను మంచిదారికి తేవలెనని కూడ వారు యత్నించిరి. ఎన్ని కట్టుబాట్లు చేసినను "వస్త్రగృహము" తమ వశమున నుండి జారిపోవు చుండెనని

గ్రహించి, జమీందారులు 1318-వ సంవత్సరములో వాని మీఁద ఎక్కుడు అధికారము నెఱప బూనిరి. దానికి ప్రతీకారముగా డెస్పెన్సరులు ఒక మంత్రాలోచన చేసి, అప్పుడు జరుగు 'స్త్రీహాటము' అనియు "శయ్యాగ్రహము"నకు మార్పించిరి. విశ్వాసపాత్రులైన సమర్థుల నియమించి, రాజు, అందు రాజకార్యములు నెరవేర్చుకొన జొచ్చెను. అది యితరులకు ప్రవేశయోగ్యము గాదు. అందు జరుగు రహస్యములు జమీందారులకు తెలియకపోయెను. దానితో, జమీందారులకు, ఆయవ్యయములు పరామర్శించు నధికారము జారిపోయినది.

ఇట్లు కొంతకాలమువఱకు, డెస్పెన్సరులసాయమున, రాజు స్వాతంత్ర్యమున ప్రవర్తింపగలిగెను. కాని 1321-వ సంవత్సరములో, జమీందారులందఱును పట్టుపట్టి, బలవంతముగా ఆ యిద్దరు రాజహితులను దేశమునుండి పంపివైచిరి. రాజునకు అది దుర్భర విషయము. కావున, నతడు సేనల గూర్చుకొని జమీందారులతో యుద్ధమునకు దిగి 'బరోబ్రిడ్జి'యొద్ద, తామసు సేనల మార్కొని ఓడించి, తామసును పట్టి తలగొట్టించెను. డెస్పెన్సరు లీ సమయమున దూరమున నుండియు, పరోక్షముగా రాజునకు సాయము చేయుచునే యుండిరి. పిమ్మట వారును తిరిగివచ్చి, యథాస్థానము లలంకరించిరి.

డెస్పెన్సరులు, కేవలము రాజహితులే కాక, దేశహితులని కూడ చెప్పనొప్పును. వారికి చక్కని రాజనీతివిజ్ఞానము కలదు; సత్పరిపాలనాపద్ధతులు నెఱుగుదురు. ఒక దృష్టాంతము చూడుడు:—1322-వ సంవత్సరములో, 'యార్కు'లో పార్లమెంటు సభ జరిగెను. ఆ సభలో డెస్పెన్సరులు ఒక క్రొత్త చట్టము చేయించిరి. ఆ శాసనభావ మేమనగా, "షైరుల ప్రతినిధులయు,

[illegible] ప్రతినిధులను [illegible], పార్లమెంటు [illegible] శాసనములు చేయవలెను [illegible] అని. ఇది ప్రజాస్వామ్యమునకు గొప్ప ప్రోత్సాహము కలిగించినది. [illegible] ప్రతినిధులును, [illegible] ప్రతినిధు లును [illegible] "కామన్సు" [illegible] 'కామన్సు సభ' అను పేరు ప్రారంభమైనది. [illegible] పార్లమెంటు [illegible] సభలకు [illegible] హేతువు.

## రెండవ ఎడ్వర్డు పతనము

ఎడ్వర్డును సింహాసనభ్రష్టు చేయుటకు, 1326—వ సంవత్సర ములో ఒక కుట్ర జరిగెను. రాజద్రోహము తలపెట్టిన వారిలో 'ఇసాబెల్లా' (Isabella) అను రాణియు, 'రోజరు మార్టిమెరు' (Roger Mortimer అను నాతడును ముఖ్యులు. 'మార్టిమెరు' వేల్సు దేశసంబంధి యగు ప్రభువులలో నొకడు. ఇక, 'ఇసా బెల్లా', ఎడ్వర్డు భార్యయే. రాజునెడ జనసామాన్యులకు అభి మానము లేమిగనుక, వారు రాణిని [illegible]. రాజవిద్రో హులు, రాజును పట్టుకొని చెఱలోనుంచిరి. డెస్పెన్సరుల నిర్వు రను వధించిరి; రాజకుమారుని, మూడవ ఎడ్వర్డును, రాజుగా ప్రకటించిరి. రెండవ ఎడ్వర్డు చెఱలో ఒకయేడు ఉండి, విద్రో హులచే అందే వధింపబడెను (1327).

ఎడ్వర్డు, నిష్ప్రయోజకుడగుటయే అతని పదభ్రంశము నకు కారణము. అతనికి రాజ్యపరిపాలనా సమర్థత లేనేలేదు. అతని యేలుబడిలో, ఏ యొకటి, రెండు మంచిపనులు జరిగి నవి ఉన్నను, అవి అతడు చేసినవి కావు. అతని హితులు చేసి

నవి. కాని అతని కాలములోనే, ఇంగ్లీషుచరిత్రలో గొప్ప మార్పు కలిగినది. రాజునాయకుల యన్యాయవ్యవహారముల నెదు చేయుదాటి పోనీయ కూడ దని జమీందారులు గ్రహించుటయే ఆ మార్పునకు మొదలు. కాని అంతఃపురమున రహస్యముగా జరుగుచున్న ఆ వ్యవహారములు, వారిచేతులకు వచ్చు టెట్లు పొసగును? రాజోద్యోగు లందఱిని తమవశమున నుంచుకొనిన గాని ఆ ధనవ్యవహారములు వశముకావు. మూడవ ఎడ్వర్డు కాలమున జమీందారు లా పని సాధింప బూనిరి.



## పండ్రెండవ ప్రకరణము



## నూఱు సంవత్సరముల యుద్ధకాలము

### ప్రథమ భాగము

### తొలి గెలుపు

1338-వ సంవత్సరము మొదలు 1453-వ సంవత్సరము వఱకు, ఇంగ్లాండు ఫ్రాన్సుతో మాటి మాటికి యుద్ధములు సేయుచుండెను. ఎడ నెడ కొన్ని యేండ్లు, యుద్ధములు లేకున్నను, ఆ నూఱు సంవత్సరముల కాలము వైరముద్రాంకితమే యగుట, దానిని నూఱు సంవత్సరముల యుద్ధకాల మనవలసి వచ్చినది.

ఇంగ్లీషురాజులకు, స్వదేశమునెడ ఉపేక్షయు, పరదేశముల యెడ అపేక్షయు ప్రబలినది. రాజులే కాక, ప్రజలును అట్టి వారే యైరి. అందుచే వారును వీరును గూడ నింద్యులే. పదునాలవ శతాబ్దిని ఉన్న ఒక ఫ్రెంచి చరిత్రకారుడు, అప్పటి

ఇంగ్లీషు వారిని గురించి వ్రాసిన వాక్యములు చూచితిమేని అది విదిత మగును:—"జయశాలియు యుద్ధప్రియుడును గాని రాజునెడ, ఇంగ్లీషు ప్రజలకు భక్తివిశ్వాసము లుండవు. తమకంటె, అధికులును సంపన్నులును నైన రాజులతో నిష్కారణవైరము పూని కయ్యమునకు దిగు రాజునెడ, ఆ ప్రజలకు విశేషభక్తియు ప్రీతియు నుండును." ఈ దుస్స్వభావము, కేవలము ప్రజలదో, రాజులదో, చెప్పలేము గాని, ఎవరిదేని కానిండు, దానివలన నూఱు సంవత్సరములు, నిష్కారణముగా ఇంగ్లీషు వారి అర్థ ప్రాణములు నాశమైనవి. ఈ యుద్ధములకు నెల్ల ముఖ్యకారణ మే మనగా, ఫ్రాన్సులో తాము పోగొట్టుకొన్న రాష్ట్రములు మరల సంపాదించుకొనవలె నని ఇంగ్లీషువారికి పుట్టిన ఆశయే. తుదకు అవి లభింపను లేదు. కీడులో మే లన్నట్లు, ఆ యుద్ధ ముల మూలమున పార్లమెంటు ప్రాభవము అధిక మైనది. తలపెట్టిన యుద్ధములు తుదివాక నడచుటకు రాజులకు నిరంతరము ధనములు కావలసి వచ్చెను. అవి యీయ దగినవారు పార్లమెంటువారు. వారు తడవ తడవకు రాజులవలన ఏవో కొన్ని క్రొత్త యధికారములు రాబట్టుకొనియే ధనము లీయ సాగిరి.

## యుద్ధకారణములు

ఆ మహాయుద్ధమునకు ముఖ్యముగా మూడే కారణము లున్నవి:—ఫ్రాన్సులో ఇంగ్లీషు వారికి గల భూము లన్నియు, క్రమక్రమముగా ఫ్రెంచిరాజులు లాగికొనిరి. గాస్కొనీలో కొంత భాగము దక్క, తక్కిన వన్నియు తొలగిపోయినవి. అవి మరల సంపాదించుకొనవలెనని, ఇంగ్లీషు రాజులు ఆశించుట, మొదటి హేతువు. రెండవది—రాజులకును జమీందారులకును

గూడ, క్రొత్త క్రొత్త భూము లాక్రమించు కొనవలె నని కుతూహలము మెండైనది. అందును సస్యసంపన్నములును, ఆరామశోభితములును నైన ఫ్రెంచిభూములు వారి చూపు లాకర్షించినవి. మూడవది—ఫ్రాన్సునకును, ఫ్లాండర్సునకును యుద్ధము పొసగు నట్లు తోచుట. ఇంగ్లీషువారి పెద్దవర్తక మంతయు ఫ్లాండర్సుతోనే యుండెను. ఆ దేశము ఫ్రెంచివారి వశ మగుచో నిక వీరి వర్తకమునకును తీరని నష్టము వాటిల్లును. కనుక ఫ్లాండర్సు ఫ్రెంచివారి యధీనము కాకుండ చూడవలసి వచ్చెను.

ఈ కారణములను పురస్కరించుకొని, మూడవ ఎడ్వర్డు యుద్ధసన్నద్ధు డయ్యెను. ఫ్లాండర్సు, తన పక్షముననే పోరాడు నని యతడు భావించెను. అది వట్టి భ్రమమైనది. ఫ్లాండర్సు రాజు, ఫ్రెంచిరాజునకు సామంతుడు. అతడు తన చక్రవర్తిని కాదని, పరుని పక్ష మవలంబించుట పొసగదు. ఈ రహస్యము గుర్తించి ఎడ్వర్డు తానే ఫ్రెంచిదేశమునకు రాజు ననెను. అది సత్యమే యగుచో, అతని పక్షమున పోరుటకు ఫ్లాండర్సు వారికి ఎట్టి యభ్యంతరమును ఉండదు. కాని యది సత్యము కాదు. ఎడ్వర్డు తన కా యధికారము కల దని చూపిన యుక్తియు బలవత్తరమైనది కాదు. ఫ్రెంచిరాజగు "నాల్గవ ఛార్లెసు" 1328-వ సంవత్సరములో మరణించెను. అతనికి పుత్రికాసంతానమే కాని, పుత్రసంతానము లేదు. స్త్రీలకు, రాజ్యపాలనదక్షత యుండ దని ఫ్రెంచివారు పట్టు పట్టుటచే, ఆ రాజకుమార్తెలలో నెవరికిని అది దక్కలేదు. పిమ్మట, "ఆరవ ఫిలిప్పు" రాజ్యమునకు వచ్చెను. అతడు నాల్గవఛార్లెసునకు

ష్టాతి. ఇక మూడవ ఎడ్వర్డు సంగతి యేమనగా, అతడు ఛార్లెసునకు దౌహిత్రుడు. అతని తల్లి "ఇసాబెల్లా" ఛార్లెసు కుమార్తెలలో నొకతె. ఈ బంధుత్వమును బట్టియే, అతడు నేనే ఫ్రెంచిరాజ ననుట. ఆడుదానికి రాజ్యార్హత లేకపోయినను తన యధికారమును ఇంకొకని కిచ్చు నర్హత యామెకు కలదని, ఎడ్వర్డు వాదము. ఈ వాదమున సారములేదు. అదియునుగాక సూక్ష్మధర్మము విచారించుచో నిజముగా ఆ రాజ్యము దక్కవలసిన యధికారి వేరొక డుండెను. అతడు "ఛార్లెసు ది బాడ్" (Charles the Bad) అను వాడు. అతడు, "పదియవ లూయి"కి మనుమడు, విశేషించి "నాల్గవ ఛార్లెసు"నకు అన్న. కనుక, ఎడ్వర్డు ఆ రాజ్యము తనదనుట కేవలము అధర్మము. అగుగాక, అది యతనికి యుద్ధమిషగా నక్కరకు వచ్చెను.

## యుద్ధములు, 1338—1360 సం॥

యుద్ధకాల మంతయు నాలుగు పాదములుగా విభజింప వచ్చును. అందు, మొదటి పాదమునను, మూడవ పాదమునను ఇంగ్లండే జయించెను. కాని రెంటను, నాల్గింటను జయము లేదు, మొదట దక్కిన సిరియు పోయినది. ఈ ప్రకరణమున తొలిగెల్పుల మాత్రము వివరింతుము.

మొదటి పెద్దయుద్ధము, సముద్రముమీద ఫ్లాండర్సు తీరమున కెదుర జరిగెను (1340). దానికి "స్లూయిసుయుద్ధ"మని పేరు (Battle of Sluys). అందు అక్కరకువచ్చిన ఓడలు, ఎడ్వర్డు సొంతములు కావు. అవి వర్తకులవి. వారు యుద్ధార్థము, రాజున కిచ్చిరి. ఆ యోడల పైతట్టున దారుగోపురములు నిల్పిరి. వాని



Painting from Froissart's Chronicle, showing a Tournament in the Fourteenth Century
(By kind permission of the Trustees of the British Museum)

నాశ్రయించి నిల్చి, భటులు శత్రువులపై బాణములు ప్రయోగించిరి. ఆ యుద్ధమున, ఇంగ్లీషువారికి పూర్ణవిజయము కల్గినది.

అంతలో, ఎడ్వర్డు "ఇంగ్లీషుసముద్రమునకు అంతకును, నేనే సర్వాధికారి" యనెను. తదధికారసూచకముగా తన పేరి నాణెములమీద, ఆయుధపాణియు కిరీటధారియునై ఒక యోడ మీద నిల్చి యున్నట్లుగా తన బొమ్మ ముద్రింపించెను. ఆ

సముద్రయుద్ధము తరువాత మఱి రెండు నేలమీఁద జరిగెను. అందొకటి 1346-వ సంవత్సరమున 'క్రెసీ'యుద్ధము (Battle of Crecy), మఱి యొకటి 1356-వ సంవత్సరమున 'పోయిటేర్సు' యుద్ధము (Battle of Poitiers) పోరిరి. రెండింటను ఇంగ్లీషువారే గెల్చిరి. వేల్సువారిని జూచి, ఇంగ్లీషు విలుకాండ్రు నేర్చుకొనిన 'దీర్ఘధనువు' ప్రయోగమే జయసంపాదక మయ్యెను. దీర్ఘధనుర్విముక్తము లైన బాణములు దృఢకవచములను గూడ భేదింప గలవు. ఆ విలుకాండ్రు కాల్బలమునకును అశ్వికబలమునకును ఇరువైపుల నిలిచి, ఫ్రెంచివారి గుఱ్ఱపుదళములపై శరపరంపర గురిసి చెదరగొట్టిరి. ఇంగ్లీషువారి సేనలో, దళములన్నియు పొందు గలిగి, పరస్పరసాహాయ్యకము లై పోరెను. ఫ్రెంచివారి సేనలో అట్టి పొందు లేదు. వారి అశ్వికదళమునకు పదాతివర్గముపై ఏవము గలదు. నాటి ఇంగ్లీషుజాతికిని ఫ్రెంచిజాతికిని గల భేదము ఈ విషయమునుబట్టి గ్రహింపనగును. ఫ్రాన్సులో, సామాన్యప్రజలకు గౌరవము లేదు. వారు పదాతివర్గమున నుండురు. ఇక సంపన్నులు అశ్వికవర్గము వారు. సంపన్నులైన తమతో కలిసి సామాన్యులు సమానగౌరవప్రతిపత్తులై పోరాడుట యన అశ్వికులకు దుస్సహమైన పని. ఇంగ్లీషు జాతిలో సంపన్నులతో పాటు సామాన్యులకు గూడ గౌరవము లభించినది. వారితో గలిసి, అశ్వికులైన సంపన్నులు యుద్ధములు చేయుటకు కొంకరు.

ఎడ్వర్డు సేనలో, జమీందారులును దీటౌయోధులును మాత్రమే కాక, వేల కొలది స్వతంత్రులైన సామాన్యులు గూడ కలరు. రెండవ హెన్రీ నాటి నుండియు, ఇంగ్లండులో ప్రతి స్వతంత్రపురుషుడును విధిగా ఆయుధాభ్యాసము చేయు

మనే యుండెను. అందుచే దేశ మన్నాడీలను గలసినంత మంది సైనికులు దొరకరు. మూడవ ఎడ్వర్డు, కొందఱు ఉద్యోగుల (కెప్టెనులు) నలు సేనలకు బంపి వారిలో సత్తములను ఏర్పఱచెను. మఱి కొంత కాలమునకు ఇంగ్లీషు రాజులు సేనల కూర్పునకొఱకు మఱల, క్రొత్త పద్ధతి యొకటి అవలంబించిరి. అది, ధారాళముగా జీతము లిచ్చి భటసంఘములను గొని వచ్చుట. ఆ సంఘములకు ఒకొక్క దానికి ఒకొక్క నాయకుడు నుండెను. వారు జీవికకై యెవరికి కావలసినప్పుడు వారి పక్షమున యుద్ధములకు బోదురు. యుద్ధకాలమున జీతములు లభించుటయే కాక, యుద్ధానంతరము వారికి దోపిడి సొత్తు గూడ చాల లభించును. రాజోద్యోగులు సమకూర్చు కొని తెచ్చు స్వతంత్రమానవసేనల వలనను, జీతములకై వచ్చు ఆ భటసంఘముల వలనను, రాజులకు జమీందారుల మీదను వారి సేనల మీదను ఆధారపడి యుండ వలసిన ఆవశ్యకము తీరినది. జమీందారులు, సాయము సేయకున్నను రాజులు చేయదలచిన యుద్ధములు ఆగవు. ఆ కారణమున జమీందారులును, దీక్షాయోధులును, క్రమ క్రమముగా, యుద్ధవిముఖులై, కృష్యాదిసాధువృత్తులకు జొచ్చిరి.

1360-వ సంవత్సరములో, ఇంగ్లీషు వారికిని, ఫ్రెంచి వారికిని "బ్రెటిని" (Bretigny) యొద్ద సంధి కుదిరినది. దాని వలన 'పోయిటీర్సు' యుద్ధమున శత్రువుల చెఱ దగిలిన ఫ్రెంచి రాజునకు విమోచనము కలిగినది. ఎడ్వర్డు, ఫ్రెంచిరాజ్యాధికారవాదము వదలుకొనెను. కాని, "ఎక్విటైను," "పోంథ్యూ," "కెలై" (Aquitaine, Ponthieu, and Calais) అను దేశభాగములు అతని పర మైనవి. ఆ భాగముల నతనిది స్వతంత్ర

పరిపాలనచేసెఁ గాని, స్కాచి రాజునకు అతఁడు సామంతుఁడు గాఁడు. ఇటు నిట్టులుండఁగా ఇంగ్లాండులో మఱి కొన్ని విశేషములు జరుగఁజొచ్చెను.

## మూఁడవ ఎడ్వర్డు: పార్లమెంటు

యుద్ధవ్యయమునకై కావలయు ధనము సంపాదించుటకు, ఎడ్వర్డు పెక్కు పాట్లు పడెను. వారు చేసిన ధనము లేకుండఁ, ప్రజ లెల్లరికిని, వారి వారి 'ఆస్తిని' బట్టి యొక క్రొత్త పన్ను విధించి వసూలు చేసెను. క్రొత్త పన్ను విధించు నప్పుడు, రాజు, పార్లమెంటువారి సమ్మతిఁ బొందవలెనను ప్రాథమికనియమము ఒకటి యున్నను, ఇప్పటికి అతఁ డా నియమమును పాటింపలేదు. మఱియు, బరోలను బలవంతపెట్టి కొంత ఎక్కువ సొమ్ము గైకొనెను. అంతతో చాలక, వర్తకులపై మిక్కుటమైన అనేక సుంకములు వేసెను. 'ఇది నియమ విరుద్ధమును, అక్రమమును' అని పార్లమెంటు వాదింపగా, వర్తకు లిష్టపడి యీయఁ గలిగిరేని, అది సక్రమమే యని యాతఁడు వాదించెను. ఆ సుంకములతోఁ గూడ తృప్తి పడక, ఒకొక్క యెడ, వర్తకుల ఉన్ని యంతయు అపహరించి వారి కంటినీరు తుడుచుటకు ఏదో కొంచెము వెలయిచ్చి పంపి, ఆ సరకును పరదేశములకు పంపి అమ్మించి బోలెడు లాభము తీసెను.

1341-వ సంవత్సరములో, పార్లమెంటు, ఒక ముఖ్యమైన కార్యము చేసెను. రాజు, ఉన్నిమీఁద ఎక్కువ సుంకము కావలె నని పార్లమెంటు నడిగెను. ముం దతఁడు, కొన్ని క్రొత్త చట్టములకు అంగీకరించిననే గాని, ఉన్నిమీఁద ఎక్కువ సుంకము



Painting from Froissarts' Chronicle, showing Ships and Armour of the Fourteenth Century
(By kind permission of the Trustees of the British Museum)

వలను పడదని యా సభవా రనిరి. రాజును దానికి ఒప్పుకొనెను. ఆ క్రొత్త చట్టము లేవనగా:—"రాజు నాయవ్యాయపు లెక్కలు సరిచూచుటకు, పార్లమెంటువారు, కొందఱి

నుద్యోగులను నియమింపవలెను" అను నది మొదటి చట్టము. రెండవది "రాజోద్యోగుల నియమించు పట్ల, పార్లిమెంటు వారు, రాజునకు సాయపడ దగును" అనునది. "ఆ యుద్యోగులు చేయు కార్యముల, మంచి చెడ్డలను పార్లిమెంటు వారు విచారింప దగుదురు. ఆ యుద్యోగులు, పార్లమెంటునకు గిట్టని పనులుచేసి, రాజాజ్ఞ చొప్పున చేసితి మనుటకు వీలులేదు" అనునది మూడవది. కార్యావసరమును బట్టి, వీని కన్నిటికిని ఎన్నియున్ను, అప్పటికి అంగీకరించినను, ఆ మఱుసటి యేడే వాని నన్నిటిని మార్చి వైచెను. అగుగాక. ఆ చట్టములవలన తేలినది యేమనగా, ఉద్యోగిజనులు తమ వశమున ఉండిననే తప్ప, రాజు తమ చెప్పిన మాట విన డని పార్లమెంటు వారు ఎట్టకేలకు గ్రహింప గల్గిరనియు, రా జడిగిన సొమ్ము నిరాకరించిననే తప్ప, అతని యుద్యోగుల మీద పార్లమెంటు వారికి అధికార మీయ డనియు.

ఈ దినములలోనే పార్లమెంటులో ఇంకొక మార్పు జరగినది. అదియు చాల ముఖ్యమైనదే. పూర్వము, యోధులును బరోల పెద్దలును "మహాసభ"కు వచ్చి నపుడు, కలిసి కూర్చుండెడి వారు కారు. పదపడి, పార్లమెంటులో మూడు వర్గము లేర్పడినవి. మొదటి వర్గమున జమీందారులును, యోధులును కలిసి యుండిరి; రెండవ వర్గమున చర్చివారుండిరి; మూడవ వర్గమున బరోల పెద్ద లుండిరి. ఏ వర్గమునకు ఆ వర్గమే వేరు వేరు గదులలో కూర్చుండెను. పిమ్మట "దృష్టాంతపు పార్లమెంటు" జరిగిన యేబది యేండ్లలో క్రమేణ ఒక మార్పు కలిగినది. యోధులకును బరోల ప్రతినిధులకును గూడ, రాజునకు చేసికొన వలసిన విన్నపము లుండును

గనుక, ఆ రెండు తెగల వారును కార్యసౌలభ్యము కొఱకు కలిసి కూర్చుండ దొడగిరి. కార్యానంతరము వారు మరల చీలిపోవుటయు గలదు. వారు స్థిరముగా ఒక వర్గముగా నెప్పుడు కలిసి కూర్చుండుట, ఈ 1341-వ సంవత్సరపు పార్లిమెంటులో ప్రతిష్ఠించెను. ఆ వర్గమే ఇటీవల "కామన్సుసభ" (House of Commons) యను పేర బరగెను. ఆ నాడు, ఆర్చిబిషప్పులును, బిషప్పులును, జమీందారులతో గూడి వేరొక వర్గ మైరి. ఆ వర్గమే "ప్రభుసభ" (House of Lords) నైనది. మతప్రచారకులలో తక్కువ పదవుల నున్నవారు పార్లిమెంటు సభకు వచ్చు నాచారము పోయినది. ఈ మార్పుల వలన కలిగిన ఫలిత మేమనగా, బరోల ప్రతినిధులకు ఎక్కువ అధికారము వచ్చుట. వారికి నైట్లుల అండయు గలదు. వారిద్దరును కలిసి కాలక్రమమున జమీందారుల కంటె బలవత్తరు లైరి. అనగా "ప్రభుసభ" కంటె "కామన్సుసభ" బలవత్తర మైన దనుట. కాని మఱి కొంత కాలమునకు గాని, యీ భావము రూఢము కాలేదు.

### కాళరాత్రి. (The Black Death. 1349—1350 సం॥)

నూఱుసంవత్సరముల యుద్ధకాలములో ప్రథమపాదమున, ఇంచుమించు యూరపు ఖండ మంతటను భయంకర మైన ప్లేగు రోగము విజృంభించినది. ఆ వ్యాధి కేవలము క్రొత్తది కాదు. అది యూరపున అప్పు డప్పుడు కలుగుచుండుట కలదు. కాని తత్పూర్వ మెప్పుడును అంత భయంకరముగా లేదు. ఆ వ్యాధి పట్టణములలో అతిశీఘ్రముగా ప్రాకెను. కుళ్లిన చెత్తచెదారము గల వీథులు గల పట్టణ

ముతే దానికి తగిన ఇరవు. పదునాల్గవ శతాబ్దిని, ఒకటి ఇంగ్లాండులో ప్లేగు ఇరువది తడవలు వచ్చినది. కాని దీని తీక్ష్ణత, వానిలో దేనికిని లేదు. ఇది తూర్పు ఆసియా ఖండమునుండి సంక్రమించి, యూరోపును ఆ ప్రక్కనుండి యీ ప్రక్కకు తుడిచిపెట్టెను. ఫ్రాన్సుదేశమునుండి "వేమౌత్తు" (Weymouth) కు వచ్చిన కొన్ని యోడల వలన, అది ఇంగ్లండులో 1348-వ సంవత్సరములో ప్రవేశించి, దేశ మంతయు కలయ ప్రాకెను. ఎవ్వరో తక్క, అది తగిలిన వాడు బ్రతుకుట యన్నది లేదు. ఆ దినములలో నున్న, ఒక ఇటాలి యను కవి, "బొకాషియో" (Boccacio) అను నతడు, దాని భీభత్సము నంతను ఇట్లు వర్ణించెను. "ఈ వ్యాధికి మందు లేదు సరిగదా, తగిలిన జాడ కనబడిన మూడు రోజులకంటె ఎక్కువ బ్రదుకరు. నిప్పుమంటు అంటుకొన్న చమురు, ఏ రీతిగా జ్వాలామయమై ఆ జ్వాలలు కలయ విజృంభించునో, యీ వ్యాధియు అట్లే రేగును. మరణించిన వారి సంఖ్యకు మితి లేదు. శవముల భూస్థాపితములు చేయుటకు, చర్చి పెరళ్లలో చోటు చాలదు. అందుచేత పెద్ద పెద్ద గోతులు త్రవ్వి, వందలు వందలుగా వచ్చు శవములను, పడవలలో బస్తాలను పేర్చునట్లుగా పేర్చి, ఒక వాటుపరుసు మన్ను పైన గప్పిరి. ఆవులు, ఎద్లు, గొఱ్ఱెలు, మేకలు, గుఱ్ఱములు, గాడిదలు, బాతులు, కోళ్లు మొదలగు జంతువు లన్నింటిని పొలములకు తరిమివేసిరి. పండిన చేలు కోయరైరి."

ఇంగ్లండులో ఎంతమంది, మరణించిరో లెక్క తేల్చి చెప్పుట చాల కష్టము. కొన్ని కొన్ని తావుల మాత్రము, ఎందఱు పోయియుందురో ఉజ్జాయింపున చెప్పవచ్చును. సాధా

రణముగ, కొన్ని తావుల, ఐదవ వంతు జనము నశించె నన వచ్చును. శుచిత్వము గల కొన్ని జాతులలో మూడవ వంతు జనము పోయి నట్లు ఊహించిరి. అసలు, 1347–వ సంవత్సరమున ఇంగ్లీషుజనము సంఖ్య సుమారు పదునైదు లక్ష లుండును.

## కాళరాత్రివలని ఆర్థికఫలితములు

పండ్రెండవ శతాబ్దిలో నుండిన ఖండ్రికల గూర్చి యీ వఱకే వర్ణించితిమి. పదుమూడవ శతాబ్ది పూర్వార్థమున గూడ అవి యట్లే యుండెను. కాని యప్పటి నుండియు వాని స్థితి కొంత మారెను. ఆ మార్పులును, దేశము నలు దెసల నొక్క సారియే కలిగెను. అయినను, అవి పశ్చిమోత్తర దక్షిణభాగముల కలిగినంత శీఘ్రముగా మధ్యభాగముల కలుగ లేదు. తొల్లి, భూస్వామి తన ఖండ్రికలో సొంతకమతము క్రింద, సారవంతము లైన చెక్క లుంచుకొను ననియు, అవి యును, పలుతావుల చెదరి యుండును గాని ఒక్క చోటున ఉండ వనియు జెప్పితిమి. చెక్కలు విడి విడిగా నుండుట, వ్యవసాయమునకు నిరుపయోగ మని గ్రహించి, భూస్వాములు పాలికాపులకు తమ చేలు ఇచ్చి, వారి చెక్కలు తమ పొలము లలో కలుపుకొన బూనుట, ఖండ్రికలలో గలిగిన మొదటి మార్పు. అదియును గాక, పాలికాపులు ఎల్లవేళల తమ పొలములలోనే పాటుపడిన, ఎక్కువ పంట పండించు కొన వచ్చును. దాని వలన, తిండికి పోను, కొంత డబ్బును మిగు లును. కనుక, వారిలో కొందఱు, భూస్వామికి పని చేసి

పెట్టుట కంటె, కట్టుబడి క్రింద కొంత సొమ్మిచ్చుట మంచి దని యెంచిరి. భూస్వాములును దానికి సమ్మతించిరి. విధిగా, సేవ చేయుట ఎప్పుడు తప్పెనో అప్పుడే వారు స్వతంత్రు లగుదురు. ఆ రీతిగా స్వతంత్రు లైన సేవకు లెందఱో కలరు. వారు తమ పొలములు, కష్టపడి పండించుకొనుటచే ఏటేట కొంత డబ్బు మిగుల్చుకొని క్రొత్త పొలములు గూడ కొన దొడగిరి.

ఈ విధముగా ఖండ్రికల లక్షణము మారినది. మఱియు కొన్ని ఖండ్రికలలో బొత్తిగా పొలమే లేని వారును ఉండిరి. వారిలో కొందఱు, కూలి చేసి జీవించిరి. మఱి కొందఱు, గొఱ్ఱెలు చేయుట, తోలు పనులు చేయుట, వడ్రంగము చేయుట లోనగు పనులు చేసికొని బ్రదికిరి. పాలికాపుల కంటె, కూలి వాండ్రే, శ్రద్ధగా పని చేయుదు రని తోచి, కొందఱు భూస్వాములు, "కొట్టారులు" మొదలగు వారివలన, డబ్బు పుచ్చుకొని, పని మానిపించిరి.

ఒకదాని వెంట నొకటిగా, 1348-వ సంవత్సరము నాటికి ఈ మార్పు లన్నియు జరిగెను. ఆ యేడు 'కాళరాత్రి' ప్రవేశించి బహు జనమును తుడిచిపెట్టెను. అందుచే ఇంచుమించు పొలము లన్నియు బీడుపెట్ట వలసిన గతి పట్టెను. ఈ సందు చూచికొని, కూలివాండ్రు, ఎక్కువ కూలి యడిగిరి. 'కొట్టారులు' లోనగు పాలికాపుల వదలుకొనుట నష్టహేతు వని గ్రహించి, భూస్వాములు పనికి బదులు డబ్బు పుచ్చుకొను

పస్థితి మానినైరి. దాని వలన సేవకులకు స్వాతంత్ర్యత లభించు నవకాశము పోయినది. ఇది యిట్టు లుండగా, కూలితో పాటు వస్తుధరలు పెరిగినవి. జనములకు ధనస్వాతంత్ర్య యధిక మగుట వలన దేశమున కీ విపత్స్థితి సంభవించిన దని గ్రహించి, కూలియు, ధరలును తగ్గించు నుద్దేశముతో పార్లమెంటువారు, 1351-వ సంవత్సరములో ఒక చట్టము చేసిరి. దానికి “కూలివాండ్ర చట్టము” అని పేరు. దానిం బట్టి కూలియు, వెలలును, 1347-వ సంవత్సరములో నుండిన దానికంటె ఇంచుకయు మించ కూడ దని నిషేధ మేర్పడెను. ఈ శాసనము వలన, ప్రజలలో అసంతుష్టి ప్రబలుట తక్క వేఱు ప్రయోజనము లేకపోయెను.

పార్లమెంటు శాసనము ప్రయోజనకారి కాకపోవుటచే భూస్వాములు, ఆ యిక్కట్టు తొలగుటకు మార్గాంతర మాలోచించిరి. వారికి తలకు మించిన పొలము లుండెను గావున, కావలసినవారికి, కొంత పొలము “కౌలు”న కీయ నెంచిరి. కేవలము పొల మిచ్చిన మాత్రమున ఎవరు గైకొందురని, పసులను నాగళ్లను గూడ ఎరువు ఇచ్చెద మనిరి. ఈ పద్ధతి లాభదాయక మని తోచి చాలమంది పొలము లేనివారు, వారి వలన కౌళ్లు పుచ్చుకొని, భూము లనుభవింప దొడగిరి. భూస్వాములకును, కూలివాండ్రబాధ తప్పినది, ఏటేట కౌలుదారుల వలన సొమ్మును వచ్చినది. ఈ ఏర్పాటు వలన అప్పటికి ఆ చిక్కు తప్పినదే కాని, కాళరాత్రి వలన గలిగిన దుష్ఫలితము 1381-వ సంవత్సరములో అనుభవించిరి. అదియే “జానపదుల తిరుగుబాటు.”




The occupations of the Months (14th Century)
(By kind permission of the Trustees of the Victoria and Albert Museum, London)

## ప్రజల మాసవర్తనములు

(పదునాలవ శతాబ్ది)

1. జనవరి—విందులు.
2. ఫిబ్రవరి—చలి క్రాగు సౌఖ్యము.
3. మార్చి—కొమ్మ చెలగుట.
4. ఏప్రిలు—మొక్క నాటుట.
5. మే—డేగ వేట.
6. జూను—గడ్డి చిమ్ముట.
7. జూలై—చేలు కోత.
8. ఆగస్టు—నుజిపిడి.
9. సెప్టెంబరు—ద్రాక్ష కోత.
10. అక్టోబరు—విత్తులు చల్లుట.
11. నవంబరు—కట్టెలు కొట్టుట.
12. డిసెంబరు—పంది వేట.

పండ్రెండవ శతాబ్దిలో, ఏర్పడిన వర్తకగణముల గూర్చి కొంత వివరించితిమి. ఆ దినములలో, చేతిపనులు సేయువారు, ఒకొొక్క పట్టణమున, ఒకొక్క పనికి ఇరువురు ముప్వురు కంటె నెక్కువ లేరు. బట్టలు నేయువారు, చెప్పులు కుట్టువారు, వర్ణరంగము చేయువారు, ఒకొక్క పట్టణమున, కడు కొలదిమంది యుండిరి. ఖండ్రికలలో పొలములు వదలుకొని, పట్టణములు చేరిన వారి సంఖ్య చాల యుండెను. వారు, జీవికకై, చేతి పనులు సేయబొడగిరి. అందువలన చేతి పనివాండ్ర సంఖ్యయు పెరిగినది. ఒకొక్క పనిని పెక్కుమంది ఆశ్రయించి జీవింప దొడగిరి. వా రందఱును, తమ తమ పనులనుబట్టి, వేర్వేర,

తొల్లిటికి వర్తకగణములు వలెనే గణము లేర్పఱిచికొనిరి. వారి గణములకును, కొన్ని నియమములును, మర్యాదలును ఉండెను. ఎవ్వాడైనను ఒక పనిలో దిగవలె నన్న, తత్సంబంధ గణనియమముల ననుసరించియే దిగవలెను గాని యథేచ్ఛగా చేయ రాదు:—ఒకడు, వడ్రంగము చేయ దలచుకొన్నచో, వాడు తొల్త, గణ సభికుడైన ఒక పెద్దవాని దగ్గర చేరి పని బాగుగ చేత నగు నంతవఱకు, పని నేర్చుకొన వలెను. ఆ దినములలో, వాడు తన గురువునింటనే యుండవలెను. అతడును వాని కేదో కొంచెము జీతము ఇచ్చు చుండును. పని బాగుగ తెలిసిన పిమ్మట, వాడు స్వతంత్రుడై, తన యిష్టము వచ్చిన వారికి పనులు సేయుచు ఏ రోజు డబ్బు ఆ రోజు గడించు కొను చుండును. తుదకు మంచి పనివా డని పేరెన్నిక గనిన నప్పుడు, వానిని గూడ గణమున చేర్చికొందురు. దీపపు వెలుగున చేసిన పనిలో పొరపాటులు రావచ్చును గనుక, ఎవ్వడును రాత్రి పూట పని ముట్టరాదు. అదియును గాక ఎల్లరును, పదిమంది జనము వచ్చి పోవు చోట ప్రకటముగానే పనులు చేయవలెను గాని, చాటు-మాటున చేయరాదు. ఇవి గణనియమములలో కొన్ని.

ఈ నియమము లిట్టు లుండ, ఆ గణములలో కొన్ని సదాచారములు గూడ గలవు. ఆపత్సమయముల గణసభికులు, అన్యోన్యసాహాయ్యము చేసికొందురు. వారిలో కొందఱు పట్టణ వాసుల వినోదార్థము బైబిలులోని కథలు నాటకములుగా జేసి యాడెడి వారు. మొదట, ఆ నాటకములను చర్చిపెరళ్లలో నాడ దొడగిరి. కొన్నాళ్లకు బండ్లమీద ఆడ దొడగిరి. నాటకమునకు విచిత్రరంగము లైన ఆ బండ్లు వీథులవెంట మెల

మెల్లగా లాగుదురు. మఱి కొన్ని నాళ్లకు, సత్రముల దొడ్లలో ఆడ దొడగిరి. ఇంకను కొన్ని నాళ్లకు, ప్రత్యేకము, నాటకశాలలు నిర్మించుకొని అందు ప్రదర్శించిరి. ఇంగ్లీషు నాటకము ఈ విధముగా బయలుదేరెను. సాధారణముగ, ప్రతిగణము వారును, తమ వృత్తికి సంబంధించిన కథనే ఆడుట ఇంకొక యాచారము.

వర్తకగణములును, చేతి పనివారి గణములును, మొదటి దినములలో చాల మంచిగానే వర్తించినవి. వాని వలన ప్రజలకును, వారికిని గూడ మే లయ్యెను. కాని నానాటికి వారికి ధనలోభము ఎక్కువై, మత్సరము పెచ్చుపెరిగి, పరపతి పోగొట్టుకొనిరి. గణసభికు లైననే తప్ప, ఏ పనియు చేయ రాదని నిరోధించుటయు, సభికుడు కాగోరు వాని వలన పెద్ద మొత్తము రుసుములు పుచ్చుకొనుటయు, వారి గౌరవము తగ్గిపోవుటకు హేతువులు. పదునైదవ శతాబ్ది ప్రజలకు, ఈ గణము లన్నచో చాల ఏవగింపు కలిగినది.

కొంత కాలమునకు, బరోలలో నుండు నుద్యోగులు, ప్రజల సౌకర్యార్థము, గణములకు బదులు తామే, వర్తకమును చేతిపనులను చేయింప దొడగిరి. అందువలన, గణముల పని మఱియు క్షీణించినది. పదునైదవ శతాబ్దికి పిమ్మట గణముల పేరు, అంతగా తలచిన వారే లేరు.



# పదమూడవ ప్రకరణము

## నూఱు సంవత్సరముల యుద్ధకాలము

## రెండవ భాగము

### మొదటి ఉలుము

1360-వ సంవత్సరములో జరిగిన బ్రెటిని సంధివలన, ఇంగ్లాండు దేశమునకు మంచి లాభములు కలిగినవి. ఆ సంధి షరతుల బట్టి తొల్లిటి నుండియు ఫ్లాండర్సులో జరుగు చుండిన ఉన్ని వ్యాపారము నిర్విరోధముగా సాగినది. అదియును గాక, ఇంగ్లీషువర్తకులు, గాస్కొనినుండి యథేష్టముగా ద్రాక్షారసము కొని తెప్పించుకొను నవకాశమును ఏర్పడినది. ఆ యుద్ధములలో ఫ్రెంచివారికి పరాజయములు కలిగినను ఆ యనుభవము వలన వారొక నీతి నేర్చుకొని, దానిని మఱవక అనుష్ఠించి ప్రసిద్ధమును గాంచగలిగిరి. 1360-వ సంవత్సరము మొదలు, 1415-వ సంవత్సరమువఱకు, ఫ్రెంచివారు గెలిచిన గెలుపులును, ఇంగ్లీషు వారికి కలిగిన నష్టములును, ఆ నీతిఫలితములే. ఎంత సమర్థులయ్యు తమ అశ్వికయోధులు, ఇంగ్లీషు విలుకాండ్రతో ముఖాముఖిని పోరజాల రనియు, అట్లు పోరుట అపజయహేతు వనియు ఫ్రెంచివారు గ్రహించిరి. ఇదియే వారికి గలిగిన అనుభవము. ఈ లోపము సవరించుకొనుటకు, వా రవలంబించిన నీతి యేమన, శత్రుసైన్యములమీద, ఉబ్బాటుగా పడి హత మొనరించుట; ఫిరంగులు దాకొల్పి, శత్రువుల కోటలు ముట్టడించుట. ఫిరంగులును, తుపాకులును, ప్రయోగించుటలో ఫ్రెంచివారు కడు నిపుణులు.

డూ గెస్క్లిను (Du Guesclin) అను నతడు, ఆ దినములలో వారి నాయకుడు. అతడు పన్నిన యుద్ధతంత్ర మంతయు, ఫలించినది. 1377-వ సంవత్సరములో, రెండవరిచర్డు ఇంగ్లీషు రాజగు నాటికి, ఫ్రాన్సులో, ఇంగ్లండుక్రింద ఏ కొంచెమో తప్ప పెక్కు భూములు లేవు. గాస్కొనిలో, బార్డో (Bordeaux) బయోనీ (Bayonne) అను, రెండు పట్టణములు మాత్రమే, ఇంగ్లీషు వారి వశమున నుండెను. తక్కిన వన్నియు ఫ్రెంచి వారు లాగికొనిరి. ఒకప్పుడు, మూడవఎడ్వర్డు కుమారుడైన "బ్లాకు ప్రిన్సు" (Black Prince) ఫ్రెంచిదేశమున పెక్కుచోట్లు కొల్లగొట్టి ధనము సంపాదించెను. కాని యిప్పు డాతడు లేడు; చనిపోయెను. ఇంగ్లండునకు ధనము తక్కువ యైనది. దానికితోడు పెక్కు అంతశ్ఛిద్రములు బయలుదేరెను. రాజులు దుర్దశలో నున్న అవకాశమును పురస్కరించుకొని, 1376-వ సంవత్సరములో పార్లమెంటువారు మఱి కొంత యధికారమును సంపాదించిరి. 1381-వ సంవత్సరములో "జానపదుల తిరుగుబాటు" వచ్చెను. మఱి కొన్ని నాళ్లకు, రెండవరిచర్డు దుష్పరిపాలన వలన పెక్కు కష్టములు తటస్థించెను.

## "మంచి పార్లమెంటు." 1376 సం॥

అప్పటికి మూడవఎడ్వర్డు మిక్కిలి ముదుసలియై నేడో, రేపో, అన్న స్థితిలో నుండుటచేత, రాజకార్యము లన్నియు అతని మూడవ కుమారుని వశమున నడచు చుండెను. అతని పేరు "జాను" (John of Gaunt). అభిషిక్తుడు కాకున్నను, జానే, నిజముగా రాజుగా వర్తించెను. 1376-వ సంవత్సరములో పార్లమెంటు కూడ కష్టదశలో నుండెను. "దేశమున

వసూలైన ధన మంతయు ప్రజాక్షేమమునకు కాక, దుర్వినియోగము చేయబడిన దని పార్లమెంటు వారు అనుమానించి, కామన్సుసభవారును, కొందరు ప్రభువులును గూడి ఆ విషయమును విచారించిరి. విచారింపగా, "లాటిమెరు ప్రభువును," "రిచార్డు లయన్సు" అను ఒక లండను నగర వర్తకుడును రాజధన మంతయు దుర్వ్యయము చేసి రనియు, వారు గలిపిన దుష్టబుద్ధుల వలననే, రాజు కూడ, పార్లమెంటువారి సమ్మతిని పొందకయే, అనేకపు పన్నులు వసూలు చేసె ననియు, ఆ ధననాశమునకు నంతకును ఆ యిద్దరే మూలకారకులు అనియు తేలినది. కాన వా రిద్దర మీదను కేసు పెట్టి విచారించి శిక్షించ వలె నని, "కామన్సుసభ" వారు నిశ్చయించిరి. పూర్వకాలమున "మహాసభ" లో రాజ్యవ్యవహారనిర్ణయములే కాక, అపరాధవిచారణలును జరుగు నాచారము కలదు. ఆ యాచారప్రకారము, "ప్రభుసభ" వారు నేడీ యిద్దర నేరమును విచారింప దగు నని యూహించిరి. "కామన్సుసభ" వారు వాదులు గాను, "ప్రభుసభ" వారు ధర్మాధికారులు గాను నుండ దగు ననియు నిశ్చయించి విచారణ చేసిరి. ఇట్టి విచారణకు "నిందారోపణము" అని పేరు. ఇటీవలి దేశచరిత్రమున, ఈ "నిందారోపణ" పద్ధతి పెక్కు సార్లు ప్రయోగింపబడినది. రాజమంత్రులు యథేచ్ఛగా ప్రవర్తింపక పార్లమెంటువారికి విధేయులై యుండు నట్లు చేయుటకు ఈ పద్ధతిని మించిన అనుకూల సాధన మింకొకటి లేదు. రాజులకు దుర్బుద్ధులు గలిగినను, సదుపదేశములు చేసి దుష్కార్యములు వారింప కున్నను, మంత్రులే శిక్షకు పాత్రులు కావలసినదే. రాజు, శాసనాతీతు డగుటయు, రాజకార్యములకు మంత్రులే

బాధ్యులగుటయు రాజులకు బదులు, మంత్రుల శిక్షించుట ఈ నిందారోపణపద్ధతి లోని తత్త్వము. దీని వలన మంత్రులు ఉదాసీనస్తును లగుటకు వీలు లేదు. దురాలోచనలు సేయ లేరు. విధ్యుక్తధర్మనిర్వహణమున అప్రమత్తులై యుండ జాలుదురు. ప్రస్తుతము, "లాటిమరు"ను "లాయొన్సు"ను (Latimer and Lyons) శిక్షార్హులని ప్రభుసభ వారు తీర్పు చెప్పి, వారి ఆస్తి యంతయు లాగి, ఖైదుల జేసిరి. ఆ సంవత్సరము, "మంచి పార్లమెంటు" నడపిన వ్యవహారములలో ఇది కడు ముఖ్యమైనది. ఏమన, రాజమంత్రులపై నిందారోపణ చేసి పార్లమెంటువారే విచారించి శిక్షించు ఆచారము ఆ నాడే పుట్టినది.

ఇది యిటు లుండ, రాజు పార్లమెంటును వంచింప కుండు నట్లును, అతడు సరిగా పరిపాలించు నట్లు చేయుటకును, పంత్రెండుగురు ప్రభువులు గల యొక సభ యేర్పాటయ్యెను. ఇది అతిప్రాచీనాచారము. ప్రస్తుతావసరమును బట్టి ఆ ప్రాత దారినే త్రొక్కవలసి వచ్చెను. "మంచి పార్లమెంటు" చేసిన కార్యములలో ఇదియు ముఖ్యమైనదియే. మొత్తము మీద ఆ తడవ పార్లమెంటుసభ తొమ్మిదివారములు నడచెను. తత్పూర్వము ఏ పార్లమెంటుసభయు ఒక్కసారి అంతదీర్ఘకాలము నడవలేదు.

ఆ మఱుసటి యేడు (1377) జాను (John of Gaunt) ఇంకొక పార్లమెంటు సభ సమావేశ పఱిచెను. ఆ సభలో అతని యిష్టులు మాత్రమే సభికులుగా నుండిరి. వారు, రాజేమి చేయవలె నన్న అది చేయుటకు సంశయింపరు. ఆ సభ "మంచి పార్లమెంటు" చేసిన నిర్ణయము లన్నియు రద్దుచేసెను.

ఆ రీతిగా, "మంచి పార్లమెంటు" తలచిన తలంపులును, చేసిన పనులును వ్యర్థమైనవి. అయ్యును, వాని మేలు ప్రజలు మఱవలేదు. రాజు ప్రజానురక్తి కొఱకు గల్గు పార్లమెంటు ఏమి చేయవలెనో, ఆ రహస్యమును "మంచి పార్లమెంటు" ఉపదేశించెను. రాజసమీపస్థుఁడగు మంత్రిగాని, ఇంకొక యుద్యోగి కాని, రాజు చేయు మంచిచెడ్డలకు ఉత్తరవాది కావలె ననియు, రాజుచే చెడ్డపనులు చేయించినను తానే చేసినను, ఆ మంత్రిని పార్లమెంటువారు విచారించి శిక్షింప వలె ననియు, అన్యాయమునకే శిక్ష, రాజ్యాధికారములు ప్రజా వశమున నుండవలె ననియు, ఆ నాటి "మంచి పార్లమెంటు" వారి యుపదేశము.

## జానపదుల తిరుగుబాటు 1381 సం|| (The Peasants' Revolt.)

1377-వ సంవత్సరములో, మూడవ ఎడ్వర్డు మృతి నొందగా, అతని మనుమఁడు రిచర్డు రాజయ్యెను. ఇతఁడు, "బ్లాక్ ప్రిన్సు" కొడుకు; ఇంగ్లీషు రాజులలో ఇతనికి "రెండవ రిచర్డు" అని పేరు. రా జగు నప్పటికి ఇతనికి పండ్రెండేండ్ల ప్రాయము. అతడు యుక్తవయస్కుఁ డగు నంత వఱకు, రాజ్య భారము వహించుటకు, పార్లమెంటు, పదునలుగురు పెద్దలు గల ఒక సభను నియమించెను. "జాను ఆఫ్‌గాంటు" కూడ కొంత మాట సాయము చేయు చుండెడి వాఁడు.

రెండవరిచర్డు రా జైన నాలు గేండ్లకే, అతని కొక పెద్ద యెద్దడి చుట్టుకొనెను. (1381). సమయమునకు, సమర్థుఁడైన "జాను" కూడ దేశమున లేఁడు. అతడు వే రొక పని మీఁద ఇంగ్లాండు నుత్తరదిశ కేఁగి యుండెను. జానపదుల తిరుగు

బాలే ఆ యొద్దడి. ఆ యుపద్రవమునకు "జానపదుల తిరుగు బాటు" అను నది సరియైన పేరు కా జాలదు. ఏమన, తిరుగు బాటు చేసిన వారు ఒక్క జానపదులు మాత్రమే కాదు. ఆ గుంపులో నితరులు కూడ మఱి కొంద ఱుండిరి. అయినను దాని కా పేరు రూఢమై పోయినది.

దేశములో, నలు దెసల పెక్కుమంది జనులకు ప్రభుత్వమునెడ అసంతుష్టి ప్రబలినది. అందును "కెంటు" "ఎసెక్సు"ల లోని ప్రజల యసంతుష్టి కేవలము మితి మీఱి పోయినది. ఆ రెండు రాష్ట్రముల జనములును, గుమి గూడి బయలుదేరి తిన్నగా లండను నగరమునకు వచ్చిరి. తమ కష్టములకు, ప్రభుత్వమువారి వలన బలవంతముగా పరిహారములు పొందవలె నని వారి రాక. మొదట ప్రజల యసంతుష్టికి గల కారణములలో ముఖ్యమైనవి కొన్ని వివరింతుము.

మొదటి కారణము:—

ధరలును, కూలియు, 1347-వ సంవత్సరము నాటి కంటె మించి పోగూడ దని ప్రభుత్వము వారు ఒక దాని వెంట నొక టిగా పెక్కు శాసనములు సేయ జొచ్చిరి. అట్లయ్యు ధరలు పెచ్చుపెరిగి పోవుచునే యుండెను. దానిని ఏ శాసనమును ఆపలేక పోయెను. దేశము మొత్తము మీఁద చూచినచో "కాళరాత్రి"కి పూర్వము ఎంత సొమ్ముండెనో, నేడును అంతే యుండెను. కాని పంటలు పండించు వారును, వస్తువులు చేయు వారును, పెక్కు మంది గతించుటచేత, బజారులలో వస్తువుల విరివి తగ్గి పోయెను. దాని బట్టి తక్కువ వస్తువునకు ఎక్కువ డబ్బు ఈయ వలసి వచ్చెను. ఇది యిటు లుండ ప్రభుత్వమువారును, నాణెములలో వేయు వెండి ప్రమాణ

మును తగ్గించిరి. అందువలన నాణెముల విలువయు తగ్గినది. ఈ స్థితిలో వస్తుధరలు పెరుగుట అర్థశాస్త్రసమ్మతమే కాని తద్విరుద్ధము కాదు. ధరలు పెరుగ రాదని శాసనములు ఘోషించినను అవి పెరుగక మానవు. ఇక వారి శాసనము చెల్లుబడి యగుట కూలివిషయమున. ఎక్కువ కూలి యీయ రాదనుట పని చేయించుకొను వారికి లాభమే కనుక వారు మాత్రము యథా-తథముగా శాసనములు పాటింతురు. ధరలు పెరుగుటయు, కూలి తగ్గుటయు, నను ద్విముఖక్షోభము జరుగుటయే, పట్టణములను, పల్లెలను గల కూలివాండ్ర యసంతుష్టికి మొదటి హేతువు.

రెండవది:—

భూస్వాములు, కాళరాత్రి రాకకు పూర్వము, అస్వతంత్రులైన పాలికాపులవలన డబ్బు పుచ్చుకొని, వారిని స్వతంత్రుల జేసి విడుచుటయు, తదుపరి కాళరాత్రివలన బహుజననాశము కలుగగా పొలముపాటు పడు మనుష్యులు కఱవై, ఆ పద్ధతి మానివైచుటయు మున్నే వర్ణించితిమి. "మాలో కొందఱకు స్వతంత్రత గలుగుట యేమి? కొందఱకు కలుగక పోవుట యేమి?" అని కోపించి, "విల్లీనులు" మొదలగు అస్వతంత్రపు పాలికాపులు భూస్వాముల గద్దింప దొడగిరి.

మూడవది:—

"విల్లీనులు" మొదలగు పాలికాపులు, పెక్కుమంది, స్వతంత్రులై రన్న మాటయే కాని వా రింకను, ఖండ్రికల నియమములలో పెక్కింటికి లోపడి యుండ వలసియే యుండెను. భూస్వామికి గల మరలోనే పిండి విసరించుకొని తీరవలె ననుట

ఆ కట్టుబాట్లలో నొకటి. ఇం కొక చోటికి పోలేరు గదా యన్న బరవసము చేత, ఆ మరవాడు వారివలన ఎకుక్కువ డబ్బు పుచ్చుకొనుటయే కాక, సకాలమున పని కూడ చేసెడి వాడు కాడు. ఎంత యిబ్బంది పడుచున్నను, మరవాని దయవచ్చు నఱకు వేచి యుండ వలసినదే: అది యటు లుండ, భూస్వాములు గూడ, అనియతముగా, కట్టుబడి శిస్తు పెంపు చేయుచుండిరి. ఈ బాధలు పడలేక, ఆ పాలికాపులు తమకు స్వాతంత్ర్యత యనునది యథార్థముగ లభించి తీరవలె ననియు తామీయ వలసిన శిస్తు, నియతముగా నుండ వలె ననియు పట్టు పట్టిరి.

నాల్గవది:—

చర్చివారు, విధ్యుక్తము లైన, మతధర్మములు పరిపాలించుట లేదనియు ప్రజలవలన డబ్బు గైకొనుట తక్క, వారు చేయుచున్న గురుత్వము లే దనియు పెక్కురు అభిప్రాయపడిరి. చర్చివారి ధర్మలోపము, తిరుగుబాటునకు అంత ప్రధానమైన కారణము కాకపోయినను, అది, ఆ మహాగ్నికి ఇంకొక కట్టె దాకొల్పి నట్లయినది. "జాను వైక్లిఫు"ను గురించి వర్ణించునపుడు, ఆ కాలపు చర్చివారి చర్యలను గూర్చి వివరముగా దెల్పెదము.

అయిదవది:—

1380-వ సంవత్సరములో, ప్రభుత్వమువారు, ప్రజల మీద ఒక అనుచితపు పన్ను వేసిరి. దానికి "తలపన్ను" అని పేరు. దేశమున గల ప్రతిమనుజుడును తల కింత యని విధిగా కొంత పన్ను కట్టవలసి యుండును. తత్పూర్వము

1377-వ సంవత్సరములో నొకడు ఒక సారి "తలపన్ను" విధించిరి గాని, ఆ నాడు పేదవారి కంటె, భాగ్యవంతులమీద, చాల రెట్లు ఎక్కువ పడినది. కలిమి గల వారు లెక్కువ యిచ్చుటయు, లేని వారు తక్కువ ఇచ్చుటయు, సమంజసమే కనుక 1377-వ సంవత్సరములో కినిసిన వారు లేరు.

1380-వ సంవత్సరములో ప్రభుత్వము వారు అట్టిదే ఇంకొక తల పన్ను విధించిరి. ప్రతిప్రభువును, ఒకొక్క పౌను చెల్లించ వలెను. పేదవాడు ఒక షిల్లింగు చెల్లించ వలెను. ప్రభువులస్థితికి వారు తల కొక పౌను చెల్లింప దగినను, పేద వారి స్థితికి తల కొక షిల్లింగు చెల్లించుట దుష్కరము. అందుచే పేద లందఱును పన్ను చెల్లింప నిరాకరించిరి. పౌనుగు పడి యున్న యగ్నిని రగుల్కొల్పి నట్లు, "జాను బాలు" (John Ball) అను ఒక క్రీస్తు జనముల మఱియు ఉద్రిక్తుల జేసెను. ఆ క్రీస్తు కేవలము ఉన్మత్తుడు. "ప్రభువు లనియు, విప్లవు లనియు అను చిత్తభేద మున్నంత వఱకు, ఈ దేశమున స్థితి గతులు చక్క బడవు. ఈ యంతరము లంతరించ వలెను. మన తక్కువ యేమి? వారి యెక్కువ యేమి? 'మేము ప్రభువుల' మని చెప్పి కొనుటకు వారి కేమి యధికార మున్నది?" అని ఆ పిచ్చి జాను ప్రజలకు ప్రబోధింప జొచ్చెను. దానితో దావాగ్ని యంటు కొన్నట్టు అయినది. ఆబాలగోపాలము, ఒక పదము కట్టి పాడ దొడగిరి.

"ఆదాము దున్నాడు, అవ్వ వడికింది
ఆ నాడు గొప్ప వా డెవ్వ డున్నాడు?"

"కెంటు," "ఎసెక్సు," "ఈస్టు ఆంగ్లియా"ల లోని ప్రజలు గుంపులుగూడి తిన్నగా లండను నగరమునకు బయలు దేరిరి.

వారిలో కెంటువారు కడు బెట్టిదులు. వాట్ టైలరు (Wat Tyler) అను నతడు వారికి నియంత. దారిలో కంట బడిన "మేనరు" గృహములకు నిప్పు అంటించుచు, క్లీశరుల కుత్తుక లకు ఉరి పోసి త్రేలాడ దీయుచు, మఱియు పెక్కు దారుణ కర్మ లాచరించుచు వారు లండను నగరము చేరవచ్చిరి. "విల్లీనులకు స్వతంత్రత లేదనియు ముందు చేసికొన్న యొడంబడికల బట్టి వారు భూస్వామికి సేవ చేయ వలసిన వారే" యనియు కోర్టులలో ప్రభువుల పక్షమున వాదింతురు, గనుక క్లీశరుల ముప్పు మూడినది. వారి రాక గాంచి లండను నగరమునందలి కూలివాండ్రు స్వాగత మిచ్చి నట్లుగా పుర ద్వారములు తెఱచిరి. "కెంటు" గుంపు మిడుతల దండు వలె లోనికి ప్రవేశించి ముస్కందు, జాను ఆఫ్ గాంటు నివసించు భవనమును తగుల బెట్టెను; అట నుండి కదలి లండను గోపురమునకు బోయి అచట నున్న కోశాధికారిని, కాంటరుబరీ ఆర్చిబిషప్పును బట్టి వధించెను. వా రిద్ద్వరే తల పన్ను విధానమునకు దారి తీసిన వా రని ఆ జనుల యనుమానము. అదియు నిజమే.

పదునాల్గేండ్ల బాలు డయ్యు, రిచార్డు ఆ సమయమున ఎంతో ధైర్యముతో వర్తించెను. అతడు నగరము వెడలి వచ్చి ఎసెక్సు ప్రజలు వచ్చుచున్న దారి కెదురుగా పోయి "మైలు ఎండు" అను చోట వారిని కలిసికొని, శాంతముగ, ప్రసంగము లోనికి దింపెను. "ఎకరము నేలకు, ఏడాదికి నాల్గు పెన్నీలిచ్చుకొని, విల్లీనులు సేవాభారము తొలగుదురు. అందుకు మీ రంగీకరింప వలెను" అని వా రతనిని కోరిరి. "తప్పక మీ కోర్కె తీర్చ గల వాడ" నని మాట యిచ్చి రిచార్డు వారిని శాంతుల జేసి, "కెంటు" ప్రజలతో గూడ ప్రసంగించు నుద్దేశ

మున "స్మిత్ఫీల్డు" అను చోటి కేగెను. అతని రాక గాంచి 'కెంటు'వారికి నాయకుడైన "టైలరు" అతని కెదురు నడచి వచ్చెను. దురదృష్టవశమున, ఒక రాజభటునకును, ఆ టైలరునకును మాట మాట మీఁద కలహము తటస్థించినది. వారిద్దరు, కలహించుకొనుట చూచి, లండను నగరపు "మేయరు," "టైలరు రాజు శరీరమునకు హాని చేయ బోలు" నని శంకించి, అతనిని ఒక్క వ్రేటున రెండు తుంటెములు చేసెను. దానితో ఆ గుంపునకు కోపాగ్ని భగ్గు మని శిర మెత్తినది. రాజు ప్రాణములు దక్కుట దుర్ఘటముగా నుండెను. ఆ జను లందఱును, కత్తులు దూసి, తుపాకు లెత్తి, రాజ పరివారము మీఁదికి దూకిరి. ధైర్యశాలి యగు రిచార్డు ఆ దారుణ ముహూర్తమున, ముందునకు వచ్చి నిల్చి, గురువతనమున, వారితో మాట లాడ సాగెను. వా రేమేమో కోరిరి. తమ కష్టము లన్నియు వెళ్ల బోసికొనిరి. ఆ కోర్కె లన్నియు తీర్చెద నని యతఁడు మాట యిచ్చెను. వారును తృప్తి పడి మరలి యిండ్లకు బోయిరి. రిచార్డు చేసిన వాగ్దానములలో నొక్కటి నైనను చెల్లించ లేదు. ఉపాయశాలి యగు నతఁడు అప్పటికి ఆ యెద్దడి బాపుకొనుటకు పలికిన పలుకులే కాని అవి మనసార అనినవి కావు. ఐనను "విల్లైనులు" ఎట్లో తంటాలుపడి కొంతకు కొంత స్వాతంత్రత సంపాదించుకొనిరి. వారు భూస్వాములకు వారము వారము చేయవలసిన చాకిరి పోయి, కోతకారున మాత్రము సాయపడుట తప్పని సరి యైనది. స్వాతంత్రత పొందిన వానికి మేనరు లెక్కలలో వాని పొలమునకు సంబంధించిన వివరము లన్నిటికి ప్రతి వ్రాసి యిచ్చెడివారు. అందులో, వాని క్రింద ఎంత పొల మున్నదియు, వాఁడు భూస్వామికి ఎంత శిస్తు ఈయవల

సినదియు స్పష్టముగా వివరము తేలి యుండును. ఎన్నడేని తగువులు వచ్చినపుడు, తన హాల మని రుజువు చేసికొనుటకు ఆ స్రాతయే వానికి నాధారము. ఈ విధముగా, తిరుగుబాటు జరిగిన సంప్రదియేండ్లలో విల్లీను లెందఱో స్వతంత్రప్రాయు లైరి గాని, సమగ్ర స్వతంత్రులు కారైరి. వారికి రాజుకోర్టు లకు పోయెడి అధికారము లభింపనే లేదు. పిమ్మట చిర కాల మునకు, అనగా పదునేడవశతాబ్దికిగాని, వారికి పూర్ణస్వాతంత్ర్యము రాలేదు.

## రెండవ రిచార్డ్టు ముప్పరిపాలన

1377-వ సంవత్సరము మొదలు, 1389-వ సంవత్సరము వఱకు ఇంగ్లాండును పార్లమెంటు వారిచే నియమిత మైన సభయే పరిపాలించెను. ఈ పండ్రెండు సంవత్సరములలో, పది యేండ్లు అయి నప్పటి నుండియు, రిచార్డు, క్రమ క్రమముగా అధికార బలము నార్జించు కొన దొడగెను. తుదకు స్వశక్తి రూఢ మైన తోడనే, తానే రాజ్యభారము వహింప గలిగెను (1389). అతని పరిపాలనలో మొదటి యెనిమిది యేండ్ల కాలము చక్క-గానే నడచినది. అతడు పార్లమెంటు వారిని అనురంజింప జేసెను, వారును అతనిని కొనియాడిరి. ఉన్నట్లుండగా, 1397-వ సంవత్సరములో, అతని యాశయము లన్నియు దెలియవచ్చెను. పార్లమెంటు వారు, ఇంగ్లీషు రాజును శక్తిహీనుని జేసి అధికార మంతయు తామే నాచికొన్నారు గాన, తదధికారము తిరిగి రాజపదమునకు సంక్రమించు నట్లు చేయ వలెనని అతని ముఖ్య మనోరథము. ఈ భావము, అతనిలో గట్టిగా నాటుకొని అతడు దాని సాధింప నధిక యత్నములు సేయుట చేతనే, తుదకు సింహాసనభ్రష్టుడు కానలసి వచ్చినది.

అతడు పరిపాలన భారమును వహింపక పూర్వమే తన యభిప్రాయములను మెల మెల్లగా సూచింప సాగెను. 1387-వ సంవత్సరములో నాటింగుహాములో నతడొక కొలువు తీర్చి, దేశమున గల పలువుర ధర్మాధికారుల పిలిపించి వారిని కొన్ని ప్రశ్నలడిగెను. వారును అతని యుద్దేశమునకు అనుకూలములైన సమాధానములే చెప్పిరి. అందు మొదటిది, "రాజునకు తను కనుపెట్టి యుండుటకు, పార్లమెంటు వారికి, ఒక సభను నియమించు నధికార ముండునా?" యను ప్రశ్న. "ఉండదు" అని ధర్మాధికారుల తీర్పు. "రాజోద్యోగుల నియోగించు నవసరమున, పార్లమెంటు వారి జోక్యము ఉండవచ్చునా? ఆ యుద్యోగులపై, వారు "నిందారోపణ" సేయ వచ్చునా" అనునది రెండవ ప్రశ్న. "అందు పార్లమెంటువారి జోక్యము ఉండరా దనియు, వారికి నిందారోపణాధికారమును ధర్మవిరుద్ధమే" యనియు జడ్జీల సమాధానము. మూడవది, "పార్లమెంటు వారు, తమ్ము రాజడిగిన వ్యవహారములనే చర్చింపదగుదురా, ఇతరకార్యములను గూర్చి కూడ ప్రసంగింప దగుదురా?" అనునది. దానికి న్యాయమూర్తుల సమాధాన మేమన "ఇతర కార్యములనుగూర్చి పార్లమెంటువారు ప్రసంగింప రాదు" అనుట. ఈ తీర్పు లన్నియు రాజున కెంతో యనుకూలములుగా నున్నవి. ఆ ప్రకార మాతడు వర్తించుచో, మూడవ హెన్రీ కాలమున, పార్లమెంటు సంపాదించిన హక్కులన్నియు రిత్తపోయిన వన్న మాట.

ఇది యిట్లుండ, రిచార్డు పెక్కు మంది మిత్రులకు ప్రభుపదవు లొసంగి వారిని వశవర్తులను గావించుకొనెను. ఆ కారణమున వారును, అతని కనుకూలు రైరి. అదియును

గాక, లెక్కలు వ్రాయుట, ఉత్తరములు వ్రాయుట మొదలగు పను లన్నియు, అతడు సుశిక్షితు లైన, క్షత్రియులచే చేయించు కొన జొచ్చెను. వారు పార్లమెంటు నియోగించిన వారు కారు. ఈ చర్య లన్నియు పార్లమెంటు వారికి దుస్సహములై, వారిని నిర్దాక్షిణ్యచిత్తుల జేసి వైచెను. 1388-వ సంవత్స రము జరిగిన పార్లమెంటు సభకు "జాలిలేనిపార్లమెంటు" అని ప్రతీతి కలిగెను. ఆ సభవారు, రాజమిత్రులలో ముఖ్యు లైన అయిదుగురపై, "దేశద్రోహులు" అను నేరము మోపి, రాజున కా సంగతి విన్నవించి, ఆ యైదుగురకు ఘోర శిక్షల విధించిరి. వారిలో నిద్దరికి తలగొట్టిరి. తక్కిన వారిని చెఱలో నుంచిరి. నాటింగుహాములో రాజునకు అనుకూలు రైన జడ్జీల కందఱకు, ఆమరణప్రవాసశిక్ష విధించిరి.

ఆ మఱుసటియేడు, రిచార్డు, తానే రాజ్యభారము వహించెను. అతడు, నిత్యవ్యవహారమున జరుగ వలసిన వ్రాతకోతలు మొదలగు గుమస్తా పను లన్నియు, పైచరల యోధులచే చేయించుకొన సాగెను. అటు పిమ్మట ఎనిమి దేండ్లలో (1389—1397) ప్రజాహితకరము లైన కొన్ని మంచి శాసనములు కూడ చేయబడినవి. దేశమున అలజడి తగ్గుటయే కాక ఫ్రాన్సుతో సంధి కూడ నైనది (1396). ఆ మైత్రి కార ణముగా, రిచార్డు ఒక ఫ్రెంచి రాచ కన్నెను పెండ్లి యాడెను. ఆమె పేరు "ఇసాబెల్లా."

1397-వ సంవత్సరములో, రిచార్డు, పార్లమెంటుకు దుర్బ లత్వము వచ్చిన దనియు, అది తన మార్గమును నిరోధింప లే దనియు దురభిప్రాయపడి, అదియే అద నని, తన యధి కారమును శక్తిని పెంపొందించుకొన జూచెను. తన యిష్టుల

నెంపటునో అతడు పార్లమెంటు సభికుల జేయుటయే కాక, సభవారిని జడిపించుటకు, పెక్కు మంది ఆయుధపాణు లైన రాజసేవకుల దెచ్చి, సభాభవనమున బ్రవేశపెట్టెను. ఆ నాడు తన మిత్రులపై ద్రోహము మోపి నిర్బంధించిన ప్రభువులలో ముఖ్యు లైన వారిని బట్టుకొని యతడు తగిన శాస్తి చేసి కసి దీర్చుకొనెను. వారిలో నొకడు వధింపబడెను. ఇద్దరు కారాగారబద్ధు లైరి. మఱి యిద్దరు, "తామసుమాబ్రే" అను నాటింగుహాము ప్రభువును, "హెన్రీబాలింగుబ్రోకు" అను డెర్బీప్రభువును మాత్రము క్షమింపబడిరి. పార్లమెంటు వారిలో పెక్కురు అతనివారే కనుక, ఆ మఱునటి యేటి పార్లమెంటు సభలో (1398) రాజునకు అనుకూలము లైన పనులు జరిగెను. నాటింగుహాములో జడ్జీలు తీర్చిన తీర్పులు ఆ సభలో ఆమోదింపబడినవి. ఆ నాడే ఉన్ని వర్తకము మీద ఎక్కువ సుంకము రాబట్టుకొను నధికారము కూడ రాజున కీయబడెను. ఆ యధికారము రిచార్డు జీవితకాలములో మరల పోగూడ దను నిషేధమును జేయబడెను. అదియును గాక పంద్రెండుగురు ప్రభువులును ఆర్గురు యోధులును గల ఒక సభ యేర్పాటు చేసి, పార్లమెంటు పనులలో ముఖ్యమైనవి తత్సభాపరమున జరుగ వలె నను తీర్మానము గూడ ఒకటి చేసిరి. ఆ పదునెనమండ్రు సభికులు రాజమిత్రులే. కావున పార్లమెంటులో రాజుప్రభావము పూర్ణముగా నెరవేరి తీరును.

ఈ విధముగా రాజు కోర్కెలన్నియు తీరిన పిమ్మట, అతడు "తామసుమాబ్రే" అను ప్రభువును "నార్ఫోకుడ్యూకు" గాను, "హెన్రీబాలింగుబ్రోకు" అను నతని "హెరిఫోర్డు

డ్యూకు" గాను జేసి మన్నించెను. ఈ యిర్వురు డ్యూకులును అకారణముగ కలహింప, రాజు వారి వర్తన సహింపక, "హాఫ్రో" అను నతనికి జన్మాంత ప్రవాస శిక్షయు, రెండవ యతనికి ఆరేండ్ల ప్రవాస శిక్షయు విధించి పంపెను. ఇంతలో "జాను ఆఫ్‌గాంటు" మరణింప, అతని కొడుకు "హెన్రీ" అను నతడు "లాంకాస్టరుడ్యూకు" ఆయెను. కాని రిచార్డు, వాని పైతృకమైన భూసంపదను వాని కొసగక, తానే నాచికొని దేశమున గల పొలము లన్నియు తనవే యనియు, వాని విషయమున తన చిత్తానుసారము తాను వర్తింప వచ్చు ననియు వాదించి, మీదు మిక్కిలి, తన దేశమున తన మాటయే శాసన మనియు ఉద్ధతి చూపెను. హెన్రీ, అప్పటికి చేయునది లేక యూరకుండె, పిమ్మట రిచార్డు ఐర్లెండులో తటస్థించిన తిరుగుబాటును అణచుటకు అచటికి పోగా, ఆ యవకాశము చూచికొని యార్కుషైరులో వచ్చి దిగి, పైతృక మైన తన సొత్తు కొఱకు వచ్చితి నని ప్రకటనము చేసెను. జమీందారులు పెక్కురు, అతనికి చేయూత ఇచ్చిరి. దానితో హెన్రీ పక్షబలము మెండయ్యెను. వెంటనే ఒక పార్లమెంటు సభయు సమావేశమై, రాజును సింహాసనమును వీడి పొమ్మనిరి. అతడును నిస్సహాయుడై, విధిలేక కిరీటము అటడించి పోయెను. అతని పదభ్రంశమునకు కారణములైన యేలుబడిలోని లోపము లన్నియు ఆ సభలో వెల్లడించిరి. అవి లెక్కకు ముప్పది మూడు గలవు.

తదనంతరము హెన్రీ రాజాయెను. అతడీ చరిత్రమున నాల్గవ హెన్రీ యను పేర బరగును. రాజ్యభ్రంశనమే కాక రిచార్డునకు కారాగారవాసమును ఘటిల్లెను. ఈ పరివర్తనము

జరిగిన కొలది నాళ్లకే, పూర్వరాజమిత్రులు కొందఱు రిచా ర్డును మరల నెట్లయినను రాజును జేయ వలె నని హెన్రీమీద కుట్ర పన్ని నాగిరి. క్రొత్తరాజు, అది పసిపట్టి అప్రమత్తుడై ప్రవర్తించి తన స్థితిని పదిలపఱచు కొనెను. రిచార్డు కూడ చెఱలో మరణించెను. అతని శవమును లండను నగరము చేర్చిరి. అతని యకాలమరణమును పల్వురు అనుమానింప కారాగారోద్యోగులు ఈ విధముగా ప్రకటించిరి. "దుర్భర మైన మిత్ర నాశమును సహింప లేక, బ్రదుకు రోసి, యతడు ఆ నాడు మొదలు అన్నము, నీరు, ముట్టక కృశించి, తుదకు ప్రాణములు గోల్పోయెను" అని. కాని నిస్సందేహముగా హెన్రీయే రిచార్డును చంపించె నని చెప్పగలము. కొన్నా ళ్లకు ఆ రహస్యమును అందఱికి తెలియవచ్చెను.

## జాత్యైకభావము వెంపొందిన విధము

1360-వ సంవత్సరము మొదలుకొని, ఇంగ్లండు పెక్కు కష్టము లనుభవించెను. నిజముగా అది దుర్దశా కాలము. ఫ్రాన్సులో శత్రువులవలన పరాజయము, దేశములో ప్రజల కల్లోలము; బ్రతుకంతయు నంధకార మయము. కాని కీడులో మే లన్నట్లు ఆచీకటిలోనే ఒక వెలుగు కిరణముకూడ తోచి నది. ఏమన, ఇంగ్లీషు వారందఱు "మన మందఱము ఏకదేశీయు లము, ఏకజాతివారము" అనుకొను భావము ఆ కష్టదినముల లోనే పుట్టినది. తత్పూర్వము దేశమున అట్టి సంఘీభావము మందునకైనను లేదు. ఒకడు తన ప్రభువునెడ భక్తుడై యుండ వచ్చును, లేదా చర్చివారికి భక్తుడు కావచ్చును, లేదా రాజభక్తుడైన కావచ్చును. అంతే కాని ఇతరమానవునెడ

ఆదరము కలవా డగుట కల్ల. అంత యేల: ఒకపట్టణమువాడు ఇం కొక పట్టణము వానికి కేవలము పరు డనియే నాటి భావము. పదుమూడవ శతాబ్దిని గల ఒక ఇంగ్లీషుయోధు నకు, ఇం కొక ఫ్రెంచి యోధుడే ఆత్మీయు డగును గాని, ఇంగ్లీషు కాపు వాడు తన వాడు కాడు. ఈ స్థితిలో, "పార్థివ పద్ధతి" నాటి సైన్యవ్యవస్థ పోయి, దాని స్థానమున, ఆశ్వికులు పదాతులు లోనగు వివిధసేనావర్గములు వెలసినవి. ఆ భటు లందఱు జీతముల వారు; అది గాక విల్లినులకును స్వాతంత్ర్యత లభించినది; ప్రజలమీద చర్చివారి ప్రభావము సన్నగిల్లినది. ఇంట ఈ మార్పులు జరుగు చుండగ బయట, దేశపరాభవ కారణము లైన పెక్కు పరాజయములు తటస్థించు చుండెను. కష్టకాలమున గాని కలుపుగోలుతనము కుదురదు గనుక, దేశీ యులెల్లను, వారు వీరను భేద భావములు తెగ త్రెంచి, ఒండొ గుల భుజములు రాయ కూడిమాడి పో దొడంగిరి.

## ఇంగ్లీషు భాషః శాసనము

ఆ కాలముననే సంఘీభావముతోపాటు, దేశభాషాభి మతమును పెంపొంద సాగెను. నార్మనుల దండయాత్ర మొదలు శాసనములు గాని, పత్రములు గాని, గ్రంథములు గాని, లాటిను భాషలోనే వ్రాయు నాచార మైనది. అది యటు లుండ గొప్ప వారెల్లరు ఫ్రెంచిభాషను మాటలాడు చుండిరి. కోర్టులలో గూడ ఫ్రెంచిభాషయే నడచుచుండెను. ఇక దేశభాష యనునది ఊరు పేరు లేక ఏ మూలనో నామమా త్రావశిష్టమై యుండుటయు, పరభాషాప్రభావము నెగడు చుండుటయు చూచి ఆ దురాచారమును ఆపవలె నని

యొంచి, 1362-వ సంవత్సరములో పార్లమెంటు వారు ఒక చట్టము చేసిరి. ఏమన "ఈ దేశమున ఫ్రెంచి భాష చే కొలదిమందికో తక్క పలువురకును తెలియదు గనుక కోర్టులలో వాదప్రతివాద సాక్ష్యములు ఇంగ్లీషు భాషలోనే జరుగవలెను; వ్రాత మాత్రము లాటిను భాషలో నుండ వచ్చును" అని. దేశభాషను సంస్కరించు తలంపున, పల్లెపు ఉపాధ్యాయులు విద్యార్థులకు తద్భాషావ్యాకరణము బోధింప సాగిరి.

కాని, ఈ భాషకు సర్వసామాన్య మైన ఒక్క రూపము లేదు. ఏ ప్రాంతము వారు, ఆ ప్రాంతపు పదములు వాడుకొను చుండిరి. ఒక మండలములోని ఇంగ్లీషు, ఇంకొక మండలము వారికి ఇంచుమించు పరభాషాప్రాయముగానే ఉండెను. ఈ భిన్నరూపత్వము సంస్కారప్రయత్నమున, మొదట ప్రతిబంధకమే యయ్యె గాని, బుద్ధిశాలురు విచారించి దానిని తొలగించిరి. ప్రాఙ్మధ్యరాష్ట్రమున మాటలాడు భాష శుద్ధమైన దనియు, దానినే అందఱును అవలంబింప వలె ననియు నిర్ధారించిరి. నేటి సుప్రసిద్ధవిశ్వవిద్యాపీఠము లైన లండను ఆక్సుఫర్డు, కేంబ్రిడ్జి నగరములు ఆ ప్రాఙ్మధ్యరాష్ట్రములోనివే. "జాన్ వైక్లిఫ్" బైబిలు భాషాంతరీకరించుటకు, ఆ రాష్ట్రభాషనే వినియోగించెను. కాని దేశభాషాపదములకు శక్తి చాల దని తోచి నప్పుడు అతడు లాటిను పదములను ప్రయోగించెను. జెఫ్రిఛాసరు అను కవి ఆ భాషలోనే కవిత్వము వ్రాసెను. ఇతడు దానికి కొన్ని ఫ్రెంచిభాషాపదములు చేర్చెను.

ఛాసరు 1312-వ సంవత్సరములో జనించెను. అతని తండ్రి లండను నగరమున నొక బ్రాంది వర్తకుడు. ఛాసరు యుక్తవయస్కు డైనది మొదలు చిరకాలము రాజకుటుంబము

సకానన ~~బుయు చుంంజెను.~~ ముస్ముందు అత డొక గుమాస్తాగా చేరెను. పదపడి యుద్ధ భటుం డయ్యెను. అటుపిమ్మట శయ్యా గృహసేవ చేసెను. కొంతకాలము రాజకార్యముల మీాద దేశాటన మొనర్చెను; మఱి కొంత కాలము ఆయవ్యయపు లెక్కలు వ్రాసెను. ఈ విధముగా అతని జీవితకాల మంతయు రాజసేవకుడుగానే యుండెను. అందులోనే తీరుబడి వేళల చక్కని కవిత్వము వ్రాయుచుండెను. అతని రచన లన్నియు నూతనసంస్కారము పొందిన ఇంగ్లీషుభాషనే యాశ్రయించి యుండెను. ఆ భాషకు అతని వల్లనే రసవత్తయు, అర్థవత్తయు కలిగె నని చెప్పవచ్చును. అతని రచనలలో సుప్రసిద్ధ మైన గ్రంథము "కాంటరుబరీ యాత్రికులు" అను నది. ఆ రచన చాల విస్తీర్ణమై రసవంతమై చమత్కారశోభితమై యుండును. లండను నగరమునకు సమీాపమున గల "సౌత్తువార్కు" (Southwark) నుండి కొందఱు స్త్రీపురుషులు, గుఱ్ఱములెక్కి జట్టుగా, కాంటరుబరీకి, తామసుబెకెట్టు సమాధి దర్శనార్థము యాత్ర చేయ బోవుట అను నది ఆ గ్రంథమున వర్ణింపబడిన విష యము. ఆ దినములలో, డబ్బు గల వారెల్లరును, తమ జీవితకాలములో ఎప్పుడో ఒకప్పుడు బెకెట్టు సమాధి దర్శ నార్థము కాంటరుబరీ యాత్ర సల్పుట పుణ్యప్రద మని భావిం చెడి వారు. ఛాసరు కల్పించిన యాత్రికులలో పలు విధము లైన వారు కలరు. ఒకడు దీక్షాయోధుడు, ఒకడు వర్తకుడు, ఒకడు సన్యాసి, ఒకడు భిక్షువు, ఒకతె సన్యాసిని, ఒకడు మత బోధకుడు, ఒకడు భూస్వామి, ఒకడు కాపు; ఒకడు న్యాయ వాది, ఒకడు వంటవాడు, ఒకడు నావికుడు, ఒకడు వైద్యుడు, ఒకడు రాటమాడువాడు — వీరు అందలి పాత్రలు. ఈ యాత్రి,

కల వేషములు, భూషణములు, నగలు, నడతలు, వూహలు, సోయగములు, అన్నిటిని ఛాసరు అతి నిష్పక్షముగా చమత్కారముగా హాస్యజనకముగా వర్ణించెను. ఆ గ్రంథము చదివి అప్పటి దేశకాలపాత్రల స్థితిగతులు స్పష్టముగా భావింప వచ్చును. ప్రతి యాత్రికుడును, దారిలో ప్రస్తుపోకకు, రెండేసి కథలు చెప్పి తీర వలె నని ఆ జట్టు ఒక సమయము చేసికొనెను. అందలి కథలన్నియు ఛాసరు తానై చెప్పినవి కావు. అతడు చెప్పిన వాని లోనే ఆ కాలపు దేశస్థితిగతులు అద్దమునందు వలె కాన వచ్చును.

ఈ "కాంటరుబరీయాత్రికులు" అను గ్రంథము ఇంగ్లీషు భాషా ప్రపంచమున గల ఉత్తమగ్రంథములలో నొకటి. అందలి విషయమును తద్రచనయు గూడ నెంతో కుతూహలజనకము లుగా నుండును.

## ఇంగ్లండులోని చర్చి స్థితి

మతబోధకుడు కడు పేదవాడనియు, తన చర్చిక్రింద నుండు ప్రజలకు బోధసేయుటలో నతడు శక్తివంచన లేక పాటు పడు ననియు ఛాసరు వర్ణించెను. కాని సన్యాసియు, భిక్షువును మాత్రము, తమ శరీరసుఖములకు పాటు పడు వారే కాని మతోపదేశములు చేయువారు కారట. చర్చివారి అనుచిత కార్యములను, అజ్ఞానమును ఆక్షేపించుటకు ఛాసరు ప్రహాసన వాక్యములు వ్రాయుచుండును. ఆ వాక్యరచనార్థమున అలంకారముకొఱకు కల్పితమైన అతిశయోక్తి కొంత యుండుట నిజమే. అట్లయ్యు ఆ రచనలు సత్యదూరములు గావు. ఆ నాటి చర్చిస్థితి యంతయు ఆ గ్రంథమున రచింపబడి నట్టుగానే యుండెను. జానపదులకు మతబోధలుగఱపు గురువు

నకు "పార్సను" (Parson) అని పేరు. ఆ గురువులు కడు పేద వారు. కష్టపడి పనిచేయువారే కాని, ఏమిలాభము? జ్ఞాన శూన్యులు. వారిలో ఏ ఒకరిద్దఱికో తక్క తక్కిన వారికి లాటిను భాష అర్థము కాదు. అందువలన, వారు మతగ్రంథ ములనుండి ప్రజలకు చదివి వినిపించు వాక్యములకు వారికే అర్థము తెలియక చిలుకపలుకుల వలె నయ్యేనే కాని ప్రయో జకములు కానయ్యేను. చదువు రాకపోవుటకు తోడు, వారికి కొన్ని పిచ్చి నమ్మకములును గలవు. పంటచేలకు చీడపురుగు పట్టినప్పుడు, తాము చేల చుట్టును తిరిగి ఆ పురుగుల శపించి నశింప జేయగల మని వారి నమ్మకము. అంత కంటెను అజ్ఞా నులైన జానపదులును ఆ మాటలు నమ్మెడివారు.

ఇక చర్చిలో పెద్ద పదవు లనుభవించు బిషప్పులు మొద లగువారి సంగతి చూడ బోయిన నదియు నంతగనే యుండెను. వారును అపండితులే. దానికి తోడు వారికి సోమరితనము మెండు. వారిలో చాలమంది ఇటలీదేశీయులు. పోపునకు లంచము లిచ్చి, వారు ఇంగ్లండులోని బిషప్పు పద వుల సంపాదించిరి. బిషప్పు లైరన్న మాటయే కాని, వారు సాధారణముగ ఈ దేశమునకు వచ్చెడి వారు కారు. ఒక వేళ ఎప్పుడో వచ్చినను, చుట్టపు చూపు చూచి పోవుదురే కాని నిలవ ఉండెడి వారు కారు. ఇక వారు చేయవలసిన మత కార్యము లన్నియు వారి ప్రతినిధులు చేసెడివారు. ప్రతినిధి యనగా, ఏ మతస్థుడో కొంత డబ్బు పుచ్చుకొని, నౌకరి చేసెడి వాడన్న మాట. ఈ దురాచారమును మాన్పవలె నని పార్లమెంటు వారు **1351**-వ సంవత్సరములో "పోపుచే నియుక్తు లైన బిషప్పులు ఇంగ్లండునకు రా వలనుపడదు" అని ఒక

శాసనము చేసిరి. అదియు వ్యర్థమయ్యెను. పోపు ఆ శాసనమును మన్నింపనే లేదు. అదియును గాక ఒకొక్క బిషప్పునకు రెండు మూడు స్థానముల పదవు లుండుటయు కలదు. అందుచే వా రొకవేళ, సోమరితనము వుల్చి క్రమ విధి తాము చేయ దలంచినను అవకాశమును లేదు.

చర్చి వ్యవస్థ యింత నిరర్థకముగా నున్నను, ఇంగ్లీషు ప్రజలు, వారికి అమితమైన ధనము చెల్లించుచునే యుండిరి. ఆ దినములలో "పోపు" ఫ్రాన్సులో నివాస మేర్పఱచికొని యుండెను. అతనికిని ఫ్రెంచి రాజునకును మైత్రి కలదు. ఆ ఫ్రెంచి రాజు ఇంగ్లాండునకు విరోధి. ఇంగ్లీషు ప్రజలవలన తనకు చేరుచున్న ధనమున చాల భాగము "పోపు" ఫ్రెంచి రాజునకు ఇచ్చు చుండెను. కాన ఇంగ్లీషు ప్రజలు, తమకు గర్భశత్రు వైన ఫ్రెంచిరాజునకు, మతముపేర పోపుముఖమున ధనము సమర్పింపవలసిన వారైరి. జానపదుల తిరుగుబాటు నాడు, చర్చివారిపై వారికి కోపము పుట్టుటకు కారణ మిదియే. మతవ్యవహారసరణి బొత్తుగా అన్యాయముగా నుండె నని, ఇంగ్లీషు వారు లో లో నణుగుకొన జొచ్చిరే కాని, దాని చక్క దిద్దుట వారి వశమున లేదు. ఏమన, రోమను కాతలిక్కు మతమునకు సర్వాధికారి "పోపు." అతని వశమున పెక్కు దేశము లుండెను. ఇంగ్లాండు వానిలో నొకటి. కాతలిక్కు చర్చి వ్యవహారములలో ఇంగ్లాండు కూడ ఇతర దేశములతో పాటు నడచి తీరవలెనే కాని, పోపు నధికారమును ధిక్కరించి మతవ్యవస్థను సరిచేయ జాలదు. ఆ స్థితిలో "జానువైక్లిఫు" అను ఇంగ్లాండుదేశీయు డొకడు, నడుముకట్టి ముందునకు వచ్చి, చర్చి పద్ధతిని సంస్కరింప సాహసించెను. అతడు బద్ధ

కంకణుఁడై, తన జీవితకాల మంతయు, ఆ మహా కార్యమునకే వినియోగించెను.

జాన్ వైక్లిఫ్.

ఇతని జన్మస్థానము "యార్కు-షైరు." విద్యాబుద్ధులుఁ గడించి పెద్దవాఁడైన పిమ్మట, వైక్లిఫ్ఫు, ఆక్సుఫర్డులో గల "బెలియలుకాలేజిలో" (Balliol College) ఉపాధ్యాయుఁడుగా చేరెను. విద్యోపదేశమే ఉపాధ్యాయుని ధర్మ మగుట, అతఁడు ప్రజలకు గూడ మత విషయికము లైన ఉపదేశముల జేయ దొడఁగెను. చర్చివారు, తమ ధర్మములను యథావిధి నెరవేర్చుట లేదనియు, వారి వర్తనయు పాప కలుషిత మై యుండె ననియు, జ్ఞానోపదేశము చేయుట పవిత్రులకు జెల్లును గాని, పాపులకు అట్టి అర్హత లేదనియు, బాహిరముగా నతఁడు బోధించెను. అదియును గాక, స్వయము దుష్టుఁడైన వానికి ఇతరుల పాలించు నధికారమును లేదని యుపదేశించెను. ఈ యుపదేశము రాజ్యమునకు ప్రాణగొడ్డము వంటిది. ఏమన, సజ్జనుఁడు కాని రాజునకు ప్రజలు విధేయులు కాఁగూడ దని దాని వ్యంగ్యార్థము. మఱియు నతఁడు, మఠస్థులయు భిక్షువులయు వర్తనముకూడ అధర్మముగా నుండె నని ఖండించెను. వారును సోమరు లనియు, పాపుల వలన లంచములు పుచ్చుకొని పాపనివృత్తి యయ్యె నని వంచించుచుండి రనియు నతనివాదము. అది యటు లుండ బిషప్పు లను వారు రాజసేవకులే యైరి గాని భగవద్భక్తులుఁ గారైరనియు, చర్చిలో పెద్ద పదవుల నున్న వారు అధిక ధనవంతు లగుటచే మదాంధు లగుదురే కాని ధార్మికులు కా జాల రనియు, వారు ధర్మము లుపదేశింప జాల రనియు నతఁడు తీక్ష్ణముగా విమర్శించెను. కొంత కాలము "జాను ఆఫ్

గాంటు" అతనికి చేదోడు వాదోడుగా నుండెను. కాని వైక్లిఫు కొన్ని మతోపదేశవాక్యములగూడ నిరసించుటచే వారి కిద్దరకును మైత్రి చెడెను.

వార్ధకమున, వైక్లిఫు, "లట్టరువర్తు"లో (Lutterworth) ఒక క్రీస్తుగా నుండెను. అచటనే యతడు, బైబిలు గ్రంథమును ఇంగ్లీషు భాషలోనికి పరివర్తించెను. అది యతనికి చిరకాంక్షిత మైన విషయము. అది నెరవేరుట అతనికి జన్మసాఫల్య మైనట్లు లుండెను. చదువ నేర్చిన యెల్లవారును స్వభాషలో గల ఆ గ్రంథమును చూచికొని తమంత తామె మతధర్మము తెలిసికొనుటయే కాక, చర్చి వారు చేయు నుపదేశములు ప్రామాణికము లగునో కాదో కూడ గ్రహించు నవకాశము వైక్లిఫు వ్రాసిన "ఇంగ్లీషు బైబిలు" వలన ఏర్పడినది. గ్రంథకర్త ఉద్దేశించిన ప్రయోజనమును అదియే. ఇది సాగనిచ్చిన చో ప్రజోపద్రవము బయలుదేరు నని శంకించి, ప్రభుత్వము వారు ఆ బైబిలును నిషేధించి, యెవ్వరును దానిని చదువ కూడ దనిరి. ఇంగ్లీషు ప్రజలకు ఆ గ్రంథము చదివికొను నధికారము పదునాఱవశతాబ్ది వఱకు రానే లేదు. "వైక్లిఫు" గ్రంథమును వ్రాయుటతో మాత్రము తనిసి యూరకుండ లేదు. తన యుపదేశములను ప్రచారము సేయుటకు శిష్యవర్గమును నలు దెసలకు పంపెను. వారి బోధలు, ప్రజలకు బాగుగా నచ్చి మనస్సుల నెలకొన దొడగెను. ఉపద్రవహేతు వైన యీ ప్రచారమును అరికట్ట వలె నని, మతస్థులు బిషప్పులు లోనగు వారు పూనుకొనిరి. వారికి కేంబ్రిడ్జి ఆక్సుఫర్డు విద్యాపీఠముల వారును, రాజును గూడ సాయపడిరి. రెండవ రిచార్డు బైబిలు తక్క, వైక్లిఫు వ్రాసిన యితర గ్రంథము లన్నియు నాశము

చేయించి, అతని శిష్యవర్గములో కొందఱను కాల్చి చంపించెను. కొందఱను చెఱలలో నుంచెను. మిగిలిన వారు ప్రాణము లర చేత బెట్టుకొని తిరిగిరి. వైక్లిఫు శిష్యులకు "లొల్లార్డులు" (Lollards) అని పేరు. వారు కడు పేదవారు. పల్లెటూళ్ల క్రీస్తులుగా నుండెడి వారు. ఇంత యత్నించియు, వైక్లిఫు చర్చిని సంస్కరింప లేక పోయెను. ఫలమున కేమి? అతని యత్నము మాత్రము కొనియాడ దగినది. ఇంగ్లాండు కాతలిక్కు చర్చికి లోపడి యుండి నన్నాళ్లు, మతమున ఏ సంస్కారమును జరుగ జాల దని నచ్చ జూపిన వాడు వైక్లిఫు. ఆ మార్పు పదునాఱవ శతాబ్దిని కలిగినది. ఇంగ్లండు కాతలిక్కు మతబంధమును అప్పటికి గాని త్రెంచుకొన లేకపోయెను.



## పదునాల్గవ ప్రకరణము



### నూఱేండ్ల యుద్ధకాలము:
### మూడవ భాగము
### రెండవసారి గెలుపులు ఓటములు

నాల్గవ హెన్రీ (1399—1413), మూడవ ఎడ్వర్డు యొక్క మూడవ కుమారుని కుమారుడు. భుజబలార్జిత మగుట తక్క, ఇంగ్లీషు రాజ్యము నెడ హెన్రీకి వేఱే హక్కు లేదు. పార్లమెంటు వారికి అతడు అభిమతు డగుటయు ఇంకొక హక్కుగా చెప్పికొన నచ్చును. అట్లయ్యు, తొమ్మిది యేండ్లు (1399—1408) శత్రుతంత్రముల వలనను, విప్లవముల వలనను, అతని స్థితి అతి వైక్లిష్ట మయ్యెను. "మార్టిమెరు" వంశము వారును, "పెర్సీ" వంశము వారును (The Mortimer family and the

Percy family) పన్నిన తంత్రములే అతని సంకటస్థితికి కారణములు. మూడవ ఎడ్వర్డు రెండవ కుమారుడైన "లయోనెలు" (Lionel, Duke of Clarence) అను వానికి మార్టిమెరు వంశము వారు అత్తింటి వైపు వారు. "ఇంగ్లీషు సింహాసనమునకు హెన్రీకి కంటె మాకే ఎక్కువ హక్కు కలదు" అని వారి వాదము. ఇక "పెర్సీ" వంశజుడైన "హెన్రీ" (Henry Percy) అను నతడు, "లయోనెలు" యొక్క మనుమరాలైన "ఎలిజబెత్తు మార్టిమెరు" (Elizabeth Mortimer) అను నామెకు పెనిమిటి. ఇవి వారి బాంధవములు.

రెండవ రిచర్డు యొక్క హత్య జరిగిన తోడనే, మార్టిమెరు వంశము హెన్రీమీద కుట్ర సేయ సాగెను. వారి భూములు వేల్సు సరిహద్దులలో నున్నవి. వారి కచట పలుకుబడి గలదు. కావున తిరుగుబాటు వేల్సురాష్ట్రముననే లేచెను. ఆ తిరుగుబాటును నడిపించిన వారిలో "ఓవెన్ గ్లెండోవరు" (Owen Glendower) అను ఒక వేల్సు దేశీయుడు ముఖ్యుడు. అతనికి చాల బలము లున్నవి. దానిబట్టి పలుకుబడియు నున్నది. వేల్సు దేశమున, ఆ కొండల సందున ఇంగ్లీషు సైన్యములు ఎందుకును కొఱగావు. కావున హెన్రి ఆ తిరుగుబాటు నణచుటకును మార్టిమెరుల నోడించుటకును తానై పూనుకొనక చూచుచు నూరకుండెను. "హెన్రీపెర్సీ"కి ఆ వంక మార్టిమెరువారితో గూడ స్పర్థ గలదు గాన ఆ పనికి అతడు పూని, మార్టిమెరును ఓడించి బందిగా గొనెను. పదపడి ఆ రెండు వంశముల వారును రాజీపడి పొత్తు కలిపి కొనిరి. దానికి తగినట్లుగా ఇంగ్లీషురాజుకూడ పెర్సీవారితో విరోధించెను. ఆ విరోధమునకు కారణ మేమన, మార్టిమెరు వారి

కిని పెర్సీ వారికిని హోమిల్డన్‌గుట్ట యొద్ద జరిగిన యుద్ధములో (Homildon Hill, in Scotland, 1402) మార్టిమెరు పక్షము వారు పెక్కురు శత్రువులచే బందీకృతులైరి. వారిలో మార్టిమెరు అను ముఖ్యపురుషుడును ఉండెను. చేత జిక్కిన శత్రువును విడిచి పుచ్చుట నీతి గాకపోవుటచే, ఎంత డబ్బు ఇచ్చినను వారిని మాత్రము విడిచిపుచ్చ వల దని, నాల్గవ హెన్రీ పెర్సీకి కబు రంపెను. హెన్రీ మాటను పెర్సీ చెవిని బెట్ట లేదు. వారును వారును సంధి చేసికొనిరి. అంతట హెన్రీ వారి కిరువురకు సాధారణ శత్రు వయ్యెను. వారికి స్కాటులాండు వారుగూడ తోడు కలిసిరి. ఇందఱును గూడి మొదట చేయనెంచిన కార్యము, హెన్రిని సింహాసనమునుండి తొలగించుట. ఇక రాజ్యక్షేత్రలగూర్చి వారి వారి తగవులు పరిష్కరించుకొనుట అటుపిమ్మటి మాట. హెన్రీ తగిన బలములు కూర్చుకొని శత్రుసైన్యముల "ష్రూసుబరీ" (Shrewsbury 1403) యొద్ద మార్కొనెను. అట, ఉభయపక్షములును అతి ఘోరముగా పోరిరి. హేస్టింగ్సు యుద్ధము తరువాత నింత దారుణమైనది ఇంకొక యుద్ధము ఇంగ్లండులో జరగలేదు. అందు జయము హెన్రీకే లభించెను. శత్రులును శాంతించెను. కాని పెర్సీ కుటుంబము వారు అంతతో నూరకొనక మరల తంత్రములు పన్న సాగిరి. 1408-వ సంవత్సరమున "హెన్రీ పెర్సీ" (Henry Percy, Earl of North umberland) యూర్కుషైరులో ఇంకొక తిరుగుబాటు లేవ సెను. హెన్రీ దానిని గూడ నణచి, పెర్సీని "బ్రాహ్మాము మూరు" (Brahmam Moor) నొద్ద అంత మొందించెను. మార్టిమెరు వారికి గల రాజ్యార్హత తమకు అక్కరకు వచ్చు నని పెర్సీవారు

చాల ధనవతిరి, అందులకై పాటును బడిరి. కాని తుదకు వారి యత్నము విఫల మయ్యెను. నాల్గవ హెన్రీ స్థితి భద్ర మయ్యెను.

## నాల్గవ హెన్రీ: పార్లమెంటు

రాజ్యము నిష్కంటక మయ్యె నన్న మాట నిజమే కాని, రాజు స్థితి మాత్రము బలవత్తరము కాలేదు. అతడు పార్లమెంటునిష్టము మీద రాజ్యమునకు వచ్చిన వాడగుటచే, ఎప్పుడును పార్లమెంటు వారి దయాధర్మమునకు లోబడి యుండుట నిజమే కాని, స్వతంత్రుడు కాజాలక పోయెను. బలహీనుడైన రాజు కలుగుటచే పార్లమెంటు వారును వీలైనంత వఱకు రాజాధికారమును తగ్గింప బూనిరి. నిజముగా హెన్రీ పేదరాజు. రాజునకు గల వరుమానములలో నెల్ల ప్రజల "ఆస్తి"వలన వచ్చు నదియే అతి ముఖ్యమైనది. దాని వలన వచ్చు నంత సొమ్ము ఇంకొక దాని వలన రాదు. ఒకొకప్పుడు దానిని అమితముగా రాబట్టుకొను నాచారమును గలదు. కాని హెన్రీ కాలమున, పార్లమెంటు వారు దాని కొక మితి యేర్పఱిచి, ఇంతకు మించి వసూలు చేయ వీలు లే దనిరి. ఆ పన్నునకు "పంచదశాంశములు," "దశాంశములు" అని పేరిడిరి. ఆ మొత్తము 39,000 పౌనులకు మించ రాదనిరి. పైరుల వారు, తమ యాస్తిలో పదునైదవ వంతును, పట్టణముల వారు పదియవ వంతును చెల్లించ వలె నను నియతిని బట్టి దానికి, "పంచదశాంశములు" "దశాంశములు" అని పేరు బెట్టిరి. దీనికి తోడు, ఆ రోజులలోనే డబ్బు విలువయు తగ్గిపోయినది. ఫ్రెంచి యుద్ధమాదిగ సుంకములును తగ్గినవి. ఈ విధముగా రాబడి

తగ్గుటయు, వచ్చిన దానికి విలువ తగ్గుటయు, హెన్రీ ధన లోపమునకు కారణములు.

ఇది యిటు లుండ, హెన్రీ స్వతంత్రుడు కాకపోవుటకు ఇంకొక కారణము కూడ గలదు. అతని ప్రజలలో కొందఱు అతి బలవంతు లగుటయే, అతని దౌర్బల్యమునకు కారణము. జమీందారులతో వియ్య మందినచో వారు, రాజ భక్తి పరాయణు లగుదు రనియు, వారు నెఱపు భక్తి బాంధవముల మూలమున తనకును బంధు బల సంపన్నత చేకూరు ననియు నెంచి, మూడవ ఎడ్వర్డు తన కుమారులకు జమీందారుల పుత్రికల చేసికొనెను. దాని ఫలితము విపరీతముగా పరిణమించెను గాని అత డనుకొన్నట్లు జరుగ లేదు. ఏమన, వియ్యంకులు చనవు కతన రాజభక్తి పరాయణులు కాక పోగా, తమ దౌహిత్రులును, తత్సంతతియు, రాజులు కాగలరన్న చూపుచే, నుద్ధతులు గూడ నైరి. తదనుగుణముగా వారికి "ఉద్ధత ప్రభువులు" అన్న సార్థక నామ మేర్పడెను. ఈ యుద్ధత ప్రభువులే, చేతులార, రోజాయుద్ధములు (Wars of Roses) కొని తెచ్చి పెట్టిరి. జీతములు తినుచు వీరి చేతి క్రింద పెక్కురు యుద్ధ భటు లుందురు. వారు ఫ్రెంచి యుద్ధములలో బ్రదికి తిరిగి వచ్చిన వారు. అవసరమగుచో ఆ "యుద్ధత ప్రభువు లందఱును గూడి తమ తమ బలముల గూర్చికొని నడచి రేని వారి ముందు, రాజును రాజసైన్యములును తృణమునకు పనికి రావు. ఆ బంధువుల యునికి రాజునకు పక్కలో బల్లె మైనది. వారి బారి తలగ వలె నన్న, అతనికి పార్లమెంటు వారి అనుకూల్యము ఆవశ్యకము. ఇందుచే నతడు పార్లమెంటునకు మిక్కిలి పరాధీను డయ్యెను.

రాజు సంగతి యిట్లుండెను. ఇక పార్లమెంటు సంగతి చూడగా అదియు శక్తిహీనముగానే యుండెను. దానికి నింకను తానై స్వతంత్రించి దేశమును పాలించు బలము చాలదు; నేర్పును లేదు. మొదట, పార్లమెంటు వ్యవహారములు ఏ వెంట నడపవలెనో ఆ ఒరవడియే కుదురలేదు. ఆ వ్యవస్థ ఏర్పఱుచు కొనుటకే, పార్లమెంటు వారు యెప్పుడు మొదలు 1400-వ సంవత్సరము వఱకును శాసననిర్మాణానుష్ఠానముల తమకు పూర్ణాధికారము సంపాదించుకొన యత్నించుచునే యుండిరి. ఈ యధికారసంపాదనార్థము, వారు మొదట రాజమంత్రుల నొక్కిపట్టి, వశవర్తుల గావించుకొనిరి. కేవల పరాధీనులైన ఆ మంత్రులకు కాలుసేయాడక పనులును సాగలేదు. వారి పరాధీనత చూచి ప్రజలును వారి యెడ అవిధేయతయు ఉపేక్షయు జూప దొడగిరి. రాజును, తన్మంత్రులును, శక్తిహీనులగుట కనిపెట్టి "ఉద్ధత ప్రభువులు" చెలరేగి, తమ యిచ్చ వెంట వర్తింప గడగిరి. వారి యనుచిత వర్తనముల విచారించి శిక్షింపకుండ వారి చేతి క్రింది యుద్ధ భటులు కోర్టువారికి కత్తులు చూపు చుందురు. దేశము ఈ వక్రమార్గముల నడచు చుండ ఏమియు చేయలేక యూరకుండెను గనుకనే "పార్లమెంటు వారికి దేశమును పాలించు బలము చాలదు" అంటిమి.

దేశము నంతను పరిపాలింప దగిన పార్లమెంటునకు దక్షత ఇంకను లభింప కున్నను, ఆ దినములలోనే దానికి కొంత సమున్నతియు గలిగినది; భావి భాగ్యోదయ సూచనలును పొడకట్టినవి. ఒక దృష్టాంతము చూపెదము:—పార్లమెంటు చేసిన ఒక విన్నపమును రాజు అనుమతించె నేని అది కొన్నినాళ్లకు శాసనమగును. "ఆదియందు విజ్ఞాపన పత్రమున ఏ యక్షరము

లుండునో, శాసనమున గూడ అవియే యుండి తీరవలెను" అను సిద్ధాంతము ఆ దినములలోనే ఏర్పడినది. రాజుగారి న్యాయవాదులు అందేవేని మాటలు మార్చెద రేని, "తొల్లిటి విజ్ఞాపన పత్రమునకు ఇది విరుద్ధముగా నున్నది" అని పార్లమెంటు తగువు పెట్టవచ్చును. పూర్వము, పార్లిమెంటు వారికి అట్టి యధికారము లేదు. అదియును గాక 1407-వ సంవత్సరములో ధనవిషయికమైన వ్యవస్థయు ఒకటి చేసిరి. రాజునకు ఈయవలసిన సొమ్ము మొత్తమును, కామన్సుసభవారు సూచింప వలెననియు, ప్రభుసభవారు దానిని అంగీకరింప వలెననియు ఆ యేర్పాటు. ఆ విషయమున ప్రభుసభవారు తమ అంగీకారము చూప వలసిన వారే కాని, సూచించు నధికారము వారికి లేదు. ఈ యేర్పాటు వలన, పార్లమెంటులో కామన్సుసభయే ప్రభుసభ కంటె ముఖ్యమైన దని తేలినది. పిమ్మట ఆఱవహెన్రీ కాలమున పార్లిమెంటు వారికి మఱికొన్ని హక్కులు లభించినవి. అవి సభికుల ప్రత్యేక గౌరవాధికారములకును, ప్రజలు వారి నెన్నుకొనుటకును సంబంధించినవి.

## ఫ్రెంచివారితో మరల యుద్ధము

ఐదవ హెన్రీ కాలమున (1413—1422) ఫ్రాన్సుతో మరల యుద్ధము తటస్థించి, పార్లమెంటు నభివృద్ధిని గూర్చి విచారించు నవకాశము లేకుండ జేసెను. ఫ్రెంచి రాజగు, ఆఱవ ఛార్లెసు పిచ్చివాడు, రాజ్య మేల జాలడు. అందుచే, అతని బంధువులు "నేను రాజ్య మేలెద" నన, "నేను ఏలెద" నని యిర్వురు గొప్ప ప్రభువులు బయలు దేరి కలహింప సాగిరి. వారిని ఆశ్రయించి దేశమున రెండు పక్షము లేర్పడి పరస్పరము మచ్చ

రించుచు శత్రుత్వము సాధించుచుండెను. బర్గండీ డ్యూక్ ఒకడును, ఆర్లియన్సు డ్యూక్ ఒకడును ఆ ప్రత్యర్థులు (Duke of Burgandy, and Duke of Orleans). 1407–వ సంవత్సరమున, రెండవ యతనిని శత్రువులు చంపించిరి. ఆ ఘోర కార్యము వలన వైరము మఱింత దారుణమై దేశమును దహించుచుండెను. అంత, ఇంగ్లీషు వారు ఆర్లియన్సు వారి మీద ఎత్తిపోయి పోరాడు నెడల, వలసినంత సాయము చేయుదు మని బర్గండీ వారు హెన్రీకి కబురు పంపిరి. హెన్రీ, ఆ వ్యవహారములో కాలు పెట్టుటకు మొదటి కారణము అతనికి సహజమై యున్న యుద్ధప్రియత్వమును, జయాభిలాషయు. కలహకారణము ఏదో యొకటి యుండవలెను గనుక, హెన్రీ తమ పూర్వులు ఫ్రాన్సులో ఆర్జించి నట్టియు, రెండవ హెన్రీ గోల్పోయి నట్టియు, భూములన్నియు తిరిగి తనకు రావలె నని పట్టు పట్టెను. అంత పోక ఫ్రాన్సుదేశమునకు తానే రాజు ననెను.

దానితో రెండు దేశములకును యుద్ధము మొగిసెను. బర్గండీ వారు తమ వారి యెడ ద్రోహచింత చేసి, యుద్ధమునకు రాక తక్కిరి. అది ఇంగ్లీషు వారికి సాయము చేయుటయే. వెనుకటి యుద్ధములలో ఇంగ్లీషు వారితో ముఖాముఖిని పోరాడి దెబ్బ తిని నపుడు కలిగిన అనుభవము మఱచిపోయి, నేడు ఫ్రెంచి వారు, మరల ముఖాముఖిని పోరాడుటకే పాల్పడిరి. 1415–వ సంవత్సరములో "అగినికోర్టు" నొద్ద (Agin Court) బహు సంఖ్యాకు లైన ఫ్రెంచివారు, అల్పసంఖ్యాకు లైన ఇంగ్లీషు వారి వలన బరాజయము పొంది విరిసి చనిరి. ఆ యుద్ధమున ఫ్రెంచి వారి దెస ఎనిమిది వేల మంది శూరశిఖా

మణులు వీరశయన మలంకరించిరి. హెన్రీ జయోత్సాహ ముతో చని "కెలై" పట్టణమును స్వాధీనము చేసికొని, అట నుండి పారిసు పట్టణమునకు సేనల నడపించుకొని పోయెను.

1402-వ సంవత్సరములో హెన్రీ, ఆఱవఛార్లెసు పుత్రిక యైన "కాథెరిన్" కన్యను పెండ్లియాడెను. ఆ బాంధవమును బట్టి, ఫ్రెంచి రాజునకు అతడే వారసు డయ్యెను. అంతటితో ఫ్రాన్సులో ఇంగ్లీషు వారి ప్రాభవము ఆకాశము ముట్టెను. ఈ జయమునకు అంతకును కారణము, హెన్రీ స్వయము గొప్ప శూరశిఖామణి యగుట. కాని అతడు చిరకాలము జీవింపలేదు. సింహాసన మెక్కిన తొమ్మిదవ యేటనే మృతి చెందెను (1422).

## కడపటి పోటములు

ఆఱవ హెన్రీ, రాజగు నాటికి తొమ్మిది నెలల పసి వాడు. 1437-వ సంవత్సరము వఱకు పార్లమెంటు వారిచే నియుక్త మైన ఒక సభ రాజ్య మేలెను. ఆ సభికులలో, "జాను" (John, Duke of Bedford), "హంఫ్రి" (Humphrey, Duke of Gloucester), "జాను బ్యూఫర్టు" (John Beaufort, Duke of Somerset) అను ముప్పురును ముఖ్యులు. వీరిలో, మొదటి యిర్వురును నాల్గవ హెన్రీకి కుమారులు. మూడవ యాతడు, "జాను ఆఫ్ గాంటు"నకు మనుమడు. ఈ ముప్పురిలో గ్లాసెస్టరు డ్యూకును, సోమరుసెట్టు డ్యూకును, ఆ సభాధిపత్యము నకై తగువు లాడ దొడగిరి.

ఆ సమయమున మూడవ యతడు (Duke of Bedford), సేనలతో ఫ్రాన్సులో నుండెను. అచ్చటి యుద్ధములలో ఫ్రెంచి వారును స్కాటులాండు వారును ఏకమై, ఇంగ్లీషు

వారిని "బీగ్" యొద్ద ఓడించిరి (Battle of Beauge, 1421). పిమ్మట మఱి రెండు యుద్ధములలో ఇంగ్లీషు వారికే జయము లభించెను. ఆ యుద్ధములు 1423, 1424-వ సంవత్సరములలో "క్రెవంటు," "వెర్న్యూయిలు" అను ప్రదేశములయొద్ద జరిగెను. ఇంత వఱకును బర్గండీవారు ఇంగ్లీషు వారి యెడ మైత్రి గలిగియే యుండిరి. ఈ రెండు యుద్ధములు జరిగిన పిమ్మట వారికిని వీరికిని పొత్తు చెడెను. దానికి తగినట్లు, జోను ఆఫ్ ఆర్కు (Joan of Arc) అను ఒక విచిత్ర తరుణి, ఫ్రెంచి సేనల శౌర్యమును ఉత్తేజనము చేసి వారికి శాశ్వత విజయము చేకూర్చెను.

"జోను" ఒక పేద కాపువాని కూతురు. ఆమె జన్మస్థానము "డామ్‌రెమి" (Domremy) అను పల్లెటూరు. 1423, 1424-వ సంవత్సరములలో వరుసగా ఫ్రెంచి వారు ఓడిపోయి, తేజము గోల్పడి మినుకు మినుకు లాడుచున్న సమయములో ఆ కన్య, చిచ్చఱ పిడుగు పడినట్లుగా వచ్చి యుద్ధ భూమిలో దుమికెను. ఇంగ్లీషు వారిని ఫ్రాన్సుదేశమునుండి పాఱద్రోలు భారము, దేవతలు తనతలపై నిడిరనియు, ఆ రహస్యము వా రాలోకమున మాట లాడుకొను చుండ తన చెవిని బడె ననియు ఆమె ఉద్ఘోషించెను. ఆ మాట లెవ్వరును నమ్మక, పిచ్చిది కాబోలు నను కొనిరి. ప్రజలు తన్ను ఉపేక్షింప నేమాయె నని, ఆమె తిన్నగా రాజాస్థానమున కేగి, ఆ పలుకులే వచ్చె బల్కెను. రాజును, ఆ మాటలు గ్రహింపలేక పోయెను. అయ్యు మేలైన నగును, లేదా నష్టమేమి? అను కొని అత డా తరుణికి వీర పురుషోచిత పరికర మంతయు నిప్పించెను. అంత జోను, కవచఖడ్గాదుల ధరించి, గుఱ్ఱ మెక్కి ఆర్లియన్సునకు

దూ కెను. అప్పటికే, ఆ పట్టణమును ఇంగ్లీషు వారు ముట్టడించి యుండిరి. అది నేడో రేపో ఫ్రాన్సుదేశము శాశ్వత పరాధీన తలో బడిపోవు స్థితి. ఏమన, ఆర్లియన్సు ఇంగ్లీషు వారి యధీన మగుట, ఫ్రాన్సు దేశము కూలిపోవుట. ఆ నగరము దేశమునకు ఆయువు పట్టు వంటిది. ఫ్రెంచిసేనలు ఆస లుడిగి, కోట పడి నట్లే యెంచి, మ్రాన్పడి యుండెను. అట్టి బెట్టిదపు దశలో జోను, పొడసూపి, మోమున ఉత్సాహమును గర్వమును తాండవింప, సేనల బరవసముచేసి, మొనకట్టి యున్న శత్రు సేనల మీాద దుమికించెను. నిజమునకు, అది అతిసాహస యత్నము అగు గాక దానితో, చావో బ్రతుకో తేలును, ఫ్రెంచి సేనలకు నూతన చైతన్య మొదవి, ఆమె నడపినట్లు నడచెను. క్షణములో, శత్రుసేనలు విరిసి పోయెను. నగరము దక్కెను (1429). ఆ యేడే, "రీమ్సు" నగరమున ఏడవ ఛార్లెసు పట్టాభిషిక్తు డయ్యెను. ఆ మహోత్సవమును కన్ను లార గాంచుటకు జోను అచ్చోటి కేగెను.

ఆ మరుసటి యేడు బర్గండీవారు, ఆ యువతిని పట్టు కొని ఇంగ్లీషు వారికి అమ్మిరి. ఆమె మాంత్రికురా లనియు, భూత విద్య యెఱుగు ననియు, ఆమె పోత్తు ప్రాణులకు అనర్థ దాయ కము గాన విచారించి శిక్షింపవలె ననియు ఒక కోర్టు ఏర్పాటు చేసిరి. ఆమెను తుదముట్టించుట ఇంగ్లీషు వారికి అభిమతము. అయినను వారిలో ప్రముఖు లెవ్వరును ఆ విచారణ జోలికి పోలేదు. విచారణ కాలమున జోను, తనకు భూతవిద్య తెలి సిన మాట నిజమే యని యొప్పికొనెను. తుదకు ఆమెను నిలు వున కాల్చి చంపిరి. అగు గాక, ఆమె చేయ దలచిన పని చేసి చచ్చినది గాని వ్యర్థురాలై పోలేదు. 1429-వ సంవత్సరమునకు

పూర్వమువలె, ఇంగ్లీషు వారిని ఎదిరించి నిల్చుటయే ఫ్రెంచివారికి దుష్కరముగా నుండెను. ఇప్పుడు జోను నూరిపోసిన సంజీవని వలన వారి కెక్కడ లేని పౌరుషమును కలిగి, ఇంగ్లీషు వారిని తమ దేశమునుండి తరిమి వేయు వరకు నిద్రపోమని కృత నిశ్చయు లైరి.

ఇంగ్లీషు వారికిని, బర్గండీ వారికిని గల మైత్రి 1432-వ సంవత్సరములో పూర్తిగా చెడిపోయెను. బెడ్ఫర్డు డ్యూకు, యొక్క భార్య ఆనీ ఆఫ్ బర్గండీ (Anne of Burgandy) అను నామె చనిపోవ, అతడు "సెంటు పోలు కౌంటు" (Count of St. Pol) యొక్క చెల్లెలిని, వివాహమాడెను. అది బర్గండీ వారికి తిరస్కారముగా తోచెను. ఏమన, ఆ కౌంటు మొదట బర్గండీ వారి పక్షముండి, అంతలో ఆర్లియన్సు పక్షమునకు తిరిగి పోయెను. ఈ వైరాగ్నిని ఎట్లయినను ఆర్పుట మంచి దని తోచి ఫ్రెంచి వారు సంధి ప్రయత్నములు చేసిరి. ఇంగ్లీషు రాజు ఫ్రెంచి సింహాసనమును ఆసింపక యుండుచో, "నార్మండీ," "అక్విటైనని" అను రెంటిని అతనికి వదలి వైచెద మని కబురంపిరి. కాని ఇంగ్లీషు వారు ఆ షరతునకు ఒప్పుకొనమి, సంధి చెడెను. ఇంగ్లీషువారి వైఖరి ఫ్రెంచి వారికి బొత్తుగా నచ్చక, తమలో తమకు గల పోరుపులు చంపుకొని రెండు పక్షముల వారును (బర్గండీవారును, ఆర్లియన్సు వారును) కలిసిరి (1435). దురదృష్టవశమున ఆ యేడే బెడ్ఫర్డు డ్యూకు గూడ మరణించెను.

నాడు మొదలుకొని పదునెనిమిది యేండ్లలో (1435—1453) ఒక్క "కెలై" పట్టణము తక్క ఫ్రాన్సులో గల ఇంగ్లీషువారి భాగములు అన్నియు పోయినవి. 1451-వ సంవ

త్సరము మొదలు, ఇంగ్లండులో గూడ కష్టములు ప్రారంభ మైనవి. ఇంటను బయటను గూడ ఒత్తిడి పడలేక, ఇంగ్లీషు వారు ఫ్రెంచి వారితోడి యుద్ధముల విరమింప జేసిరి. ఈ రెండు దేశములకును చిరసంబంధ ముండెను. 1066–వ సంవత్సరములో ఇంగ్లాండునకు ఫ్రాన్సుతో సంబంధము కలిసెను. ఈ నాలుగునంవల యేండ్లలో అంతులేని యుద్ధముల వలన కలిగిన నష్టము తక్క ఇంగ్లాండునకు చేకుఱిన మేలు అవంత లేదు. 1453–వ సంవత్సరము ఇంగ్లీషువారికి, యూరపుఖండమున భూమి లార్జింప వలె నను కోర్కె పోయినది. అటు పిమ్మట చూపు మఱొక దెసకు మరలించి, క్రొత్త జగత్తున క్రొత్త రాజ్యములు జయింప సాగిరి. అవియే నేడు ఇంగ్లాండునకు నానా దిశల గల అధినివేశ రాజ్యములు.

## పార్లమెంటు

"రోజా యుద్ధములు" (Wars of the Roses) జరగక పూర్వము పార్లమెంటులో మఱికొన్ని మార్పులు కలిగెను. షైరులలో ఏడాదికి నలుబది పౌనుల ఆదాయమునకు తక్కువ రాని సొంత పొలము గల వారే కామన్సు సభకు ప్రతినిధుల నెన్నుకొన వలె నని యొక తీర్మానము చేసిరి. ఈ తీర్మానము వలన పొలము లేని పేదవారికి ప్రతినిధుల ఎన్నుకొను నాచారము పోయినది. పూర్వము ఆ యాచారము గలదు. కాని, అప్పటి ఎన్నికలు కేవలము నిస్సారములై పోయిన వని గ్రహించి యీ మార్పు గావించిరి. ఈ తీర్మానము 1832–వ సంవత్సరము వఱకును ఆచరణలో నుండెను.

ఆ రోజులలోనే, పార్లమెంటు సభికుల గౌరవాధిక్యములలో గూడ కొన్ని మార్పులు జరిగెను. రాజునకు సమర్పించు కొఱ సలసిన విజ్ఞాపన పత్రములను కామన్సు సభ వారు, స్వయము ప్రత్యక్షముగా సమర్పించు కొను గౌరవము కావలె ననిరి. పార్లమెంటు సభ జరుగు దినములలో తత్సభికులు మహాపరాధములు చేసినచే తక్క, సామాన్యపు నేరములకు శిక్షింప బడక గూడ దని యింకొక వరము కోరిరి. 1450-వ సంవత్సరమునకు పిమ్మట, ఈ కోర్కెలు చెల్లింప బడెను. మఱియు సభలో, ఏ విషయము నైనను చర్చింప వచ్చు ననియు, సభ వారి మాటలలో నెట్టి దోషము లున్నను, శిక్షార్హులు కారనియు, రాజు వారికి వాక్స్వాతంత్ర్య మీయ వలె ననియు పట్టుపట్టిరి. వారికి ఈ యధికారము ఆ నాడు లభింప లేదు. పార్లమెంటు వారి సంభాషణలలో వాచాదోషములు పట్టరా దను తీర్మానము ఎనిమిదవ హెన్రీ కాలమున ఆమోదింప బడెను. 1453-వ సంవత్సరమునకు తరువాత, పార్లమెంటు సభకు తొల్లిటి యధికారములు చాల పోయినవి. ఎనిమిదవ హెన్రీనాడు తిరిగి సంపాదించిరి.



## పదున్నైదవ ప్రకరణము



### రోజా యుద్ధములు

1455-వ సంవత్సరము మొదలు, 1485-వ సంవత్సరము వఱకు, ముప్పది యేండ్ల కాలము, ఇంగ్లీషు సింహాసనము కొఱకు, రెండు గొప్ప కుటుంబములవారు యుద్ధములు చేసిరి.

అందొకటి "యార్కు" కుటుంబము. రెండవది "లాంకాస్టరు" వంశము. వారిలో యార్కు వారికి తెల్లగులాబి పువ్వు లాంఛనము. లాంకాస్టరు వారికి ఎఱ్ఱ గులాబి పూవు. ఈ గుర్తుల బట్టియే ఆ యుద్ధములకు రోజాయుద్ధము లను పేరు వచ్చినది.

ఈ కలహములకు కారణము, రెండవ రిచార్డు కాలము ననే యంకురించినది. లాంకాస్టరు వంశ్యుడైన హెన్రీ, రిచార్డును పదభ్రష్టు జేసి, తాను సింహాసన మెక్కుటను గూర్చి చదివితిమి గదా? అతనికి ఆ యధికార మెట్లు వచ్చినది? రిచార్డు దుష్పరిపాలకు డగుట బట్టి, హెన్రీ పార్లమెంటు వారికి సమ్మతు డయ్యె గాని నిజముగా, అతని కీ రాజ్యము నెడ హక్కు లేదు. దుర్జను డగు గాక సజ్జను డగు గాక, సమర్థు డగు గాక అసమర్థు డగు గాక, రిచార్డే రాజ్యమునకు అధికారి గాని, హెన్రీ కాడు. ఇది యిటు లుండు గాక. ఇంకను పూర్వచరిత్రను విచారింతు మేని, ఈ యుద్ధ కారణము అప్పటి నుండి కూడ నున్నట్లు పొడకట్టును. మూడవ ఎడ్వర్డు, జమీందారులతో వియ్య మందుటయే దానికి బీజము. నాల్గవ హెన్రీ కాలమున జరిగిన తిరుగుబాటులకు ముఖ్యహేతువు, "మార్టిమెరు" వంశము వారు రాజ్యము నాసించుటయే గదా! ఆ మార్టిమెరు వంశము, మూడవ ఎడ్వర్డు యొక్క రెండవ కుమారుని సంతతి.

నాలవ హెన్రీ, పసివాడుగా నున్నయెడ, పాలనా భారమును ఒక సభ వహించుటయు, దాని యాధిపత్యమునకై "గ్లాస్టెస్టరు" "సోమరుసెట్టు" అను నిద్దరు ప్రముఖులు కలహించుటయు, పూర్వము వివరించితిమి. ఆ యిద్దరును, లాంకాస్టరు వంశ్యులు. రాజబాంధవముచే, ఉద్ధతులైన ప్రభు

వుల గూర్చియు వివరించితిమి. ఆ ప్రభువులు రాజును అణచి పెట్టి తమ ప్రాభవమును నెఱపు యత్నములకు, ఈ గ్లాస్టరును సోమరుసెట్టుల కలహము సూచన. తఱి వేచి యున్న యుద్ధతప్రభువులకును, ఆఱవ హెన్రీ కాలమున సందు దొరకినది. ఆ రాజు కడు సాధుపుంగవుడు. అతడు నిరుపద్రవ వేళల, సుఖపరిపాలన చేయదగిన వాడే కాని, కష్టకాలమున కఠినపరిపాలన చేయ జాలడు. దేశము సోపద్రవ మగు నెడ రాజు చండశాసనుడుగా నుండ వలెను. హెన్రీ ప్రకృతి యట్టిది గామి, ఉద్ధతప్రభువులు చెలరేగి, దేశమును అల్లకల్లోలములో ముంచి వైచిరి.

## సోమరుసెట్టు వారితో యార్కు వారి పోరాటము

**1450**-వ సంవత్సరములో, దేశమున నొక గొప్ప తిరుగుబాటు లేచెను. దాని నడపిన వానికి పెక్కు పేర్లు కలవు. అతనిని కొందఱు "జాక్ కేడ్" (Jack Cade) అనిరి. కొందఱు "జాన్ మార్టిమెరు" (John Mortimer) అనిరి. మఱి కొందఱు "జాను అమెండాలు" (John Amendall) అని పేర్కొనిరి. మున్ముందు, ఆ విప్లవాగ్ని కెంటులో రగిలి రగిలి మండి పిమ్మట దేశ మెల్లెడల కలయ బ్రాకెను. విప్లావకులు, ప్రభుత్వములో ముఖ్యముగా మూడు లోపములు చూపిరి. అవియే వారి తిరుగుబాటునకు కారణములట. షైరుల వారు పార్లమెంటుకు తమ ప్రతినిధుల నెన్నుకొను విషయమున, ప్రభుత్వము వారు, **1430**-వ సంవత్సరమున చేసిన మార్పు, మొదటి లోపము. రెండవ లోపము, రాజు దుర్జనుల దురుపదేశముల నాలకించి వారు చెప్పిన చొప్పున నడచుట. మూడవ లోపము, ఫ్రాన్సుతో

నిష్కారణ వైరము కొని తెచ్చికొని నెగ్గ లేక వోడి పోయి, ధనము గోలుపోయి, ఆ నష్టము పన్నుల పేరిట ప్రజల నెత్తిని వైచి రుద్దుట. ఈ లోపములు వెంటనే సవరింప వలె ననియు "కూలివాంఛ్ర చట్టము"ను రద్దు చేయ వలె ననియు విప్లావకుల పట్టుదల. ఈ లోపములు మైమయి సవ రింప దగినవి కావు గనుక, దానికి వారొక ప్రతిక్రియ చెప్పిరి:—ఏమన, ప్రస్తుతము ఐర్లాండు దేశమున నున్న "యార్కు డ్యూక్" అయిన "రిచార్డు"ను (Richard, Duke of York) ఇంగ్లాండునకు రప్పించి అతని మతము ననుసరించి రాజు వర్తింప వలె నని. ఈ రిచార్డు తండ్రి కేంబ్రిడ్జి డ్యూక్ (Richard, Duke of Cambridge), తల్లి "ఆనీ మార్టిమెరు" అను నామె (Anne Mortimer). ఆ కేంబ్రిడ్జి డ్యూక్ అగు రిచార్డు, యార్కు డ్యూక్ అయిన ఎడ్మండునకు కొడుకు. ఆ ఎడ్మండు, మూడవ ఎడ్వర్డు కొడుకులలో నాలవ వాడు. ఆఱవ హెన్రీకి పుత్ర సంతానము లేదు గావున, యార్కు డ్యూక్ రిచార్డే 1450-వ సంవత్సరము నాటికి రాజ్యమునకు వారసు.

విప్లావకులు, లండను నగరమున ప్రవేశించిరి గాని, వారిని అణచి వైచుటకు ఎంతో సేపు పట్టలేదు. ఐర్లాండు నుండి రిచార్డు (Duke of York) కూడ, ఎట్టకేలకు స్వదేశము చేరెను. తదనంతరము, 1453-వ సంవత్సరములో ఆఱవ హెన్రీకి ఒక మగ శిశువు కలిగెను. పుత్రజననానంతరము, అతనికి పిచ్చి యెత్తినది (1454). ఆ స్థితిలో, రిచార్డు రాజ ప్రతినిధిగాం రాజ్య భారము వహింప వలె నని పార్లమెంటు వారు నిర్ణయించిరి. అతడును సమ్మతించెను. అతనికి "సోమరు సెట్టు డ్యూక్" అయినట్టియు, లాంకాస్టరు వంశ్యుడైనట్టియు

"ఎడ్మండు" (Lancastrian Edmund, Duke of Somerset) బలవ ద్విరోధి. రిచార్డు రాజప్రతినిధి యగుట అతనికి బొత్తిగా గిట్టని పని. ఇంతలో, ఆ మఱుసటి యేడే, రాజునకు పిచ్చి కుదిరి బుద్ధి కుదుట బడెను. అతడు మరల రాజ్య భారము వహించి "ఎడ్మండు"ను దగ్గఱకు చేరదీసి అతని మతమున వర్తింప దొడగెను. అప్పట్లి, రిచార్డు పని పరిహాసపాత్రము కాగా అత డది సహింప లేక, తన గౌరవ ప్రాభవాదుల కాపాడుకొనుటకై కత్తి చేతబట్టి యుద్ధమునకు దిగెను. "సెంటు ఆల్బన్సు" వద్ద ఇరువాగును తారసిల్లిరి (1455). ఆ యుద్ధము నకు, "ఆల్బన్సు మొదటి యుద్ధము" అని పేరు. అందు రిచార్డే జయించెను. "ఎడ్మండు" హతు డయ్యెను. ఆఱవ హెన్రీ శత్రువులచే పట్టుపడి చెఱ దగిలెను. అంత, రిచార్డు పసిబాలు నకు రక్షకుడుగా ప్రతినిధిగా అయి, రాజ్య భారము తాల్చి, గొప్ప గొప్ప పదవు లన్నియు తన మిత్రవర్గమున కిచ్చి, యేలు బడి సాగించెను.

లాంకాస్టరు వంశమునకు, "మార్గరెట్ ఆఫ్ ఆంజౌ" (Margaret of Anjou) అను నామె గొప్ప యండ. ఆమె ఆఱవ హెన్రీ భార్య; శక్తిస్వరూపిణి. భర్త యెంత సాధువో, భార్య యంత యసాధువు. ఆమెకు "ఫ్రెంచి దేశపు ఆడు తోడేలు" అను సార్థకనామము గలదు. స్త్రీస్వభావవిరుద్ధములగు మనో ధైర్యము, శౌర్యము, తంత్రము, నిర్దయ, మొదలగు గుణము లన్నియు ఆమె పాలిటి సొమ్ములు, హెన్రీ, ఆమె చేతుల కీలు బొమ్మ. ఆ భార్యయే, అతని రాచటికమునకు జీవగఱ్ఱ.

## యార్కు వంశీయులు, సింహాసన మాక్రమించుట

1460-వ సంవత్సరములో జరిగిన "వేక్ఫీల్డు" యుద్ధములో (Battle of Wakefield) యార్కు ప్యూక్"ను, "రిచార్డు నెవిల్లి"యును (Duke of York and Richard Neville the Elder) ఇర్వురును గతించిరి. వారి పిమ్మట, ప్యూకు కొడుకగు "ఎడ్వర్డు"ను, "వార్విక్కు" అను నతడును యార్కు పక్షమున నాయకత్వము వహించిరి. ఆ యేడే "రెండవ సెంటు ఆల్బన్సు యుద్ధము"లో (Second Battle of St. Albans) యార్కు పక్షము మరల ఓడి పోయెను. "మార్గరెట్టు," తన భర్తను బందీకృతుని జేసెను. కాని ఆమె లండను నగరమునకు పోవ సాహసింప జాల దయ్యె. పిమ్మట, ఒకటి రెండు నెలలలో "టౌటను" వద్ద ఇంకొక యుద్ధము జరిగి, యందు లాంకాస్టరు వారి సేనలు నిశ్శేషముగా హతము లైనవి. (Battle of Towton, 1461). అంత, యార్కు వంశీయు డైన ఎడ్వర్డు, "నాలవ ఎడ్వర్డు రాజు" అను పేర సింహాసన మెక్కెను.

ఎడ్వర్డు, 1461-వ సంవత్సరము మొదలు 1483-వ సంవత్సరము వఱకు, ఇరువదిరెండేండ్లు రాజ్య మేలెను. మొదటి రోజులలో అతడు "వార్విక్కు" యొక్క చెప్పు చేతలకు వశవర్తి యై యుండెను. కాని కొన్ని నాళ్లకు రాజు నకును అతనికిని విరోధము కలిగెను. రాజునకు ఒక ఫ్రెంచి రాచ కన్నెను ఇప్పించి పెండ్లి చేయ వలె నని వార్విక్కు పెండ్లి రాయబారములు నడపు చుండగా, రాజు ఆ సంబంధము వల దని, "వుడ్విల్లీ" వంశ్య యైన "ఎలిజబెత్తు" అను నామెను వివాహ మాడెను. ఇదియే వారి కిర్వురకు కలిగిన విరోధమునకు ముఖ్యహేతువు. రాజునకు వార్విక్కు తోడి

వైరము మంచిది కాదు. అతడు అఘటనఘటనాసమర్థుడు. వాని నణచుటకు, రాజు స్వయము తానై పూనుకొనక తన యత్తింటివంశమువారిని అతని మీదికి ఎగఁగొల్పెను. కొంత కాలము అతడును వారును కలహించిరి. అంతలో వార్విక్కు నకు రాజు వలన ఇంకొక పరాభవము జరుగగా, నతడు సహింప లేక, రాజు మీఁద తిరుగబడెను (1467). ఇరువురును యుద్ధములలో దిగిరి.

1469-వ సంవత్సరములో "ఎడ్జికాట్టు ఫీల్డు" నొద్ద జర గిన యుద్ధములో (Battle of Edgecott), వార్విక్కు రాజు నోడించి పట్టుకొనెను. ఆ మఱుసటి యేడు స్థితి యంతయు విపరిమించి, వార్విక్కు దేశము విడిచి ఫ్రాన్సునకు పాఱి పోవల సిన వాడయ్యెను. ఫ్రాన్సులో మార్గరెట్టు గలదు గనుక, అతడు ఆమెతో కలిసి తంత్రము నడపి, ఎడ్వర్డు మీఁద నెత్తి పోవు ప్రయత్నము చేసెను. వారిరువురును తమ తమ సేనల కలిపికొని, యొకటియై నడచి, ఎడ్వర్డు నెదిరించి పోరి యోడించి (1470), చెఱ దగిలి యున్న ఆఱవహెన్రిని వెలార్చి సింహాసన మెక్కించిరి.

ఎడ్వర్డు పునఃప్రయత్నము చేసి యా మఱుసటి యేడే వార్విక్కును "బార్నెట్టు" యుద్ధమునను (Battle of Barnet), మార్గరెట్టును "ట్యూక్సెస్బరీ" యుద్ధమునను (Battle of Tewkesbury) వేర్వేర నోడించెను. అంతలో హెన్రీ కూడ మరణించుటచే ఎడ్వర్డు పని సుకరమై నిష్కంటకముగా రాజ్య మేల దొడగెను.

## ఎడ్వర్డు పుత్తర కాలము

1471-వ సంవత్సరము మొదలు 1483-వ సంవత్సరము వఱకు, ఎడ్వర్డు చాల గట్టిగానే పరిపాలించెను. ఇతనికి హెన్రీకి వలె పేదతనము లేదు. హెన్రీ పేదరా జగుటకు కారణము ఆయమునకు మించిన వ్యయము. అతని రాబడి కూడ చాల తక్కువ మొత్తముగానే యుండెను. 70,000 పౌనుల యాదాయములో హెన్రీ ఇంటి ఖర్చుక్రింద 13,000 పౌనులును, "కెలై" "బెర్విక్కు" పట్టణములకు గాను 25,000 పౌనులును వెచ్చ బెట్టెడి వాడు. ఫ్రాన్సులో నతనికి ఒక్క "కెలై" పట్టణము మాత్రమే మిగిలెను. అట్లే స్కాటు లాండులో "బెర్విక్కు"ను ఒకటి. ఇక ఎడ్వర్డునాదాయము ఇంత కంటె చాల ఎక్కువ. ఆదాయము పెంపొందించు కొనుటలో నతడు కడు జాగరూకుడై వర్తించెను. "పార్థివ పద్ధతి" ననుసరించి రాజునకు రాదగిన మొత్తములో నత డొక పెన్నీ నైనను బీరు పోనీకుండ రాబట్టెను; ధనవంతులవలన బలవంతముగా అప్పులు దెచ్చెను; పార్లమెంటువారికి నచ్చ జెప్పి, ఎగుమతి దిగుమతి సరకులపై ఎక్కువ సుంకములు వసూలు చేసెను; యుద్ధదినములలో తన యెదిరిపక్షమున జేరిన భూస్వాములభూములు స్వాధీనము చేసికొని, యా "ఫల సాయము" తా ననుభవించెను.

ఇన్ని ద్వారముల డబ్బు వచ్చుచుండుటచే నతడు పార్ల మెంటు వారిని ధనముకొఱకు బ్రతిమాల వలసిన పని లేక పోయెను. పార్లమెంటువారును రాజువలన తమకు గలుగు ధననష్టము లేమి జేసి, యితర వ్యవహారముల నతని చిత్తము చొప్పున వర్తించుచు, అతడు చెప్పిన పను లెల్ల చేసిరి.

"లాంకాస్టరు ప్రయోగము" వలన పార్లమెంటువారి శక్తి క్షీణించి నట్లు ఊహింప వచ్చును. కామన్సు సభవారు కొంత కాలము రాజకీయ విషయముల దెస ఉదాసీనులై, పర్తక వ్యాపారములయెడ అభినివేశము చూపిరి. వారి యుదాసీనతయు రాజప్రాబల్యమునకు పోషకమే. ఎడ్వర్డు ఆ యవకాశమును రిత్త బుచ్చక, తనకు గల అధికారబల మంతయు దేశమున మరల భద్రత నెలకొల్పి, అవక్రమార్గమున నడపింప వినియోగించెను. గత యుద్ధములును విప్లవములును అనెడి అంతశ్ఛిద్రముల వలన దేశమున కొందఱు చివికిపోయిన మాట నిజమేకాని, దేశము మొత్తముమీద చూచినచో ప్రజా ప్రవృత్తి యంతగా భగ్న మైనట్లు తోచదు. జమీందారు లాండ్లారులతో పోరాడి నలిగి పోయిరి. వారు పోయిన పోవు దురు గాక, సామాన్యపు పంటకాపు మాత్రము ఆ యల జడిలో మునుగ లేదు. సైన్యములు చాడి నడచు నప్పుడు ఒకొొక్క యెడ పంటచేల మీదుగా నడచుట కలదు గనుక, అట్టి వేళల కాపులకును నష్టము కలిగెడిది. ఉద్ధత ప్రభువులు బలదర్పితులై యున్నంతవఱకు దేశమున భద్రతాప్రతిష్ఠ నెలకొన దని యూహించి, వారి జాడ లరసి నచ్చుటకు, యెడ్వర్డు, పెక్కుమంది గూఢచారుల నియోగించెను. ఆ రాజు పరిపాలన నీతిసంపన్నమే కాని, నయసంపన్నము కాదు. అతని కాలముననే ఒక క్రూరశాసనము గూడ పుట్టినది. తనయెడ నెవ్వడేని భేదము తలచు వా డున్నట్లు వినినచో, ఎడ్వర్డు వాని నంత మొందించుటకు పార్లమెంటు వారిచే ఆ విరోధిమీద "రాజద్రోహి" యను నేరము మోపించెడి వాడు. నేరము మోపుటయే వాని నంత మొందించుట. దానికి వేఱే సాక్షి

విచారణాదిధర్మము లక్కర లేదు. ఈ చండశాసనము అతి క్రూరమైనది. ఇందు ధర్మము లేదు. ఇట్టి దానిని ఏల ఆదరించిరో కాని, పిమ్మటి రాజుల కాలమున గూడ నిది పెక్కుమారులు ప్రయోగింప బడెను. ఈ శాసనమునకు "ప్రాణాంత శాసనము" అని పేరు.

## యార్కువంశపు క్షీణదశ

నాలవ యెడ్వర్డు 1483-వ సంవత్సరములో మృతి నొందెను. అతనికి ఇర్వురు కుమారులు గలరు. పెద్దవానికి రాజనామము లభించెను (అయిదవ యెడ్వర్డు). నాలవ యెడ్వర్డునకు సోదరుడును, "గ్లాసెస్టరు డ్యూకు"ను అయిన, రిచార్డు (Richard, Duke of Gloucester) పూర్వరాజకుమారుల నిర్వురను బట్టుకొని చెఱలో నుంచి, జమీందారుల సాయమున తాను సింహాసన మెక్కెను. పిమ్మట ఆ రాజపుత్రుల నిర్వురను ఆ చెఱలోనే చంపించెను. వాని దౌర్జన్యమునకు రోసి కొందఱు ప్రభువులు, నాలవ యెడ్వర్డు భార్య యగు "ఎలిజబెత్తు వుడ్విల్లీ" అను నామె పక్షము వహించిరి. వారిలో "రివర్సు ప్రభువు," "గ్రే ప్రభువు" (Lord Rivers and Lord Grey) అను వారు ముఖ్యులు. రిచార్డు ఆ యిర్వురను రాజద్రోహు లని తల గొట్టించెను. రిచార్డు హింసాస్వరూపము. వాని దౌరాత్మ్యమే తుదకు వాని నాశమునకు హేతు వైనది. మొదట ఎవరి ప్రాపున తాను పదస్థు డయ్యెనో, ఆ జనులందఱితోను ఒకని తరువాత నొకనితో అతడు కలహించెను. మున్ముందు "బకింగుహాము" అను వానికిని అతనికిని పొత్తు చెడినది. రిచార్డు నెట్లయినను తుదముట్టించ వలె నని

"బకింగుహాము" ఒక కుట్ర పన్నెను గాని, అది గుట్టు చెడి విఫలమై పోయినది. కుట్ర చెడిపోవుటయే కాక బకింగుహాము తలయు పడిపోయెను. అటుపిమ్మట నతడు చర్చివారితో కలహించెను. రిచార్డు తన భార్య యగు "ఆనీ నెవిల్లీ"తోడి వివాహబంధము త్రెంచుకొని విడాకు లిచ్చి పంపి వైచి, తన సోదర పుత్రి యగు నాలవ యెడ్వర్డు కుమార్తె "ఎలిజబెత్తు"ను (Elizabeth of York) పెండ్లియాడ సంకల్పించెను. దీనికి చర్చివారు సమ్మతింపక పోవుటయే వారి కలహమునకు కారణము.

రిచార్డు సంకల్పము సిద్ధింపక మునుపే "రిచిమాండు ప్రభువు"ను, "ట్యూడరు వంశజుడు"నగు హెన్రి యను నతడు (Henry Tudor, Earl of Richmond). రాజ్యముకొఱకు పోరాడుటకై వేల్సులో వచ్చి దిగెను. ఈ హెన్రికి "ఎడ్మండు ట్యూడరు" తండ్రి, "మార్గరెట్టు బ్యూఫర్టు" తల్లి. ఆ మార్గరెట్టు "సోమరుసెట్టు డ్యూకు" అయిన "జాను" కూతురు (John, Duke of Somerset). ఆఱవ హెన్రి పాలనమున ప్రథమ దశలో సభాధ్యక్షపదవికి, "గ్లాసెస్టరు"తో తగవు లాడిన "సోమరుసెట్టు" ఇతడు.

"ఎడ్మండు ట్యూడరు" "ఓవెను ట్యూడరు"యొక్క కొడుకు. అయిదవ హెన్రీ చనిపోయిన పిమ్మట అతని విధవ భార్యను పెండ్లి యాడిన వాడే "ఓవెను ట్యూడరు" (Owen Tudor). ఇది హెన్రీ ట్యూడరు యొక్క అభిజన పరంపర.

వేల్సుదేశసంధుల నున్న లాంకాస్టరువంశ్యులు హెన్రీ ట్యూడరునకు సాయమైరి. అయినను ఆ సేన లన్నిటను కలిసి అయిదు వేల మంది కంటె నెక్కువ భటులు లేరు. ఆ కతిపయసేనతోనే హెన్రీ "బాస్వర్తు యుద్ధమున" మూడవ

రిచార్డును ఓడించి చంపెను (Battle of Bosworth 1485). భుజబలార్జిత మగుటచే రాజ్యము అతనిదే యయ్యెను. పార్లమెంటు వారును అతనిని అనుమతించిరి. ఆతడే యీ చరిత్రమున ఏడవ హెన్రీ. రిచార్డు పెండ్లియాడ దలచిన, ఎలిజబెత్తును (Elizabeth of York) ఏడవహెన్రీ వివాహ మాడెను. ఈ విధముగా రెండు శత్రు వంశములకును బంధుభావ మేర్పడెను.

దేశము యుద్ధములవలన విసివి యుండెను. నూతేంగ్లకు పైగా పోరాడినను ఫ్రాన్సులో లభించినది యేమియు లేకపోయెను. జమీందారు లొండొరులు కొట్టుకొన్నను, ఎవనికి ఏ విధమైన లబ్ధియు లేకపోయెను. కనుక ప్రస్తుతము రాజ్యమును న్యాయముగా పరిపాలించుచు ఇంటను బయటను గూడ పోరు లేకుండ జేసి, శాంతి భద్రత లొసగ గల వాడే ఇంగ్లండునకు అప్పట్ల కావలసిన రాజు. అట్టి శక్తి ట్యూడరు వంశము వారికి గలదు. హెన్రీ ట్యూడరు చాల సమర్థుడైన రాజు. ఒకొక్క యెడ అతడు కఠినుడు గూడ నయ్యెను. అగుగాక, అసమర్థుని మార్దవముకంటె సమర్థుని కాఠిన్యము కొంత నయము. ట్యూడరు వంశమునకు రాజ్యము లభించుట తమపాలిటి సుకృతఫలముగా ప్రజలు భావించిరి. నిజముగా, పూర్వరాజవంశములలో నింత సమర్థ మైన వంశ మింకొకటి లేదు. ఈ వంశము తన ప్రాబల్యముతోపాటు పార్లమెంటు వారికిని ప్రాబల్యము తెచ్చెను. పార్లమెంటు రాజప్రాబల్యము నణచిపట్టు యత్నములు పదునేడవ శతాబ్ది వఱకు మరల జరుగలేదు.

## ఏడవ హెన్రీ 1485—1509 సం॥

హెన్రీ ట్యూడరు, సరసుఁడు కాఁడు; కఠినహృదయుఁడు, లోభావిష్టుఁడు; అయినను శక్తిసంపన్న లేక స్వధర్మము పాలించువాఁడు. అతఁడు తన లోపములు తాఁ నెఱుఁగును; తనదు దేశమున గల అనుకూలప్రతికూలాంశము లేవియో యెఱుఁగును; తన ప్రాబల్యమునకు నిరోధకము లేవియో యెఱుఁగును. పూర్వ రాజులు నిర్వీర్యులై పోవుటకు హేతువు లేమైయుండునా యని విచారించి, అతఁడు రెండు ముఖ్యకారణములు కని పెట్టెను. మొదటిది యుద్ధతప్రభువుల యునికి, రెండవది ధన లోపము. ఈ రెంటిని సంస్కరించిననే తక్క, తన యేలుబడి సుప్రతిష్ఠితము కాఁజాల దని యెంచి, యతఁడు యుద్ధతప్రభు భంజనమును, ధనార్జనమును అనెడి రెండును తనకు ప్రథమ కర్తవ్యములుగా గైకొనెను.

### 1. ఉద్ధతప్రభుభంజనము

ఈ విషయమునెడ స్థితిగతులుకూడ నతనికి చాల అనుకూలముగానే యుండెను. రోజాయుద్ధములలో ఉద్ధతప్రభువులు పెక్కురు, ఒండొరులను చంపికొనిరి. మఱి కొందఱు యుద్ధ వ్యయముచే క్రుంగిపోయిరి. దానివలన, హెన్రీ చేయ దలచిన పనియు మిక్కిలి సుకర మయ్యెను. ముస్ముందు, అతఁడు వారి కోటలు ధ్వంసము చేయ దొడఁగెను. ప్రభువు లెవ్వరి దగ్గఱను ఫిరంగిమందు ఉండ రాదని నిషేధించి, తన ఫిరంగులచే వారి కోటగోడల పడ గొట్టించెను. 1504–వ సంవత్సరములో నతఁ డొక క్రొత్త శాసనముకూడ చేసెను. దాని వలన ఏ జమీందారునొద్దను యుద్ధభటు లుండఁగూడదు; వార

సతతము తన వశమున నుంచుకొని పోషింపరాదు. ఈ శాసనముతో ప్రభువుల యుద్ధతంత్రములు నశించినవి. వారిసేవ చాలించు కొన్న యుద్ధభటులు తిండికి లేక బిచ్చమెత్తు కొనిరి. ఈ శాసనము యథాక్షరముగా పాలింపబడు నట్లు హెన్రీ వేయి గన్నుల ఆరయు చుండెను. ఆక్సుఫర్డు ప్రభువు (Earl of Oxford) హెన్రీకి మిత్రుడు. ఆ ప్రభువునింటికి రాజొక సమయమున అతిథియై వెళ్లి, ఆతని వశమున నింకను యుద్ధభటులుండుట కనుగొనెను. అప్పటి కేమియు ముఖవికారము తోపనీయక మిన్నకుండి, రాజధానికి వచ్చిన పిమ్మట శాసనతిరస్కారము చేసినందులకు మిత్రుని వలన ఎంతో పెద్దసొమ్ము దండుగగా పుచ్చుకొనెను.

"ఉద్ధతప్రభువుల యనుచిత వర్తనముల విచారించి శిక్షింపకుండ, వారి చేతిక్రింది యుద్ధభటులు జడ్జీలకు కత్తులు చూపుచుందురు" అని పూర్వప్రకరణమున దెల్పితిమి. ఆ దినములలో అది యట్టిదియే. ఆ బెదరింపువలన అలతులైన వారు ఆ ప్రభువులచే బాధితు లయ్యు కేసులు పెట్టుటకు అవకాశము లేకుండ పోయినది. అథవా ఎవ్వడేని తెగించి కేసు తెచ్చినను ప్రభువులయుద్ధభటులవలని భయముచే జడ్జీలు న్యాయము చెప్పుటయు దుర్లభమే. ఏడవహెన్రీ యీ అక్రమమును పోగొట్ట వలె నని యెంచి ప్రభువులపై వచ్చు కేసులను విచారించుటకు ప్రత్యేకపు కోర్టుల నేర్పాటు చేసెను. "రాజసభ" యను నది కొన్ని వ్యవహారపు కేసులను ప్రత్యేకముగా విచారించు నాచారము తొల్లిటి నుండియు కలదు. మూడవ యెడ్వర్డు కాలమున ఆ "రాజసభ"వారు, వెస్టుమిన్‌స్టరులో ఒక ప్రత్యేక భవనమున విచారించెడు వారు. ఆ భవనములో ఒక

గదికి కప్పున నక్షత్రములు చిత్రించిరి. దానిబట్టి ఆ భవన మునకు "నక్షత్రభవనము" అను పేరు వచ్చెను. ఏడవహెన్రీ ప్రస్తుతము ఏర్పాటు చేసిన ప్రత్యేకపు కోర్టు ఆ నక్షత్రభవన మున నే వ్యవహరించు చుండెడిది. రాజసభవారిలో కొందఱు జడ్జీలుగా నుండెడి వారు. ఆ కోర్టు వారు నేరము లొనరించిన ప్రభువులనే కాక, అపాయకరు లైన ఇతర పురుషులగూడ విచారించి శిక్షించిరి. ఆ కోర్టువారి విచారణపద్ధతులు మామూలు పద్ధతులవంటివి కావు. ఒకడు తనకు ప్రతికూల ముగా తానే సాక్ష్య మీయ వలసి వచ్చిన దనుకొనుడు. చేతులార మెడకు నురి పోసికొన జాలక వాడు నిసర్గముగా మౌనము వహించి యుండును. అట్టిచో ఈ కోర్టువారు వానిని కాల్చి యైనను పలికించెడి వారు. ఈ ఘోరపద్ధతి శాస్త్రీయము కాదు. అది తక్కిన మామూలు కోర్టులలో జరగను లేదు.

కొంత కాలమునకు "నక్షత్రభవనమును" అసహ్యించు కొనని మానిసి లేడు. కాని ఏడవహెన్రీ కాలమున ఆ కోర్టే దేశమును అదుపులో నుంచ గలిగినది.

## 2. ధనార్జనము

"ధనము సర్వశక్తిమూలము" అను సిద్ధాంతమును హెన్రీ గట్టిగా నమ్మి, పుష్కలధనవంతు డగుటకు ఎన్ని మార్గములు గలవో అన్ని మార్గముల ధనము సంపాదించెను. అపరాధుల వలన ఎక్కువ దండుగసొమ్ము పుచ్చుకొనుట, ప్రజలకు ఎక్కుడు పన్నులు వేయుట, ధనవంతులవలన అప్పు పుచ్చుకొనుట, లంచములు పుచ్చుకొని పెద్ద యుద్యోగము లిచ్చుట—ఇవి అతని ధనాగమనమార్గములు. ఇక వ్యయవిషయమున అతడు

కడు పొదుపరి. వృథాగా ఋణము ఖర్చు చేయడు. అందు చేతనే లోకులు అతనిని "లోభి" యనిరి. ఎంత పొదుపు చేసి నను అతడు ఈ లోకము విడిచి పోవు నపుడు, కొడుకున కిచ్చి పోయిన మూట ఎంతో లేదు.

పూర్వరాజులనాడు, సాధారణముగ పెద్ద యుద్యోగ ములు సంపన్నులకును, చిన్న నౌకరులు సామాన్యులకును, ఇచ్చు నాచారము కలదు. సంపన్నుల మీద ఆధారపడి యుండుట క్షేమము కా దనియు, పూర్వాచారమును క్రమ ముగా సంస్కరింపవలె ననియు నెంచి హెన్రీ ఉన్నతపదవులు కొన్ని సామాన్యులకుగూడ నిచ్చెను. కాల క్రమమున, జమీందారులకు పాలనాదికమున జోక్యము లేకుండ జేయ వలె ననియే అతని తలంపు. ఈ నీతిసూత్రము కొంత కాల మునకు ఫ్రాన్సుదేశమున గూడ అనుష్ఠితమైనది. పదునేడవ శతాబ్దిని ఫ్రెంచిజమీందారుల అధికార ప్రాభవములు నశించి అణగిపోవుటకు కారణము, వారు ఉద్యోగపదవుల నుండుటయే. హెన్రీ తలచిన తలపు తుదముట్టలేదు గాని, అదియే తుదముట్టినచో ఫ్రెంచిజమీందారులకు పట్టిన గతియే ఇంగ్లీషుజమీందారులకును పట్టి యుండును.

1509–వ సంవత్సరములో దేశస్థితి కొంత ఇఱుకున బడి నది. అప్పటికి ఐరోపీయదేశములలో ఫ్రాన్సుదేశమును స్పెయినుదేశమును అతిప్రబలముగా నుండెను. ఫ్రాన్సు దేశము స్కాటులాండుదేశమిత్రము. ఇంగ్లాండు ఫ్రాన్సునకు విరోధి. కనుక, ఇంగ్లాండునకు ఇరువైపుల శత్రువు లుండిరి. ఈ విషమస్థితి తలగుటకు హెన్రీ యొక్కయుపాయము చేసెను: — స్కాటులాండురాజుతోను, స్పెయినురాజుతోను

వియ్య మందెను. ఆ కాలమున వియ్యము మైత్రిలక్షణము. హెన్రీకుమార్తె "మార్గరెట్టు" అను కన్యను స్కాటులాండు రాజగు నాలుగవ జేమ్సున కిచ్చిరి. "హెన్రీకుమారునకు ఆర్థరు" అను వానికి "ఆరగను"రాజుకుమార్తెను "కాథరిను" కన్యను జేసికొనిరి (Catherine, daughter of the king of Aragon). విధిప్రాతికూల్యమున ఆర్థరు వివాహమైన కొన్ని నాళ్లకే చనిపోయెను. తొల్లిటి బాంధవము పోనీయ కూడ దని, హెన్రీ ఆ వితంతునవధువును తన రెండవ కుమారునకు "హెన్రీ" అను వాని కిచ్చి పెండ్లిచేయ నెంచెను. కాని అట్టి పెండ్లి కాతలిక్కుమతధర్మమునకు విరుద్ధము. అయ్యు, ఆపద్ధర్మముగానో అపవాదముగానో సమర్థించి, పోపు అనుజ్ఞ యిచ్చుటచే ఆ పెండ్లి యైనది.

హెన్రీ చనిపోవు నాటికి దేశస్థితి సర్వవిధముల బాగుగా నున్నది. ప్రజలలోనా కల్లోలములు లేవు. కోశమునా ధన మున్నది. పరదేశములనా గౌరవ మున్నది.

ఎనిమిదవ హెన్రీ కూడ తండ్రియడుగుజాడలబట్టియే నడచెను గాని భిన్నమార్గములు త్రొక్కలేదు. అటుపిమ్మట ఎలిజబెత్తురాణి ఇంగ్లాండుదేశమునకు మిక్కిలి సమున్నతి కలిగించెను. ఆ స్థితికి వచ్చు లోగా దేశమున ఎన్నియో పరివర్తనములు జరగెను. ఆ పరివర్తనముల సూత్రప్రాయముగా చెప్పవలయు నెడ, "విద్యాప్రబోధము" "మతసంస్కరణము" అని చెప్పదగును. ఆధునికాంగ్లచరిత్రకు ఈ రెండు సూత్రములే ఉపోద్ఘాతము.



## పదునాఱవ ప్రకరణము

---

## విద్యాప్రబోధ మతసంస్కరణయుగము

## మధ్యయుగములనాటి అజ్ఞానము

మధ్యయుగముల జనులు కేవలము నిరక్షరకుక్షులు, మూఢులు, అమాయికులు. వారికి ప్రతివస్తువు నెడను అవిచారమూలక మైన విశ్వాసము మెండు. ఇంద్రజాల కల్పితము లన్నియు వారికి వాస్తవములే. రోగములు కుదురు ననియో, ఐశ్వర్యము పట్టు ననియో, పుణ్యము వచ్చు ననియో, భావించి వారు వ్యయప్రయాసల కోర్చి, వందలకొలది మైళ్లు నడచి పోయి, యే పుణ్యపురుషుని అస్థులనో దర్శించి ముద్దు పెట్టుకొని వచ్చెడి వారు. మరణానంతరము ప్రాణులు యమలోకమునకు పోదురనియు, అచట చిరకాల ముండి పాపనిష్కృతి చేసికొని పిమ్మట స్వర్గము చేరుదు రనియు, అట్లు గాక ఇహముననే పాపప్రాయశ్చిత్తము చేసికొను వారికి యమలోకావాసానుభవము అచిరకాలముననే తీరు ననియు, మహాత్ముల సమాధి దర్శనము ప్రాయశ్చిత్తకల్పమున నొక విధ మనియు, వారి పిచ్చి నమ్మకములు. ఆ దినములలో "రోము పట్టణ సమాధి వివరణము" అను ఒక పుస్తకము ఉండెడిది. అందు ఆ పట్టణమున గల సమాధుల చరిత్ర యంతయు, వివరముగా నిర్వచించి యుండును. ప్రతితైర్థికుడును ఆ పుస్తకమును కొని, దానిని బట్టి రోమున గల సమాధులను ఒక్కటి యేని బిఱుపోనీక, అన్నిటిని దర్శించి తన్మహత్వము కొనియాడుచు, భక్తి నెఱపును. అదియును గాక వారి నమ్మకములలో నింకొకటి

మఱియు చిత్ర మైనది—వేలకొలది భూతములును దయ్యాము లును కత్తులు కటారులు దాల్చి, శత్రుసేనలవలె, ప్రతి ప్రాణి చుట్టును తిరుగుచుండు ననియు, ఏమఱుపాటున నున్నప్పుడు, ఆ ప్రాణిని తుద ముట్టించు ననియు.

వా రింత అమాయికు లగుటకు ముఖ్యకారణ మేమనగా, ఎవ్వరో తక్క బహుజనములు ఇల్లు విడిచి దూరప్రయాణములు చేసి యెఱుగరు. జమీందారులును, యోధులును, యుద్ధములకై పరదేశముల కేగి యుందురు గాక, వర్తకులు వాణిజ్యమునకై పరరాష్ట్రముల కేగి యుందురుగాక, తైర్థికులు సమాధి దర్శనార్థము దూరప్రయాణములు చేసియుందురు గాక, అంతమాత్రమున ఏమైనట్లు? ఏ రెండును కలిసినను ప్రజా బాహుళ్యమున ఎన్నవవంతు ఉందురు? "దూరప్రయాణములు చేసి యెఱుగరని" మేము చెప్పినది బహుజన విషయము. ఒక పంటకాపు గాని, ఒక కూలివాఁడుగాని, తన యూరు విడిచి నాల్గు మైళ్లకు అవల పోయి యెఱుగడు. పల్లెటూళ్లవారు జన్మ మధ్యమున నూఱు తలలు చూచి యుండ రనుచో వింత గాదు. కాని, పలువురు చదువను వ్రాయను నేర్చి యున్నచో, ప్రయాణాభావము నిర్విశేషమే. అదియును తెలియక పోవుట, అంత అనర్థమునకు మూల మైనది. ప్రజల మాట యేల? రెండవ రిచార్డునకు పూర్వము ఒక్క రాజైనను, తన పేరు సంతకము చేయుట యెఱుగడు. అథవా, చదువగల వా రున్నను పుస్తకాభావము. పుస్తకములకు చేతితో ప్రతులు వ్రాసికొనవలెను. అది కష్టతర మైన కార్యము. వ్రాసిన ప్రతులు కొనుటకు వెల చాల ఎక్కువ. ఏదేని యొక పెద్ద

పుస్తకము ప్రతి కొనవలెనన్న, ఇల్లును పొలమును అమ్ముకొన వలసినదే కాని సులభముగా లభింపదు.

అదిగాక, వారికి చదువ తీరుబడియును లేదు. జమీాం దారులకును యోధులకును కాలయాపనకు పెక్కు మార్గము లుండెను. వారు బహుకార్యవ్యగ్రులు. వేటాడుట, ప్రేటు లాడుట, తినుట, నిద్రపోవుట—ఇవి వారి నిత్యకృత్యములు. ఇవిగాక, ఎప్పుడైన పొలములు చూచికొనుట. వర్తకులకు, ధన సంపాదన కుశలతయే కాని, చదువుతో పనిలేదు. కూలి వాండ్రు, పగ లెల్ల పాటు పడిన గాని, పొట్ట గడవదు. ఇక చర్చివారి విషయము చూచిన, వారును విద్యాహీనులే యని చెప్ప దగును. ఏమన, మత గ్రంథము లన్నియు "లాటిను" భాషలో నుండెను. కొందఱు చర్చివారు, ఆ గ్రంథముల చూచి యైన చదువ నేర కుండిరి, అందఱ కంటెను, మతముల వారికి మాత్రము విద్యావ్యాసంగమునకు వలయు వ్యవధి యుండెను. కాని యేమి లాభము? వారికి పుస్తకములు లేవు. ఏ మఠమున నేని యొక గ్రంథ మున్నచో, వారు దానినే మాటి మాటికి మరల మరల చదువుచు కాలముపుచ్చుకొనెడి వారు. గ్రంథాంత రాభావమున అంత కంటె నేమి చేయ గలరు? మఠస్థులు పలువు రొక చోట చేరి, ఆ లోకైక గ్రంథార్థమును గూర్చి, పూర్వ పక్షసిద్ధాంతములు సేయుచు, వాదోపవాదములు పెంచి, మథించి, సారము తీయ ప్రయత్నించెడి వారు. వారి వాద ములు కూడ వివేకదూరములే. "ఒక సూదిమొనమీాద, ఎందఱు దేవదూతలు నిలబడ గలరు?" అను ధర్మ సందేహము కలిగి, పదిమంది మఠస్థులు పది మాసములు తర్క వితర్కములు చేసి, నిర్ణయము తేలక లేచిపోయిరట.

## పదునైదవ శతాబ్ది పరివర్తనములు
### మొదటి భాగము
### విద్యాంసులు

ఈ స్థితిలో, పదునైదవ శతాబ్దిలో క్రమక్రమముగా కొన్ని మార్పులు కలిగెను. పట్టణములు తొల్లిటికంటె భాగ్యవంతము లయ్యెను. పట్టణ నివాసు లైన వర్తకులు చాల ధన మార్జించిరి. వారి కుమారులు, తండ్రు లార్జించిన ధనములతో సుఖముగా జీవయాత్ర గడప గలిగిరి. వారికి పాటుపడి పొట్ట పోసికొనవలసిన ఆవశ్యకము లేమిజేసి, ఎక్కువ తీరుబడి యుండెను. దానికి తోడు చేతి నిండ సొమ్ము కలదు. ఆ సదవకాశమును వృథ పుచ్చక, వారు ఎంత వెల గల పుస్తకముల నైనను కొని చదువ గడగిరి. ఆ దినములలోనే భాగ్యవశమున, అశ్రుతపూర్వము లైన గ్రంథరాజములు తూర్పు దేశములనుండి వచ్చి వెలసినవి. తత్పూర్వము "కాన్‌స్టాంటినోపిలు"లో లెక్క లేనన్ని గ్రీకు గ్రంథములును, లాటిను గ్రంథములును ఉండెను. పడమటి యూరపు దేశీయులు వానిపేర్ల నైనను విని యెఱుగరు.

1453-వ సంవత్సరములో తురుష్కులు కాన్‌స్టాంటినోపిలు జయించిరి. సాహితీమహత్త్వ మెఱిగిన విద్వాంసులు ఆ పురమున గల పుస్తకరాజములు శత్రువశమున బడ కుండ, పిల్లలను వలె కాపాడుకొని, ఇటలీదేశమునకు పాఱిపోయిరి. ఆ దేశీయులు అత్యభినివేశముతో ఆ పుస్తకములకు ప్రతులు వ్రాసి చదువుకొన సాగిరి. కాన్‌స్టాంటినోపిలు అనెడి నిధిలోని సాహిత్యరత్నములను ఆ విధముగా వెలయించి ఆపణముల పచరించిరి.

ఆ దినములలోనే అచ్చు పద్ధతియు కనిపెట్ట బడెను. 1450-వ సంవత్సరములో "మెయింజ్" కాపురస్థు డగు "జాను గూటెన్బర్గు" (John Gutenberg of Mainz) అను నతడు మొదట అచ్చు యంత్రము సృజించెను. ఆ విద్య దేశదేశముల బ్రాకి, 1477-వ సంవత్సరమునాటికి ఇంగ్లాండులో కూడ ప్రవేశించెను. ఈ దేశమున ఆ యంత్రమును నెలకొల్పి, మొదట అచ్చుపని ప్రారంభించిన వాడు "కాక్సటను" (Caxton). ఆ ముద్రాలయమున మొదట అచ్చు పడిన పుస్తకము "హోమరు రచించిన ట్రోజనుయుద్ధము" (Homer's Trojan War). ఏడవ హెన్రీ కాలమున, ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయమున గ్రీకుభాషను బోధింప సాగిరి. అప్పట్లు "గ్రోసిను" (Grocyn) అను పండితుడు అధ్యాపకుడు. పిమ్మట కొన్ని నాళ్లకు "లినాకెరు" (Linacre) అను నింకొక పండితుడు అతనికి సహాధ్యాపకుడుగా వచ్చెను. ఈ రెండవ పండితుడే "గాలెను" (Galen) అను గ్రీకువైద్యుడు వ్రాసిన వైద్యగ్రంథమును ఇంగ్లీషులోనికి భాషాంతరీకరించిన వాడు. ఆ గ్రంథము శారీరశాస్త్రము. తత్కర్తకు మానవ దేహ నిర్మాణరహస్యములు కరతలామలకములు. ఆ పాటి విజ్ఞానము మధ్యయుగముల మఱే వైద్యునకును లేదు. 1496-వ సంవత్సరము తరువాత, ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయమునకు ఇంకొక గ్రీకుపండితుడు వచ్చెను. ఆతని పేరు "జాను కోలెట్టు" (John Colet). కొంతకాలమునకు అత డా యధ్యాపకత్వము వదలుకొని, "సెంటుపాలు కెతెడ్రా"లున "డీను"గా ప్రవేశించెను (Dean of St. Paul's Cathedral). బైబిలు యొక్క ఉత్తరఖండవిషయముల బోధించు సమయముల నతడు భక్తిరసావిష్టుడై యుపన్యసించెడి వాడట. 1510-వ సంవత్సర

ము లో ఆ భక్తుడు ఆ దేవళమునసే ఒక బడి పెట్టెను. నేటికిని అది ఈ దేశమున గల సుప్రసిద్ధ పాఠశాలలలో నొకటిగా వెలసి యున్నది.

1498-వ సంవత్సరములో "ఎరాస్మసు" (Erasmus) అను ఇంకొక గ్రీకుపండితుడు, ఆక్సుఫర్డున అధ్యాపకుడుగా వచ్చెను. అతడు స్వధర్మనిరతుడు, అన్యచింతాశూన్యుడు. ఆ విద్యోపా సకుడు తనను గుఱించి యిట్లు వ్రాసికొనెను—"నేను నా జీవిత మును గ్రీకుభాషాదేవతపరము చేసితిని. నాకేదేని కొంచెము సొమ్ము లభించిన వుడు, ముందు కొన్ని గ్రీకు పుస్తకములు కొందును, పదపడి కట్టుగుడ్డలు కొందును" అని. "ఎరాస్మసు" "కోలెట్టు" వలన, చాల విద్యారహస్యములు గ్రహించెను. బాలున్నైక యెనిమిదవ హెన్రీ, ఈ పండితవర్గమున పెక్కు రకు మిత్రుడు. అతడు రాజ్యమునకు వచ్చిన పిమ్మటనే, విద్యా వ్యాప్తి ఎక్కువగా జరగినది. 1516-వ సంవత్సరములో "ఎరాస్మసు" బైబిలు నుత్తరఖండమును, గ్రీకుభాషలో నచ్చొ త్తించెను. ఆ గ్రంథమునందు ఆతని కెంతో భక్తి. "ఈ గ్రంథము, అన్ని భాషలలోనికిని పరివర్తనము కావలెను. అప్పుడు దానిని, స్కాంటులాండు వారు, ఐర్లాండు వారు, తురుష్క స్థానము వారు—వారు వీరన నేల, అందఱును చదివి తన్మ హత్త్వము గ్రహింప గలరు. దీనిని పంటకాపు పొలము దున్ను కొనువేళ పాడుకొనుచు ఆనందింప వలెను. సాలెవాడు మగ్గముసవ్వడితో మేళవించి పాడుకొన వలెను. బాటసారులు ఈ కథలు చెప్పుకొనుచు మార్గశ్రమ మఱువ వలెను. ఇది నాకోరిక." అని ఎరాస్మసు ఆ గ్రంథమును గుఱించి వ్రాసిన మాటలు.

కోలెట్టునకును, ఎరాస్మసునకును "సర్ తామసు మూరు" (Sir Thomas More) అను నింకొక పండితుడు మిత్రుడు గలడు. అతడు 1516-వ సంవత్సరములో "నక్షత్రచిత్" (Utopia) అను నొక పుస్తకము వ్రాసెను. దాని యర్థము "ఎచ్చటను లేదు" అని. 'అనగా ననగా ఒక దేశము కలదు. ఆ దేశమున రాజ శాసనము లన్నియు ప్రజాక్షేమకరములు. అందు ఎల్లరకు కలిమియే తప్ప, లేమి లేదు. ప్రజలకు మతనిర్బంధము లేదు. ఎవరికి నచ్చిన మతమును వారు అవలంబింప వచ్చును." అను కల్పన ఆ గ్రంథవిషయమునకు మూలము. దేశమున ఎల్లెడలను ప్రబలి యున్న దురాచారములను సంస్కరించు నుద్దేశముతో "మూరు" ఆ గ్రంథమును వ్రాసెను. మానవజాతి యనుభవించు బాధలు చూడజాలని విద్యవలన ప్రయోజనము లేదనియు మనోవాక్కాయ కర్మల సంస్కరించుటయే "విద్యాప్రబోధము" వలని ఫలమనియు అతని యుపదేశము. "కోలెట్టు" గూడ, ఆ సంస్కరణమహాకార్యమున "మూరు"నకు చేదోడు వాదోడుగా పనిచేసెను. వారి నిర్వాకము జూచి పెక్కుమంది పరోపకారస్వభావులు బయలుదేరి పేదపిల్లలకు బడులు పెట్టిరి. ఆఱవ యెడ్వర్డు కాలమున, అట్టి బడులు పెక్కు నెలకొల్పబడెను. రాజుగూడ కొన్ని పెట్టించెను. ఆ పాఠశాలలలో పేదవారి పిల్లలకే కాక సామాన్యుల పిల్లలకుగూడ చదువులు చెప్పెడివారు. వాని వలన చాలమంది బాలురు చదివిన వారైరి. నానాటికి ముద్రితపుస్తకసంఖ్యయు పెరిగెను. ఇన్ని కారణములచేత, దేశమునుండి, పూర్వకాలపు అజ్ఞానము తొలగిపోయెను.

# పదునైదవ శతాబ్ది పరివర్తనములు

## రెండవ భాగము

## నూతనదేశ సంపర్కనములు

ఆ శతాబ్దిలో నొక వంక విద్యావ్యాప్తి జరుగుచుండ ఇంకొక వంక ఖండాంతర పరిజ్ఞానమును కలుగ జొచ్చెను. 1415-వ సంవత్సరములో "క్రిష్టొపరు కొలంబను" (Christopher Columbus) అను నొక మహాపురుషుడు "జనోవా" (Genoa) పట్టణమున జనించెను. అతడు బాల్యముననే సముద్రయాన ములు చేసి, నిపుణుడైన నావికుడయ్యెను. దిక్ప్రదర్శక యంత్ర ప్రయోగమున అతడు కడు కుశలుడు. మధ్యయుగములవారు దానిని క్రొత్తగా కని విని యెఱుగరు. అది 1302-వ సంవత్స రములో కనిపెట్టబడెను. దాని సాయమున పడవలు సముద్ర మున ఎంత దూరమైనను ఏ దెసకైనను పోగలవు. మధ్య యుగముల జనులు హిందూదేశమునకు పోవలె నన్న నేల దారినే పోయెడివారు. కాని తురుష్కులు "కాన్ స్టాంటి నోపులు" జయించిన తరువాత వారి యునికివలన, ఆ నేలదారి క్షేమకరము గాక ఐరోపీయులు తూర్పుదేశములకు పోవుట మాని వైచిరి. భూమి బంతివలె గుండ్రముగా నుండెను గాని చాపవలె పఱపుగా లేదని "కొలంబను" బహుప్రయాణములు చేసిన నావికులు చెప్పికొనగా విని, అట్లే యగుచో సముద్రము మీద పడమటగా పడవలు పోవునెడ హిందూదేశము చేర వచ్చు నని అనుమానించెను. అష్టకష్టములకును లోనయి, అతడు 1492-వ సంవత్సరములో "పడమటి ఇండీసు" (West

Indies) చేరి, అవియే హిందూదేశ మని నమ్మెను. అతనికి ఆ నమ్మకము మరణపర్యంతమును పోనే లేదు.

1497-వ సంవత్సరములో, "సెబాస్టియను" "కాబట్టు" (Sebastian and Cabot) అను ఇర్వురు "వెనీసు" నివాసులు (Venetians) "బ్రిస్టలు"నుండి బయలుదేరిన ఒక ఇంగ్లీషు నావ నెక్కి, పడమరగా పోయి "న్యూఫవుండులాండు"ను (Newfoundland) కనుగొనిరి. వారిపిమ్మట మఱి కొందఱు బయలుదేరి కాలక్రమమున ఉత్తరపు అమెరికా తీరభూముల కనిపెట్టిరి. 1486-వ సంవత్సరములో "బర్తులోమియు డైజు" (Bartholomew Diaz) అనునావికుడు "గుడ్ హోపు" అను భూమ్యగ్రమును (Cape of Good Hope) చూచి వచ్చెను. అటు పిమ్మట పదునొకండు ఏండ్లకు, అతడు తీసిన దారినే బయలుదేరి "వాస్కోడగామా" అను "పోర్చుగలు" దేశీయుడు, పది నెలల పదునైదు దినములకు, హిందూదేశమున గల కల్లికోట పట్టణము చేరెను. తదుపరి మఱి కొందఱు నావికులు దక్షిణపు అమెరికా కనిపెట్టిరి. అటు పిమ్మట కొందఱు పోర్చుగీసు నావికులు బయలుదేరి, మూడేండ్లలో (1519—1522) శాంతమహాసముద్రము మీదుగా పోయి, "హారన్" అను భూమ్యగ్రమును (Cape Horn) చుట్టి వచ్చిరి. ఆ నావికవర్గమునకు "మాగెల్లను" (Magellan) అను నతడు నాయకుడు. వారు "కేపు హారను" చుట్టి యూరపు చేరుటయే ప్రపంచము చుట్టును తిరిగి వచ్చుట.

ఈ విధముగా ఖండాంతరదర్శన మగుటవలన, భూతధాత్రియందు యూరపు ఒక అల్పాంశము మాత్రమే అని తత్ప్రజలు గ్రహింప గలిగిరి. పరదేశముల కేగివచ్చిన నావికులు

ఆ దేశముల గూర్చియు, తత్ప్రజలగూర్చియు, వింత వింత కతలు చెప్పుచుండుటవలన, ఐరోపీయులు ప్రపంచదర్శనోత్సుకు లైరి. భూప్రపంచము ఇంత పెద్దది యని తెలియుట వారికి అద్భుతావహ మయ్యెను. అదియును గాక "విశ్వమునకు కేంద్రప్రాయము సూర్యుడే కాని, భూమి కాదని" "కోపర్నికసు" (Copernicus) అను జ్యోతిషకుడు తెల్పిన సిద్ధాంతము ఇంకొక అద్భుతావహ విషయము. ఈ వింతవార్తలు, ఈ అద్భుతభావములు, ప్రజల మనఃప్రవృత్తికి పరివర్తనము కలిగించుటలో ఆశ్చర్యమేమున్నది? విద్యాప్రబోధమువలన అజ్ఞానతిమిరము విరిసిపోయెను. పరప్రత్యయనేయబుద్ధి, మూఢతాలక్షణ మను భావమేర్పడి జనులు మతవిషయముల చర్చివారి యుపదేశవాక్యముల శంకింప సాగిరి.

మానవజీవితము సారహీనమును బుద్బుదప్రాయమును ననియు, జీవి ఐహికచింత విడిచి, ఆముష్మిక సుఖానుభూతికి యత్నింపవలె ననియు పూర్వకాలపు చర్చివారి యుపదేశవాక్యములు. నూతనాభ్యుదయమునకు కారకు లైన మహాపురుషుల యుపదేశములు, చర్చివారి చెప్పెడి మాటలకు కేవలము భిన్నములుగా నుండెను. మానవజీవితము సారవంతమనియు భూతకోటిలో, మానవుడే ఉత్తమ ప్రాణి యనియు, ఐహికలోకము తిరస్కార్యము కాదనియు, ఆముష్మిక సుఖానుభవముతోపాటు ఐహికసుఖానుభవమును వాంఛనీయమే యనియు, దృశ్యమాన మైన ప్రకృతియందలి సౌందర్యమును, నానాత్వమును, ఈశ్వరప్రసాదములుగా చూచి, ఆనందించవలె ననియు వీరి యుపదేశసారము. నూత్న చైతన్య మొద

విన ప్రజలకు ఈ వాక్యములు వీనుల విందై, సత్యాసత్యవివే చన శక్తి గలిగి, చర్చివారి మాటలు శంకింప సాగిరి.

## కాతలిక్కు చర్చివారు: ప్రొటెస్టెంటు వారు
(The Catholic Church and the Protestants)

"కాతలిక్కు" అను పదమునకు "జగద్వ్యాపకము" అని యర్థము. "పోపు" అనెడు రోముబిషప్పు యొక్క యాజ మాన్యమున గల క్రైస్తవ మతమునకు, "కాతలిక్కు" అను పదము విశేషణముగా వాడిరి. ఆ నాటి క్రైస్తవమతము జగ ద్వ్యాపకము కాకపోయినను, ఐరోపీయులు ఏ దేశములను ప్రధానజగత్తుగా భావించిరో, ఆ దేశముల వ్యాప్తి గలది యగుట, ఆ మతమునకు "కాతలిక్కు" విశేషణము నొసగిరి.

మానవులకు మతవిషయమున స్వాభిప్రాయములును, స్వతంత్రవివేచనలును పనికి రావనియు, చర్చివారు నిర్ణయించు ధర్మముల యెడ శ్రద్ధాళువులై యుండవలసినదే యనియు, పూర్వకాలమున కాతలిక్కు మతగురువులు బోధించు చుండిరి. పదునాఱవ శతాబ్ది ప్రజలకు ఈ బోధనల వలన తల కంటగించి బుద్ధిశాలురు కొందఱు పూర్వపద్ధతులను గట్టిగా విరోధింప దలకొనిరి. అట్టి వారిలో "మార్టిను లూథరు" (Martin Luther) అను జర్మను దేశీయుడు ముఖ్యుడు. అతడు మంచి విద్వాం సుడు, మతస్థుడు. సమస్త ధర్మ నిర్ణయములును బైబిలునందే కల వనియు ఆ గ్రంథమును చదువ గల వారు తమకు తామే వాని గ్రహింప వచ్చు ననియు, చర్చివారి యుపదేశములకును గ్రంథస్థము లైన వాక్యములకును విరోధము ఉన్నట్లు తోచె నేని ప్రజలు చర్చిని విడిచి బైబిలునే ఆశ్రయింప వలె ననియు,

లూథరు వాదము. అతడీ వాదమును, 1521-వ సంవత్సర
ములో స్పష్టముగా వ్రాసి ప్రకటించెను. చక్రవర్తియు, చర్చి
వారును గూడ లూథరువాదమును ఖండించిరి. "చర్చివారి
యుపదేశములకు భిన్నము లైన సంస్కారములు, నిషిద్ధము"
లని 1529-వ సంవత్సరములో చక్రవర్తి యొక శాసనముగూడ
చేసెను.

లూథరుయొక్క అనుచరులందఱు ఆ శాసనమును ప్రతి
ఘటించుటచే, వారికి "ప్రతిఘటకులు" (Protestants) అని పేరు
వచ్చెను.

## మతసంస్కర్తలు

ప్రతిఘటకులు చర్చివారి మాటలు ధిక్కరింపగా, మఱి
కొందఱు వారి చేష్టలను నిరసించిరి. పూర్వము "జాను వైక్లిఫ్"
చర్చివారి యే యనుచితవర్తనముల సంస్కరింప యత్నించెనో,
అవి నాటినుండియు అట్లే యుండెను గాని చక్కబడ లేదు.
బిషప్పులు మొదలగు ఉన్నతపదస్థులు నిష్కారణముగ ప్రజల
పీడించి ధనము గుంజుచునే యుండిరి. అంతతో పోవక, మత
బోధకులు పిచ్చిమాటలు చెప్పి ప్రజలను మఱియు అజ్ఞాన
కూపముల ముంచు చుండిరి. ఈ అవివేకచేష్టలు మాన్పిన
గాని మతము చక్కబడ దని యెంచి, "ఎరాస్మసు" మొదలగు
కొందఱు విద్వాంసులు, ఆ విధమయిన సంస్కార మభిలషిం
చిరి. ఈ వర్గమువారికి రోమను కాతలిక్కు చర్చిని విడద్రొక్కి
పోవలె నను ఉద్దేశము లేదు. చర్చివారు, పవిత్రవర్తనులు
కావలె ననియే వారి కోరిక.

కాని, అంతమాత్రమున కాతలిక్కు చర్చి లొంగి రా
లేదు. సంస్కరణాభిలాషులవాదము లరణ్య రోదనము లై

పోయెను: చర్చివారి అనుచితవర్తనము యథాప్రకారము సాగుచునే యుండెను. అంతతో విసివి, ఎరాస్మసుపక్షమువారిలో కొందఱు, మొదలు కాతలిక్కు చర్చినే విడనాడి భిన్నమార్గము త్రొక్కుటయే మంచి దని యెంచి ప్రతిఘటకులతో గూడిరి. జరగిన పర్యవసానమే "మతసంస్కారము." పెక్కు దేశములు కాతలిక్కు చర్చిని త్రోసిపుచ్చి సొంతచర్చిని స్థాపించుకొనెను. కొన్ని దేశములలో పూర్వాచారవర్తనముల సంస్కరించిరి. ఇంగ్లాండు కాతలిక్కు చర్చినుండి తొలగుట ఎనిమిదవ హెన్రీ కాలమున గాని తటస్థింపలేదు. అప్పటికిని ఈ దేశము ప్రొటస్టెంటు దేశము కానే లేదు. ఆ పరివర్తనము ఆఱవ యెడ్వర్డు కాలమున జరగెను.



## పదునేడవ ప్రకరణము

### మతసంస్కరణ కాలమునందలి దేశస్థితి: ఎనిమిదవ హెన్రీ: ఆఱవ యెడ్వర్డు: మేరి

ఎనిమిదవ హెన్రీ, 1509-వ సంవత్సరములో రాజ్యమునకు వచ్చెను. అప్పటికి అతడు బలసౌందర్యాభిశోభితు డైన తరుణుడు. కొంతకాలము, అతడు "తామసు వుల్సీ" (Thomas Wolsey) అను వాని చెప్పుచేతలకు లోనై వర్తించెను. "వుల్సీ" 1471-వ సంవత్సరములో జన్మించెను. అతని తండ్రి ధనవంతు డైన ఒక కసాయి వాడు. తామసు చిన్ననాటి నుండియు చుఱుకైన వాడు. చిన్నచదువు లైన తరువాత అతడు పెద్ద చదువు కోసము ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయమునకు పోయి, విద్యార్థికోటిలో నంత బుద్ధిశాలి లేడనిపించుకొనెను. విద్యా



Henry VIII—Painting perhaps by Holbein
(By kind permission of the National Portrait Gallery, London)

పూర్తి చేసికొని వుల్సీ మతప్రబోధకుడై సోమరుసెట్టులోని "లిమింగుటను" (Lymington) లో నివాస మేర్పరచికొని పేరు గడించెను. ఎనిమిదవ హెన్రీ ఆతని ఖ్యాతి విని రాజాస్థానమునకు పిలిపించి, రాజపురోహితుని జేసి మన్నించుటయే కాక రాజకార్యవిశేషముల గూడ అతనితో మంతన మాడదొడగెను. రాజాశ్రయమున వుల్సీకిని అభ్యుదయపరంపర లభించెను. 1513-వ సంవత్సరములో నతడు "టూార్నె" "లింకాను" (Tournai and Lincoln) అను రెండు ప్రదేశములకు బిషప్పు ఆయెను; ఆ మఱుసటి యేడే (1514) యార్కులో ఆర్చిబిషప్పు ఆయెను. పోపు కూడ, అతని సమర్థతకు మెచ్చి కాతలిక్కు చర్చికి "కార్డినలు" (Cardinal) గా జేసెను. పదపడి వుల్సీ, ఇంగ్లాండులో పోపునకు ప్రతినిధిగా వ్యవహరించెను.

అతనికి కాలక్రమమున ప్రతిష్ఠతోపాటు ధనసంపదయు పెరిగెను. కలిమికి దానభోగములే ఫలము లని యెంచి, అతడు సమస్త భోగములు అనుభవించి ఒరులకు చేతి నిండ దానము చేసెడివాడు. విలువ గల చీనిచీనాంబరముల ధరించుట, రసోపేతము లైన విందులు గుడుచుట, పరివారపరివృతుడై తిరుగుట మొదలగు రాజభోగములయందు అతనికి ప్రీతి మెండు. రాజసమునకు అనుగుణముగా అతనికి ఒక ఉన్నతప్రాసాదము గలదు. కొన్నినాళ్లకు, దానిని వుల్సీ రాజునకు కానుకగా సమర్పించెను. అతని నడవడి చూచి జనులు చాలమంది రాజుకంటె నతడే మిన్న యని భావించిరి. ఒక సమయమున అతడు పోపుపదవికి గూడ నిగూఢయత్నములు చేసెను. కాని అది లభింపలేదు. అతడు కేవలభోగియే కాదు విద్యాపక్షపాతియు, "ఇప్సువిచ్చి" (Ipswich) అను చోట నొకటియు,

ఆక్సుఫర్డులో నొకటియు రెండు కళాశాలల స్థాపించెను. ఆక్సు ఫర్డు దానికి "కార్డినలు కాలెజి" అని పేరిడెను. అదియే నేటి "క్రైస్తుచర్చి" కాలెజి.

ఇంతలో వుల్సీకి దశ తిరిగినది. హెన్రీ అతని జూచి ఓర్వలేక పోయెను. దానికి తగినట్లుగా హెన్రీ తన భార్యయైన "కాతరిను" అను నామెను వదలిపెట్ట సంకల్పించినప్పుడు వుల్సీ పోపుతో చెప్పి అనుమతి యిప్పింప లేకపోయెను (1529).

సమర్థుడయ్యు తన మనోరథము నెరవేర్ప డయ్యె నను మిష కల్పించి హెన్రీ వుల్సీని పదభ్రష్టుని జేసి రాజద్రోహి యని నేరము మోపెను. రాజభటులు అతనిని నిగ్రహించి, లండనునగరగోపురమునకు కొని పోవుచుండ మార్గమధ్యమున నతడు ప్రాణములు వదలెను.

## వుల్సీ ఫ్రెంచివారి మైత్రి

వుల్సీ 1510-వ సంవత్సరము మొదలు 1527-వ సంవత్సరము వఱకు ఏకదీక్షగా హెన్రీకి పరరాజ్యములయెడ అవలంబింప దగిన నీతినిగూర్చి బోధించెను. ఆ కాలమున ఫ్రాన్సుదేశమును స్పెయినుదేశమును చాల ప్రబలములుగా నుండెను. ఆ రెంటితో పోల్చి చూచిన ఇంగ్లాండునకు ప్రాధాన్యమే లేదు. ఆ రెంటిలో ఏ రాజ్యము అభివృద్ధి నొందినను ఇంగ్లాండునకు సంకటమే యగును. అందును స్పెయినురాజ్యము నమ్మదగినది కాదు. అది పెరుగుట, ఇంగ్లాండు విరుగుట. కావున, వుల్సీ స్పెయినుమీద ఎత్తిపోవు ఫ్రాన్సునకు ఇంగ్లాండు సాయము చేయుట నీతి యని నిశ్చయించెను. ఆ రెండుదేశములను ఏక కాలముననే మాన్పించుటకు స్పెయిను




Cardinal Wolsey - Painter Unknown
(By kind permission of the National Portrait Gallery, London)

చాలదు. ఒకవేళ ఫ్రెంచివారు ఇంగ్లీషు వారి సాయమున స్పెయినుదేశమును అణచి మిక్కిలి ప్రబలులు కావచ్చును. అదియు ఇంగ్లాండునకు మోసమే. అప్పుడు ఇంగ్లీషువా రేమి చేయవలెను? "అప్పటి, వారు, స్పెయిను పక్షమవలంబించి ఫ్రాన్సును త్రొక్కవలెను" అని వుల్సీ మతము. ఈ కల్పన వలన ఇంగ్లీషువారితోడి మైత్రి చెడనాయకు విడనది కాదని ఆ రెండురాజ్యములకును గోచరించును. తమసాయము ఆ రెండు దేశములలో ఏదేశమునకు లాభకర మైనను ఇంగ్లీషు వారికి ప్రాధాన్యము లభించి తీరును.

అనుకొన్నట్లుగా యుద్ధములు తటస్థించెను. స్పెయిను రాజును పోపును కలిసి ఫ్రాన్సుతో డీకొనిరి. ఫ్రాన్సునకు స్కాటులాండు సాయము వచ్చెను. హెన్రీ స్పెయినుపక్షమున నిల్చి, "స్పర్సు" యుద్ధములో ఫ్రెంచివారిని, "ఫ్లాడెను" యుద్ధములో స్కాటులాండువారిని ఓడించెను. (Battle of Spurs and Battle of Flodden 1513.) జయము లభించిన తోడనే హెన్రీకి యుద్ధవిముఖత కల్గెను. ఏమన, కష్టము తన వంతును లబ్ధి స్పెయినురాజు వంతును పోపు వంతును అగుట అతనికి నచ్చ లేదు. మొదట వుల్సీ అనుకొన్నట్లుగా స్పెయిను రాజ్యమునకు బలాధిక్యమును గలుగు చుండెను. కావున ఆ స్థితిలో హెన్రీ, స్పెయినును విడిపుచ్చి ఫ్రాన్సుతో చేర వలెను. కాని ఇంగ్లండు నకును ఫ్రాన్సునకును మూడు వందల యేండ్ల నుండి మైత్రి లేదు. అఘటనఘటనాసమర్థు డైన వుల్సీ ఆ రెండు రాజ్య ములకును మైత్రి పొసగించుటకు ఇంకొక కల్పన చేసెను. (1515). హెన్రి సోదరి యగు "మేరీని" ఫ్రెంచిరాజగు "పం డ్రెండవ లూయీ"కి ఇచ్చి పెండ్లి చేసిరి. కాని ఆ రాజు

పెండ్లియైన యేటనే చనిపోయెను. ఆ బాంధవము చెడకుండ పట్టవలె నని, హెన్రీకుమార్తె యగు "మేరీని," కాబోవు ఫ్రెంచి రాజున కిచ్చి పెండ్లిచేయు ఏర్పాటు చేసిరి.

మూడు వందల యేండ్లనుండి యున్న వైరము, ఈ అతుకులమారి బాంధవములవలన సమసిపోవునా? 1521-వ సంవత్సరములో ఈ కృత్రిమమైత్రి భగ్నమైనది. 1519-వ సంవత్సరములో "ఐదవ ఛార్లెసు" అను స్పెయినురాజు "పవిత్రపు రోమను చక్రవర్తి" యై, జర్మనీ ఆస్ట్రియా దేశముల గూడ పాలింప దొడగెను. ఆతని సమున్నతి ఇంగ్లాండునకు అనర్థదాయకమే యయ్యె, హెన్రీ యతని పక్షమును 1525-వ సంవత్సరము వఱకు వీడనే లేదు. ఆ యేడు ఛార్లెసు, ఫ్రెంచి రాజును "పావియా" యుద్ధమున (Battle of Pavia) ఓడించి బందీకృతుని జేసెను. దానితో స్పెయినురాజ్యమునకును, ఇంగ్లాండునకును, పొత్తు చీలిపోయెను. 1527-వ సంవత్సరములో ఐదవఛార్లెసు, రోము పట్టణమును ముట్టడించి లోగొని "ఏడవ క్లెమెంటు" (Clement VII) అను పోపును పట్టుకొని చెఱలో నుంచెను. ఈ యవకాశముల వలన వుల్సీ ఫ్రాన్సునకును ఇంగ్లాండునకును చెడిపోయిన మైత్రిని మరల అతికెను.

ఇంతికును, ఎనిమిదవ హెన్రీ కాలమున ఫ్రెంచివారితోడి మైత్రికి యత్నములు మాత్రము జరగినవే కాని శాశ్వతమైన అవిరోధభావ మేర్పడ లేదు. కాని ఆ ప్రయత్నముల సూచన యేమనగా, ఇంగ్లీషు వారికి ఫ్రాన్సును వశపఱుచుకొను ఆసలు పోయిన వనియు, యూరపుఖండమున క్రొత్త భూములు సంపాదించు తలంపు వారికి లే దనియు.

అర్మేడ్యా, పదునేడు పదునెనిమిది సంవత్సరపు శతా బ్దుల ఫ్రాన్సు అప్రతిహతమైన బలాధిక్యమును చూపుచుండ ఇంగ్లండు ఇంకొక మారు ఆ దేశముతో యుద్ధము చేయ వలసి వచ్చెను. పదునారవ శతాబ్దిలో ఇంగ్లండునకు ముఖ్య శత్రువు స్పెయినుగాని ఫ్రాన్సు కాదు. నూతనప్రపంచమున కనిపట్టిన దేశము లన్నియు "పోర్చుగలు" వారును "స్పెయిను" వారును రెండు వంతులుగా పంచుకొని యనుభవింప సాగిరి. ఇంగ్లండు స్పెయినుతో పోరాడి జయము గొనుటవలన, ఈ దేశమునకు కూడ, ఆ క్రొత్తభూములు కొన్ని లభించెను. అది మొదలుగా, ఇంగ్లీషువారు నానాదేశలకు పోయి క్రొత్త భూముల నాక్రమించుకొని రాజ్యములు స్థాపించి, సామ్రాజ్య మును ప్రతిష్ఠింప సాగిరి. నాటితో వారికి వ్యాపారమును లోప ఱుచుకొనవలె నన్న సంకల్పము పోయినది.

### హెన్రీకి పోపుతోడి సంబంధము

ఇంగ్లీషువారిలో కొందఱు కాతలిక్కుచర్చి వారి మాట లను, మఱి కొందఱు వారి చేతలను తిరస్కరింప దొడగి రని చెప్పితిమి. హెన్రీ కూడ స్వప్రయోజనపరుడై, పోపువారి తలగొట్టుటకు యత్నించెను. పోపువారి తప్పించుకొనుట కడు దుర్ఘట విషయము గనుక, రాజు ప్రొటెస్టెంటుల యొక్కయు, సంస్కరణపరాయణుల యొక్కయు ప్రాపు సంపాదించెను. అంత మాత్రమున అతడు, ఇంగ్లీషు చర్చి వారి బోధనలు సంస్కరింప దలపలేదు; తనకు కాతలిక్కుమతము నందు గాఢ మైన భక్తి యుండె నని యతని తలంపు, ఆ మతమును ఖండిం చుచు లూథరు వ్రాసిన వ్రాతల పూర్వపక్షము చేసి హెన్రీ

ఒక పుస్తకము కూడ వ్రాసెను. పోపు దానికి చాల మెచ్చి అతనికి "స్వమత స్థాపకుడు" అను బిరుదము కూడ నిచ్చెను. ఆ బిరుదాక్షరములు నేటికిని ఇంగ్లీషు నాణెములమీద కాన నగును. అతని యేలుబడిలో కాతలిక్కు మతధర్మములు తక్క ఇంగ్లీషు చర్చివారిని వేఱు ధర్మములు బోధింప నీయ లేదు.

హెన్రీ వితంతువధూనికను (Catherine of Aragon) పెండ్లియాడుట, అశాస్త్రీయ మైనను అప్పటి పోపు ఆ కార్యమునకు ఎట్లో ప్రత్యేకముగా అనుజ్ఞ యిచ్చెను. తన యనంతరము తన కుమారుడు రాజు కావలె నని హెన్రీ కోరిక. కాని కాతరినునకు పుత్రసంతానము పుట్ట దయ్యెను. ఆ లోపము సోదర భార్యను వివాహ మాడిన తన పాపమునకు ఫల మని యెంచి దానిని రద్దు చేయు మని "ఏడవక్లెమెంటు" అను పోపును అడిగెను. కేవలము రద్దు చేయు మని కోరుటయే కాదు; మతవిరుద్ధ మైన యీ దాంపత్యము ఏదో సంబంధము కావగును కాని, వివాహ బంధము కాదని ప్రకటింపు మనెను. ఈ యకార్యము సాధించవలసిన భారము వుల్సీ నెత్తిని పడినది.

పోపునకు ఏమి చేయుటకును తోచలేదు. అతడు రాజు కోరి నట్లు చేయునా, పూర్వపు పోపు ధర్మవిరుద్ధము చేసె నని చెప్పి నట్టు లగును. చేయడా, స్వమతస్థాపకుని మాట మన్నింప నట్టు లగును. అదిగాక కాతరిను ఐదవఛార్లెసునకు మేనత్త. ప్రస్తుతము పోపుకూడ ఛార్లెసు చేతులలో బడి కారాగారమున నుండెను. తన మేనత్తను పోపు అవమానపఱచుచుండ ఛార్లెసు చూచుచు నూరకుండడు. ఈ స్థితిలో క్లెమెంటు, హెన్రీ మాటలు ఆమోదసూచకముగా చెవి యొగ్గి విను

చున్నట్లే నటించెను గాని, కావలసిన మాట మాత్రము అన లేదు. వుల్సీ నొక్కి చెప్పినను లాభము లేకపోయెను. ఈ మిషచేతనే హెన్రీ వుల్సీని నాశము చేయుట.

ఇంగ్లీషుచర్చికి పోపు యాజమాన్యము తొలగించి, తాను ఆ పదవి పొందుచో ఒకని యనుజ్ఞ వేడకయే తన పని తాను సుకరముగా చేసికొన వచ్చు నని యెంచి, హెన్రీ తత్ప్రయత్నములు సాగించెను.

1529-వ సంవత్సరములో నతడు, పార్లమెంటుసభను సమకూర్చి, అందు చర్చివారి పరోక్షాధికారములను, బహుపదవీభావములను నిషేధించు నట్టియు, వారి కిచ్చు సొమ్ము తగ్గించు నట్టియు శాసనములు చేయించెను. దానివలన నైనను పోపు లొంగి వచ్చు నని అతని యాశ. కాని పోపు చలింపలేదు. పార్లమెంటు సభ మరల కూడెను (1531). ఇంగ్లీషు చర్చికి అధిపతి హెన్రీయే యని, కాంటరుబరీ మతబోధక వర్గమువారిచే బలవంతముగా ననిపించిరి. మరల 1532-వ సంవత్సరములో రాజు తన సమ్మతి లేక చర్చివారు మత సంబంధము లైన చట్టములేమియు చేయ రాదని ఉత్తరువు చేసెను. మరల 1533-వ సంవత్సరములో పార్లమెంటు కూడి, "ఇంగ్లీషు వా డెవ్వడును రోమునకు, విజ్ఞాపనలు పంపు కొన రాదు" అని తీర్మానించెను. అనగా చర్చికోర్టులలో అన్యాయము జరిగినను పోపుతో చెప్పికొనరా దనుట. ఈ తీర్మానము కాతరినుకొరకే ఉద్దిష్టమైనది. రాజు తనను విడ నాడినను ఆమెకు మతాధికారియైన పోపుతో చెప్పికొను నవకాశము పోయినది. ఆ సంవత్సరమే "క్రాన్మరు" (Cranmer) అను కాంటరుబరీ ఆర్చిబిషప్పు, రాజు "ఆనీబోలిను" (Anne Boleyn) అను నామెను వివాహ

మూడ వచ్చు నని ప్రకటించెను. ఈ పెండ్లికూతురు కాత్తరిను నంతఃపురపరిచారిక.

1534-వ సంవత్సరపు పార్లమెంటుసభ "ఇంగ్లీషు ప్రజలు పోపునకు ఏ విధమైన సొమ్మును చెల్లింపరాదు" అని నిషేధించెను. ఆ యేడే "అధిపత్యశాసనమును" జేసిరి. అనగా హెన్రీయే చర్చికి అధిపతి యనుట. ఆ శాసనము నామోదించుచు దేశప్రముఖు లందఱు ప్రమాణము చేయవలసి వచ్చెను. "సర్ తామసుమూరు" ప్రమాణము చేయ నిరాకరించి నందులకు అతని శిరము ఖండించిరి. "ఫిషరు" అను నింకొక బిషప్పునకును (Bishop Fisher of Rochester) ఆ గతియే పట్టెను.

## తామసు క్రాంవెలు. (Thomas Cromwell)

ఈ క్లిష్ట దశలో "తామసు క్రాంవెలు" మొదటనుండియు హెన్రీకి సహాయుడై నిలచెను. అతని తల్లిదండ్రులు కడు పేదవారు. తొల్త నతడు ఇటలీయుద్ధములలో ఒక భటుడుగా జేరెను; పిమ్మట వెనీసులో ఒకవర్తకు నొద్ద గుమాస్తాగా నుండెను; పదపడి స్వయము తానే ఉన్నివర్తకము సాగించి ధన మార్జించెను; మఱి ఆ ధనమును వడ్డీల కిచ్చి పెంచి గొప్ప భాగ్యవంతు డాయెను; మఱి కొంతకాలమునకు ధర్మశాస్త్రము (Law) చదివి పరీక్ష యిచ్చెను. తుదకు క్రాంవెలు పార్లమెంటు సభ్యుడు గూడ నయ్యెను. 1528-వ సంవత్సరములో నతడు వుల్సీ క్రింద ఉద్యోగము సంపాదించి వుల్సీ మరణపర్యంతము అతనిని భక్తిపూర్వకముగా కొల్చు చుండెను. సమర్థుడును పలుకుబడి గల వాడును అగు క్రాంవెలు మూలమున, తన ప్రయోజనములు నెరవేర్చు కొన వచ్చు నని యెంచి, హెన్రీ కొంత



Archbishop Cranmer—Painting by G. Flicke
(By kind permission of the National Portrait Gallery, London)

కాలము అతని యుపదేశానుసారము వర్తించెను. రాజునకు "అనీ బోలిను" తోడి వివాహామునకు "క్రాన్మెరు" అనుజ్ఞ యిచ్చుట క్రాంవెలు మూలముననే. "అధిపత్యశాసనము" వలన హెన్రీకి చర్చి అధ్యక్షపదవి లభించి నప్పుడు క్రాంవెలు ఉపాధ్యక్షు డయ్యెను. ఈ విధముగా రాజు పోపుబారి తొలగు యత్నములలో క్రాంవెలు ఏదో సాయము చేయుచునే యుండెను; దానికి ప్రతిఫలముగా హెన్రీకూడ అతనిని తడవ తడవకు బహూకరించుచునే యుండెను. దేశమున రాజాధికారమునకు మించి ఇంకొకరి యధికారము ఉండరా దనియు, రాజాజ్ఞ ప్రజలకు శిఖరీభూతము కావలె ననియు క్రాంవెలు సంకల్పము. ఈ సంకల్పము నెరవేరుటకు "అధిపత్యశాసనము" ఒక సాధనము. ఆ శాసనార్థమును యథావిధిగా ప్రజలెల్లరును అనుష్ఠించి తీరవలెను. అవిధేయులకు మరణమే శిక్ష. "మూరు"ను "ఫిషరు"ను మరణించుట అట్టి అవిధేయత వలననే. వారి మరణమునకు కారకుడును క్రాంవెలే. ఇటువంటి కార్యములవలననే క్రాంవెలునకు "పరమక్రూరుడు" అను దుష్కీర్తి వచ్చెను. మతసంస్కరణముమూలమున చర్చిమీది అధికారమే కాక ధనముగూడ గైకొన వచ్చు నని, క్రాంవెలు హెన్రీకి ఉపదేశించెను. ఆ యుపదేశానుసారముగా రాజు మఠముల ఇనాములును తక్కగల ఆస్తులను తన వశము చేసికొనెను. 1543-వ సంవత్సరమువఱకును క్రాంవెలుమాట అప్రతిహతముగా నెగ్గి తీరెను. కాని తుదకు అతనికి రాజు ఎదురుతిరిగి క్రూరదండన విధించెను. ఎట్లనగా—క్రాంవెలు "అనీ ఆఫ్ క్లీవిసు" (Anne of Cleves) అను ఒక జర్మను రాచ యువిదను హెన్రీకి నూత్నవధువుగా సంబంధము కుదిర్చెను. తత్పూర్వము రాజు,

ఆ కన్యను చూచి మోహముగను. తరువాత, సంబంధము కుదిరి పెండ్లియై వధూవరులు లోపములు చూచికొనిరి. ఆమె మొగము చూడగనే హెన్రీకి క్రాంవెలు మీద పెక్కుడులేని కోపమును వచ్చి అతనిపై రాజద్రోహి యను నేరము మోపి తల నఱకించెను.

## మఠముల ధ్వంసము 1536—1539 సం॥

మఠములవారు సోమరులై తమ ధర్మముల తాము నెరవేర్చుట లేదని చాలకాలముగా వారిమీద ఒక నింద యుండెను. మతస్థాపకులు ఏ యుద్దేశములతో అవి నెలకొల్పిరో, ఏ యే నియమములు చేసి పోయిరో, అవి యన్నియు ఇటీవలివారు గమనింపక మఠములకు దుర్గతి తెచ్చిరి. మఠస్థుల సంఖ్యయు తగ్గిపోయెను. ఉన్న వారైనను కర్తవ్యపరాయణులు గాక గ్రామముల వెంట సుఖసంచారములు చేయ దొడఁగిరి; ఏమేని కొంచెము మతకార్యములు చేయవలసి యున్నచో ఆ కార్యములను తమ నౌకరులచే జేయింప జొచ్చిరి. మఠముల వశమున పెక్కు మడిమాన్యములును, వెండిబంగారులును ఉండును గనుక, నౌకరులకు జీతము లిచ్చుట వారికి సుకరమే యయ్యెను. మఠములు ధర్మపాఠశాలలు పెట్టి నడప వలె నని పూర్వనియమము. కాని నేఁడు, చదువుకొన దలచు బాలురున్నను బడులు పెట్టదలచు మఠములు లేవు. ఈ విధముగా మఠములు నిష్ప్రయోజకములై పోవుటయే కాక కొందఱు మఠస్థులు దుర్నయవృత్తికి గూడ జొచ్చిరి.

బిషప్పులకు, మఠములపై నధికారము లేదు. మఠముల సర్వాధికారి తానే కాని ఇతరులకు అందు జోక్యము లేదని పోపు నానతి. కావుననే ఇంగ్లీషుచర్చి పోపునధికారమును

త్రోసిపుచ్చినను, ఇంగ్లీషుమఠములు మాత్రము ఇంకను అతనికి లోబడియే యుండెను. కనుక మఠముల సంస్కరించుట రాజువశము లేని పని. అప్పుడు క్రాంవెలు మఠముల మూయింపుమని హెన్రికి ఉపదేశించెను. వుల్సీ కూడ అందుకు సమ్మతించి మఠస్థుల దుర్వర్తనమును గుఱించి, ఎంతో సాక్ష్యము సమకూర్చెను. రాజోద్యోగులు కొందఱు, మఠముల ప్రవృత్తిని గూర్చి విచారించి వచ్చుటకు దేశమెల్లెడల తిరిగి, మఱి కొంత సాక్ష్యము ప్రోగుజేసిరి. ఈ యుద్యోగులు కొన్ని లేని పోని అసత్యములను గూడ మఠములపై కల్పించి చెప్పిరి. అగుగాక; రాజు తలచిన ప్రయోజనము నెరవేఱుటకు అవి అక్కరకు వచ్చును గనుక, సత్యాసత్యవివేచనతో పని లేక పోయెను. 1536-వ సంవత్సరములో మూడు వందల డెబ్బది యాఱు చిన్న మఠములు మూయించిరి. మఠస్థులు తమ బ్రతుకుతెరువు తాము చూచికొన వలసివచ్చెను. వారికి ఇతర విద్యలు రావు గనుక బిచ్చ మెత్తి కొనిరి. ఈ మఠధ్వంసము వలన ఇంగ్లాండు నుత్తరభాగమున నొక తిరుగుబాటు లేచెను. దానికి "కరుణయాత్ర" అని పేరు. మఠముల వారి పనిపట్టించినట్టుగానే రాజు చర్చివారి పని గూడ పట్టించబోలు నని పెక్కురు ప్రజలు భయపడి, అట్టి అనర్థకము రాక మున్న ప్రతిక్రియా మార్గము చూడవలె నని తిరుగుబాటులో తామును కలిసిరి. ఎంతమంది కలిసిన నేమి ప్రయోజనము? ఆ విప్లవమును అణచుటకు ఎంతో సేపు పట్టలేదు. 1539-వ సంవత్సరములో మిగిలిన పనియు పూర్తి యయ్యెను. ఆ యేడు రెండు వందల యేబది పెద్ద మఠములు మూయించిరి. మఠముల స్థిరచరరూపమైన ఆస్తి యంతయు రాజవశ మయ్యెను.

ఆ భూముల వలన ఏడాదికి తొంబది వేల పౌనుల ఆదాయము వచ్చెను. రాజు ఈ క్రొత్తరాబడిని పెక్కు విధముల వినియోగించెను. కొంత సొమ్ముతో సముద్రతీరభూముల దుర్గములు కట్టించెను; కొంత ఆక్సఫర్డు, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయపండితులకు జీతముల క్రింద నిచ్చెను; మఱి కొంత, అప్పుడు క్రొత్త బిషప్పుల నియోగించి వారికిగాను వెచ్చించెను. పండితులకును బిషప్పులకును ఇచ్చిన మొత్తము చాల తక్కువ. మిగిలిన ధనమును అతడు తనకు అనుకూలు రైన వేయిమందికి కాన్కలుగా పంచి యిచ్చెను. ప్రజలకు కానుక లిచ్చి వారిని వశపఱచుకొనుట, అతనికి తండ్రి నాటి యాచారము. రాజోద్యోగములలో ప్రభుజాతి యుండ కూడ దని హెన్రి యుద్దేశము. అతనిచే బహూకృతు లైన వారందఱు నడిమితరము వారే. వుల్సియు క్రాంవెలును ఆ జాతిలోని వారే. సామాన్యులకు ధనము లిచ్చుచో కాలక్రమమున ఆ ధనములు పెంపొంది వారును సంపన్నులై, రాజువలన నింతవార మైతి మని కృతజ్ఞతయు భక్తియు నెఱపుదురు. సామాన్యులకు కాన్కలిచ్చుటలో రాజు త్రొక్కిన నీతిపథ మిదియే.

## సంస్కరణ ఫలితములు

రోమనుచర్చి యధికారమును త్రోసిపుచ్చుటకు హెన్రి చేసిన యత్నములలో పార్లమెంటుసభయు అతనికి చేదోడు ఆయెను. పరదేశీయు లైన పోపునకు లోబడి యుండుటయు, ప్రతిమతవ్యవహారమందును అతడు వ్రేలు పెట్టు చుండుటయు, పార్లమెంటువారికిని గిట్టని పనియే కనుక, వారు రాజుతో నేకీభవించిరి. దానివలన నాల్గవ యెడ్వర్డు కాలమున పోయిన

స్వాధికారమును పార్లమెంటువారు మరల పొంద గలిగిరి. ఇతర వ్యవహారములయందుగూడ వారు రాజునకు అనుకూలురు అయియే వర్తించిరి. "రాజాజ్ఞయే, శాసనము" అని 1539-వ సంవత్సరములో పార్లమెంటు ఒక ప్రకటనను గావించెను. పార్లమెంటువారానుకూల్యమువలన రాజాధికారమును హెచ్చెను. అతనికి మతవిషయమున పరుని బారితప్పినది. ఇతర విషయములం అతని మాటయే శాసన మైనది. కనుక రాజు సర్వతంత్రస్వతంత్రుడాయెను. అతడు ప్రజలకు, ఏలికయే కాక మతగురువు గూడ నయ్యెను. అతనికి రాజ్యపాలన మెట్టి కర్తవ్యమో, చర్చిపరిపాలనయు నట్టి కర్తవ్యమే. పరాధీనత తొలగినది కనుక, ప్రజలెల్లరు ఇంగ్లీషు చర్చిని ఆశ్రయింపవలసినదే. ప్రాచీనతాపక్షపాతము వలన ఎవ్వడేని ఇంగ్లీషుచర్చిని ఆశ్రయింపనిచో వాడు దేశద్రోహియే. నాడు మొదలు 1689-వ సంవత్సరము వఱకు గూడ మతవిషయిక మైన ఆ నిర్బంధము అట్టే యుండెను. ఆ మధ్యకాలములో రాజమతము దక్క ఇతరమతము నాశ్రయించిన వానికి క్రూరశిక్ష తప్పలేదు. ఇది సంస్కరణము వలని ప్రధానఫలితము.

రెండవ ఫలితము బైబిలు భాషాంతరీకరణము. "టిండేలు" "కవర్డేలు" (Tyndale and Coverdale) అను ఇద్దరు పండితులు బైబిలును, ఇంగ్లీషుభాషలోనికి మార్చిరి. ఇంగ్లీషుబైబిలు యొక్క ప్రతులు, ఎల్ల చర్చిలలోను ప్రజోపయోగార్థము పెట్టి యుండవలె నని 1538-వ సంవత్సరములో రాజాజ్ఞ యయ్యెను. దేశభాషలో క్రొత్తగా బైబిలు వెలసెను గనుక ఎల్లరును దానిని చదువ సాగిరి. ఆ చదువు కూడ ఒక విధ

ముగా అనర్థహేతువే యయ్యెను. నమన ఇంగ్లీషుచర్చి వారి యాచారములు గ్రంథస్థవాక్యములకు విరుద్ధములుగా నుండె ననియు, అవి ప్రామాణికములు గావనియు ప్రజలు అనుకొన జొచ్చిరి. పరస్పరవిరుద్ధములైన ఆ రెండు పద్ధతులవలనను ప్రజలకును వింత బుద్ధులు పుట్టి, తమంత, స్వతంత్రాలోచనలు చేసి క్రొత్త ఆచారములు ప్రారంభించిరి. మఱికొందఱు బిషప్పులకు మతపరిపాలనాధికారము ఉండ గూడదు అనిరి. కనుకనే, 1543-వ సంవత్సరములో ఇంకొక మారు హెన్రీ వేఱు విధముగా శాసించెను. ఆ శాసనార్థము "పెద్ద మనుష్యులు తక్క ఇతరులు, అనగా, పంటకాపులు, కూలివాండ్రు స్త్రీజనము, మొదలగువారు బైబిలు చదువ గూడదు" అని.

## హెన్రీ తుదిదినములు

హెన్రీ పరిపాలనలో జరగిన మహాకార్యము మతసంస్కరణము. అంత వఱకు అతని చరిత్ర సమంజసముగానే యున్న దని చెప్పవచ్చును. కాని తదుపరి, అతని నడత యంతయు కళంకితమే యయ్యెను. "ఆనీబోలీను" పరానురక్త యయ్యె నన్న నింద మోపి, 1537-వ సంవత్సరములో అతడు ఆమె తలకొట్టించి "జేను సేమూరు" (Jane Seymour) అను నామెను పెండ్లి యాడెను. హెన్రీ కోరిక ఆమె వలన నెరవేరినది. అతనికి ఆమెయందు యువరాజు జనించెను. వాని పేరు ఎడ్వర్డు. పదపడి ఆమెయు మరణించెను. అప్పుడే క్రాంవెలు వికారరూపిణి యైన జర్మనురాచకన్యను మాటలాడి, రాజునకు పెండ్లి చేసి, ప్రాణములు గోలుపోయినది. హెన్రీ ఆ మందభాగ్యురాలిని విడిచిపెట్టి, "కాతరిను హొవార్డు" (Catherine

Howard) అను ఇంకొక ఆమెను పెండ్లి యాడి మఱునటి యేడే ఆమె తలను గొట్టించెను. ఆమెకును పరానురక్త యయ్యె నను నింద యే. 1543-వ సంవత్సరములో నతడు "కాతరిను పారు" (Catherine Parr) అను ఇంకొక ప్రౌఢను పెండ్లి యాడెను. ఆమెకు అది మూడవ పెండ్లి. తత్పూర్వము, ఆమెకు ఇద్దరు మగలు గతించిరి. మూడవ మారు కూడ ఆమెకు వైధవ్యము తప్పలేదు. ఆమె యుండగనే హెన్రీ గతించెను.

క్లెవిసు డ్యూకు (Duke of Cleves) ప్రొటస్టెంటు మతము వాడు. వానికిని హెన్రీకిని గల సంబంధమునుబట్టి, హెన్రీ ప్రొటస్టెంటు వారితోడి మైత్రి యభిలషించినట్లు తోచెనుగాని, పదపడి యాతడు కాతరిను హొవార్డు (Catherine Howard) ను వివాహమాడుటను బట్టి అట్టి యూహకు అవకాశము లేక పోయినది. ఏమన కాతరిను హొవార్డు కాతలిక్కు మతావలంబిని. ఆ మతమునందు ఆమెకు మిక్కిలి పట్టుదల గూడ కలదు. పిమ్మట, 1539-వ సంవత్సరములో "సిద్ధాంత షట్క శాసనము" (Statute of Six Articles) చేయబడెను. ఈ శాసనమున రోమను కాతలిక్కు మతవిషయికము లైన ఆఱు ప్రధానసిద్ధాంతములు గలవు. వానిని ఇంగ్లీషు చర్చి వారు ప్రజలకు నియతముగా బోధింపవలె నని ఆ శాసనాదేశము.

అంత్యకాలమున హెన్రీ స్థూలశరీరుడును రోగియు నయ్యెను. క్రమముగా నతనికి తనంత లేచి నడయాడు శక్తియు ఉడిగెను. చేయూత లేక నిలబడు నోపికయు పోయెను. తుది దినములలో నతని కొరకు త్రోపుడుకుర్చీ యేర్పాటు చేసిరి. దానివలన నెట్లో కాలము గడచుచుండెను. తుదకు 1547-వ

సంవత్సరములో సతడు గతించెను. ఇంతకును ఎనిమిదవ హెన్రీలో లోకము కొనియాడదగిన గుణ విశేషములు లేవు. అయినను, అతనికాలమున దేశము తొల్లింటికంటె ఎక్కుడు శక్తిసంపన్న మయ్యె ననుటయే అతని యేలుబడివిశేషము.

## ఆఱవ ఎడ్వర్డు. (Edward VI 1547—1553 సం॥)

ఆఱవయెడ్వర్డు జేను సేమోరు (Jane Seymour) కుమారుడు; రాజ్యమునకు వచ్చు నప్పటికి అతనికి తొమ్మిదియేండ్లే వయస్సు. పదవడి, ఆ యేండ్లలోనే యతడు మరణించెను. అతని కాలములో రాజ్యమును ప్రభువులలో నెవరో యొకడు ఏలుచుండెను. అట్టి వానికి "ప్రభు గోప్త" అని పేరు. ఆ ప్రభుగోప్తలలో మొదటివాడు సోమరుసెట్టు డ్యూకు. ఇతడు ఆఱవయెడ్వర్డునకు పిన తండ్రియే. ఇతనికి రాజ్యపాలనాదికముల మంచి యుద్దేశములే కలవు గాని, దురదృష్టవశమున ఇతని యేలుబడి యంతయు అలజళ్లతోనే సరిపోయెను.

అయిదవ జేమ్సు చిన్న కుమార్తె యైన మేరీని (Mary, Queen of Scots) ఎడ్వర్డున కిప్పించి పెండ్లి చేయవలె నని సోమరుసెట్టు తొల్త సంకల్పించెను. ఆ మేరీ తల్లి (The French Mary of Guise) ఫ్రెంచివారి ఆడుపడుచు. ఆమెకు తనపిల్లను ఎడ్వర్డున కిచ్చుటకు ఇష్టము లేదు. స్కాటులాండులో గల ఒక ఫ్రెంచి వర్గము వారు ఆమెకు బాసటయై నిలిచి, ఈ యింగ్లీషు బాంధవమును నిరాకరించిరి. దండోపాయమున గాని కార్యము చక్కబడదని యెంచి, సోమరుసెట్టు సేనల గూర్చుకొని స్కాటులాండు మీద ఎత్తి నడచెను (1547). స్కాటులాండు వారిని బలిమిచే లోగొని యీపెండ్లి చేసి తీరవలె నని యాంతని

తలంపు. పింకీ క్లూఫ్ (Pinkie Cleugh) వద్ద రెండు పక్షముల వారును తారసిల్లిరి. అందు సోమరుసెట్టె గెల్చెను. కాని ఆ పెండ్లి మాత్రము జరగనే లేదు. ఆ కన్నెను ఫ్రెంచియువ రాజు చేసికొనెను. ఈ విద్యుమ వలన ఫ్రాన్సు స్కాటులాం డులకు తొల్లిటి కంటె దృఢతర మైన మైత్రి నెలకొనెను. ఇది సోమరుసెట్టు పాలనలో కలిగిన మొదటి అలజడి.

ఇక రెండవది: — ఇంగ్లండులో భూమ్యాక్రమణములను గూర్చిన తగాదా బయలు దేరెను. ఖండ్రికదారులలో పెక్కు మంది సర్వసామాన్యమైన గ్రామకంఠముల నాక్రమించుకొన జొచ్చిరి. దానివలన ఖండ్రికల వైశాల్యము పెంపొంద జొచ్చెను. అదిగాక, వారిలో చాలమంది పొలముపాటు మానివైచి గొఱ్ఱెల మందల పెంచుకొన దొడగిరి. గొఱ్ఱెల కాపుకొఱకు పొలముపాటునకువలె పెక్కురు పాటు పడ వలసియుండదు. ఆ కతమున కూలి వాండ్రకు పని తగ్గి పోయెను. పనిలేనివాండ్రు కూడుగుడ్డలకు తొల్లిటి వలె మత ములకు పోవు అవకాశము పోయినది గనుక, కూలివాండ్రు బిచ్చ మెత్తుకొన వలసివచ్చెను. ఇది పల్లెలలో కలిగిన అలజడి.

మూడవది, పట్టణములలో కలిగిన అసంతుష్టి. పూర్వపు చేతి పనివాండ్ర సంఘములు, క్రొత్తగా వచ్చి చేరదలచిన వాండ్రవలన ఎక్కువ రుసుము రాబట్టుకొన దొడగెను. మఱియు ఆ సంఘనియమములును మునుపటికంటె కఠినతరము లయ్యెను. ఆ సంఘములయునికి అనర్థదాయక మనియు, నిష్ప్రయోజక మనియు నెంచి సోమరుసెట్టు, వానిని మాపు చేయించి, వానికి గల ఆస్తి వశపఱచుకొనెను. సంఘసభ్యు

లను ఆపత్కాలమున ఆదుకొనుట తత్సంఘ సదాచారములలో నొకటి. ఆ విధముగా, సంఘములు చాల ధనము వెచ్చపెట్టి ఎంతమందికో సాయము చేసెను. ఇప్పు డవి యస్తమించెను. ఆపన్నులకు దిక్కులేదు. ఇది పట్టణముల అసంతుష్టికి హేతువు.

దీనికి తోడు, కొన్ని మతసంస్కారములు కూడ చేసి, సోమర్సెట్టు పట్టణవాసుల అనాదరమునకు మఱియు పాత్రు డయ్యెను. 1549-వ సంవత్సరములో అత డొక నూతన ప్రార్థనాగ్రంథమును ప్రచురించెను. దానికి ఆఱవయెడ్వర్డు యొక్క ప్రథమప్రార్థనాగ్రంథ మని పేరు. అర్చనావిధాన మున గూడ కొన్ని పూర్వాచారములు తొలగించి, ప్రొటె స్టెంటు పద్ధతులు ప్రవేశపెట్టెను. మత విషయిక తంత్రములలో ఇంగ్లీషు భాషనే వాడవలె ననుట ఇంకొక సంస్కారము. చర్చి లలో గల విగ్రహములను, చిత్రములను తుడిచిపెట్టించుట మఱొక సంస్కారము.

ఆ నూతన ప్రార్థనాగ్రంథమును వ్రాసిన వాడు తామసు క్రాన్మెరు (Thomas Cranmer) అను ఒక పండితుడు. అతడు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయమున విద్య నభ్యసించెను. ఎనిమిదవ హెన్రీ, కాతరిను ఆఫ్ అరగను అను భార్యను విడిచిపెట్ట దలచి నపుడు, ధర్మనిర్ణయము కుదరక పెద్ద లందఱు తల కొక మాట చెప్పుచుండ, క్రాన్మెరు ఒక అభిప్రాయమును దెల్పెను. ఏమన, రాజు యూరపుఖండములోని విశ్వవిద్యాలయము లం దలి న్యాయవాదుల సంప్రతించి వారి సమ్మతిమీద రాణిని విడిచిపెట్టవచ్చు నని. ఈ మాట యనుటతోడనే అతని మీద హెన్రీకి అమిత మైన ఆదరము కల్గి, అతని రాజాస్థానమునకు పిలిపించి, తనకు నచ్చిన మిత్రు డని కొనియాడి మన్నించి, ఆర్చి

బిషప్పు వారెహాము చనిపోవగానే (1532) క్రాన్మెరును కాంటబరీ అర్చిబిషప్పుగా నియమించెను. క్రాన్మెరునకు, ఆ మహాపదవి లభింపదగిన యోగ్యత లేకపోయినను, రాజాదరమువలన అది లభించినది. 1533-వ సంవత్సరములో క్రాన్మెరు "హెన్రీ, కాతరినును ఎప్పుడును పెండ్లియే యాడలే"దని, ప్రచురించి, "ఆనీ బోలియను" అను నామెను అభిషేకించి, పట్టమహిషిని జేసెను. ఈ క్రొత్త ఆర్చిబిషప్పు రాజు చెప్పుచేతలకు లోనై వర్తించెడి యస్వతంత్రుడని ప్రజలనుకొనిరి. కాని యతనియుద్దేశ మే మన, ఇంగ్లీషుచర్చికి, హెన్రీయే, అధిపతిగా నుండవలె ననియు, అట్లుండిననే దేశమునకు శ్రేయస్సనియు, మతవ్యవస్థ గూడ రాజునకు లోబడియుండవలె ననియు. పిమ్మట ఆఱవయెడ్వర్డు కాలములో, క్రాన్మెరు, ప్రోటస్టెంటుగా మారెను. తుదకు, మేరీరాణి కాలములో అతనిని సిలువున కాల్చి చంపిరి. అతని మత సిద్ధాంతములు ఎవరికిని నచ్చకపోవుటయే అతని దుర్గతికి కారణము. అతని మతసిద్ధాంతములును, రాద్ధాంతములును అటుండ నిండు, వాని జోలి, మనకేల? వాని స్వభావలోపముల సంగతి మనకేల? ఆతడు వ్రాసిన ప్రార్థనా గ్రంథము మాత్రము, ఆతని వలన మనకు లభించిన యమూల్య రత్నము. సులభకోమలమై, జాతీయమై, రసవంత మయిన అట్టి రచన నేటివఱకును మరల ఇంగ్లీషుభాషలో వెలువడ లేదు. దానిని అనుకరించుటకును ఎవరికిని శక్తి చాలదు.

కేవల పూర్వాచార పరాయణులైన ఆ నాటి ప్రజలకు, ఆ గ్రంథమును, తద్భాషయు నిరుపయోగము లయ్యెను. దాని సొగసు గ్రహించెడి శక్తి వారికి లేదు. దానియెడ వారికి

నిరసనభావమే గాక, విరోధభావము కూడ నేర్పడెను. కారణాంతరములచే పల్లిపట్టణముల రేగుచున్న అలజడికి, తద్గ్రంథ రచనయు ఉపోద్బలకమై, దేశమున రెండు విప్లవములు రేచెను.

1549-వ సంవత్సరములో పదివేలమంది డెవనుషైరు ప్రజలు తిరుగుబాటు చేసి ఎక్సెటరును ముట్టడించిరి (Exeter). క్రొత్తమత మతములో తెచ్చిపెట్టిన మార్పులే వారి తిరుగు బాటునకు కారణ మట. ఆ తిరుగుబాటు నణచుటకు సోమరు సెట్టు కొంతమంది జర్మనుభటులను తెప్పించెను. వారికిని వీరి కిని "స్టోకు" నొద్ద ఘోరమైన యుద్ధము జరిగెను (Battle of Stoke). అందు ఇరుదెసలను కలిసి నాల్గువేల మంది హతులైరి. తుదకు ప్రజాపక్షమే వోడిపోయెను. విప్లవము సద్దుమణ గెను. ప్రజానాయకులు ఉరిదీయబడిరి.

నార్ఫోకులో ఇంకొక తిరుగుబాటు తటస్థించెను. దానికి కారణము మతసంస్కారము కాదు. భూవ్యాక్రమణములును, సంఘుధ్వంసమును దానికి హేతువులు. ఆ విప్లవమునకు రాబర్టు, విలియము కెట్టు అను వారిద్వారు నియంతలు (Robert and William Ket). విప్లావకులు, నార్విచ్చి మీదికి ఎత్తి నడచిరి. నార్విచ్చి, ఇంగ్లండుదేశమున గల సంపన్నపట్టణములలో నొకటి.

ఈ గుంపుతో నైనను, సామమున తగవు తీర్చుకొనుట మంచి దని, సోమరుసెట్టు, వారితో రాయబారములు నడపి సంధియత్నములు చేసెను. ఆ పద్ధతి రక్షకసమితి (Council of Regency) వారికి నచ్చలేదు. అల్పులతో రాయబారములు

సేయుట రాజప్రతిష్ఠకు భంగకరమని వారి యూహ. సోమరు సెట్టు తేలిక మానిసి యనియు, తిరుగుబాటు నణచ లేడనియు నెంచి, ఆ సమితివారు "వార్విక్కు దొర"ను (Earl Warwick) ఆ పనికి నియోగించిరి. అతడును సమర్థతమై, తిరుగుబాటును అణగద్రొక్కెను. పదపడి 1551-వ సంవత్సరములో సోమరు సెట్టు వలన గలిగిన అనర్థకములకు అతనిని చెఱలో నుంచి, ఆ మఱుసటియేడు అతనితల కొట్టించిరి.

## II. నార్తంబరులాండు డ్యూకు, గోత్త యగుట.

వార్విక్కు దొర సుకరముగ ఆ తిరుగుబాటును అణగ ద్రొక్కి సమర్థు డనిపించుకొనెను. ఆ కారణముననే అతనిని ప్రభుగోత్తను జేసి, "నార్తంబరులాండు డ్యూకు" అను బిరుద మిచ్చిరి.

పిమ్మట 1552-వ సంవత్సరములో ఇంకొక ప్రార్థనా గ్రంథము వెలసెను. దానికి ఆఱవయెడ్వర్డు రెండవ ప్రార్థనా గ్రంథ మని పేరు. కాతలిక్కు మతసంబంధి యైన అర్చనా విధానము, ఈ ప్రార్థనాగ్రంథమందు, మొదటి దాని యందు కంటెను ఎక్కువగా తీసివేయబడెను. కాతలిక్కు మతముతో నెట్టి సంబంధమును ఉండగూడ దనియు, ప్రోటస్టెంటుమతము సర్వతంత్ర స్వతంత్రముగా నుండ వలె ననియు బోధించుటయే ఈ గ్రంథ వాక్య సారము. అట్లయ్యు, ఈ తడవ ప్రజావిఘ్నము బయలు దేరనే లేదు. నేడు ఇంగ్లీషుచర్చివారు ఉపయోగించు ప్రార్థనాగ్రంథము, దానికి ప్రతి యనియే చెప్పవచ్చును. 1552-వ సంవత్సరము నాటి గ్రంథమునకును, నేటి గ్రంథము నకును ఎంతో భేదము లేదు.

పొలములు లేమిని తిండికి లేక యల్లాడెడి కూలివాండ్ర దుర్గతి తొలగించుటకు కూడ. నార్తంబరులాండు డ్యూకు కొంత ప్రయత్నము చేసెను. అతడు గొఱ్ఱెలమందల పెంచు నాచారమును అరికట్టెను; ఇంకను పనిలేని వాండ్రకు అన్నము పెట్టించుటకు, చర్చిలో చందాలు వసూలు చేయించెను. నార్తంబరులాండు డ్యూకు అధికార ప్రాభవములు కలవాడు. తుదకు అతని అధికారలోభము మితిమీరి, ఆత్మనాశన హేతువయ్యెను. ఎడ్వర్డు చిన్ననాట నుండియు దుర్బల శరీరుడు. పదునైదేండ్లు వచ్చినను అతనికి బలముపట్టినదే లేదు. అతడు అకాలమృత్యువు వాత పడునని యందఱును అనుమానించిరి. అతని యనంతరము కాథరిను ఆఫ్ అరగను కూతురైన మేరీ రాజ్యమునకు రావలసి యుండెను. ఆమెది కాథలిక్కు మతము. అందుచే, ఆమె రాజ్య మేలుట, నార్తంబరులాండునకు గిట్టదు. దీప ముండగనే ఇల్లు చక్కబెట్టుకొనుట మంచి దని యెంచి, యతడు తన కోడ లైన జేను గ్రే (Lady Jane Grey) అను నామెకు రాజ్యము సంక్రమింప జేయవలె నని ఆమె పేర మరణశాసనము వ్రాయ వలసినదిగా ఎడ్వర్డును ప్రోత్సహించెను. జేను గ్రే ఎనిమిదవ హెన్రీ చిన్నచెల్లెలి మనుమరాలు.

ఎడ్వర్డు 1553-వ సంవత్సరములో మరణించెను. ఆ వార్త మేరీ చెవిని బడకముందే ఆమెను బట్టుకొని చెఱలో బెట్ట వలె నని నార్తంబరులాండు యత్నించెను గాని, మేరీ అతని బారి బడక తప్పించుకొని, తానే రాణి నని ప్రకటించెను. ఆమె నోడించి తుదముట్టించవలె నని నార్తంబరులాండు ఒక సేనను ఆయత్తము చేసెను, గాని అచిరకాలముననే ఆ సైనికులు అతనిని పరిత్యజించి లేచి పోయిరి. అంత నార్తంబరులాండును

శత్రుపక్షమువారు పట్టుకొని శిరచ్ఛేదము చేసిరి. అతని కోడలు జేను గ్రే అను నామెకును అదియే గతి పట్టెను. అంత కాతలిక్కు మతావలంబిని యైన మేరీ ఇంగ్లండు నేలుట తటస్థించెను.

## ఇంగ్లాండు, మరల, కాతలిక్కు మతము నాశ్రయించుట

## మేరీ 1553—1558-వ సం॥

ట్యూడరువంశ్య యైన మేరీ రాణియై సర్వజన శ్లాఘనము వడసెను. తత్పూర్వము రాజ్యభారము వహించిన సోమరుసెట్టు గాని, నార్తంబరులాండు గాని, ప్రజారంజనము చేయ లేక పోయిరి. వారియేలుబడియు సుఖప్రదము గాక పోయెను. మతమున వారు తెచ్చిపెట్టిన సంస్కారములయెడ గూడ, ప్రజలకు సుముఖత లేదు. ఆ యలజడి సమయమున ఇంగ్లాండునకు సర్వసమగ్రమైన పాలకత్వము అవసరమయ్యెను. మేరీ కాతలిక్కు మతస్థురాలైనను, సమగ్రు రాలని తోచి ప్రజలు ఆమె పాలకతను కొనియాడిరి. ఆమెయు సింహాసన మెక్కుటయె తడవుగా తన సమర్థత చూప దొడగెను. రాజ్యమునకు వచ్చిన రెండు మాసములకే ఆమె పార్లమెంటు సభను సమావేశము చేసి వారిచే "ఎనిమిదవహెన్రీ పాలనలో తుది సంవత్సరము, మతమున ఏ యర్చావిధానము జరిగెనో, అదియే మరల ఆచరణయోగ్యము కావలె" నని తీర్మానింప జేసెను; మఱియు ఆఱవ యెడ్వర్డు చేసిన మతసంస్కారము లన్నియు రద్దు చేయించి, ప్రోటస్టెంటులైన "ఆర్చిబిషప్పు క్రాన్మరు," "బిషప్పు లాటిమెరు," "బిషప్పు రెడ్లీ" అను వారిని పదభ్రష్టుల జేసెను. పదపడి, 1554-వ సంవత్సరములో, ఆమె స్పెయినుదేశపు రాజైన రెండవ ఫిలిప్పును పెండ్లియాడెను.

ఆ రాజునకు కాతలిక్కు మతమున పట్టుదల మెక్కువ. పూర్వాచారమును తిరస్కరించి, ప్రొటెస్టెంటు మతములోనికి దిగిన దేశము లన్నిటిని తిరిగి పూర్వమతమునకు తెచ్చుట విధి యనియు, ఆ పని నెరవేర్చుటకు ఎట్టి సాధనము నైనను ప్రయోగించుట న్యాయమే యనియు నతని యుద్దేశము. ఆ సాధనములలో ప్రొటెస్టెంటులను నిలువునకాల్చి చంపుట యొకటి. అతని యుద్దేశము ప్రకారము, ఆ సాధనము క్రూరమైనది గాదు, భగవంతునకు సమ్మతమునుగూడ.

ఈ పెండ్లి ఇంగ్లాండున కెంతో యనర్థదాయక మయ్యెను. మనువురాయబారములు నడచి నప్పుడే ఇంగ్లాండు దేశపు వ్యవహారము లన్నియు మేరీయే స్వతంత్రించి చేయ వలె ననియు, ఇంగ్లాండు ఫ్రాన్సుతో యుద్ధమునకు దిగ కూడ దనియు సమయములు చేసికొనిరి. ఈ కారణములచే ఇంగ్లాండు స్పెయినుదేశమునకు వశవర్తి యయ్యెను. స్పెయిను దేశ మనగా సామాన్యము గాదు. ఆ నాటి యూరపు దేశములలోని కెల్ల అతి బల సంపన్న మైన దేశము.

నాడు మొదలు ముప్పదియేండ్ల వఱకు ఇంగ్లాండును జయించి లోపఱచికొని యేల వలె నని స్పెయినుదేశపు రాజు తంత్రములు పన్నుచునే యుండెను. దైవవశమున 1588-వ సంవత్సరములో "నౌకాఘాటి" (Armada) నాశ మైనది గనుక అతని పన్నుగడలును భగ్నము లయ్యెను.

ఈ లోగా, మేరీ తర్జనభర్జనలు చేసి ఇంగ్లీషుప్రజలను కాతలిక్కు మతమునకు త్రిప్పుచుండెను. ప్రొటెస్టెంటు లైన బిషప్పులును, సాధారణ మతబోధకులును గూడ కాల్చి చంపబడిరి. 1555-వ సంవత్సరము వేసవికాలములో, "క్రాన్మెరు," "లాటి

మెరు," "రెడ్లీ" అను వారిపై మతాపరాధము మోపి విచారించిరి. వారిలో లాటిమెరు వార్సెస్టరుబిషప్పు. అతడు గొప్ప మతబోధకుడు. రెడ్లీ లండనుబిషప్పు. వారి కిర్వురకును దహనశిక్షయే విధింపబడెను. క్రాన్మెరు ఆర్చిబిషప్పు గనుక అతనిని శిక్షించుటకు ప్రత్యేకము పోపునాజ్ఞ కావలసి వచ్చెను. అందుచే అతనిని తక్కిన యిర్వురితోపాటు కడతేర్చుటకు వీలు లేక కొన్ని దినము లాపిరి. ఆ దినములలో అతనికి కొంచెము శరీరాపేక్ష గలిగి కాతలిక్కు మతావలంబియై ప్రాణములు నిల్పుకొన నుద్యుక్తు డయ్యెను. కాని వెంటనే అతనికి మనోధృతి కలిగి మరణమునకు జంకక ధీరత చూపుటచే, పోపునానతి నతనిని వధించిరి (1556).

ఈ రీతిగా పెద్ద పెద్ద బిషప్పులను వధించినంతమాత్రమున, ప్రొటస్టెంటు మతవిశ్వాసములు దేశమున లేకుండ పోలేదు. పెద్దలు పోయినను, పిన్నలు ఆ మతప్రచారము సేయుచునే యుండిరి. ఆ మతమును ఎట్లయినను తుడిచి పెట్టవలె నని దీక్ష బూని, మేరీ ప్రొటస్టెంటుల మని చెప్పికొన్న వారిని వందల కొలదిగ కాల్చి చంపించెను. పెద్ద తలలు కాక పోవుటబట్టి వారి పేళ్లు చరిత్రకు నెక్క వయ్యెను గాని వారును బిషప్పులకంటె నెక్కుడు వీర్యము గల పురుషులే. ఎంతమంది జనులు ఆ ఘోర దహనశిక్షకు ఆహుతియైరో గాని, ఆ దినములలో వంటకట్టెలు దొరకుట కష్టమయ్యెనట. ఆ క్రౌర్యమువలన మేరీయెడ దేశమునకు జుగుప్సాభావము కలిగెను. దానికి తోడు అప్పుడే ఫ్రాన్సుతోయుద్ధము వచ్చెను. ఆ యుద్ధము మేరీవివాహ దుష్ఫలితమే. ఆ యుద్ధము తద్వివాహఫలితముగా వచ్చి తీరు నని

ప్రజ లనుకొన్నదే. అది లటస్థింపకుండ చేయవలె నని ఇంగ్లండు ఎంత ప్రయత్నించినను, తప్పనే లేదు. ఫ్రెంచివారు ఇరువది యైదు వేలమంది సైనికులతో వచ్చి కెలై పట్టణమును ముట్టడించిరి (1558). అచటి ఇంగ్లీషువారికి, స్వదేశమునుండి సాయము వచ్చిన వారు లేరైరి. పట్టణము సుకరముగా శత్రు హస్తగత మయ్యెను. దానితో ఫ్రాన్సుదేశమున ఇంగ్లాండున కుగల కొంచెపు సొత్తును పోయినది.

ఇంగ్లాండు దేశముతో ఫ్రాన్సు దేశము చిరకాలము నుండి పోరాడుచుండుట ఆ కెలై పట్టణముకొఱకే. నాటితో ఆ తగవు తెగిపోయెను. కాని యా సంవత్సరమే మేరీ చని పోవుటచే ఇంగ్లాండునకు స్పెయినుతోడి పోరాట తప్పని సరి యగు నని దుశ్శకునములు పొడకట్ట వొడగెను.



పదునెనిమిదవ ప్రకరణము



## ఇంగ్లండు దేశము మహాశక్తిసంపన్న మగుట

### ఎలిజబెత్తు (Elizabeth) 1558—1603-వ సం॥

ఎలిజబెత్తు ఎనిమిదవ హెన్రీకూతురు. ఆమె తల్లి ఆనీ బోలీను. ఇంగ్లండు దేశపు సింహాసన మెక్కిన స్త్రీలలో ఎలిజబెత్తు వంటి సమర్థురాలు ఇంకొకతె లేదు. స్త్రీలలోనే యేల, పురుషులలో గూడ ఆమెకు సాటి రాదగిన వారు ఎందఱో లేరు. ఆమె దుర్బలశరీరిణి. నిరంతర వ్యాధిపీడిత. అట్లయ్యు, వ్యవహారముపట్ల ఆమె చూపిన మనోబలమును, కార్యదీక్షయు నిరుపమానములు. "ఎప్పటి కెయ్యది ప్రస్తుతమో, అప్పటి

కద్రా" అను నది యామె నీతి. ఎంత సంకటస్థితియందును, ఎంత యలజడి వేళ యందును, ఆమె నిరుపమానమైన యోరిమి చూపగలదు. ఫ్రాన్సుకంటెను, స్పెయినుకంటెను తన దేశము దుర్బలముగా నుండె నని గ్రహించి ఎలిజబెత్తు ఆ రెండు దేశములతోను అప్పటికి యుద్ధములు పొసగకుండ చూచికొని, బలము ధనమూల మని యెంచి కోశము వృద్ధి చేసికొని, సమగ్రమైన శక్తి చాలిన వెంటనే, స్పెయినుతో ఢీకొని యా దేశము నోడించెను. ఆమె యెంత శాంతురాలో అంత చండస్వభావురాలు. రాజ్య మేలినను స్త్రీజన సులభము లైన దుర్గుణములు ఆమెను వదలలేదు. తన దుస్తులకంటె అందమైన దుస్తులు తొడిగి యెవ్వతె కంటబడినను ఎలిజబెత్తు రాణి సహించెడిది కాదు. సహించక పోవుట యటుండ, అది యొక మహాపరాధముగ భావించి క్షమించెడిది కాదు. ఆమె స్తోత్రప్రియ. "నీవంటి యందకత్తె భూమిమీద లేదమ్మా" యని యామె నెప్పుడును ఎవ్వరో పొగడుచుండవలె నని యామె కోరిక. పోనీ అంద మున్న పొగడ్తల కేమి? ఆమెకు అది లేనే లేదు. తన చక్కదనమును, తన ప్రాభవమును జూచి, తన మంత్రులు లోకరోకశే తన్ను వలచుచుండ బోలు నని భావించి యామె లోలో మురిసి కొనెడిది. ఈ యాత్మవంచకత కనిపట్టి నేర్పరులైన ప్రధానపురుషులు ఆమెను వంచించెడివారు. ఇవి యన్నియు లోపములే అగు గాక, లోపము లటుండనిండు. ఎలిజబెత్తు రాణి యిచ్చిన చేయూతచే, చూపిన యాదరముచే, చేసిన యుపదేశముచే ఆ నాడు ఇంగ్లీషుప్రజలు మహాకార్యములు చేసిరి. తమ రాణియే తమకు సర్వస్వ మని యాప్రజల విశ్వాసము.

తన ప్రజలే తనకు సర్వస్వ మని యా రాణి విశ్వాసము. తమతోను, తమ దేశముతోను, తాదాత్మ్యము పొందిన యామె కొఱకు, ప్రాణములకు తెగించి యైనను ప్రజలు మహాకార్యములకు పూనిరి. వారిపాలిటికి ఆమె యొక దేవత. ఆ దేవతను వర్ణించి స్తోత్రము చేయుచు అప్పు డెన్నియో కావ్యములు గూడ వెలసినవి.

## చర్చి పరిష్కారము

ఎలిజబెత్తురాణికి, నిజముగా, ఏ మతమునెడను పట్టు దల లేదు. ఆమెకు కాతలిక్కుమతమునెడ గాని, ప్రొటస్టెంటు మతము నెడ గాని పక్షపాతము లేదు. ఇంత యేల, మతవ్య వస్థను గూడ రాజ్యవ్యవహారములలో జేర్చి తానే పాలింప వలె నను కుతూహలము దక్క ఆమెకు వేఱు విధమైన మతా భిమానము లేదు. రాచవారికిని ప్రజలకును సాధారణమైన మత ముండిననే తక్క, దేశమున రాజభక్తి నెలకొన దని యామె యభిప్రాయపడి "రాచ చర్చి"ని ఒక దానిని స్థాపించి ప్రజ లందఱు అందు చేరుటకు తగిన యత్నము లెన్నియో చేసెను. దానిచే, కాతలిక్కులకును ప్రొటస్టెంటులకును గల పోరుపులు, కలతలు సమసి పోయి, సమాన మతాశ్రయము వలన పొంది పొసగి యుండుట యగు నని యామె తలంపు. ఈ యత్నమునకే "మతపరిష్కారము" అని పేరు.

ఈ కార్యము నెరవేర్చుటకు పార్లమెంటువారు రెండు శాసనములు చేసిరి. అందు మొదటిది, సర్వాధికార శాసనము; రెండవది సమతాశాసనము. ఈ రెంటి వలన పూర్వము మేరీ చేసిన కార్యమంతయు తుడిచి పెట్టబడినది.



Queen Elizabeth.—Painter Unknown.
(By kind permission of National Portrait Gallery, London)

"చర్చి వ్యవహారములలో ఎలిజబెత్తురాణియే ఇంగ్లండునకు సర్వాధికారిణి" అని నిర్ణయ మయ్యెను. కాతలిక్కు మతము వారికి కోపము రాకుండుటకై "సర్వాధికారిణి" యను బిరుదము వహించెనే కాని, లేనిచో ఆమె "సర్వాధ్యక్షురాలు" అని పిలిపించుకొన్నను చెల్లుబడి యగును. మనసులు నొప్పించుట, కలతలు పెంచుట, ఆమె కిష్టము లేదు గనుక, ఆ బిరుదమే తాల్చెను. ఎల్లరు మతప్రచారకులును, ఎల్ల రాజకీయోద్యోగులును, ఎలిజబెత్తురాణి వహించిన బిరుదు శాస్త్రీయమే యని యంగీకరించి ప్రమాణములు చేయునట్లు, రాణి యాదేశింప, వారెల్లరు నట్లే చేసిరి. పిమ్మట నేకొక ప్రార్థనాగ్రంథము ప్రచురింపబడెను. కాతలిక్కులకును, ప్రొటెస్టెంటులకును, అర్చనావిధానమున గల భేదములు సవరించి సమవిధానమును కల్పించుట యొకటి దక్క, ఈ నూతన ప్రార్థనా గ్రంథమున విశేషాంశము లేవియు లేవు. తక్కిన విషయములలో అది 1552-వ సంవత్సరములో వెలసిన గ్రంథమునకు ప్రతి యనియే చెప్పవచ్చును. ఈ నూతన గ్రంథమే, అన్ని చర్చిలలోను ఉపయోగింప వలె ననియు, తగినంత కారణము లేక, ఎవ్వడును చర్చికి పోవకుండరా దనియు, ఆదేశింపబడెను. నిష్కారణముగ నెవ్వ డేని, చర్చికి పోవ డేని, వానికి శిక్ష తప్పదు. ఇది ఎలిజబెత్తు చేసిన మతపరిష్కారము. నేటి ఇంగ్లీషుచర్చికి ఆ నాటి పరిష్కారమే మూల మని చెప్పదగును.

## పావనులు (Puritans)

నూతనముగా వెలసిన, ఆ యింగ్లీషుచర్చికి సంబంధించిన సిద్ధాంతములు ముప్పదిమూడు. వాని నన్నిటిని ఎంతో

పదిలముగ వ్రాసి, 1563-వ సంవత్సరములో ప్రచురించిరి. ఆ సిద్ధాంతము లన్నియు సత్యములే యని యెల్లరు అనుకొనవలసినట్టుగా, వానిని మిక్కిలి ప్రౌఢ మైన భాషలో వ్రాసిరి. ఆ సిద్ధాంతములు తమకు ప్రమాణము లని, మతప్రచారకు లెల్లరు ప్రమాణములు చేయవలెను. క్రొత్త చర్చిలో, ఎల్ల ప్రజలను జేర్చుట యుద్దేశము గాన, ఆ సిద్ధాంతములను పరమ ప్రామాణికములుగా నొప్పుకొనని వారి నైనను ఎలిజబెత్తు ఆ చర్చిలో ప్రవేశ పెట్టెను. అందుచేత క్రొత్త చర్చిలో చేరియు, కొందఱు తదాచారముల కొన్నిటిని అంగీకరింపరైరి. ఎట్లన, కొందఱు మతప్రచారకుల వస్త్రధారణ పద్ధతుల నొప్పరైరి. కొందఱు పూజాసమయములలో సంగీతవాద్యఘోషములు కూడ వనిరి. మఱి కొందఱు, వివాహవేళల ముద్దుటుంగరము లిచ్చి పుచ్చుకొనుట పనికిరా దనిరి. ఇట్టి లోపములు సవరించి చర్చిని పవిత్రవంతము చేయ బూనిన వారికే "పావనులు" అను పేరు వచ్చెను. కాని కొన్ని దినములకు ఆ శబ్దార్థమునకు అతివ్యాప్తి కలిగి, చర్చి పరిపాలనా పద్ధతుల నిరసించిన వారి యెడను, ప్రయోగింపబడెను. అట్లు నిరసించిన వారిలో "కార్ట్రైటు" (Cartwright) అను నత డొకడు. అతడు కేంబ్రిడ్జిలో అధ్యాపకుడు. "బిషప్పులు" అను వారు ఉండరా దనియు జిల్లామతసభలు జరుగు నపుడు, పల్లె చర్చి వారెల్లరు తమ తమ ప్రతినిధుల పంపవలె ననియు, ఆ సభలతీరుమానములను, ఆ యా "జిల్లాచర్చి" వారు తమ తమ జిల్లాలలో ఆచరణలోనికి తేవలె ననియు, ఒక్కొక్కప్పుడు అన్ని జిల్లాల ప్రతినిధులును రాదగిన మహాసభ యొకటి జగురుచుండవలె ననియు, దానికి "జాతీయసమితి" యని

పేరుపెట్టి, దానియాదేశమే, చర్చికి సంబంధించిన సమస్త వ్యవహారములలో నెల్లరు శిరసావహింపవలె ననియు, "కార్ట్రైటు" ప్రతిపాదించిన మతవ్యవస్థ. ఈ వ్యవస్థకు "ఆర్య్య పరిపాలనా పద్ధతి" అని పేరు పెట్టిరి (Presbyterian Method).

ఇది యిటులుండ, 1580-వ సంవత్సరములో ఇంకొక క్రొత్తవర్గమువారు బయలుదేరిరి. వారికి "స్వతంత్రులు" అని పేరు. "ఏ చర్చికి ఆ చర్చి స్వతంత్రమే కాని, దాని పాలించు నధికారము ఇంకొకరికి ఉండరాదు" అని వారి సిద్ధాంతము. నిజముగా, ఈ స్వతంత్రవర్గమువారుగాని, ఆర్య్య పాలనాపద్ధతివారు గాని పావనుల వర్గమున చేరిన వారు కారు. అయినను, వారిని వీరిని అందఱిని కలిపి, పావను లని పిల్చుట యాచార మయ్యెను. 1586-వ సంవత్సరములో "ఆర్చిబిషప్పు పార్కరు" (Archbishop Parker) అను నతడు గట్టిగా పావనుల మని చెప్పికొను వారి నెల్ల ఇంగ్లీషు చర్చినుండి తొలగించి వేయవలె నని యత్నించెను. చర్చియర్చకత్వము పోయిన వారు అచ్చటచ్చట రహస్యముగ పౌరోహిత్యము చేసికొని బ్రతుకవలసి వచ్చెను. అట్టి పౌరోహిత్యము కూడ అశాస్త్రీయ మని భావింపబడుటచే, శిక్ష ననుభవింప జాలక, ఆ మందభాగ్యులు రహస్యముగ వర్తింపవలసి వచ్చెను. వారికి "రహశ్చరులు" అని పేరు. ఎలిజబెత్తు రాణికి, ఆ రహశ్చరు లన్న భయము పుట్టి, వారి నెట్లయినను తుదముట్టింప వలె నని చూచెను. 1583-వ సంవత్సరములో "విట్‌గిప్టు" (Whitgift) అను నతడు ఆర్చిబిషప్పుగా వచ్చెను. అతడును, రహశ్చరుల వ్యవహారములను, సమావేశములను అణచవలె నని

యత్నించి, ఇంగ్లీషు చర్చిలో నుండ దలచిన వాడెల్ల ముఖ్యముగా మూడు అంశముల నంగీకరించి తీరవలె నని బలవంత పెట్టెను:— అందు మొదటిది ఎలిజబెత్తురాణియే ఇంగ్లీషు చర్చికి సర్వాధ్యక్షురా లనుట; రెండవది, నూతనప్రార్థనా గ్రంథము పరమప్రమాణ మనుట; మూడవది ముప్పదితొమ్మిది సిద్ధాంతములును సత్యవాక్యము లనుట.

రాజ్యమునకు వచ్చిన కొలది నాళ్లకే, ఎలిజబెత్తు ప్రత్యేకము మతాపరాధముల విచారించు నొక కోర్టు నెలకొల్పెను. పూర్వకాలపు నక్షత్రశాలా న్యాయస్థానము వంటిదే యీ కోర్టు కూడ. వ్యవహారములు నడపుటలో కూడ రెంటిది ఒకటే పద్ధతి. పాపనులను, రహస్యపులను, ఆర్యపాలనాపద్ధతి వారిని పట్టి శిక్షించుటయే యీ కోర్టు ధర్మము. ఈ మూడు వర్గముల వారే కాక కాతలిక్కులుగూడ కొన్నాళ్లకు ఆమెతో విరోధము సాగించిరి. కాతలిక్కులను రెచ్చగొట్టి, ఆ విరోధ భావము కల్పించిన సమర్థురాలు "మేరీ" యను నామె. ఆమె స్కాటుల రాణి (Mary, Queen of Scots).

## మేరీ, స్కాటుల రాణి

ఈమె స్టూవర్టు వంశసంభవ. స్కాటులాండులో మతసంస్కారము, ఇంగ్లండులో జరిగినంత తొందరగా జరగలేదు. సంస్కరణాభిప్రాయములు, ప్రజలలో పుట్టుటకే యిచట చాలకాలము పట్టెను. తుదకు "జాను నాక్సు" (John Knox) అను వాని నాయకత్వమున స్కాటులాండులో గూడ సంస్కరణము సాగెను. నాక్సు చిన్ననాడు ఒక ఫ్రెంచిపడవలో కూలివాడు. అట్టివాడు క్రమక్రమముగా మతసంస్కరణము చేయు నంత వాడయ్యెను.

అతని సరణి ఇంగ్లండులోని ఆర్యపాలనాపద్ధతివారి సరణి వంటిది. ఆ సరణి ననుసరించియే అతడు క్రొత్త చర్చి వ్యవస్థను నెలకొల్పి, దానికి "ఈశ్వర పరిషత్తు" అని పేరిడెను (Congregation of the Lord). తత్సభ్యులను పొరపాటున, లోకులు కొందరు "పరిషదీశ్వరులు" అని పిల్చుచుండెడి వారు. కాతలిక్కు మత నాశమే ప్రతిసంస్కరణోద్దేశము గావునను, ప్రస్తుతము కాతలిక్కులు ఎలిజబెత్తుతో విరోధించి యుండిరి గావునను, వారి ప్రాభవము మాపుమాపుటకు, నాక్సనుచరులు పూనిరి గావునను, ఎలిజబెత్తు నాక్సు మొదలగు వారికి సాయము చేసి, స్కాటులాండులోని కాతలిక్కుల నాశము చేయింపవచ్చు నని తలచి, తగినంత నౌకాదళమును సన్నాహముచేసి స్కాటులాండునకు బంపెను. ఈశ్వరపరిషత్తువారికి ఎలిజబెత్తు తోడ్పడగా, కాతలిక్కులకు ఫ్రెంచివారు తోడ్పడిరి. తుదకు సంస్కరణక్రియులే గెల్చిరి. కాతలిక్కుపక్షము వహించి పోరాడిన ఫ్రెంచిసేన 1560-వ సంవత్సరములో స్కాటులాండు వదలిపెట్టి ఫ్రాన్సునకు పోయెను. మేరీభర్త యైన రెండవ ఫ్రాన్సిసు చనిపోగా, ఆమె 1561-వ సంవత్సరములో ఫ్రాన్సు నుండి లేచి వచ్చి స్కాటులాండు చేరెను. లీసెస్టరు దొరను (Earl of Leicester) రెండవ మనువుగా చేసికొమ్మని, ఎలిజబెత్తు మేరీని ప్రోత్సహించెను గాని, ఆమెకు అతనియెడ మనసులేక డార్న్‌లీ ప్రభువును చేసికొనెను (Lord of Darnley).

ఆ క్రొత్తమగనిని వెంటబెట్టుకొని మేరీ ఒకయిల్లు చేరగా, ఆయిల్లు అకస్మాత్తుగ భగ్గు మని మండి పోవ దానిలో డార్న్‌లీ కూడ కాలిపోయెను. మేరీ మీద కన్ను వైచి యుండి డార్న్‌లీని తుదముట్టింప అదనువేచి యున్న ఇంకొక

పురుషుడు, ఈ గృహదాహ మనెడి ఘోరకార్యము చేసి ఆ మందభాగ్యుని ప్రాణములు తీసెను. ఆ పురుషుని పేరు "బాతు వెల్లు" (Bothwell). "ఈ కుట్రలో మేరీ కూడ చేరి యుండునా?" అని పలువురు అనుమానపడిరి కాని, ఆ రహస్య మెవ్వరికిని తెలియ రాలేదు. పిదపడి, మేరీ మూడవ మగనినిగా, "బాతువెల్లు"నే చేసికొనుట బట్టి ఆ యనుమానము నిర్హేతుకము కాదని శంకింప నయ్యెను. ఈశ్వరపరిషత్తువారు బాతు వెల్లు మీద కత్తిగట్టి మేరీని పట్టుకొని చెఱలో నుంచిరి. ఆమె బాతువెల్లు వంటి దుర్మార్గునితో కలిసి కుట్రపన్ని మగని ప్రాణము తీసిన జంత యని వారు గట్టిగా నమ్మిరి. ఆమెయు, వగలు వలపులు నటించి, కారాగృహాధికారిని తన వలలో వైచికొని, చెఱనుండి తప్పించుకొని, ఇంగ్లండునకు పాఱిపోయి, శరణ మిమ్మని ఎలిజబెత్తును వేడెను. ఎలిజబెత్తురాణికిని ముందువెనకలు తోచలేదు. ఏమన, మేరీని చూడబోయిన తనకు బందుగురాలు; విశేషించి తన పిమ్మట, ఇంగ్లీషురాజ్యమునకు రా నున్నది. కాని ఆమె కాతలిక్కుమతస్థురాలు. దేశమున జూడ బోయిన, కాతలిక్కులు తనతో విరోధించి యుండిరి. వారు తగిన యదను దొరకె నని, మేరీని వెంటనే సింహాసన మెక్కించుటకు, ఏమేని కుట్రలు పన్నగలరు. ఈ సంకటస్థితిలో ఎటును పాలుపోక తుదకు ఆమె మేరీ భర్తృఘాతిని యగునో కాదో సత్యము తేలుదాక స్వాతంత్ర్యురాలుగా నుండ దగదని, ఆమెను చెఱలో బెట్టి యుంచెను.

## కాతలిక్కులవలని యపాయము

పదునాఱవ శతాబ్ది ప్రారంభమున కాతలిక్కు చర్చి వారు, తమ మతవ్యవస్థలో దొరలిన లోపముల, తాము సవ

రించుకొనక యూరకుండిరి. కనుకనే లోపభూయిష్ఠ మైన ఆ మతపద్ధతి నాశ్రయింప నొల్లక, కొన్ని దేశములు ప్రొటస్టెంటు సరణి నవలంబించెను. పదపడి, కాతలిక్కులు తమ తప్పు తాము తెలిసికొనిరి. రెండవ ఫిలిప్పును, పోపును పూనుకొని, లోకులు నిందించుచున్న తమ మతాచారములు కొన్ని సంస్కరించి, ప్రొటస్టెంటు మతము వీడి పూర్వమతమున జేరవలసినదిగా ఆ యా దేశములవారిని హెచ్చరింప సాగిరి. "యేసు సంఘము" అను వారు పోపునకు భక్తులై, అతని యానతిని విధేయతతో నిర్వర్తించుచు, ఈ నూతన మతప్రచారము చేసిరి. కేవలము మతప్రచారము సేయుటయేకాక ప్రొటస్టెంటుల బట్టి చంపుటయు ధర్మమే యని వారితలంపు. కాని, వారు సాధ్యమైనంత వఱకు హింసాకర్మలకు జొరక, సామముననే, నేర్పుగా ప్రజలను తమ మతమునకు త్రిప్పుకొను చుండెడివారు. ఆ పని యట్లు సాగుచుండగనే, 1570-వ సంవత్సరములో, "ఎలిజబెత్తు, ఇంగ్లండు దేశము గోల్పోయెను. ఆ సింహాసనముమీద నుండుటకు, ఆమె కర్హతలేదు" అని పోపు ఒక ప్రకటన గావించి 1574-వ సంవత్సరములో సమర్థులైన కొందఱు కాతలిక్కు ప్రీస్టులను ఇంగ్లాండునకు పంపెను. ఏ విధమున నైనను మరల ఆ దేశమును తమ పక్షమునకు త్రిప్పుకొనుట వారి రాకకు ప్రయోజనము. 1580-వ సంవత్సరములో, యేసు సంఘ సభ్యు లిద్దరు ప్రాణములు సరకుగొనక, కాతలిక్కు మత ప్రచారార్థమే జీవితముల ధార పోయుదుమని విజృంభించి వర్తించిరి. కాల క్రమమున మతప్రచారమే కాక, ఎలిజబెత్తునకు పదభ్రంశము కూడ కలిగించు నుద్దేశముతో, కాతలిక్కులు పన్నుచుండిన కుట్రలు బయటబడెను.

ఒక్కొక్క కుట్రనే కనిపట్టి విచారింపగా, అన్నియు, మేరీని ఇంగ్లండునకు రాణినిగా జేయుటకు పన్నినవి గానే తెలియవచ్చెను.

ఆ కుట్రలలో "నారుఫోకుదొర" పన్నిన కుట్ర మొదటిది. అతడు 1569-వ సంవత్సరములోనే, మేరీని చెఱనుండి విడిపింప సమకట్టి, స్పెయిను దేశపు రాజుతో కలిసి కొంత పన్నుగడ సాగించెను. అది ఫలింపకపోవుటచే, నతడు 1571-వ సంవత్సరములో, "రిడాల్ఫి" (Ridolfi) అను ఒక ఇటలీ దేశపు సాహుకారితో గలిసి యింకొకటి పన్నెను. దీనిని కనిపట్టి, ద్రోహుల విచారించి, నారుఫోకుదొరకు శిరచ్ఛేదము విధించిరి. మఱల 1583-వ సంవత్సరములో ఇంకొక కుట్ర బయటబడెను. దానిని పన్నినవాడు "త్రాకు మార్టను" (Throck Morton). అదియు, ఎలిజబెత్తును సంహరించి, మేరీని గద్దె నెక్కించుటకు ఏర్పడినదే. ఆ కుట్రలు, ఆ పన్నుగడలు, ఆ సంగతిసందర్భములు, అన్నియు మొదలంట విచారింపగా, అన్నిటి ప్రయోజనమును ఒక్కటిగానే తేలెను. ఏమన, ఇంగ్లండును కాతలిక్కు దేశము చేయుట, కాతలిక్కు మతస్థురాలైన మేరీని తద్దేశమునకు రాణినిగా జేయుట, మేరీ రాణియగుటకు ఎలిజబెత్తు ఆటంకముగా నుండెను గాన, ఆ యాటంకమును పరిహరించుట. ఈ రహస్య మంతయు వెలికి వచ్చినపుడు, ప్రజలు అతివిస్మితులై, తమరాణిని తొల్లిటికంటె నెక్కుడుగ ఆదరింప సాగిరి. సోపద్రవ మైన ఆ స్థితిగతులలో ఏమఱుపాటున నుండదగదని, రాణిని కంటికి రెప్పలట్లు కాపాడ దొడగిరి. ఆమె రక్షణమే పరమధర్మముగా భావించి, కొందఱు కూడి ఒక సమాజమును గూడ నెలకొల్పిరి (1584). రాణి యెడ ద్రోహచింత తలచిన నెవ్వని నేని పట్టి బాహిరముగా వధించుటయే

ఆ సామాజికుల వ్రతము. అదియును గాక, ఎవరి యున్నతి గోరి, రాణి మీద కుత్రలు పన్నబడునో అట్టి వారిని గూడ చంపుట వారి దీక్ష. అనగా, మేరీని రాణిని జేయ గోరి ఇంకొక కుత్ర, పన్నబడునేని, అది కనిపట్టి ఆ సామాజికులు ముందు మేరీని చంపుదు రనుట.

## మేరీమరణము 1587-వ సం॥

ఇన్ని విధముల కనుగన్ని యున్నను, ఎలిజబెత్తు ప్రాణ హరణార్థము, ద్రోహులు కుత్రలు పన్నుచునే యుండిరి. 1586-వ సంవత్సరములో నట్టి కుత్ర బయటబడెను. ఆ కుత్ర పన్నిన వాడు బాబింగుటన్ (Babington) అనెడు ఒక కాతలిక్కు మతస్థుడు. అతడు ఎలిజబెత్తునాస్థానమున ఉద్యోగము చేయుచుండు వాడు. అతడు, ఎలిజబెత్తునే కాక, ఆమెకు కార్యావసరముల చేదోడు వాదోడుగా నుండిన మరి యిర్వురు పురుషులను గూడ నంత మొందించు యత్నము చేసెను. ఆ యిర్వురును, "బర్లీ," "వాల్సింగాము" అను వారు. వీరి నందఱిని వధించుటకు, బాబింగుటను ఆర్వురు హంతకుల నియోగించెను. ఆ కుత్రలో మేరీ కూడ చేరి యుండె నని యను మానించిరి. తదనుగుణముగా నామెచే బాబింగుటనుకు వ్రాయబడిన యుత్తరము కూడ ఒకటి బయటబడెను. అందిట్లున్నది:—

"యత్నము లీవిధముగా కొనసాగిన వెంటనే, ఆ యార్వురును కర్తవ్యమునకు గడగ వలెను." ఆ యుత్తరముతో, మేరీ యొక్క ద్రోహచింత విస్పష్టము కాగా ఆమెను పట్టుకొని నిగ్రహించి, అపరాధవిచారణ సల్పిరి. మేరీని క్షమింప రాద

నియు, వెంటనే శిరచ్ఛేదము చేయింపవలెననియు, పార్లమెంటువారు ఎలిజబెత్తును గోరగా, ఆమె సాటిదానికి అట్టి కఠినశిక్ష విధించుట బాగుగాదని యెంచి కొంత వెనక ముందులాడెను. దాక్షిణ్యము మాట యటుంచినను మేరీని చంపుట రాజనీతి విరుద్ధమని ఎలిజబెత్తునభిప్రాయము. ఏమనగా, మేరీని చంపుదురేని, ఇంగ్లండు వారికి స్పెయిను దేశముతో తప్పక యుద్ధము సంభవించి తీరును. ప్రబలులతో నిష్కారణ యుద్ధమునకు దిగుట క్షేమముగాదు. ఎట్టకేలకు, తప్పనిసరియై, ఎలిజబెత్తు మేరీవధార్థము అజ్ఞాపత్రమున సంతకముపెట్టి వాల్సింగాముచేతికి ఇచ్చియు, త్వరపడి మాత్రము వెంటనే ఆమెను వధింపవలదని గట్టిగా చెప్పెను. వాల్సింగామునకు ఎలిజబెత్తుమాటల యర్థము చక్కగా తెలియక, మేరీని అవశ్యము వధించుటయే తన యుద్దేశము గాన, రాణి అజ్ఞాపత్రమున సంతకము పెట్టియుండు నని భావించి, ఆ యాజ్ఞానుసారము, ఆ ద్రోహకారాలిని చంపించెను. నిజము చూచినను, ఎలిజబెత్తు నభిప్రాయము కూడ అట్టిదే కావచ్చును. లోకనింద వచ్చునను భయమున సామవాక్యము లాడెనే కాని, మనసున మాత్రము మేరీని వధించుట ఆమెకు సమ్మతమే కాదగును. కాకున్న, ఒక వంక ఆజ్ఞాపత్ర మిచ్చుటేమి, ఇంకొక వంక దానిని ప్రయోగింపవలదనుటేమి? తీర, కార్యము ముగియుటతోడనే, ఆమె ఏమియు నెఱుగని దానివలె వాల్సింగామును నిందించి, యాతడొనర్చిన ఘోరకార్యమున తనకు జోక్యము లేదని లోకులకు నచ్చజెప్ప సాగెను. ఇంతకు కావలసిన కార్యమైనది. తత్ఫలితమును తదనుగుణముగానే జరిగినది. ఇంగ్లండునకు స్పెయినుతో పోరు మొగిసినది.

## ఎలిజబెత్తుయొక్క పరదేశ సంబంధ నీతి

1558-వ సంవత్సరము నాటికి, ఇంగ్లండుదేశమునకు పరిసరముల స్పెయిను, ఫ్రాన్సు అనెడి రెండు ప్రబలరాజ్యములు వర్ధిల్లు చుండెను. ఆ రెండును రోమను కాతలిక్కుమతము నాశ్రయించిన రాజ్యములు. కనుకనే, ఆ రెంటికిని ఇంగ్లండు మీంద విరోధము ప్రబలినది. ఆ విరోధమునకు అవాంతర కారణము లెన్ని యున్నను, మతభేదమే ముఖ్యకారణము. 1570-వ సంవత్సరములో "ఎలిజబెత్తు, ఇంగ్లండుదేశమునకు రాణికాజాలదు" అని పోపు ప్రకటించినపుడు, స్పెయినుదేశపు రాజైన రెండవఫిలిప్పు మిక్కిలి సంతసించి, ఆమెను సింహాసనము నుండి తొలగించుట తనకు విధాయకకృత్య మని భావించెను. ఇది యిటులుండ, ఇంగ్లండుదేశపు నావికులు, సముద్రయానములు సేయునపుడు, తమ కంటబడిన స్పెయినుదేశపు ఓడలపై బడి దోచుకొనుటయు, స్పెయినువారి వలసరాజ్యములపై బడి కొల్లగొట్టుటయు సాగించిరి. ఇదియు, ఇంగ్లండునెడ ఆ దేశము విరోధము వహించుటకు ఇంకొక కారణము. ఇక, ఫ్రాన్సు ఏ నాడు స్కాటుల రాణి యైన మేరీ పక్షము వహించి ఆమెకు సాయము చేయబూనెనో, ఆ నాడే ఆ దేశము ఇంగ్లండునకు విరోధి యని విస్పష్ట మయ్యెను.

ఈ విధముగా రెండు ప్రబల రాజ్యములు పగ గొని యున్నను, ఎలిజబెత్తు మాత్రము దేనితోను యుద్ధమునకు దిగ నెంచలేదు. ఏమన ఆమె శక్తి యామెకు తెలియును. ఆ రెంటిలో నేదేశమును తాకినను ఆమెకు పరాజయము తప్పదు. మొదటి నుండియు, ఎంతో పొదుపుగా వ్యవహరించుచు, కోశమును పెంపొందించుకొనుచు వచ్చినను ఎలిజ

బెత్తు చేతిలో తగినంత ధనము లేదు. ఆమె రాజ్యమునకు వచ్చిన తొలినాళ్లలో ఆమెకు అసలు ధనమే లేదని చెప్పవచ్చును. ఎప్పటి కైనను, స్పెయినుతోనో, ఫ్రాన్సుతోనో యుద్ధము తప్పదని గ్రహించియే ఆమె నాటనుండియు వ్యయభారమును తగ్గించుకొని ఆయము వృద్ధిచేసికొన బూనెను. అట్లయ్యు 1589-వ సంవత్సరము నాటికి కూడ, నాల్గు లక్షల పౌను లైనను ఆదాయము వచ్చుట లేదు. అందుచేతనే అర్థబలము చేకూరు వఱకు యుద్ధములకు దిగ కూడదని ఆమెయా దేశములతో పొత్తునటించుచు కాలము గడపెను.

అదృష్టవశమున, ఆ పరరాజ్యముల రెండింటను అంతశ్ఛిద్రములు కలుగుటయు, ఇంగ్లండునకు ఉపకారకమే యయ్యెను. పూర్వమునుండియు స్పెయిను రాజునకు లోబడి యుండిన హాలెండు, బెల్జియము అను దేశములు 1572-వ సంవత్సరములో తమకు స్వపరిపాలన కావలె నని స్పెయిను మీద తిరుగుబాటు చేసెను. వారియత్నము రాజద్రోహమనియు, అది మొదలంట నిర్మూలము చేయవలె ననియు పట్టుపట్టి, స్పెయినురాజు తన సేనలను ఆ దేశముల రేగుచున్న స్వతంత్రతోద్యమముల నణచుటకు పంపెను. ఆ దేశపు ప్రజలును తిరుగబడి పోరాడిరి. తుదకెట్లును హాలెండునకు స్వాతంత్ర్యము లభించెను. ఆ యలజడిలో మునిగి యున్నవాడు కావుననే స్పెయినురాజు ఇంగ్లండు మీద నెత్తి రాలేక పోయెను. ఇక ఫ్రాన్సులోని అంతశ్ఛిద్రము, మతవిషయికము. అచట ప్రజలు మతభేదములచే దొమ్ములాడ దొడగిరి. కాతలిక్కులును, ప్రొటెస్టెంటులును ఒండొరుల భేదించుకొనుచుండిరి. అదిగాక, ఫ్రాన్సు దేశమునకు స్పెయిను వలని

భయము నొందు. స్పెయినుదేశమునకు ఫ్రాన్సుదేస ఏవము నొందు. ఈ సంగతి ఎలిజబెత్తు ఎఱుంగనిది కాదు. స్థితిగతు లన్నియు అనుకూలములుగా నుండుటబట్టి ఇంగ్లండునకు అప్పటికి యుద్ధములు తప్పెను. అదియును గాక నీతినిపుణ యగు ఎలిజబెత్తు ఇంకొక చమత్కారము నటించెను. ఫ్రెంచి యువరాజును పెండ్లియాడ నుంటినని ఆమె నల్వురకు విశద పఱిచెను. నిజముగా ఆమెకు ఆ యుద్దేశము లేదు. అతనినే కాదు, మఱి యెవ్వనిగూడ పెండ్లిచేసికొను తలంపే ఆమెకు లేదు. ఆజన్మకన్యగా నుండుటయే యామె మనోరథము. ఆ నటన వలన ఫ్రాన్సునకు ఆస లూరెను. ఆ పెండ్లివలన ఇంగ్లండుతో బాంధవ మేర్పడు ననియు, ఆ సాయము వలన తాను స్పెయినును డీకొని ఓడింప వచ్చు ననియు ఫ్రాన్సు నుద్దేశము. ఇక, స్పెయినుదేశమునకు ఆ పెండ్లి సంబంధము బాధక మగును గాన వారు దానిని కాకుండ జూతురు. కాగా, ఎలిజబెత్తు పెండ్లిమాట బయటబెట్టిన వెంటనే స్పెయినురాజు ఆమెతో పగమాని పొత్తుమాటలాడెను.

ఇది యిటులుండ, మొదటనుండియు ఎలిజబెత్తు, ఫ్రాన్సునకును, స్పెయినునకును వారి వారి విరోధులతో కలిసి రహస్యముగ అపకారములు సేయుచునే యుండెను. 1560-వ సంవత్సరములో, స్కాటులాండులో "ఈశ్వరపరిషత్తు" వారిని ఫ్రెంచి సేనలు మార్కొని నపుడు, ఫ్రెంచివారిని ఆ దేశము నుండి తఱిమి వైచుట మంచి దని, ఆమె ఆ పరిషత్తువారికి గూఢముగా సాయముచేసెను; ఫ్రాన్సుదేశములో, కాతలిక్కులును, ప్రోటస్టెంటులును కొట్టుకొనుచుండ ఆమె ప్రోటస్టెంటు పక్షమునకు రహస్యముగ సాయముచేసి వారి కలహాగ్నిని

మఱింత మండించెను. హాలెండు బెల్జియము దేశములు స్వాతంత్ర్యసంపాదనార్థము, స్పెయినుతో కలహించి నప్పుడు, ఆమె హాలెండువారికి కొంత సైన్యముగూడ సహాయముగా పంపుటయే కాక, ఇంగ్లీషునావికులు, వీలైనప్పుడెల్ల హాలెండు బెల్జియముల పక్షమున స్పెయినువారితో పోరాడ వలె నని యాదేశించెను. మఱియు ఇంగ్లీషు "నీటికుక్కలు" స్పెయిను దేశపు ఓడలమీద బడి దోచుకొనుచుండ, ఆమె అదలింప లేదు సరిగదా, పైపెచ్చు వలసినంత దోచుకొనవచ్చు నని ఆ "నీటికుక్కలు"ను ప్రోత్సాహించెను.

"నీటికుక్కలు"

హిందూదేశమునకు క్రొత్తదారిని కనిపెట్టవలె నను సంకల్పముతో ఇంగ్లీషునావికులు, ఏడవహెన్రీ నాటి నుండియు దీక్ష వహించి, అప్రమత్తులై యత్నములు సేయుచునే యుండిరి. ఛాన్సెలరు; ఫ్రోబిషరు; విల్లోబి; డేవిసు (Chancellor, Frobisher, Willoughby and Davis) అను నావికులు, ఆర్కిటిక్కు సముద్ర తీరాంచలము లన్నియు త్రొక్కిచూచి, వాయవ్య మూలగనో, ఈశాన్యమూలగనో పడవల బోనిచ్చి నచో, హిందూదేశపు తీరభూములను జేరవచ్చు నని యూహించిరి. కాని వారియత్నము సఫలము కాలేదు. ఆ దారులు హిందూదేశమునకు పోలేదు. అంతతో విసివి యూరకుండక కార్యశూరులగు ఆ నావికులు క్రొత్తదారులు వెదకి పట్టనెంచి ఉత్తరదిక్కుగా బోయిరి. కాని ఉత్తరసముద్రముల అతి శీతలత భరింపలేక, వారు మరల నైర్ఋతి మూలగా నడచిరి. అంతకు పూర్వమే, స్పెయిను దేశీయులును పోర్చుగలు దేశీ

యులును ఆ దారులవెంట బోయి దక్షిణామెరికా తీర భూములు స్వాధీనము చేసికొని యుండిరి. అయ్యు, ఇంగ్లీషు పడవలు కూడ అటకు జేరి, స్పెయిను వారి పడవలు వచ్చిన వెంటనే కొల్లగొట్టుటకై తడివేచి యుండెను. ఆ నాటి ఇంగ్లీషు పడవలలో సుమారు నాల్గువందల మంది సరంగులు గలరు. స్పానిషు పడవల దోచుకొని సంపన్నులము కావచ్చును గదా యని, ధనికుల బిడ్డలును సరంగులుగా పోయెడి వారు. వారిలో ఫ్రాన్సిసు డ్రేకు, జాను హాకిన్సు (Francis Drake and John Hawkins) అను వారు ముఖ్యులైన సరంగులు. స్పెయిను వారి యోడలు మిక్కిలి పెద్దవి. ఇంగ్లీషువారివి చిన్నవి. అయ్యు ఇంగ్లీషు సరంగులు సుశిక్షితులగుటచే స్పానిషు పడవలను సుకరముగా లోగొనెడి వారు. "పగవాని ఓడను నీట ముంచి వేయ దలచుచో, అది దూరమున నుండగనే గురి చూచి తుపాకులు పేల్చవలెను" అను సూత్రము, లోకమున కెఱిగించిన వాడు డ్రేకు. పూర్వకాలమున ఆ పద్ధతి యెఱుగరు. బారైన గాలములు వైచి పగవాని పడవను దగ్గరకు లాగి, వానితో నేలమీాద వలెనే పోట్లాడుట పూర్వాచారము. దాని కంటె డ్రేకు చూపిన పద్ధతియే ఉత్తమ సాధక మని భావించి యందఱును దానినే అనుసరించిరి.

డ్రేకు, మొదటిసారి శాంతమహాసముద్రమును జూచుట, 1572-వ సంవత్సరములో. నాంబరు డి డయో (Nombre de Dios) యొద్ద స్పానిషు ఓడల పై బడి, మిక్కిలి మొత్తము లైన వెండి బంగారులను దోచుకొని, ఆ ధనముతో సరాసరిగ అతడు శాంతమహాసముద్రమునకు తన ఓడల పోనిచ్చెను. పిమ్మట 1577-వ సంవత్సరములో, అతడు మాగెల్లాన్ జలసంధుల

గుండ పోయి, దక్షిణపు అమెరికా తీరభూముల గల స్పానిషు పట్టణముల కొల్ల గొట్టెను. అటనుండి బయలుదేరి, సముద్రమునకు అడ్డముగా పోయి, జావా లంక చేరి, చూచి, అటనుండి యూరపునకు తిరిగి వచ్చెను. దానితో అతని సముద్రయానము భూప్రదక్షిణ మయ్యెను. ఇంటికి తిరిగి వచ్చునాటికి అతని యొద్ద గల దోపిడి సొమ్ము మొత్తము ఎనిమిది లక్షల సౌనులు. అతని ధీరతకును, శూరతకును మెచ్చి, ఎలిజబెత్తు రాణి అతనికి యోధబిరుద మిచ్చి మన్నించెను. ఈ విధముగా, ఇంగ్లీషు నావికు లితరులు గూడ నెందరో, స్పానిషు పడవలు దోచుకొని సొమ్ము తెచ్చుచుండ ఎలిజబెత్తు వారిని మెచ్చి మన్నించెనేకాని తెరువాటుదనము కూడ దని మందలింప దయ్యెను. యుద్ధములు అనియత ఫలములు. అర్థప్రాణము లొడ్డినను జయము లభింపక పోవచ్చును. ఇక ఈ తెరువాటుదనమో నష్టములేని లబ్ధిహేతువు. కనుకనే, స్పెయినుతో పోరాట లేకయే ఆ దేశజనులధనము తనకు సుకరముగ వచ్చి చేరుచుండ, సందిగ్ధమైన యుద్ధలాభము కంటె, ఈ లాభమే మేలని ఎలిజబెత్తు సంతసించి యూరకుండెను. ఇంకొక విశేష మేమనగా, అప్పట్లు, ఇంగ్లండునకు స్పెయినుతో మైత్రి కుదిరియుండెను. ఆ ధర్మమును గూడ, ఎలిజబెత్తు పాటింప దయ్యె. స్పానియార్డులు కూడ, కేవలము పందలై యూరకొనక, శతవిధముల తమ సొత్తు కాపాడుకొనుటకును, ఇంగ్లీషు నావికుల పట్టి బంధించుటకును యత్నించుచునే యుండిరి. వారు, తమచేజిక్కిన ఇంగ్లీషు నావికులను మిక్కిలి క్రూరముగా హింసించెడి వారట. దాని వలన,

కొల్లవేడ్కతోపాటు ప్రతీకారకాంక్షయు సలము కొనగా ఇంగ్లీషు నావికులు ఇనుమడించిన పగ నెఱపెడి వారు.

1585-వ సంవత్సరములో డ్రేకు మరల అమెరికాకు ప్రయాణము కాగా, ఎలిజబెత్తు తన సొంత యోడలగూడ రెంటిని అతని యోడలతో జతచేసి పంపెను. ఆ సంవత్సరము అమెరికాకు ముప్పది ఇంగ్లీషుపడవలు పోయెను. అవన్నియు అచట "స్పానిషువెస్టిండీసు" మీద పడి తత్ప్రజలకు మితిలేని అర్థప్రాణనష్టములు కలిగించెను.

### నౌకా ఘాటి (The Armada) 1588-వ సం॥

ఈ స్థితిగతు లిట్టులుండగా, అప్పుడే స్కాట్టుల రాణి యగు మేరీ వధయు జరిగెను. ఇంగ్లండుపై దాడివెడలి, దానిని ముట్టడించి నాశముచేయ తలఁచివేచి యున్న స్పెయినురాజగు ఫిలిప్పునకు చక్కని సందు దొరకి, కలహకారణము కలిగె గదా యని యుద్ధసన్నద్ధు డయ్యెను. అత డొక పెద్ద యుద్ధనౌకా సమూహమును నిర్మించి "కాడిజు నౌకా రక్షణ స్థానమున" (Cadiz Harbour) నిల్పి యుంచెను. దానికే "ఆర్మడా" అని పేరు. అంత గొప్ప యుద్ధనౌకాసమూహమును తత్పూర్వ రాజు లెవ్వరును నిర్మించి యెరుగరు. వానినిర్మాణమును గూర్చియు, ఉనికిని గూర్చియు విని, ఆఘాటిని మునుముందఁ నాశన మొనర్చుట మే లని యెంచి డ్రేకు కాడిజు రేవు చేరి, ముప్పది యేడు నౌకలను, అమితమైన వస్తుసంభారమును నాశ మొనర్చి, ఒకటి రెండు నెలలపాటు స్పానిషుతీరములనే సంచరించు చుండెను (1587). సన్నాహము కొంత భంగపడుటచే, నౌకాఘాటి వెడలుటకు ఒకయేడు కాలవిలంబనమయ్యెను.

ఆ యేడు (1588) నూటముప్పది యోడలను ఆయత్తము చేసి ఫిలిప్పు ఇంగ్లాండు మీదికి పంపెను. పరిమాణమున అవి చాల పెద్దవి. కాని అందలి నావికులు సమర్థులు గారు. యుద్ధభటుల చేతి తుపాకులు మంచివి కావు. వారిలో నావికులు పడవల నడక మొదలగు పనులు చూడ వలసిన వారు. వారికి యుద్ధ భారము లేదు. యుద్ధము చేయవలసిన వారు భటులు. ఆ రెండు తెగలకును పొత్తు కుదరక పోయెను. భటులకు నావికుల జూచిన ఏవగింపు. వీరికి వారిని జూచిన రోత. భటులలో చాలమంది స్పెయిను దేశీయులే యుండిరి. తక్కినవారు హాలెండు బెల్జియము దేశముల వారు. ఆ నౌకాధాటికి "మెడీనా సిడోనియా డ్యూకు" (Duke of Medina Sidonia) నియమితుడై యుండెను. అతడు మంచినావికుడు. యుద్ధనిపుణుడును.

వారిని మార్కొనుటకు ఇంగ్లీషు వారును తగిన సన్నాహామే చేసిరి. అంతకంటె ఎక్కువ ఓడలు కట్టించిరి. వానిలో కొన్ని రాణిగారి సొంతవి గూడ నుండెను. కాని చాలభాగము ఓడ లన్నియు వర్తకులవి. అవి స్పెయిను వారి యోడ లంత పెద్దవి కావు గాని, అంతకంటె గట్టివి. వీరి తుపాకులును చాల మంచివి. వారివలె వీరి భటులకును నావికులకును పొత్తు పొసగకుండుట లేదు. ఇంగ్లీషు వారిలో నావికుల పని యది యనియు, భటులపని యిది యనియు విభాగము లేదు. ఇర్వురును యుద్ధనిపుణులే. ఇర్వురును సమయమున తుపాకులు పట్టి యుద్ధ మొనర్తురు. వీరి నియంత "ఎఫింగాము ప్రభువగు హొవార్డు." అతని దళవాయి సర్ ఫ్రాన్సిసు డ్రేకు.

ఆ సంవత్సరము జూలై నెల పందొమ్మిదవ తేదీని "ఆర్మడా" ఇంగ్లీషు చానలులో ప్రవేశించి విహరింప సాగెను.

ఇంగ్లీషువారు ముఖాముఖిని పోరుటకు వచ్చెద రనియు అప్పట్లో వారిని జయించుట సుఖకరమనియు భావించి, స్పానియార్డులు నిరీక్షించు చుండ ఇంగ్లీషువారు ఇంకొక దారి త్రొక్కిరి. వీరు వారిని మాఱ్కొన పోలేదు. అంత స్పానిషుపడవలు "కెలై" మొగమై నడచి అచట లంగరులు వైచి నిలిచి, చానలు దాటి ఇంగ్లండును తాకుట కొఱకు ముప్పదివేల మంది తమ భటుల రాకకు వేచియుండెను. ఆ సమయము కనిపెట్టి డ్రేకు తమ అగ్నిపడవల బంపి, వారి పడవల గుంపులో అగ్ని పెట్టించెను. లంగరులు వైచికొని ఏమఱి యున్న వారు గాన స్పానియార్డులు హఠాత్సంభవ మైన ఆ యగ్నిప్రమాదమునకు తాళలేక గగ్గోలుపడి, లంగరు లెత్తుకొని త్రాళ్లు త్రెంచుకొని, నానావిధముల అలజడి గుడిచి పోయిన పడవలు పోగా, మిగిలిన వానితో తూరుపు మొగమై నడచిరి. ఇదియంతయు జూలై నెల ఇరువది యేడవ తేదిని జరిగెను.

మరల ఆ మూడవనాడు (జూలై 29) "గ్రేను లైన్సు" (Grane lines) నొద్ద, ఇంగ్లీషు వారు ఆర్మడాలో ఇంకొక భాగమును మాఱ్కొనిరి. అప్పటికి ఇంగ్లీషు వారి యొద్ద చాలినంత తుపాకి మందు లేదు. శత్రుపక్షమున చాలినంత యుండెను. అయ్యు ఇంగ్లీషువారే గెల్చిరి. స్పానిషు పడవలు కొన్ని వీరి వశ మయ్యెను. కొన్ని నీట మునిగి పోయెను, కొన్ని మెట్ట బట్టి నిల్చిపోయెను. ఇంతలో ఒక దక్షిణవాయువు వీవగా దాని వాలున బడి పాఱిపోవచ్చు నని స్పానిషు పడవలు ఉత్తరముగా బయలు దేర, ఆ గాలియు తుపానుగా పరిణమించి వాని నడకను సాగనీయ దయ్యెను. వారికి పడవలలో తినుటకు తిండియు త్రావుటకు నీరును లేవు, దెబ్బలు తిన్న పడ

వలు బాగుచేసికొనుటకు వ్యవధి లేదు. ఎట్లయినను అయిన నష్టము కాగా మిగిలిన దానితో నైనను స్వదేశము చేరవలెను గాన, వారు స్కాటులాండు మీదుగా, ఐర్లాండును చుట్టి నడచి ఇల్లుసేర బయలు దేరిరి. దారిలో ఎన్నో పడవలు బ్రద్దలై పోయినవి. ఇక మిగిలిన కొలదిపడవలును అష్టకష్టములు పడి స్వదేశము చేరెను.

దానితో, ఇంగ్లండునకు స్పెయినువలని యపాయము తప్పినది. 1603-వ సంవత్సరమువఱకు గూడ రెండు దేశములకును యుద్ధములు నడచుచునే యుండెనుగాని, ఇంగ్లండునకు పరాజయశంక ఆర్మడా నాటితోనే పోయెను. స్వతంత్రతా సంపాదనార్థము స్పెయినుమీద తిరుగబడిన హాలెండు వారికి ఎలిజబెత్తు ఇంకొక సారిగూడ సాయముచేసెను. మరల ఇంకొక సారి ఫ్రాన్సులోని ప్రొటెస్టెంటులకును సాయమునడపెను. డ్రేకు మరల రెండవసారి "కాడిజు"ను తాకెను. ఇవన్నియు ఆ యుద్ధములు నడచిన నాళ్లలోని విశేషములు. యుద్ధములంతమొందినపుడు తేలిన సారమే మనగా, సముద్రయుద్ధ సామర్థ్యములో, ఇంగ్లండు నిరుపమానము కాదగిన శుభసూచనములును, స్పెయిను శక్తి క్షీణించు సూచనలును కాన నగుట. ఖండాంతరముల స్పెయినువారు సంపాదించిన వలసరాజ్యముల జయించి స్వాధీనము చేసికొను నంతటి శక్తి ఇంగ్లండునకు లేదు. అయినను ఎలిజబెత్తు రాణి చూపిన ఓరిమియు, నైపుణియు మంచి ఫలము లొసగెను. ఆమె నీతి ఫలమే, ఇంగ్లండు దేశము తక్కిన యూరోపీయదేశములతో సమానబల సంపన్నమని గణనకెక్కుట. ఎలిజబెత్తు కాలమున నౌకాధాటీ విషయమే గొప్ప యొద్దడి కలిగించినది. ఆ నాడు తాళుకొనబట్టి గాని, లేనిచో

ఇంగ్లండు స్థితి ఎట్లుండునో? జయము లభించినది గనుకనే సంపద సుస్థిరమైనది.

ఆమె పరిపాలనలో, ఇంత కంటె చెప్పికొన దగిన విశేషము లిక లేవు. నేమైనను, ఆమె దేశాభ్యుదయము సంపాదించెను. అభ్యుదితమైన ఆ దేశమును మొదటి జేమ్సు (James I) స్వీకరించి యేలుకొన సాగెను.



పందొమ్మిదవ ప్రకరణము



## ట్యూడరు యుగ విశేషములు

### (1) ప్రభుత్వము

ఇంగ్లండును పాలించిన రాజవంశములలో, ట్యూడరు వంశము అతి సమర్థమైనది. ట్యూడరు వంశ్యులైన రాజుల శక్తి యిట్టిదని వర్ణించుట చాల కష్టము. "రోజాయుద్ధముల" నాడు ప్రబలిన ఉపద్రవములు, విప్లవములు అణచి దేశమును మరల సక్రమమార్గమున నడపి రక్షించుట యొక్కటే వారి దక్షతకు నిదర్శనము. కాని వారిపాలన అతి కఠినమైనది. ఒక్కొక్క యెడ వారి వర్తనము అక్రమముగా నుండెను. అగుగాక, వారు సమర్థులు. అలజడివేళ అరాజకము రాకుండ దేశమును కాపాడ గలందులకు సమర్థులు కావలెను గాని కేవలము మంచివారు చాలరు. అదియునుగాక, వారికి ఆ శక్తియు దేశప్రజ లొసగినదే. "మీకు కావలసిన అధికారబల మిచ్చెదము. మీరు దాని గైకొని మమ్ము మంచి మార్గమున నడపుడు" అని ప్రజలు రాజుల కోరిరి; రాజులు శక్తిసంపన్నులై





**Silver Medal commemorating the defeat of the Spanish Armada, 1588. Made at Middelburg.**

*Obverse:* "I am assailed but uninjured."—the Church founded on a rock. *Reverse:* "He blew and they were scattered" – the Spanish fleet dispersed.

*British Museum.*

ఆ కార్యము నెరవేర్చిరి. ఎంత కఠినముగానైనను పాలింతురు గాక, వారి పాలన, దేశమును భావిభాగ్యమునకు అభిముఖము చేసెను.

ఆంగ్లో నార్మను రాజుల కాలమున, "రాజపరిషత్తు" వారు (Curia Regis) చాల వ్యవహారముల రాజునకు తోడ్పడు చుండిరి. ప్రతివిషయమునను వారి సాయమే రాజునకు కాబట్టెడిది. శాసనములు చేయుట, వాని ప్రయోగించుట, శాసనధిక్కారమును శిక్షించుట లోనగు కార్యము లన్నియు రాజపరిషత్తు మూలముననే రాజు నెరవేర్ప గలిగెను. అదియును గాక, సంధి విగ్రహాది విషయములలో గూడ వారి యుపదేశమునే రాజు అనుసరించెను. ట్యూడరురాజుల నాడు అట్టి వ్యవహారముల కన్నిటికి ప్రత్యేకముగా ఒక్కొక్క వర్గ ముండెను; ఎట్లన ఆదాయము రాబట్టుటకు, ఆ లెక్కలు చూచుటకును, కోశాధికారి యొకడు గలడు. వాని చేతి క్రింద చాలమంది చిన్న యుద్యోగు లుందురు. ఆ వర్గమునకు ఇతరవ్యవహారములతో జోక్యము లేదు. ఇట్లే తక్కిన వ్యవహారములు గూడ. వీరి నాడును తొల్లిటి రాజపరిషత్తు ఉన్నది. దాని కిప్పుడు "రహస్సభ" (Privy Council) అని పేరు. పూర్వాచారమును బట్టి ఆ సభ రాజునకు పెక్కుధర్మముల తోడ్పడుచునే యుండెను. కాని నేటి సభ పిలవని పేరంటమునకు పోదు అనగా, రాజు తానై తత్సభోపదేశ మర్థించిననే తక్క ఆ సభ్యులు అతనికి సలహాను ఈయరు. సూక్ష్మధర్మము లారయ వలసిన కేసులు ఏవేని వచ్చుచో వానిని విచారించి తీర్పు అధికారము నేటికిని ఆ సభవారికే కలదు. పార్లమెంటు సమ్మతి లేనిది, రాజు ఏశాసనమును చేయరా దను న్యాయము ట్యూడరు రాజుల కాల

మున వచ్చినది. అయ్యు అతనికి "అసాధారణ శాసనము" (Ordinance) చేయు నధికారము నిల్చియున్నది. అదియు సాధారణ శాసనమువలె ఆచరణయోగ్యమే. రెండింటికిని సమాన బలమే కలదు.

ఏడవ హెన్రి రాజ్యమునకు వచ్చునప్పటికి పార్లమెంటు చాల శక్తిహీనముగా నుండెను. కావుననే అతడును, తక్కిన ట్యూడరు రాజులును రాజపరిషత్తునే ఎక్కువగా వినియోగించుకొనిరి. ఆ పరిషత్తువారే ప్రత్యేకప్రత్యేకములుగా కొన్ని వర్గములుగా ఏర్పడి వివిధ వ్యవహార ధర్మములు చేయసాగిరి. ఒకవర్గము వారు కేసులు విచారించిరి. ఇంకొక వర్గమువారు రాజుతో కలిసి దేశసంచారము సేయుచు అసాధారణ శాసన నిర్మాణమున సాయపడుచుండిరి. ఇంకొక వర్గమువారు ఇంగ్లండు నుత్తర దిశకు పోయి, అచట స్కాట్లాండువారి వలన యొత్తిడి కల్గకుండ ప్రజల రక్షించుచుండిరి. మఱియొక కొందఱు దక్షిణముగా పోయి, వేల్సువలని యొత్తిడి లేకుండ అచటి ప్రజల కాపాడుచుండిరి. మఱి కొందఱు, 1558-వ సంవత్సరములో పుట్టిన "సర్వాధికారశాసనము" "సమతాశాసనము"ను ధిక్కరించిన వారిని శిక్షించుట కేర్పడిన కోర్టులో వ్యవహరించుచుండిరి. ఇంత యేల, సూత్రప్రాయముగా చెప్పవలయునన్న ట్యూడరురాజుల యేలుబడి యంతయు యుద్యోగివర్గముల మూలముగా జరిగె నని చెప్పవలెను.

ట్యూడరు రాజుల కాలముననే, పార్లమెంటునకు పోయిన పలుకుబడి మరల కల్గినది. పోపు బారినుండి తొలగుటకు సాధనాంతరము గానక, ఎనిమిదవ హెన్రీ నిండుమనస్సుతో పార్లమెంటు నధికారమును వృద్ధిచేసెను. పార్లమెంటునకు

అధికారవృద్ధి కల్గెను దనగా, కామన్సుసభకు అభివృద్ధి కల్గిన దని యర్థము. 1540–వ సంవత్సరములో కామన్సు సభ వారు సభలు నడపుకొనుటకై, వెస్టుమిన్స్టరున గల సెంటు స్టీఫెను ఆలయములో, ప్రత్యేకము ఒక ప్రదేశము ఏర్పాటు చేయబడెను. వారి సభావ్యవహారము లన్నియు వ్రాసి యుంచుకొనుటకును వారికి అధికార మీయబడెను. అట్లు వ్రాసియుంచుకొను రికార్డుల వలన చాల ప్రయోజనము కలదు:— ఎట్లన, రాజు ఎన్నడేని కామన్సువారి యధికారము చులకన చేయుచో, వారు పూర్వనిదర్శనములు చూపి తమ స్వత్వమును కాపాడు కొనుటకు. ట్యూడరు రాజులు, సాధారణముగ నడిమిరకము వారినే ఉద్యోగులుగా నియోగించిరి. వారి వలన గూడ కామన్సుసభకు ఎక్కువ గౌరవము లభించెను.

తమకు క్రమక్రమముగా అధికారగౌరవప్రాబల్యము కల్గెను కొలది, కామన్సువారికి రాజు స్వతంత్రించి చేయు కార్యములకు అడ్డుతగులు బుద్ధియు పుట్టెను. "స్పానిషు ఆర్మడా"ను జయించిన పిమ్మట పార్లమెంటునకును, ఎలిజబెత్తు రాణికిని ఎన్నో వాగ్యుద్ధము లైనవి. కాని రాణికి ధన లోపము మెండు. ఆమెకే యేల, ట్యూడరు రాజు లందఱును అట్టి వారే. అందుచేత పార్లమెంటుతో ప్రబలవిరోధము పెట్టుకొన్నచో బండి నడవ దని యామె ఎప్పటి కప్పుడే సద్దుకొని పోయెడిది. కాని మొదటి జేమ్సు కాలమున అట్టి కష్టము రానే వచ్చెను. వర్తకవ్యాపారములును పరదేశవ్యవహారములును సంబంధించి నంతవఱకు, రాజు స్వతంత్రుడే యనియు ఆ విషయములలో పార్లమెంటు జోక్యము కలిగించు

కొనఁ రాదనియు ట్యూడరురాజుల వాదన. స్టూవర్టు రాజుల నాఁడును ఈ వాదన యుండెను.

పరిపాలనాకార్యము మహాభార మైనది గనుక, అంత బరువును మోయవలె నన్న పార్లమెంటును చాలదు. ఇతరసభ లును చాలవు. కావుననే "ధర్మమూర్తులు" (Justices of Peace) అను వారు కావలసి వచ్చిరి. అట్టివారు కొందఱు పద మూఁడవ శతాబ్దిని గూడ నుండిరి గాని, వారికి వీరి కున్నంత ప్రాధాన్యము లేదు. ధర్మమూర్తుల ప్రతిష్ఠ, ట్యూడరు రాజుల నాటినుండియే ప్రారంభ మని చెప్పవచ్చును. వారు పల్లెల నుండు పెద్దమనుష్యులు. వారిలో కొందఱు న్యాయవాదులుగా గూడ నుందురు. కాని అందఱును న్యాయవాదులు కారు. కావలె నను నియమమును లేదు. కొంతకాలము వారికి జీత ములు గూడ ముట్టెను. కాని పిమ్మట ఆ యాచారము పోయినది. ధర్మమూర్తులు అచ్చటచ్చట పర్యాయముగ కోర్టులు పెట్టి చిన్న చిన్న కేసులు విచారించి నేరముల శిక్షించెడి వారు. పెద్ద పెద్ద కేసులలో గూడ వారు కొంత విచారణ సల్పి, పెద్ద కోర్టులకు పంపెడి వారు.

కూలియు, వెలయు నిర్ణయించుట, కొల్తలు, తూకములు సరిగా నుండునట్లు చూచుట, పేదలకు అన్నవస్త్రము లిప్పించు టకు పల్లెలలో చందాలు వసూలు చేయించుట మొదలగు పనులు గూడ వారి ధర్మములే. పూర్వకాలపు మఠములు పోయినవి గనుక పేదలకు కూడుఁగుడ్డ లొసంగు భారము ప్రభుత్వము వారు వహింపవలసి వచ్చెను. పేదవాండ్రు బిచ్చ మెత్తుకొనఁ రాదా యనిన, బిచ్చగాండ్ర యునికి దేశమునకు న్యూనత ఆ సంగతి గ్రహించినవారు ట్యూడరు రాజులే. ఎలిజబెత్

పేదవాళ్లను ఎంతో ఆదుకొనెను. ఆమె వాళ్లకు తిండి లోపము రాకుండ చూచెను. అది యొక మహాకార్యము. ఆ కార్యనిర్వహణార్థము పెక్కురు జనులు కావలెను. వారిలో ముఖ్యులు ధర్మమూర్తులు. వారందఱును పరోపకారార్థము ఆ పని చేసిరేకాని రాణిగారు వారి కెవ్వరికిని జీతము లీయలేదు.

(2) వేల్సు, స్కాటులాండు, ఐర్లాండు దేశములతోడి సంబంధము

మొదట, ట్యూడరురాజులు వేల్సు దేశీయులు. వారికి ఆ దేశమున ప్రాతచుట్టాలు పెక్కుమంది గలరు గనుక, తద్బాంధవము మూలమున ఆ రెండు దేశములకును ఎప్పుడు కలహములు కల్గలేదు. ఇక స్కాటులాండు, ఐర్లాండు దేశములతోడి సంబంధ మన్ననో, ఇంగ్లీషు రాజులకు క్లేశహేతు వయ్యెనే గాని సుఖప్రదము కాలేదు. స్కాటులాండుతో ఎట్లయినను పొత్తు కలిపికొనుట మంచిదని, ఏడవ హెన్రీ, తన కూతురు మార్గరెట్టును (Margaret) స్కాటులాండు రాజగు నాల్గవజేమ్సున కిచ్చి పెండ్లిచేసెను. ఆ పెండ్లివలన తాత్కాలిక మైన పొత్తు ఏర్పడెనే కాని చిరస్థాయి యైన మైత్రి నెలకొనలేదు. అటుపిమ్మట, ఎనిమిదవ హెన్రీయు, సోమరుసెట్టు డ్యూకును, మేరీ రాజకుమారిని ఆఱవ యెడ్వర్డున కిప్పించవలెనని యెంతో గట్టి యత్నములు చేసిరి గాని అది నెరవేర లేదు. తుదకు ఆ కన్య ఫ్రెంచి రాజగు రెండవ ఫ్రాన్సిసును పెండ్లియాడెను. అది యటులుండ, ఫ్రాన్సులోని కాతలిక్కులును, స్కాటులాండులోని కాతలిక్కులును ఏకార్థసమవేతులై మిత్రులైరి. దానితో ఆ రెండు దేశములకును తెగని బాంధవ

మేర్పడెను. అది ఇంగ్లాండునకు అపాయకరమైన స్థితి. ఉపాయశాలిని యగు ఎలిజబెత్తు ఈశ్వరపరిషత్తు వారికి సాయము చేసి, ఫ్రెంచిసేనలను స్కాటులాండునుండి వెడలగొట్టించుట చేత ఇంగ్లాండునకు కొంత ఊరట కల్గెను (1560). కాని, స్కాటుల రాణి యగు మేరీ, ఫ్రాన్సునుండి స్కాటులాండునకు తిరిగి వచ్చుట తోడనే ఇంగ్లాండునకు మరల ఎద్దడి మొదలిడెను. తదనుగుణముగా, ఆమెకు ఎలిజబెత్తు మరణశిక్ష విధించి వధించుట మఱియు చెట్ట యయ్యెను. స్కాటులాండులో గల కాతలిక్కుమతస్థులు ఇంగ్లాండును ద్వేషింప సాగిరి. తుదకు స్కాటులాండు రాజైన ఆఱవ జేమ్సు, మొదటి జేమ్సు అను పేర ఇంగ్లాండునకు రాజు కాగా రెండుదేశములకును కొంత పొందు పొసగెను గాని అదియు కార్యవశమునసైనదే కాని నిక్కమైనది కాదు. తుదకు 1707-వ సంవత్సరములో నిక్కమైన పొత్తు కుదిరెను.

నాల్గవ ఎడ్వర్డు, "కిల్డేరు దొరను" (Earl of Kildare) ఐర్లాండు పరిపాలనకు తన ప్రతినిధిగా నియమించెను. ఆ దొర చాల శక్తిమంతుడు, పలుకుబడి గలవాడు. ఏడవ హెన్రీ కాలమున గూడ కొన్నినాళ్లు అతడే ప్రతినిధిగా నుండెను గాని తుదకు అతనికి పదభ్రంశము కలిగెను. అతని స్థానమున "సర్ ఎడ్వర్డు పోరింగు" (Sir Edward Poyring) అను నొక ఇంగ్లీషు వాడు నియమింపబడెను. అతని కాలమున "పోరింగు శాసనము" అనునది యొకటి వెలువడెను. ఐరిషు పార్లమెంటువారు తమకు తామే స్వతంత్రించి యెట్టి శాసనములు చేయరా దనియు, ఇంగ్లాండులోని రాజసభ వారి యాదేశము ననుసరించి శాసనములు చేయవలె ననియు, ఆ పోరింగుశాసనము

యొక్క సారము. ఇది ఐరిషువారికి నిజముగా అవమాన కరమును స్వాతంత్ర్యచ్ఛేదకమును నైన మాట. పోనీ, ఇంగ్లీషు వారిపరిపాలన చక్కగా నుండుచో, ఐర్లాండును ఆ శాసనము అంతగా బాధింపదు. అదియు లేదు. ఒక్కొక్కప్పుడు, ట్యూడరు రాజులు ఐరిషు ప్రభువులకే సర్వాధికారముల నిచ్చి వారి వారి రాష్ట్రము లేలుకొమ్మనెడి వారు. ఆ ప్రభువులును ప్రజాహితముగా పాలింపలేక పోయిరి. కాగా, ఇంగ్లీషు రాజులు, ఐర్లండు విషయమున తీక్ష్ణ దండధారు లైరి.

ఎనిమిదవ హెన్రీ కాలమున, ఐర్లాండు నేలిన రాజప్రతి నిధులలో "సర్రే దొరయు" "సెంటు లీగరు" అను నిర్వురు ముఖ్యులు (Earl of Surrey and St. Leger). వారిలో మొదటి వాడు కఠిన శాసకుడు. అతడు ఐరిషు ప్రజలను హింసించి యేలెను. రెండవ వాడును ప్రజలను హింసించెను గాని మొదటి వాని కంటె కొంచెము నయము. ఎనిమిదవ హెన్రీ తాను "ఐర్లాండురాజును" అని చెప్పికొన సాగెను. కాని "పేలు" దాటిన, ఆవల అతని యధికారము చెల్లదు. "పేలు" అనగా "డబ్లిను" "లూతు" "కిల్డేరు" "మీతు"లో కొంత భాగమును. ఇంచు మించు ఐరిషు ప్రజలందఱును కాతలిక్కులే. ఎలిజబెత్తురాణి పేలు రాష్ట్రములోవారిని మాత్రము ప్రోటస్టెంటులను జేయ సమకట్టెను, తక్కినవారి జోలికి ఆమె పోలేదు. "పేలు"లో మాత్రము సర్వాధికారశాసనమును సమతాశాసనమును అమలులో పెట్టిరి.

ఎలిజబెత్తు రాజ్యమునకు వచ్చిన కొలది నాళ్లలోనే, ఐర్లాండులోని అల్‌స్టరు (Ulster) లో ఒక తిరుగుబాటు లేచెను. దానికి కారణము "ఓనీలు" (O'Neill) వంశమున కలిగిన ఒక

కుటుంబ కలహము. దాని వెనుక మఱికొన్ని తిరుగుబాటులు బయలుదేరెను. వాని నన్నిటిని పుట్టించిన వారును రెచ్చగొట్టిన వారును స్పెయిను వారు. 1598-వ సంవత్సరములో "ఒనీలు" వంశ్యులలో పెద్దవాడును "టైరోనీ" దొరయు (Earl of Tyrone) నైన వాడు స్పెయిను వారి ప్రేరణమున ఇంకొక తిరుగుబాటు లేవదీసెను. దాని నణచుటకు, ఎలిజబెత్తు ఎసెక్సుదొరను బంపగా నతడు పోయి, విప్లావకులతో సంధి చేసికొని, స్వదేశమునకు వచ్చి ప్రధానామాత్యుడైన "రాబర్టు సెసిలు" (Robert Cecil) మీద కుత్రు పన్నసాగెను. పిమ్మట, మౌంటుజాయి ప్రభువు (Lord Mountjoy) టైరోనీ దొరను ఓడించి ఆ విప్లవము నణచెను. ఇంతకును, ట్యూడరు రాజులు ఐర్లాండును జయింపనే లేదు. తరువాతి రాజుల కాలమున గూడ ఆ దేశవిషయము క్లిష్టముగానే యుండెను. ఆ దేశమును లోపఱచికొని యేలవలెను, లేదా పొత్తుగలిగి యుండవలెను, గాని లేనిచో ఇంగ్లాండునకు ప్రాణసంకటము. ఆసన్నముగా శత్రువుండుట ఎవ్వరంగీకరింతురు. ఆ విరోధమును ఊతగా గొని పరులు మఱింత భేదము పన్ని, ఐర్లాండుతో గలిసి, ఇంగ్లాండును ముంచివేయ జూతురు. స్పెయినువారు ఆ ప్రయత్నము చేయనే చేసిరి. పోనీ, ఆ దేశమునంతను జయించి లోపఱ్చుకొన నెంచినచో, దానిని జయించుటకు ఇంగ్లీషు వారికి శక్తి చాలదు. ఐర్లాండు మీద జయము గొనుట దుర్ఘట విషయము. పోనీ సమర్థతమై పలి అణచి పెట్టుటకా, అనేక కార్య వ్యగ్రు లగుటవలన, ట్యూడరు రాజులకు అవకాశమే లేక పోయినది.

## 3. వర్తక సంఘములు

ట్యూడరు రాజుల కాలములోనే, ఇంగ్లీషు జాతి గొప్ప వర్తక జాతి యయ్యెను. పదునాఱవ శతాబ్దిని ఇంగ్లీషు నావికులు, పడవలమీఁద నానాదిశల కేఁగుటయు, క్రొత్తదారులు, క్రొత్తదేశములు కనిపెట్టుటయు బోయి ఘనకార్యములు సేయుటయు మనకు విదితమే.

అయినను, ఇంగ్లాండు ఇతర దేశములతో వర్తకవ్యాపారములు సాగించినది నాఁడే యని తలఁపరాదు. తత్పూర్వము కూడ, ఇంగ్లీషువారు సమీపదేశములతో వర్తకము సేయుచునే యుండిరి. పదమూఁడు, పదునాల్గవ శతాబ్దుల, ఇంగ్లాండు నుండి ఎంతో యున్ని యెగుమతి యయ్యెను. కాని ఆ యెగుమతియు నియతము లైన యేవో కొన్ని రేవులనుండి తక్క, అన్ని చోటుల నుండియు ఎగుమతి చేయుటకు వీలు లేదు. అదియును గాక, ఎల్లరును ఆ యెగుమతి సేయుటకును అవకాశము లేదు. అట్టి హక్కు కొలదిమంది వర్తకులకు మాత్రమే కలదు. లాభ మంతయు వారే మూటగొనుట ఇతరులకు అసూయాజనకమై, పదునైదవ శతాబ్దిని మఱికొందఱు వర్తకులు బయలుదేరి, తమకును ఆ హక్కులు కావలె నని పట్టుపట్టిరి. ఎట్టకేలకు 1407-వ సంవత్సరములో, ప్రభుత్వము వారు, వారికిఁగూడ, హాలెండు బెల్జియములతో వర్తకముసేయు నధికార మిచ్చిరి. కొంత కాలము ఆ రెండు తెగల వారికిని పోటీ సాగెను. రెండవ తెగవారికి సాహస వర్తకులు అని పేరు వచ్చెను. ఆ సాహసవర్తకులు, మఱింత సాహసము చేసి, సముద్రములు గడచి దూరదేశములతో గూడ వ్యాపారము సాగించిరి. వారు సాగించిన దూరదేశ

వ్యాపారము ఎంతో ప్రమాదభూయిష్ఠము. ఏమన ఒకానొక యెడ వారి పడవలను సముద్రమున ముంచి వేయుటయు అర్థ ప్రాణ నష్టములు కలుగుచుండుటయు నయ్యెను. అయినను లాభనష్టములు సరిగా పంచుకొను ఏర్పాటుతో పలువురు పొత్తు కలిసి చేయు వ్యాపారము గనుక నష్టము వచ్చినంత మాత్రమున వర్తకము మునిగి పోవు నిబ్బంది కలుగలేదు. వారికి ఎంత నష్టమైనను, నికరముమీద తేలెడి లాభము ఎక్కువగా నుండుట చూచి, మఱి కొందఱు వర్తకులు, వారికి పెట్టుబడి పెట్టి లాభనష్టములు పంచుకొనుట కంగీకరించిరి. ఈ విధముగా క్రమక్రమమున, సాహసవర్తకులు ఉమ్మడి బేరగాండ్రుగా నైరి. పదునాఱవ శతాబ్దిని ఉమ్మడి బేరగాండ్ర గుంపులు చాల వెలసినవి. వానికి "వర్తకసంఘములు" లేక "కంపెనీలు" అని పేరు. 1555-వ సంవత్సరములో "మస్కొవి కంపెనీ" (Muscovy Company) లేచెను. అది ఉత్తరపు రష్యాతో వర్తకము చేసెడిది. 1581-వ సంవత్సరములో "లెవాంటు కంపెనీ" (Levant Company) బయలుదేరెను. మధ్యధరా సముద్రపు తూర్పు దేశములతో వర్తకముసేయుట దాని పని.

తుదకు పదునాఱువందల సంవత్సరములో సుప్రసిద్ధమైన "ఈస్టు ఇండియా కంపెనీ" (East India Company) అవతరించెను. హిందూదేశముతోను, తక్కిన ఆసియాఖండముతోను వర్తకముసేయు సర్వాధికారము, ఆ యీస్టు ఇండియా కంపెనీదే కాని తక్కిన కంపెనీలకు ఆ యధికారములేదు.

ఈస్టు ఇండియా కంపెనీ దినదినాభివృద్ధి గాంచ దొడగెను. దాని యభ్యుదయమును మెచ్చి, ట్యూడరు రాజులు దానికి తగినంత సాయమొనర్చి ప్రోత్సహించిరి. "ప్రతి

మనుజుడును, వారమునకు కొన్ని నాళ్లు నియమితముగా చేపలు తిని తీర వలె నని ఎలిజబెత్తు ఒక విచిత్రమైన శాసనము చేసెను. దాని యుద్దేశ మేమనగా, చేపలను తినవలయును, పెక్కురు చేపలు పట్టుకొన నేర్తురు; చేపలు పట్టుకొను నేర్పులచే సముద్ర సంచార మలవడును. ఆ సంచార మలవడుటచే పెక్కురు నావికు లగుదురు. వారిలో మంచి నావికులు సముద్రయుద్ధానౌకల రాజ్యమును అపేక్షింతురు. ఆ శాసనము ఉద్దిష్టఫలిత మొసగెను. స్పానిషు ఆర్మడాతో పోరాడిన నావికులలో పెక్కురు ఈ విధముగా ప్రసిద్ధులైన వారే. మఱియు, సాహసికులు స్పెయినువారి పడవలను దోచుకొనుటకు ఎలిజబెత్తు సమ్మతించె ననియు తత్ఫలముగ అమిత ధన ప్రాప్తి యయ్యె ననియు తెల్పితిమి. అవియు నావికుల ప్రోత్సాహించుటయే. అట్లే, ఆ రాణి కొన్ని కంపెనీలకు వర్తకవిషయమున కొన్ని ప్రత్యేకాధికారము లిచ్చి ప్రోత్సహించెను. ప్రత్యేకాధికారము పొందిన కంపెనీవారు, ఏ సరకు ఎగుమతి చేయుదురో ఏ యే దేశములతో వ్యాపారము నడపుదురో, ఆ సరకు జోలికిని ఆ దేశముల జోలికిని ఇతరులు పోవవీలు లేదు. కావున పోటీలు పడక, కంపెనీలు, తమ తమ పనుల చక్కగా వర్తించి వృద్ధి నొందెను. నేటి ఆంగ్లసామ్రాజ్యము ఆ నాటి కంపెనీల సృష్టియేయని ఎల్లరు అంగీకరింపక తప్పదు.

## (4) సాహిత్యము

తమది ఒక పౌరుషవంత మైన జాతి యనియు, ఆ జాతికిని తద్భావములకును అన్ని విధముల సరియగు ఒక భాష తమకు నుండె ననియు, జాతికెల్లరు ఆ యేకభాషయేగాని

భిన్న భాషలు లేవనియు, ఇంగ్లీషు ప్రజలు గ్రహించి, యుత్సాహించి, గర్వించి, విఱ్ఱవీగినది, ట్యూడరు రాజుల నాడే. అందును, ముఖ్యముగా ఎలిజబెత్తురాణి కాలమున ఆ భాషలో చిత్ర విచిత్ర కావ్యజాలము వెలసెను. మొదటి స్టూవర్టు రాజుకాలమున గూడ పెక్కు కావ్యనాటకములు రచింపబడెను. అవి సార్వకాలికములును, విశ్వజనీనములును నైన రచనలు. ఆ కవులకు, క్రొత్తమాటలు సృజించుట యందును, ప్రాత మాటలకు క్రొత్త యర్థములు చెప్పుటయందును కుతూహాల మెక్కువగా నుండెను. ధీరులైన తమ సోదరులు, భూప్రపంచమున క్రొత్త దేశములు కనిపట్టుచుండ, ఆ కవులు భాషాప్రపంచమున క్రొత్తమాటలు కనిపట్టుటలో వింత యేమి? సముద్రమువిూద, వారు క్రొత్తదారులు తీయు చుండ, సారస్వతమున వీరు క్రొత్తదారులు త్రొక్కుటలో నాశ్చర్య మేమి? అట్టిదే, జాతికి సర్వతోముఖమైన భాగ్య మనగా. మఱి కొన్నినాళ్లకు, అనగా పదునాఱవ శతాబ్ది యంతమున మహాప్రతిభాశాలు రగు కొందఱు కవు లవతరించిరి. భావసంపన్నులును, రససిద్ధులును నైన ఆ కవులు ఆంగ్లవాఙ్మయ చరిత్రకును, ఆంగ్లదేశచరిత్రకును గూడ నలంకారప్రాయులు. వారితో ఎన రాదగినవారు మరల ఈ దేశమున పుట్ట లేదనుట అతిశయోక్తి కాదు. వారు ప్రతిభాశాలు రగుటకు కాలప్రభావము కూడ కొంతకారణము. ఆ దినములలో నింగ్లండు నభ్యుదయ మేమి చెప్పను? పట్టిన దెల్ల బంగార మగుచుండెను. ఎత్తినకత్తి జయించు చుండెను. మెట్టిన భూములు స్వాధీనము లగుచుండెను. ఈ వీరరసప్రధాన మైన నాటకమునకు సూత్రధారిణి యై, దివ్య విలాసిని యైన రాణి గద్దె నెక్కి యుండెను.

సామాన్యజనులే, ఉల్లాసపూరితులై, పవు దేశమే భూతల స్వర్గముగా భావించి జీవితానంద మనుభవించుచుండ, ఇక కవులహృదయముల రసవాహినులు వెల్లివిరియుట వింతయా?

ఈ నాటకరచనలలో, నాటకము మిక్కిలి రసవంతమైన ప్రక్రియ. "మార్లో," "బెన్‌జాన్సను," "వెబ్‌స్టరు" (Marlowe, Ben Johnson and Webster) అను మహామహులు క్రొత్త నాటక రచనను ప్రారంభించిరి. పిమ్మట, కవికులతిలకుడగు షేక్స్పియరు ఉదయించెను. అతని ప్రతిభకు పూర్వకవుల ప్రతిభ చాలదు. వాని కీర్తిముందు, వారికీర్తి పొడగానకపోయెను. "అతని హృదయము ప్రేమనాకర భరితము. అతని వాక్కు ప్రేమతత్వ పూరితము. అతని రచనలు త్రికాల నిరుప మానములు. అతని కవిత్వము ఆంగ్లసాహితికి తిలకాయ మానము." "దీర్ఘబాహులును, దృఢకాయులును, సుందర విగ్రహులును, రసవచ్చిత్తులును, అయిన అప్పటి ఆంగ్ల జాతిలో పుట్టి కవిగాక, మఱే మెట్టి వా డవతరించును?"



## ఇరువదియవ ప్రకరణము



### పార్లమెంటు రాజాధికారమును ధిక్కరించుట

### ఆఱవ జేమ్సు (James VI.) స్కాటులాండు: ఇంగ్లాండు

1603-వ సంవత్సరములో స్కాటులాండు రాజైన ఆఱవ జేమ్సు, ఇంగ్లాండునకు రాజై, "మొదటిజేమ్సు" అను పేర బరగెను. ఏడవ హెన్రీకి దగ్గఱ వారసు డగుట యొకటియే అతని కీ రాజ్యమునెడ గల హక్కు. రాజభావము నెడ అతనికి



William Shakespeare—Painting attributed to R. Burbage or J. Taylor
(By kind permission of National Portrait Gallery, London.)

కొన్ని విపరీతాభిప్రాయములు గలవు. రాజస్వత్వము ఈశ్వరోద్దిష్టమని యతని భావము. అనగా, ఇంగ్లీషురాజులకు వారసుడుగా తనను ఈశ్వరుడు పుట్టించుట, ఆ రాజ్యము తనచే

నేలింప దలచినాఁ డనియు, కనుక తనకు ఇంగ్లండుదేశము ఈశ్వరదత్త మయిన వరమనియు, ఈశ్వరోద్దిష్టుఁడైన కారణ జన్ముఁడు గనుక, తనకును ఇతరమానవులకును ఎందును సామ్యము లేదనియు, ఈశ్వరానుగ్రహసంపాదిత మైన తన యధికారమును ధిక్కరించు వారు పాపాత్ములుగా శిక్షింపబడుదు రనియు అతని తలంపు. ఈ విపరీతాభిప్రాయము లుండిన నుండును గాక. అతనిచేష్టలు సామాన్యములుగా నున్నచో భావము లెట్లున్న నేమి? కాని చేష్టలును తదనుగుణముగానే యుండెను. అతని వర్తనము చూచినచో ఎంత వినయభూషణుఁడైనను, అతని మాటను ధిక్కరింప తలపు గలుగును. అతఁడు చక్కఁగ వ్రాయగలఁడు, చమత్కారముగ మాటలాడ గలఁడు. కాని యేమిలాభము? మానవ స్వభావము బొత్తుగా ఎఱుఁగఁడు.

తానెంత హింసించుచున్నను ప్రజలు తనయెడ భక్తితత్పరులై యుండవలెనని యతని కోరిక. అతని హితులును నట్టి యవివేకులు, దుర్మార్గులు. ఎందఱో సమర్థు లుండగా, వారి నెల్ల కాదని యీతఁడు అవివేకులనే హితులుగా గ్రహించి వారి యిష్టానుసారము వర్తించెడి వాఁడు. వారియెడ అతనికి అభిమాన ముండుటకు హేతువు, వారి చక్కఁదనమట.

అతఁడు మంచి శుభవేళ రాజ్యమునకు వచ్చెను. పూర్వము నుండియు భిన్నములై, విరుద్ధములుగా నుండిన, ఇంగ్లాండు స్కాట్లాండు దేశములు, అతఁడు సింహాసన మెక్కుటవలననే అభిన్నము లైనవి. పార్లమెంటు, చర్చి మొదలగు విషయములలో ఏ దేశమున కా దేశమే స్వతంత్రముగా వర్తించినను, రెంటిని ఏలు రాజు ఒక్కఁడే గనుక తొల్లిటి విరోధములు

సమసి సోదరుల వలె నుండ నయ్యెను. ఇంగ్లండునకు స్కాటు లాండువలని ముప్పు తప్పిన దని యెల్లరు సంతోషించిరి. ఫ్రాన్సువారు, స్కాటులాండుతో గూడి, ఇంగ్లండునకు ప్రతికూలముగా తంత్రము పన్ను దినము లిక రావని రాజనీతి వేత్త లందఱు భావించిరి. దీనిని బట్టియే జేమ్సు శుభవేళ రాజ్యమునకు వచ్చె ననుట.

ఐర్లాండులో, ఇంగ్లండునకు గల రాజ్యము కొలదిపాటిదే కాని విస్తృత మైనది కాదు. ఇంకను కొన్ని రాష్ట్రము లాక్రమించుకొని ఆ రాజ్యమును విస్తరింపజేసికొనుటకు జేమ్సు సంకల్పించెను. పూర్వము, ఎలిజబెత్తు ఒక వ్యవహారము చేసినది. ఏమన, డెవనుషైరులోని సుందరపురుషు లందఱికి ఆమె ఐర్లాండులోని మన్స్టరులో (Munster) గల ఫలవంతములైన భూములు ఇనాములుగా నిచ్చి మన్నించెను. వారు ఆ భూములను స్వాధీనము చేసికొని తోటలు దొడ్లు వేసికొని అనుభవించుచుండిరి. 1610-న సంవత్సరములో జేమ్సు కూడ అట్లే, కొంతమంది స్కాటులాండు వారికి, కొంతమంది లండను నగరవాసులకు ఐర్లాండులోని అల్స్టరు (Ulster) లో మఱికొన్ని తోటలు దొడ్లు కల్పించి యిచ్చెను. తాతల నాటినుండియు ఆ భూము లనుభవించుచున్న దేశీయులు అచట నుండి తఱిమివేయ బడిరి. తక్కిన ప్రజలును ఘోరముగా హింసింప బడిరి. అల్స్టరులో ప్రవేశించి భూము లాక్రమించిన ఇంగ్లీషు వారును, స్కాటులాండువారును ప్రొటస్టెంటులు. అచ్చటి దేశీయులు కాతలిక్కులు. మొనమొన్నటి దనుక వారును వీరును కలియనే లేదు.

## జేమ్సు: ప్యూరిటనులు: ప్రెసిబిటేరియనులు

జేమ్సు చిన్ననాటినుండియు ప్రెసిబిటేరియను సంప్రదాయమునందే పెరిగెను. కాని ఆ మతమునందు అతనికి అభిమానము లేదు. అభిమానమే కాదు, ఇష్టమును లేదు. చర్చి పరిపాలన బిషప్పుల వశమునందే యుండవలెనుగాని, ప్రతినిధి సంఘముల వశమున నుండరా దని యతని యభిప్రాయము. మతమున, నేడు బిషప్పుల అధికారము పోయినచో, రేపు రాజ్యమున రాజులయధికారమును నున్న కావచ్చు నని యతని భయము. అందుచే నతడు ప్రతి మాటికి "బిషప్పు లేనిచో, రాజును ఉండడు" అని యుద్ఘోషించెడి వాడు.

ఇంగ్లీషు చర్చిలో, ఇంకను చాలమంది "ప్యూరిటనులు" కలరు. వారికి ఆ చర్చిని విడద్రొక్కి పోవలె నను బుద్ధి లేదు. అందుండియే, దానిలోని దురాచారములు కొన్ని సంస్కరింపవలెనని వారి యాశ. 1603–వ సంవత్సరములో, ఆ వర్గమునకు చెందిన ప్రముఖులు, బహుసంఖ్యాకులు, చర్చిదురాచారముల మాన్పవలసినదిగా, ఒక వినతిపత్రమును వ్రాసి రాజునకు సమర్పించిరి. ఆ విషయమును గూర్చిన వివరము లన్నియు ముఖాముఖిని ముచ్చటించుట మంచి దని, జేమ్సు వారి కందఱికి హాంప్టనుకోర్టున దర్శన మిచ్చెను (1604). వారి ప్రసంగము లాలకింపగా, వారికిని ప్రెసిబిటేరియనులకును భేదము లే దనియు, వారును బిషప్పుల తిరస్కరించువారే యనియు, అతనికి ఒక అపోహ పుట్టి, వారిమీద మండిపడి సాంతముగా సభ జరగనీయక నడుమ లేచిపోయెను. తదుపరి, ప్రార్థనాగ్రంథములోని వాక్యములు పరమప్రమాణము లనియు చర్చి యాచారము లనియు అతిపవిత్రము లనియు,

మత ప్రచారికులెల్ల అంగీకరింప వలసినదిగా రాజాజ్ఞ కాగా, పెక్కురు గతి లేక యట్లే యొనర్చిరి. సుమారు మూడువందల మంది మాత్రము, తమ కా పని యిష్టము కా దని చెప్పి ఇంగ్లీషు చర్చిని విడనాడి పోయిరి. వారికే "అసమ్మతులు" (Non - Conformists) అని పేరు వచ్చెను. చర్చి యాచారము లన్నిటికి వారు సమ్మతించక పోబట్టి వారి కా పేరు కల్గెను.

## తైర్థికపితామహులు: (Pilgrim Fathers).

**1607**-వ సంవత్సరములో, నాటింగాముషైరులోని, స్క్రూబీ (Scrooby in Nottinghamshire) నుండి, కొందఱు "అసమ్మతులు" బయలుదేరి, ఇంగ్లండును విడిచిపెట్టి, హాలెండునకు పోయిరి. అచ్చట, మతవిషయికమైన నిర్బంధము లుండ వనియు, తమ యిచ్చ వచ్చిన తాము ఈశ్వరారాధన చేసికొన వచ్చు ననియు తలచి వారు స్వదేశమును త్యజించి పోయిరి. అట పదియేండ్ల కాలము గడచిన పిదప, వారికి అమెరికాకు పోవలె నను బుద్ధి పుట్టెను. కాని రెండు మూడేండ్ల వఱకు ఆ ప్రయాణము సాగలేదు. తుదకు **1620**-వ సంవత్సరము మే నెలలో, నూటయిద్దఱు తైర్థికులు "వసంత సుమము" (Mayflower) అను ఓడ నెక్కి పోయి అమెరికా లోని "వర్జీనియా" (Virginia) చేరిరి. తత్పూర్వము **1585**-వ సంవత్సరములోనే, "సర్ వాల్టరు రాలీ" (Sir Walter Raleigh) అను మహానుభావుడు, వర్జీనియాలో వలస రాజ్యము స్థాపింప యత్నించెను. కాని యిది నెరవేరలేదు. ఆ మఱుసటి యేడు (**1586**) డ్రేకు, వర్జీనియాకు పోయి అచ్చటి ఇంగ్లీషు వారి నెల్ల స్వదేశమునకు తోడ్కొని వచ్చెను. మరల **1587**-వ సంవత్స

ఖ్యాతులైన కాతలిక్కులు గలరు. అంత మతసంస్కరణోద్యోగము జరిగినను, పల్లెల జనులు మాత్రము కాతలిక్కులుగానే యుండిరి గాని ప్రోటస్టెంటులు కారైరి. అయినను రాజశిక్షా భయమున, వారు ప్రోటస్టెంటు చర్చికే పోవుచు, ప్రోటస్టెంటుల వలె పైకి నటించుచు, రహస్యముగ నింట్లలో తమ పూర్వధర్మములనే తాము సేవించు చుండిరి. మఱి కొంత మంది కేవలము ఉదాసీనులుగా నుండక, మరల దేశమున కాతలిక్కుమతమును పునరుద్ధరింప వలె నని యత్నించు చుండిరి. వారెల్లరు "జెసూయిట్టు" (Jesuits) ల అనుచరులు. కాతలిక్కు మతావలంబి యైన వానికి రాజోద్యోగము ఈయబడదనియు, ప్రోటస్టెంటు చర్చికి పోవని వాడు శిక్షార్హు డనియు, కాతలిక్కులు రాజాజ్ఞ లేక ఇల్లు విడిచి యైదుమయిళ్ల దూరము కంటె నెక్కువ ప్రయాణము చేయ రాదనియు, బాహిరముగా, కాతలిక్కు మత విధమున పూజా పురస్కారములు చేసినవాడు వధార్హు డనియు, కొన్ని కఠినశాసనము లుండెను. ఆ శాసనములు పేరునకు మాత్ర ముండెనేకాని, వాని నెప్పుడును అమలులో పెట్టలేదు. ఆచరణమున లేకున్నను, అక్షర రూపమున నుండుటయు అనర్థహేతువే కాన వానిని తీసి వేయించుటకు తిరుగుబాటు చేయవలె నని జెసూయిట్టులు పట్టు పట్టిరి.

గట్టిగా కాతలిక్కుమతమే కావలె నను వారు, ఇతరుల గూడ చెడగొట్టక, తమంత తాము, రహస్యముగ, ఆ మతము ప్రకారమే వర్తింప వచ్చు నని జేమ్సు కొంత కనికరించెను. ఆ మాత్రపు చన విచ్చుటచే, వారు పోపునెడ కంటె, తన యెడనే ఎక్కువ భక్తిభావము చూపెద రని యతని యూహ.

1603-వ సంవత్సరములో, కాతలిక్కులు, రాజుమీద ఒక కుట్ర పన్నిరి. అది బయటబడెను. చనవిచ్చుట వ్యర్థమనియు, కాతలిక్కులకు రాజభక్తి యుండదు గనుక నొసంగుట వట్టి భ్రమయనియు, జేమ్సు అప్పుడు గ్రహించెను. అంతట, అతిఘోరముగా నున్న శాసనము లన్నియు ప్రయోగించిరి. కాతలిక్కు ప్రీస్టు లెల్లరు దేశము వదలి పోవలెనని శాసించిరి.

దానివలన కాతలిక్కులకు మఱింత మనసులు నొచ్చి, ప్రతీకారదీక్ష బూని, తొల్లిటి దానికంటెను ఘోరమైన ఇంకొక కుట్రపన్నిరి. రాజునేకాక, పార్లమెంటును గూడ తుదముట్టింప వలె నని కుట్రదారుల పన్నుగడ. పార్లమెంటు భవనములను హఠాత్తుగా తగులబెట్టవలె ననియు, అవి నాశమైన వెంటనే పెక్కురుగూడి తిరుగుబాటు నారంభింప వలె ననియు కల్పన. తదనుగుణముగా, కామన్సుసభాభవనము క్రింద సొరంగములు త్రవ్వి ఫిరంగి మందు కూరిరి. సమయ మెఱిగి నిప్పు ముట్టించుటకు, "గై ఫాక్సు" అను ఒక నేర్పరిని నియోగించిరి. కాని, వాని వలననో, మఱి యెవ్వరి వలననో, ఆ రహస్యము బయటబడెను. ద్రోహుల సంపెటిని గాలించి పట్టి బంధించిరి. కుట్ర యత్నము లన్నియు వ్యర్థము లైనవి. కాని, ఇంగ్లండునకు మాత్రము కాతలిక్కులవలని యపాయశంక తొలగనే లేదు. చిరకాలము వనుక కాతలిక్కుల పేరు చెప్పిన గుండె తల్లడముగానే యుండెను. వారి యౌద్ధత్యమును అణచుటకు, పూర్వపు శాసనములు కొన్ని ప్రయోగించినను ఫలితము లేక పోయెను.

## పార్లమెంటు

మొదటి జేమ్సు నేలుబడిలోని విశేషములలో ప్రధానాంశ మేమనగా, పార్లమెంటును క్రమముగా రాజాధికారములను కొన్నిటిని తిరస్కరింప యత్నించుటయే. అతని కాలమున పార్లమెంటు సభలు నాల్గు సార్లు జరిగెను. నాల్గు తడవలును రాజు సభవారితో కలహించెను. మొదటి సారి జరిగిన సభలో, రాజు చర్చికి అధ్యక్షుడుగా నుండు విషయము వివాదమై, అతనికి ఆ యధికారము కూడదని నిర్ణయించిరి. చర్చి వ్యవహారములలో రాజు నాజ్ఞయే శాసనము. అతని యిష్టానుసారము చట్ట చేసినను ఇదేమని అడుగుటకు ఎవరికిని హక్కు లేదు. ఆ లోకువ కనిపెట్టి ఇతర రాజకార్యముల గూడ నతడు తన యిచ్ఛ చొప్పుననే వర్తింప జూచును గాని పార్లమెంటునకు విధేయుడై యుండడని, శంకించి పార్లమెంటు వారు అతని మతాధిపత్యమును నిరసించిరి.

అదిగాక, రాజ్యతంత్రమున గూడ రాజునకు "అనర్గళాధికారము" (Prerogative) అను ఒక స్వత్వ ముండెను. నిజమును బట్టి చూచిన, ఏవో కొన్నిట దక్క, సమస్త వ్యవహారముల యందును రాజు పార్లమెంటువారితో సంప్రతించి వారి సమ్మతి ప్రకారమే వర్తించ వలసి యుండెను. కాని, రాజు తనకు మేలని తోచినట్లుగా, దేశక్షేమములను గోరి, తన యిచ్ఛ చొప్పున ప్రవర్తించు నధికారము గల దనియు, లేకున్న రాజభావము నిరర్థక మనియు, అన్ని యెడలను పార్లమెంటు వారి సమ్మతిపొంద నక్కరలే దనియు, అవసరమును బట్టి దేశాచారమునుబట్టి నియతము లైన శాసనముల గూడ తాను పాటింప నక్కర లేదనియు జేమ్సు వాదించెను. ఈ

యధికారమునకే “అసర్గళాధికారము” అని పేరు. పార్లమెంటు వారు ఆ వాదమును నిరసించిరి. రాజు శాసన నియమముల తప్పక పాటింప వలెననియు, పార్లమెంటు వారి మాట మన్నింప వలయు ననియు, వారియిష్టమునకు భిన్నముగా వర్తింప రాదనియు వారి వాదన.

అదియును గాక, వర్తకవ్యాపారముల యందును, పరదేశములతోడి సంధివిగ్రహాదులయందును, తొల్లిటి నుండియు పార్లమెంటువారి జోక్యము లేదు. కాని జేమ్సు కాలమున పార్లమెంటు వారు, తమకు ఆ విషయముల గూడ విచారించు నధికార మున్నదని వాదించిరి. ఇంతలో జర్మనీలో “ముప్పది యేండ్ల యుద్ధములు” తటస్థించెను. రాజు, ఆ యుద్ధములలో దిగ వలె నని పార్లమెంటు వారు తీర్మానించిరి. యుద్ధవిషయముల సలహాల నిచ్చుట వారికి తగని పని యని జేమ్సు ధిక్కరించెను. అంతతో అది ఆగి పోయెను. కాని వర్తకవిషయముల విచారించుటను గూర్చిన వాదనలో పార్లమెంటు వారే నెగ్గిరి. విధి లేక రాజు అందులకు సమ్మతించెను.

తుదకు, ప్రయోజనము లేని వాద ప్రతివాదములతో లాభము లేదని పార్లమెంటువారు క్రియారూపమున తమ శక్తి చూప గడగిరి. తమ మనోరథ సిద్ధికి వారు రెండు సాధనములు కని పట్టిరి. అందు మొదటిది, పూర్వకాలపు “నిందారోపణ” పద్ధతి. దుర్మార్గు లని తోచిన రాజమంత్రులను రాజహితులను నిందారోపణ పద్ధతిప్రకారము విచారించి శిక్షించు నధికారము పార్లమెంటు వారికి పూర్వకాలమున కలదు. 1621-వ సంవత్సరములో ఆ పద్ధతి పునరుద్ధరింప బడెను.

రెండవది, కోశ విషయము. పార్లిమెంటువారు రాజు నకు కొంత సొమ్ము ఇచ్చుచుందురు. అది అతని చిత్తము చొప్పున వెచ్చింప వచ్చును. 1624-వ సంవత్సరములో పార్లిమెంటువారు తీర్మానించిన దేమనగా, ధనవ్యయ విషయమున రాజు స్వతంత్రించి వర్తింప రాదనియు, దేని కెంత వెచ్చింప వలెనో పార్లిమెంటు వారే నిర్దేశింతు రనియు, ఆ నిర్దేశమును రాజు అనుసరింపవలె ననియు. ఈ తీర్మానము వలన ధనాధికారము పూర్తిగా పార్లమెంటు వశ మైన దనుట. ఏ ప్రభుత్వ మైనను సరిగా సాగవలె నన్నచో తగినంత డబ్బు కర్చు చేయ వలెను. వలసిన సొమ్ము వెచ్చింప లేని రాజునకు రాజభావము సార్థకముగా లేదన్న మాట.

ఈ విధముగా పార్లమెంటు ఒక్కొక్క హక్కు కోరు చుండ, జేమ్సు దిక్కు తెలియక వ్యర్థ ప్రసంగములు చేయ సాగెను. తాను దయదలచి యుంచబట్టి గాని, లేనిచో పార్లిమెంటునకు స్థితియే లేదనియు, తన యిచ్చ వచ్చి నప్పుడు అది అస్తమించి పోవు ననియు, నతడు ప్రగల్భము లాడ జొచ్చెను. అతని ప్రగల్భములు సరకు సేయక, పార్లిమెంటు వారును ఉద్ధతులై ప్రతిఘటింప సాగిరి. తుదకు ఎట్లో ఆతని దినములు కడచనెను. అతడు నాటిన విషవృక్ష ఫలము, అతని కొడుకు "చార్లెసు" (Charles) అనుభవించెను.

## మొదటి చార్లెసు (Charles I) రాజ్యమునకు వచ్చుట

## మార్చి 1625-వ సం॥

మంచిరాజునకు నుండ దగిన లక్షణము లన్నియు చార్లెసులో ప్రకృతి సిద్ధములుగా గలవు. అతడు సుందరాకారుడు,

నెఱ కౌతు, మితాహారము ఉచితవిహారము సేవించువాడు, గురువతనము గలవాడు, విశేషించి దైవభక్తి సంపన్నుడు. ఇన్ని సుగుణము లున్నను, తండ్రినాటి లోపములు సవరించి, పార్లమెంటు వారి కోపాగ్నిని శమింప జేయ లేకపోయెను. ఆ కార్యము నెరవేర్చుటకు అతనికి శక్తియు లేదు. ఎంత సుగుణ సంపద గలవాడైనను అతనిలో గూడ ఒక దుర్గుణ ముండెను. ఏమన, తండ్రి వలెనే అతడును దురభిమాని; పట్టినపట్టు విడిచి పెట్టు స్వభావము కాదు. ఎన్నడేని కొంచెము పట్టు వీడి నట్లు కనబడినను, అది మాటలనే కాని చేతల గాదు. మాట యిచ్చి తప్పుట అతనికి పరిపాటి యయ్యెను. తండ్రి వలెనే అతడును పెక్కుసారులు పార్లమెంటుతో కలహించెను. ఆ కలహకారణములును జేమ్సునాటివే. రాజమంత్రులలో కొందఱు పార్లమెంటు వారికి నచ్చని వారైరి. మఱియు, చార్లెసు చేసిన యుద్ధములలో పరాజయములు ప్రాప్తించెను. ఈ విషయములను సభలో తర్కించ వలె ననియు, తమకు ఆ హక్కు కలదనియు పార్లమెంటువారు పట్టుపట్టిరి. మఱియు, మతవిషయములలో చార్లెసు, "హైచర్చి" కి చెందినవాడు; అది కాతలిక్కు మతమునకు చేరువ. పార్లమెంటు సభ్యులలో పెక్కురు ప్యూరిటనులును, ప్రెసిబిటేరియనులును గలరు. పార్లమెంటు వారు, చార్లెసును సహింపకపోవుటకు మత విరోధమును ఒక కారణము.

ఇవన్నియు నిటు లుండ, తండ్రి వలెనే, అతడును, రాజ భావము ఈశ్వరదత్త మనియు, రాజుచర్యలు సర్వధా ధర్మసమ్మత ములే యనియు, వానిని గూర్చి ప్రశ్నచేయు నధికార మెవ్వరికిని లేదనియు, తన యధికారమును నిరోధించు నధికారము

పార్లమెంటునకు లేదనియు వాదింప సాగెను. ఇదియంతయు జేమ్సునాటి పాలయే.

## చార్లెసు: మొదటి మూడు పార్లమెంటు సభలు

ప్రధానమంత్రి యైన బకింగుహాముడ్యూకు చేసిన యుపదేశము వలన చార్లెసు 1625-వ సంవత్సరము మే నెలలో హెన్రియెట్టా మేరియా (Henrietta Maria) అను నామెను పెండ్లి యాడెను. ఆమె ఫ్రెంచిరాజునకు చెల్లెలు. వారిది కాథలిక్కు మతము. పెండ్లి యైన నెల దినములకే పార్లమెంటు సభ సమావేశ మయ్యెను. యూరపులో జరుగుచున్న ముప్పది యేండ్ల యుద్ధములో దిగి, స్పెయిను ఆస్ట్రియాలతో పోరాడవలె నని చార్లెసు ఆ సభలో ప్రతిపాదించెను. తత్పూర్వమే, ఫిబ్రవరి నెలలో పంద్రెండు వేల మంది సైనికులను జర్మనీకి పంపిరి. మంత్రియైన బకింగుహాము యొక్క లోభగుణము వలన, ఆ భటులకు కడుపు నిండ తిండియు, చేతి నిండ డబ్బును లేక నానాకష్టముల పాలైరి. వారిలో పెక్కురు తిండిలేకయే చచ్చిరి. తక్కినవారు యుద్ధవిముఖులై లేచి పోయిరి. కావున, స్పెయిను ఆస్ట్రియా దేశముల మీదికి చార్లెసు మరల పంపదలచిన సేనలకు కావలసిన సొమ్ము ఇచ్చుటకు వీలు లేదని పార్లమెంటువారు ప్రతిఘటించిరి. సాధారణముగ ఏ రాజైనను రాజ్యమునకు వచ్చిన వెంటనే, పార్లమెంటు వారు, అతని పరిపాలనకాలములో రాబట్టుకో దగిన సుంకముల మొత్తమును ఒక్కసారి గానే "యింత"యని నిర్ణయించి తీర్మానింతురు. ఇది పూర్వాచారము.

1625-వ సంవత్సరపు పార్లమెంటు సభ ఆ పూర్వాచారమును ఉల్లంఘించి ఆ యేటి సుంకములు మాత్రము చార్లెసు వసూలు చేసికొన వచ్చునని తీర్మానించెను. అతడును వారి తీర్మానమును సరకు సేయక పూర్వాచారముల రీతిగనే సుంకపు మొత్తము లన్నియు వసూలు చేయించెను.

రెండవ సారి పార్లమెంటు, 1626-వ సంవత్సరము ఫిబ్రవరి నెలలో సమావేశ మయ్యెను. ఈ సభ నాల్గు మాసముల వఱకు నిరంతరముగ జరుగుచునే యుండెను. మంత్రియైన బకింగుహాము చర్యలు నచ్చక, ఆ సభవారు అతనిపై నిందారోపణచేసి విచారించి శిక్షించుటకు యత్నించిరి. ఆ జాడ కనిపెట్టి చార్లెసు ఆ సభను చాలించెను. ఆ మఱుసటి యేడు ఫ్రాన్సులో కాతలిక్కు ప్రభుత్వమునకును ప్రొటెస్టెంటులకును యుద్ధములు సాగెను. ఫ్రెంచి ప్రొటెస్టెంటులకు "హ్యూజినాట్లు" (Huguenots) అని పేరు. ఆ హ్యూజినాట్లకు సాయముగా, సేనల పంపి, ఆ ప్రభుత్వమును ఓడింపవలె నని తలచి చార్లెసు, బకింగుహామునాధిపత్యమున కొంత సేనను "రీ" లంకకు (Island of Rhe) పంపెను. ఫ్రెంచి ప్రభుత్వము వారి సేనలు బకింగుహామును తత్సేనలను ఓడించెను. ఓడినను గెల్చినను యుద్ధమునకు ధనము కావలెను గనుక, చాలినంత ధనము చేతిలో లేక, చార్లెసు అప్పు లిమ్మని ప్రజల బలవంత పెట్టసాగెను. చాలమంది అప్పులీయ మని ఎదిరించిరి. వారిలో ముఖ్యులను ఎనుబది మందిని ఏరి, చార్లెసు చెఱలో పెట్టించి డబ్బు ఈయజాలని పేదలను, బలవంతముగా సేనలో చేర్చెను. అదియును గాక, సైనికులకు అన్నవస్త్రములను, నివసించుటకు ఇండ్లను, ఇచ్చు భారము

కూడ ఏ కూలియు లేని సామాన్యులైన గృహస్థుల మీఁద పడెను.

1628-వ సంవత్సరము మార్చి నెలలో పార్లమెంటు మూఁడవ సారి సమావేశమై ఒక్క యేఁడు ఎడతెగక వ్యవహరించెను. ఆ దినములలో రాజనియుక్తులైన ధర్మాధికారులు ఒక విపరీత ధర్మమును నిర్ణయించిరి. ఏమనగా, రాజు తన యిచ్చవచ్చిన ఎవ్వనినైనను కారణము చెప్పకయే చెఱలో పెట్ట వచ్చు నని. రాజుయొక్క నిరంకుశత్వము మితిమీఱి పోవు చున్నదని తోఁచి, పార్లమెంటు వారు అతని లోపము లన్నియు వరుసగా వ్రాసి, ఆ పత్రమును అతని ముందఱ పెట్టి ఆ లోపముల వెంటనే సవరింప వలసినదిగా కోరిరి. ఆ పత్రమునకు "స్వత్వ వినతి" (Petition of Right) అని పేరు (1628). అందు, వారు కోరుకొన్నవి మూఁడు.

**మొదటిది**:—సైనికుల అన్నవస్త్రాదిభారము గృహస్థులమీఁద పెట్టరా దనుట.

**రెండవది**:—అపరాధ వివరణము తెల్పకుండ, నిష్కారణ ముగ నెవ్వనిని చెఱలో నుంచి శిక్షింపరా దనుట.

**మూఁడవది**:—దానరూపముగా గాని, కానుక రూపముగా గాని, అప్పు రూపముగా గాని, పన్ను రూపముగా గాని, పార్లమెంటు సమ్మతి లేక, రాజు ప్రజలవలన సుంతేనియు ధనము తీసికొనరా దనుట.

ఏ డెనిమిది రోజులు సందేహించి సందేహించి తుదకు విధి లేక చార్లెసు ఆ నిబంధనల కన్నిటికి సమ్మతించి పత్రము మీఁద సంతకము పెట్టెను. కాని అన్న మాట నిల్పుకొనక, యతఁడు యథాపూర్వవర్తనమే సాగించెను. మంత్రి చేయు దురుపదేశ

ముల వలన ఈ గతి పట్టుచున్న దని శంకించి పార్లమెంటు వారు బకింగుహాముని పనిలో నుండి తొలగింప వలసిన దని కోరగా చార్లెసు అట్లే చేసెను. పని చాలించుకొని బకింగు హాము "పోర్ట్సు మౌతు" (Portsmouth) నగరమునకు పోయి యుండ, పూర్వ విరోధి యొకడు అతనిని పొడిచి చంపెను.

పదపడి 1629-వ సంవత్సరము మార్చి నెలలో చార్లెసు మరల పార్లమెంటు సభను రద్దు చేసెను. పిమ్మట పదు నొకండు ఏండ్లవఱకు పార్లమెంటే లేదు.

## చార్లెసు, పార్లమెంటు లేకయే, స్వతంత్రించి రాజ్యమేలుట 1629—1640-వ సం॥

### (1) ధనము

ప్రభుత్వపుబండి సాగుటకు నిత్యమును ధనము కావలసి యుండును. చార్లెసు నొద్ద తగినంత ధనములు లేదు. ధన లోపమువలన అతడు చాల చిక్కులు పడి, ఎట్లయినను దానిని సేకరింప వలెను గనుక, స్వత్వవినతి పత్రముఖమున తాను చేసిన సమయము లన్నియు ఉల్లంఘించెను. ఓడ రేవులలో, వర్తకుల పీడించి సుంకము లన్నియు వసూలు చేయ దొడగెను. వర్తకులలో చాలమంది అది సమయ విరుద్ధ మని సుంకము లీయరైరి. అందుచే వర్తకము మందగించెను. ఆఱు మాసముల వఱకు లండను నగరమున క్రయ విక్రయములే జరగ లేదని చెప్పవచ్చును.

పదపడి, రాజుగారి న్యాయవాదులు అతని యానతిచే ప్రాచీన శాసనముల కొన్నిటిని తిరుగ త్రవ్వి, తత్ప్రయోగమున ఎక్కుడు ధనము లభించునట్లు చేసిరి. పూర్వము మొదటి



Charles I—Painting by D. Mayteus by kind permission of National Portrait Gallery, London.

ఎడ్వర్డు కాలమున సాలుకు నలుబది పౌనుల ఆదాయము
కాగల భూమి యున్న వారెల్ల డీకా వోాఫ బిరుదము పుచ్చు
కొన వలెనను ఒక శాసనము గలదు. బిరుదు పుచ్చుకొన్న
నాడు రాజునకు కొంత సొమ్ము చెల్లించు కొన వలెను. ఆ
యాచారము ఎన్నడో మానినది. ప్రస్తుతము చార్లెసు దానిని
తిరుగ తోడించి ఆ మాత్రము కాలము గల వారినెల్ల బిరుద
ధారణమునకై బలవంత పెట్టెను. పెక్కుమంది నిరాకరిం
చిరి. అట్టి వారికి రాజు దండుగ సొమ్ము శిక్షగా విధించెను.
కాగా, ఆ శాసనము రెండంచుల కత్తి యైనది. ఇష్టపడి
బిరుదు తాల్చిన వాని వల్ల సొమ్ముగా ధనము లభించినది,
ఇష్టపడని వాని వలన దండుగమూలముగా లభించినది.

అదియును గాక, అతడు పూర్వకాలపు అటవీ శాసన
ముల గూడ పునరుద్ధరించి ప్రయోగించెను. మొదటి విలి
యము కాలము నాడు దేశమున గల భూమిలో మూడవ
వంతు అడవిగానే యుండెను. అది రాజువశముననే యుండెను.
కాల క్రమమున ఆ భూమి యంతయు సేద్యమై రైతుల పర
మయ్యెను. ఆ భూములను తమ వశమున ఉంచుకొన్నందు
లకు చార్లెసు రైతులకు జరిమానాలు వేసెను. ఎక్కువ
పొలము గల పెద్ద రైతులు కొందఱు ఇరువదివేల పౌనులు
గూడ జరిమానాగా చెల్లించ వలసి వచ్చెను.

పదపడి అతడు కొన్ని కంపెనీలకు, ప్రత్యేక వర్తకాధి
కారము లమ్మి సొమ్ము రాబట్టు కొనెను. కొన్ని యధికార
ములు అతని ఉద్యోగులు గూడ కొని వర్తకము సాగించిరి.
దీనిని బట్టి కొన్ని కొన్ని సరకులు కొనుటకును అమ్ముటకును

కొంపెనీకే అధికార ముండెను గాని, ఎల్లరు ఎల్లవస్తువుల క్రయ విక్రయములు చేయ జాలకపోయిరి.

చార్లెసు విధించిన పన్నులలో మిక్కిలి కంటకప్రాయమై, పెక్కు చిక్కులకు హేతు వైనది "ఓడపన్ను." పూర్వకాలమున ఒక ఆచార ముండెడిది. ఏమన, సముద్ర తీర నివాసులైన ప్రజలు, రాజునకు కొన్ని ఓడలు సమర్పించుకొనవలెను.

1634-వ సంవత్సరములో, చార్లెసు ఆ యాచారమును పునఃప్రయుక్తము జేసి, ఓడలు తెండని సముద్రతీరవాసుల నడిగెను. దానివలన అతనికి చాల ఓడలు లభించినవి. మరల 1635-వ సంవత్సరములో ఇంకొక మారు, ఓడలకు బదులుగా ధనము తెండని యడిగెను. అదియును కేవలము సముద్రతీరవాసులనే కాక, అన్ని ప్రాంతముల వారిని అడిగెను. ఆ ధనములతో తనకు అనుకూలము లైన ఓడలు కట్టించుకొందు నని యతడు చెప్పుట. కాని నిజమునకు, ఓడలకు అంత ధనము కాబట్టదు. అది యొక నెపము. ఏదో యొక నెపమున అమితధనమును సేకరించి, పార్లమెంటు వారి యధీనము నుండి తొలగి నిరంకుశముగా ఏలవలె ననియే యతని యభిప్రాయము.

బకింగుహాము నివాసి యగు నొక రైతు "జాను హాంప్డెన్" (John Hampden) అను వాడు ఈ ఓడపన్ను ఈయ నిరాకరింపగా, అతనిని పట్టుకొని చెఱలో నుంచి, కేసుపెట్టి విచారించిరి. ఆ పన్ను విధించుట, యక్రమమే యని యంగీకరించియు, అది రాజాజ్ఞ గనుక ఎల్లరును తప్పక చెల్లించి తీరవలె ననియే న్యాయమూర్తులు, తీర్పు చెప్పిరి. రాజాజ్ఞయే శాసనమగుట కంటె వేఱు నిరంకుశత్వము ఉండజాల దని లోక విదిత మయ్యెను. ఆనిరంకుశత్వమును అరికట్టక, పార్లమెంటు

వారు ఉపేక్షించి యుండజాలరు. కాని పార్లమెంటు సభలు నిలిచి పోబట్టి వారును ఏమియు చేయలేకపోయిరి. దేశమెల్లె డల కొందఱు ప్రముఖులు బయలుదేరి, ఈ దుష్పరిపాలనమును ఎట్లయినను సంస్కరించి తీరవలె నని యాలోచనలు సేయ సాగిరి. వారిలో "జానుహాంప్డెను" ఒకడు, "జాను పిమ్" (John Pym) అను వా డింకొకడు. మూడవసారి పార్లమెంటు సభ కూడినప్పుడు రాజును ప్రతిఘటించి, ప్రజాపక్షమున నిల్చి మాటలాడిన నాయకుడు ఈ "జాను పిమ్." అప్పటికి ఆలో చనాపరులును ఏమియు చేయలేక పోయిరి గాని, వడవడి కొన్ని నాళ్లకు "జాను పిమ్" మంచి కార్యశూరు డనిపించు కొనెను. ఇది యిట్లుండగా, "అసమ్మతులు" అనబడు మత స్థుల యెడ చార్లెసు అవలంబించిన పద్ధతి మఱింత ప్రజల కోపాగ్నిని రగిల్చెను. "ప్యూరిటనులు," "ప్రెసిబిటేరియనులు" "ఇండిపెండెంటులు" అను మూడు తెగలవారును, "అసమ్మ తులే" (Non-Conformists).

## (2) మతము.

1633-వ సంవత్సరములో "లాడ్" (Laud) అను నతడు కాంటరిబరీ ఆర్చిబిషప్పు ఆయెను. చర్చి వ్యవహారములను దక్షతమై నడపవలెను గనుక, రాజే చర్చికి అధ్యక్షుడుగా నుండి తీరవలె నని యాతని యభిప్రాయము. ప్యూరిటనులు విశాలహృదయులు కారని వారియెడ అతనికి కోపము. అంత కంటెను ఎక్కువ కోపము ప్రెసిబిటేరియనుల యెడను, స్వతం త్రుల యెడను. "మతవిషయముల శ్రద్ధాళువులై యుండుట మూఢభక్తికి లక్షణ మనియు, చర్చిలోనికి అతిభక్తి పూర్వక

ముగా చిచ్చుల కిచ్చితి మనియు, పాత్రలకు పూజ్యా వేయు వాకు లేని కిక్కిరిసి వెంటబెట్టుకొని కల్లుదుకాణము దూరుట నాటిదే చిప్పిలోనికి జనులు ప్రవేశించుటయు" అనియు అతనిమతము. అసమ్మతులను, వారియూహలను భగ్నమొనర్చి తీరవలయు నని అతడు గట్టిగా సంకల్పించి, మతాపరాధ ములు విచారించుటకు నేర్పడిన "హై కమిషను కోర్టు" మూలమున తన సంకల్పము నెరవేర్ప గడగెను. తమ మత ప్రచారార్థము పుస్తకములు పత్రములు వ్రాయు అసమ్మతులను బట్టి శిక్షించెను. మఱియు ఎల్లవారును ఆదివారము నాడు తప్పక విలువిద్య నేర్వవలె నని యాదేశించెను. ఆదివారము నాడు విల్లు చేతపట్టుట మహాపాతక మని అసమ్మతుల తలంపు. కనుక, "లాడ్" చేసిన యాదేశము వారికి హృదయశల్య ప్రాయమై ఇక ఈ దేశమున తాము బ్రతుకుట కష్టతర మైన విషయ మని తోచి, అమెరికాకు లేచిపోదొడగిరి. పండ్రెం డేండ్లలో (1628—1640) ఇంగ్లండునుండి, అమెరికాకు ఇరువది వేల మంది అసమ్మతులు లేచిపోయిరి. ఆ పండ్రెండు ఏండ్ల లోను, అమెరికాలో రెండు వలస రాష్ట్రములు ఏర్పడెను. "మస్సాచూసెట్స్" (Massachusets) అను ప్రదేశమున నొక టియు, "మేరిలాండు" (Maryland) అను ప్రదేశమున నింకొక టియు. అందు రెండవది కాతలిక్కుల వలసరాజ్యము. "లాడు" తమయెడ పూనిన విరోధమువలన, అసమ్మతులు ఒక నీతి నేర్చుకొనిరి. ఏమన—తమ మతాభిప్రాయములను రాజకీయ వ్యవహారములకు గూడ అన్వయించవలె నని. అనగా, పార్లమెంటు నధికారము రాజునధికారముకంటె ఎక్కువైన గాని తమ మతము రక్షితము కాదని వారు గ్రహించిరి. వారిలో మఱి

కొందఱు చర్చి పరిపాలన బిషప్పుల వశమునుండి తొలగి, ప్రతినిధిసభలపరము కావలె ననియు, అంతవఱకు మతము రక్షితము కావనియు ఊహించిరి.

## (౩) ఐర్లాండు, స్కాట్లాండు

చార్లెసు పరిపాలన ఐర్లాండునకు అతి దుఃఖావహ మయ్యెను. ఆ దినములు తలపున బాసిన, తత్ప్రజలకు నేటికిని గుండె జలదరించును. 1632-వ సంవత్సరములో థామసు వెంటువర్త్ (Thomas Wentworth) అను నతడు ఐర్లాండునకు రాజప్రతినిధిగా నియమింపబడెను. అతనికిని బకింగుహాము మంత్రికిని ప్రబల విరోధము. ఒకప్పుడు వెంటువర్తు ప్రజాపక్షము వహించి, స్వత్వవిషయముల గట్టిగా వాదించెను. కాని, పదపడి కొన్ని నాళ్లకు అతనియభిప్రాయములు మారెను. ఎంత స్వతంత్రులయ్యు పార్లమెంటువారు దక్షతమై రాజ్య మేల జాలరనియు సమర్థుడును బలవంతుడును నైన రాజే యా కార్యమునకు తగిన వాడనియు వాదింప జొచ్చెను. అతని యభిప్రాయములు తనకు అనుకూలములుగా నుండెను గాన, రాజు అతని ఆత్మీయునిగా స్వీకరించి మన్నించెను. అతడును క్లిష్టసమయముల రాజునకు అండయై నిలిచెను. రాజున కిష్టు డగుట వలన అతనికి ఐర్లాండు ప్రతినిధిపదవి లభించినది. ఐర్లాండులో స్కాటులాండు వారును ఇంగ్లీషువారును అక్రమముగా దేశీయుల పొలములను ఆక్రమించుకొని యనుభవించుచుండిరి. మందభాగ్యులైన తద్దేశీయులు, వెంటువర్తుతో తమ గతిని గూర్చి మొఱపెట్టుకొనగా, అతడు వారి వారి పట్టాలు తెప్పించి, భూస్వామ్యమును గూర్చి కొంత విచారణ

పెట్టెను. ఈ విచారణవలన తమకు న్యాయము కల్గు నని ప్రజ లాసించిరి గాని వారి యాసలు వ్యర్థము లయ్యెను. ఏమన రాజప్రతినిధి విచారణ చేసి యూరకొననే కాని, ఇంగ్లీషు వారిని గాని స్కాటులాండు వారిని గాని మందలించి, భూస్వాక్రమణమును ఆపలేకపోయెను. చెప్పుకొను నాథుడు లేక, మందభాగ్యులైన ఐరిషుప్రజలు తాతలనాటి తమ పొలము లన్నియు, అన్యాయముగ పరులు ఆక్రమించుకొను చుండ చూచుచు నూరకొనిరి. ఆ దోపిడి, ఆ కొల్లలాట నిరంకుశముగా సాగినది. దానిని అరికట్ట లేకపోయినను రాజప్రతినిధి అచటి పరిపాలనను ఇతర విషయములలో కొంత సంస్కరించి బాగు చేసెను.

అతడు కోశమున జరుగు లోపములు సవరించి, దానిని సక్రమపద్ధతిని నడిపించెను; సైనికుల అవిధేయతను మాన్పి, వారిని వినీతుల జేసెను; "ఐరిషు ఛానలు" (Irish Channel) లో దోపిడిగాండ్ర జాడ లేకుండ చేసెను. హాలెండు దేశమునుండి మంచి విత్తనములు తెప్పించి ఐర్లాండు దేశమున నాటి మంచినారను తయారు చేయించి దానితో సన్న నేత పనిని వృద్ధి చేసెను. ఫ్రాన్సులోని నేతగాండ్రు మంచిపని వాండ్రని విని, వాండ్రను గూడ కొన్ని కుటుంబముల పిలిపించెను. కాని యీ పనుల వలన ప్రజల కేమి సంతోషము కలుగును? వారియెడ అతడు చండశాసనుడే; వారికి అతని పేరు సింహస్వప్నము. అతనిని లోలోన తిట్టని వారు లేరు. మఱియు, అతడు "అల్స్టరు" (Ulster) లోని ప్రోటస్టెంటులను పట్టి శిక్షించెను. వారు ప్యూరిటనుల పద్ధతుల అమోదించుటయే దానికి కారణము. ప్రోటస్టెంటుల శిక్షించిన మాత్రమున కాతలిక్కులు అతనిని

నష్టములేదు. సమయము చూచి, ఎప్పుడో తమ పని కూడ పట్టింప గల డనియే వారి భయము.

ఐర్లాండులో స్థితిగతులు ఈ విధముగా జరుగుచుండెను. ఇంగ్లండులోని స్థితి గతులను చార్లెసు గమనించు చుండెను. ఏ దెస చూచినను రాజునెడ ద్వేషమే. నేడో, రేపో, ప్రజలు తిరుగబడుదు రన్నంత ముప్పు ఆసన్నమై యుండెను. తుదకు స్కాట్లాండుతో కూడ నతడు చేతులారా వైరము తెచ్చికొనెను. అది కేవల విరోధముతో పోలేదు. యుద్ధము కూడ తటస్థించెను. ఈ విషమసమయమున అతడు పార్లమెంటును సమావేశము చేయక తప్పినదికాదు.

స్కాట్లాండువారిది ప్రెస్బిటేరియను మతము. “లాడ్” ఆర్చిబిషప్పు అయిన పిమ్మట, వారు కూడ, ఇంగ్లీషు చర్చివారు ఉపయోగించు ప్రార్థనాగ్రంథమునే ఉపయోగింపవలె నని యాదేశించెను (1637). స్కాట్లాండు ప్రజలెల్లరు ఆబాలగోపాలము ఆయాదేశమును తిరస్కరించిరి. వారిలో వారికి తత్పూర్వము ఎట్టి పొరపు లున్నను వాని నన్నిటిని మఱచిపోయి ఎల్లరు కూడి ఆర్చి బిషప్పు నాదేశమును ప్రాణము లుండగా అమోదించ రాదని ఉమ్మడిగా ఒడంబడిక చేసికొనిరి. అంతలో 1639-వ సంవత్సరములో యుద్ధము ముగిసెను. జూను ఇరువది నాల్గవ తేదీని “బెర్విక్కు” (Berwick) నొద్ద ఉభయులును తారసిల్లినపుడు, చార్లెసు స్కాట్లాండు వారిని జయించుటకు తనకు బలము చాల దని గ్రహించి, వారిమతముజోలికి రా నని సంధిచేసికొనెను. పిమ్మట వెంటువర్తును ఐర్లాండునుండి తిరిగి రప్పించి, రాజు అతనిని స్ట్రాఫోర్డు దొరను గా జేసి గౌరవించెను (Earl of

Strafford). స్కాటులాండు వారికి లొంగిపోవుట నవమానమనియు, ప్రబలసేనను సమకూర్చి మరల యుద్ధమునకు దిగవలెననియు తలచి యతడు సేనాసంగ్రహము నిమిత్తము పార్లమెంటు వారి సమ్మతి పడయుటకై తత్సభను సమావేశము చేసెను. పార్లమెంటువారు అందులకు సమ్మతింపనైరి. అంతతో ఆ సభయు నిల్చిపోయెను. పిమ్మట స్ట్రాఫోర్డు ఐర్లాండులో తాను చూపిన కౌశలమునే, ఇంగ్లాండులో గూడ చూపి, ప్రతికూలురనెల్ల నణచి, వ్యవహారములు చక్కజేయ నమకట్టెను.

స్కాటులాండు వారితో చేసికొన్న సంధిసమయముల పరిపాలింపక, చార్లెసు మరల యుద్ధమునకు దిగెను. మంత్రియై "స్ట్రాఫోర్డు" ఎంతగా యత్నించినను, బలవంతమైన సైన్యము సమకూరనే లేదు. ధనలోపమే దానికి కారణము. ఉన్న మాత్రము సేనలతోనే పోరికి నడచిరి గాని, తీర, "రిపన్"బద్ద (Ripon) 1640–వ సం॥ యుద్ధము ప్రారంభమైన తోడనే చార్లెసు శత్రువులకు లొంగిపోయి, వారు కోరిన షరతు లన్నియు నంగీకరించి సంధి చేసికొనెను. స్కాటులాండు వారికైన యుద్ధవ్యయమంతయు చార్లెసు భరించుటయే కాక, నష్టపరిహారము క్రింద కూడ వారికి అమిత ధన మిచ్చుటకు ఒప్పుకొనెను. స్కాటులాండువారును, ఇంగ్లండులోని అసమ్మతులును మిత్రులు. పార్లమెంటులో బహుసంఖ్యాకులు వారే. నష్టపరిహారము క్రింద వారి కీయవలసిన ధనమును చార్లెసు పార్లమెంటువారి నడిగి తీసికొనవలెను. కనుక అతడు ఆ సమయమున విధిగా పార్లమెంటు సభను సమావేశము చేసి, వారితో మంచిమాటలకు రావలెను. అత డెట్లయినను పార్లమెంటు సభకు విధేయు

జరుగుటయే వాంఛనీయము గనుక, స్కాట్లాండువారు నష్ట పరిహార ధనమును కోరిరి.

## దీర్ఘకాలపు పార్లమెంటు 1640 సం॥

అనుకొన్నట్లుగా చార్లెసు పార్లమెంటును సమావేశపఱచెను. అందు ప్రముఖులైన పిమ్, హాంప్డెను మొదలగు అసమ్మతులు, తమకు మంచి యదను చిక్కిన దని గ్రహించి దానిని ఊరక పోనీరాదని యూహించి, రాజును వశపర్చుకొను మార్గము లాలోచించిరి. రాజునకు ప్రస్తుతము కావలసిన ధనమే, వారి కార్యసిద్ధికి సాధనము. ధన మిచ్చువానికి పుచ్చుకొనువాఁడు లోకువ గనుక, యథార్థముగ, దేశమునకు సర్వాధికారి పార్లమెంటే కాని రాజు కాడు అని అతనిచే ననిపింప దలచిరి. సభ ఆరంభమైనది మొదలు కొన్ని నెలల వఱకు ఈ యంశము తేల్చుటకే పట్టెను. అదియు నెఱవేఱెను. పదపడి క్రమక్రమముగ ఒకదాని వెంట నొకటిగా రాజాధికారము లన్నియు, పార్లమెంటువారు గుంజుకొనిరి.

మతాపరాధముల శిక్షించుటకు ఏర్పడిన కోర్టులు తీసివైచిరి. 1629-వ సంవత్సరము మొదలు, 1640-వ సంవత్సరము వఱకు స్వతంత్రించి రాజ్యమేలిన కాలమున, రాజు, ఏయే పద్ధతు లవలంబించి సొమ్ము రాబట్టుకొనెనో, అవి యన్నియు అక్రమపద్ధతులు గనుక, ఇక ముందు ఆ విధముగా ప్రవర్తించుటకు వీలు లేదని నిషేధించిరి.

పదపడి, స్ట్రాఫోర్డు మీద దేశద్రోహి యని నిందారోపణ చేసి విచారించి శిక్షింప తలపడిరి. కాని ప్రభుసభ వారు అతనిని శిక్షించుటకు ఇష్టపడ నందున, కామన్సు సభవారు, తమ

సభలో "స్ట్రాఫోర్డు దేశద్రోహి" యని తీర్మానించి, సంతకము కొఱకు రాజుముందఱ పెట్టిరి. సంతకము పెట్టనిచో తన భార్యకును పార్లమెంటు వారు అవమానము కలిగింతు రని భయపడి, విధి లేక యతఁడు దానిమీద సంతకము చేసెను. అంత 1641-వ సంవత్సరములో స్ట్రాఫోర్డునకు శిరశ్ఛేదము చేసిరి.

పిమ్మట పార్లమెంటు సభ్యులలో భిన్నాభిప్రాయము లేర్పడెను. ఒక పక్షమువారు చార్లెసుతో కలిసి వ్యవహరించుట దుర్ఘట విషయ మనియు, అతనిని కేవలము బొమ్మను జేసి పెట్టి, తామే సర్వాధికారులై రాజ్యము నడప వలె ననియు తలంచిరి. ఇంకొక పక్షమువారు, పార్లమెంటు చర్యలు అప్పటికే మేరమీఱి పోయినవి గనుక అంతతో శాంతించిన బాగని తలచిరి. ఇరుపక్షముల బలమును ఇంచుమించు సమానముగానే యుండెను.

**1641**-వ సంవత్సరము జూలై నెలలో, ఇంగ్లీషు చర్చిలో బిషప్పులను తీసి వేయవలె నని తెచ్చిన ప్రతిపాదన సందర్భమున ఓట్లు తీసికొనగా, ఆ యిరుపక్షముల స్థితియు తద్బలాబల రహస్యమును బయలుపడెను.

ఆ సంవత్సరమే, అల్సటరు లోని ప్రజలు తిరుగుబాటు చేసిరి. ఆ విప్లవమును అణచుటకు సేనలు బయలుదేర వలసి వచ్చెను. కాని, రాజువశమున సేనల నుంచినచో, ఎప్పటి కేని తమకు ముప్పు తప్పదు గనుక, సైనికోద్యోగులు తమకు విధేయులై యుండవలె నని, పార్లమెంటులో ఒక పక్షము వారనిరి. రెండవ పక్షమువారు అది అశాస్త్రీయమని భిన్నాభిప్రాయులైరి. కాని తొమ్మిది ఓట్లు ఎక్కువ వచ్చుటచే, మొదటి వారి

సూటువహు నెగ్గెను. ఈ సందర్భమున గూడ ఇరుపక్షములవారును ఇంచుమించుగా సమబలులే యని తేలెను.

1642-వ సంవత్సరము జనవరి మూడవ తేదిని, రాజోద్యోగి యొకడు పార్లమెంటు సభలో లేచి నిల్చి, తత్సభ్యులలో ఐదుగురిమీద నిందారోపణ చేసి శిక్షార్హులను చేయ యత్నించెను. ఆ యైదుగురిలో "పిమ్", "హాంప్డెను" అను వారిద్దఱును గలరు.

వారి మీద మోపిన నేరము రాజద్రోహము, వారు రాజద్రోహు లగుటయు కాకుండుటయు నటులుండ, రాజోద్యోగి యవలంబించిన పద్ధతి మాత్రము శాస్త్రసమ్మతము కాదు. అందుచే, ప్రభుసభవారు ఆ యైదుగురిని నిగ్రహింప వీలు లే దనిరి. ఆ మఱునాడు, చార్లెసు కొందఱు సైనికుల వెంట బెట్టుకొని సభామందిరము ప్రవేశించి రాజద్రోహు లైదుగురను తానే నిగ్రహింప సమకట్టెను, కాని విఫలమనోరథు డయ్యెను. అతని బుద్ధిలేమికిని, తొందర పాటునకును ఏవగించుకొని, అతనికి ఈషదనుకూలు రైనవారు గూడ తిరిగి పోయిరి. దానితో, రాజునకును పార్లమెంటుకును విరోధము ఘోరమై యుద్ధము తప్పని సరి యయ్యెను. ఇరువురకును పొత్తు కలియు పదను తప్పినది. లండను నగరము సేనాక్రాంత మయ్యెను. రాజు జనవరి పదియవ తేదీని రాజధానీనగరమును విడిచి యెటకో లేచిపోయెను. రాజోద్యోగు లెల్లరు తమకు విధేయులై యుండవలె నని పార్లమెంటు వారు శాసించిరి.



# ఇరువది యొకటవ ప్రకరణము

## ప్రజా యుద్ధము, ప్రజా స్వామ్యము, పక్షవిక్షేపము:

## 1645-వ సంవత్సరము వఱకు యుద్ధము

పార్లమెంటునకును రాజునకును యుద్ధము మొగిసెను. యుద్ధ ప్రయత్న సమయమున, దేశీయులు ఎవరే పక్షము చేరుదురో నిర్ణయింప రాక పోయినను, తీర, యుద్ధభూమిలో నడుగు పెట్టి నపుడు, పశ్చిమోత్తరదిశల ప్రజలు, చార్లెసుపక్షమున నిల్చి నట్లును, ప్రాగ్దక్షిణదిశల ప్రజలు పార్లమెంటు పక్షము వహించి నట్లును గ్రహింప నయ్యెను. మఱియు పెద్దరైతు లందఱు రాజువైపున చేరిరి. చిన్న రైతులును పట్టణవాసులును పార్లమెంటువైపున చేరిరి. నౌకాదళ మంతయు పార్లమెంటు వశమున నుండెను. అదిగాక, పదాతి వర్గము వారిసేనలో ప్రధానాంగము. రాజునకు ఆశ్వికవర్గము ముఖ్యాంశము. దాని బట్టియే, రాజపక్షావలంబులను "ఆశ్వికులు" అని పేర్కొనిరి. పార్లమెంటు సైనికులు పొట్టి జుట్లు పెట్టుకొనుటచే వారిని "గుండ్రతలలు" అనిరి.

ఆ యుద్ధము మొత్తము మీఁద దేశమునకు అనర్థకమే యయ్యె పొలములకును, పొలము పాటు చేసికొను వారికిని విస్తారము నష్టము కల్గలేదు. ఉభయసేనలును పంటచేలను త్రొక్కి పాడు చేయకుండగనే చరించిరి. పంటకాపులును, యథావిధిగ తమ పనులు తాము, తలవంచి, చేసికొనుచునే యుండిరి. యుద్ధారంభమున కొంత కొల్లలాట సాగెను గాని, "క్రాంవెలు" (Cromwell) వెంటనే ఆ దుష్కార్యమును అణచి

నైచెను. తొలి దినములలో అచ్చటచ్చట దెబ్బలాటలు సాగించిరి. అవి యుద్ధము లనుటకు వీలు లేదు. క్రమ క్రమముగా దెబ్బలాటలే పెద్ద పెద్ద యుద్ధములై రక్తపాత మయ్యెను.

1642-వ సంవత్సరము అక్టోబరు నెలలో "ఎడ్జిహిల్" (Edgehill) అను చోట ఒక పెద్ద యుద్ధము జరిగెను. అందు ఎవరికిని జయము లభింప లేదు. పిమ్మట, చార్లెసు ఆక్సుఫర్డును తన రాజధాని నగరముగా జేసికొని యందు వసించెను. 1643-వ సంవత్సరములో, ఎసెక్సు నుండియు, కెంటు నుండియు, పడమటి దెసనుండియు, ఒక్క మారుగా పోయి లండను నగరము మీద పడి స్వాధీనము చేసికొన వలె నని, రాజ్యాంకులు పన్నిరి గాని అది సాగలేదు. గుండ్రతలలకు పడమటి దెస, గ్లాసెస్టరు గట్టి దుర్గము. దానిని వశము చేసికొన యత్నించియు, చార్లెసు విఫలమనోరథు డయ్యెను. అయినను మొత్తము మీద రాజపక్షమే జయించు సూచనలు కాన వచ్చెను. సుశిక్షిత మైన ఆ యాశ్వికదళమును మారొకని గెల్చుటకు అశిక్షితు లైన పదాతులకు శక్తి చాలదు. ఇతరుల సాయము పొందిన గాని గెల్పు దుష్కర మని గ్రహించి, పార్లమెంటుపక్ష నాయకులలో నొకడగు "పిమ్" స్కాటులాండువారి సాయ మపేక్షించి వారితో ఒక యొడంబడిక చేసికొనెను. "ఈశ్వరాజ్ఞకును ఉత్తమములైన చర్చి సంప్రదాయములకును విధేయులమై, ఇంగ్లీషు చర్చిని సంస్కరించెద" మని పార్లమెంటువారు, 1643-వ సంవత్సరము ఆగష్టు నెలలో స్కాటులాండువారితో ప్రమాణము చేసి పల్కిరి. దాని యర్థము, "ఇంగ్లీషు చర్చిని, ప్రెసిబిటేరియను చర్చిని చేసెద" మనుట. ఆ ప్రమాణము పుచ్చుకొని స్కాటులాండు వారు,

వారికి సాయము వచ్చిరి. కాని యుద్ధజయము కన్నులార గాంచక మునుపే "పిమ్" గతించెను (1643-వ సంవత్సరము, డిసంబరు నెల).

1644-వ సంవత్సరము జనవరి నెలలో స్కాటిషు సేనలు తరలి వచ్చి ఇంగ్లాండును తాకెను. ఆ సంవత్సరము జూలై నెలలో అశ్వికులు గుండ్రతలలును స్కాటులును గూడి యున్న శత్రుపక్షమును "మార్స్టన్ మూరు" (Marston Moor) నొద్ద తాకిరి. కేవలపదాతులు, వైరిఘాటికి తాళలేక విరిసి పోవుటను గాంచి "ఆలివరు క్రాంవెలు" (Oliver Cromwell) అను నతడు పార్లమెంటు పక్షమునకు గూడ సుశిక్షితు లైన అశ్వికవర్గమును గొని వచ్చెను. ఆ యాశ్వికబలమే, మార్స్టన్ మూరు యుద్ధమున రాజపక్షమును అనాయాసముగ నోడించి జయము గాంచెను. ఆ యుద్ధజయము వలన ఉత్తరపు ఇంగ్లండు, పార్లమెంటు వశ మయ్యెను. కాని యంతమాత్రమున రాజపక్షము నిశ్శేషముగా ఓడినట్లు కాజాలదు. సంపూర్ణజయము గాంచుటకు, పార్లమెంటు వారు ఇంకను యత్నింపవలసి యుండెను. అదియే తుది యత్నము. దాని నిర్వహించినవాడు "ఆలివరు క్రాంవెలు."

**(2) ఆలివరు క్రాంవెలు: మొదటి ప్రజాయుద్ధము ముగియుట.**

క్రాంవెలు, హంటింగుడనుషైరున (Huntingdonshire) ఒక చిన్న రైతు. మతవిషయములలో, అతడు స్వతంత్రపక్షమునకు చేరినవాడు. తా నొక కారణజన్ము డనియు, పార్లమెంటునకును, రాజునకును తటస్థించిన ఆ యుద్ధములో, తాను పార్లమెంటుపక్షము వహించి జయసంపాదన మొనర్చుట ఈశ్వ

రేచ్ఛయు ఈశ్వరాజ్ఞయు అనియు నతని దృఢవిశ్వాసము. ఆ విశ్వాసప్రేరణ చేతనే యతడు యుద్ధమున దిగెను. మొదలు, పార్లమెంటుసేనలలో సుశిక్షితులు లేరు, సమర్థులైన నియంతయు లేదు, ఎవ్వ రేని యున్నను వాని యాజ్ఞకు బద్ధులై నడచు సైనికులును లేరు. రాజపక్షమున సేనావ్యవస్థ అతి సుశిక్షితము. దానిని గెల్చుటకు, తమ సేనలలో నట్టి శిక్షితులైన వారుండిన గాని పొసగ దని క్రాంవెలు సుభటసంపాదనార్థము బయలు దేరి, తూర్పుదెస గల మండలములకు బోయి, చిన్న చిన్న రైతులను సమకూర్చి, వారికి గుఱ్ఱ మెక్కి-పోరాడు విద్య నేర్పెను. "మార్స్టన్ మూరు" యుద్ధమున రాజపక్షపు అశ్వికబలమును ఓడించిన వారు క్రాంవెలుచే విద్య గఱచిన ఆ రైతులే. ఆ యుద్ధమున వారు చూపిన నిపుణతకును, ధైర్యసాహసములకును వారికి "ఉక్కు-తున్కలు" అని పేరువచ్చెను. సైనికు లందఱు, అట్టి యుక్కు-తున్కలగుచో జయము నిశ్చిత మని భావించి, క్రాంవెలు 1645-వ సంవత్సరము ఏప్రిలు నెలలో సర్వసేనాధిపత్యము తాను వహించెను. తత్పూర్వము సైనికోద్యోగులుగ నున్న పార్లమెంటు సభికు లెల్లరు తమ తమ యధికారము లన్నియు అతని పర మొనర్చిరి. అంతట క్రాంవెలు కార్యఖడ్గములకు రెంటికిని తానయ్యె, తనవలె మతమున "స్వతంత్రు" లైన వారికి పలుకుబడి తెచ్చి వారి మాట అప్రతిహతముగ సాగునట్లు చేసెను. రాజబలమును తదధికారమును నిర్మూలము చేసిన గాని పరిపూర్ణజయము లభింప దని స్వతంత్రుల తలంపు. వారి పక్షమున ఒక క్రొత్త సైన్యము ఆయత్త మయ్యెను. దానికి "నిదర్శన సేన" అని పేరు. అందు ఆశ్వికులును పదా

త్తులును గూడ గలరు. ఆశ్వికులకు క్రాంవెలు అధిపతి. 1645-వ సంవత్సరము, జూను నెల పదు నాల్గవ తేదీని "నిద ర్శన సేన" "నేస్బీ" (Naseby) యొద్ద, రాజు సేనలను నిశ్శేష ముగా ఓడించెను. అటనుండి ఆ సేన పడమటి దెసకు చని తత్ప్రాంత మండలము లన్నియు జయించి, అటనుండి స్కాటు లాండునకు బోయి, అచ్చట గల రాజానుచరులను హతమొన ర్చెను. ఇక జయము దుర్లభ మని తోచి, చార్లెసు లోగి పోయెను. 1646-వ సంవత్సరము, మే నెల అయిదవ తేదీని, "న్యూ ఆర్కు" (Newark) నొద్ద అతడు స్కాటుల చేతజిక్కెను.

నాటు మొదలు, అతని మరణపర్యంతము చార్లెసు శత్రుపక్షమున అంతఃకలహములు పుట్టించవలె నని భేదో పాయము పన్నుచునే యుండెను. స్కాటులాండు వారికిని, పార్లమెంటునకును విరోధము పుట్టించుటకును, పార్లమెంటున కును తత్సేనలకును విరోధము పుట్టించుటకును, అత డెన్నో పాట్లు పడెను. పార్లమెంటు సభ్యులలోనే కొందఱు, క్రాంవెలు పేరు చెప్పిన భయవినమ్రు లగు చుండిరి. అతని మాహాత్మ్య మట్టిది. అట్టి వారిని చార్లెసు మెల్లగ చేర బిలిచి, తన పక్షము వహించిన పెక్కు ఉపకారములు చేయుదు నని ఆసలు పెట్ట దొడగెను. ఆ దానోపాయమును ఫలింప లేదు. పిదప నతడు, ఒకరికి తెలియకుండ నింకొకరితో, వారు నా పక్షము చేర నుండి రని, వీరు నా పక్షము చేర నుండి రని కల్పించి చెప్పి, వారిని వీరిని వశ పఱుచు కొన జూచెను. తుదకు అతని తంత్ర ములన్నియు వెల్లడి యై, యతనిని కడతేర్చిన గాని వ్యవహార ములు చక్కబడ వని తేలెను.

(3) రెండవ ప్రజాయుద్ధము: ఛార్లెసు శిరచ్ఛేదము.

తమ చేత జిక్కిన ఛార్లెసును స్కాటులు "న్యూ కాసిలు" నకు తీసికొని పోయి కొన్ని నాళ్లుంచిరి. పదపడి 1647-వ సంవత్సరములో, అటనుండి "న్యూ మార్కెట్టు" నకు గొనిపోయి యుంచిరి. అతడు అచట నుండి మెల్లో తప్పించుకొని "వైటు లంకలోని కారిసు బ్రూకు" నకు పారిపోయెను (Carisbrook in the Isle of Wight). అట నున్న దినములలో అతడు స్కాటులతో మంచి మాటలాడి సంధి చేసికొని వారిని ఇంగ్లండు మీదికి ప్రేరేచి పంపెను. వారును అతని మాటలకు లోగిపోయి, 1648-వ సంవత్సరములో ఇంగ్లండు మీదికి దాడి నడచి నిదర్శనసేనచే హతులైరి. ఇంగ్లండులో గూడ అచ్చటచ్చట రాజభక్తులు బయలుదేరి అల్లరి చేయ సాగిరి. ససెక్సులోను, ఎసెక్సులోను, కెంటులోను గూడ అట్టి అల్లరులు సాగగ, నిదర్శనసేన, వానిని గూడ అణచి వైచెను. ఇది రెండవ ప్రజాయుద్ధము. అదియు ముగిసినది. ఈ రెండుసారులును జయము సంపాదించినది నిదర్శనసేనయే. ఆ సేనకు అధిపతి క్రాంవెలు.

ఇంత కష్టపడి జయము సంపాదించిన సేన యుండగా, తదధిపతి యగు క్రాంవెలు ఉండగా, వారితో సంప్రతించకయే, పార్లమెంటు రాజుతో సంధి చేసికొనెను. క్రాంవెలు, పార్లమెంటు కృతఘ్నతకు కోపావిష్టుడై, తత్సభను నిర్వీర్యము చేయ దీక్ష పూనెను.

పార్లమెంటు సభ్యులలో ప్రెసిబిటేరియనులు, స్కాటులతో సంధి చేసికొన నిచ్ఛగించి యుండిరి. వారితో సంధి చేసికొనుట యనగా, ఛార్లెసుతో సంధి చేసికొనుట యే

పోగును. క్రాంవెలు, ఆ పద్ధతి ఇచ్ఛగింపడు. కనుక, పార్ల మెంటు సభలో నుండి ప్రెసిబిటేరియనులను తొలగించి, ఏకాభిప్రాయము గల తన పక్షమువారినే సభ్యులుగ ఉంపదలచెను. తదనుగుణముగ, "కర్నలు ప్రైడు" (Colonel Pride) అను తన యనుచరు నొకని, పార్లమెంటు సభ సమావేశము కాబోవు వేళ తద్ద్వారమున నిలబెట్టి, ప్రెసిబిటేరియనులను లోనికి రానీయకుండ గెంటివేయు మని ఆజ్ఞాపించెను (1648-వ సంవత్సరము డిసంబరు ౬వ తేదీ). అతడును ప్రెసిబిటేరియనుల పేర్లు గల జాబితా ఒకటి చేత గైకొని సభాభవన ద్వారమున నిల్చి, ఒకరొకరినే వెనుకకు నెట్టెను. ఎవరేని పెనగులాడిన, వారిని బంధించి చెఱలో పెట్టెను. కాగా, సభా సమావేశ సమయమునకు, సభ్యులు నూఱుమంది యైనను లేరు. వారికి "పరిశిష్టులు" అని పేరు వచ్చెను. ఆ పరిశిష్ట సభ వారు, ప్రభు సభను రద్దు చేసితి మనియు, తమ తీరుమానములే శాసనము లనియు నిర్ణయించిరి. ఈ పరిశిష్టులు స్వతంత్రమతమువారు. వారికిని, నిదర్శన సేనకును భిన్నాభిప్రాయములు లేవు. కనుకనే, ఇరువ్వురునుకలిసి, క్రాంవెలునాజ్ఞకు విధేయులై వర్తించిరి.

1649-వ సంవత్సరము జనవరి మొదటి తేదీని, పరిశిష్ట సభ వారు, చార్లెసును దేశద్రోహమునకై విచారించి శిక్షింప ప్రత్యేకము ఒక న్యాయస్థానమును నెలకొల్పిరి. దానికి "ఉన్నత ధర్మమండపము" అని పేరు. (High Court of Justice) అందు ముగ్గురు జడ్జీలును, నూట యేబదిమంది కమిషనరులును గూడి కేసు విచారింతురు. అది కేవలము, అశాస్త్రీయమును, అక్రమమును నైన పద్ధతి. ఇంగ్లీషు రాజును విచారించి శిక్షించుటకు ఎవరికిని అధికారము లేదు. అతడు శాసనాతీతుడు.

ఏమైన నేమి విచారణ ప్రారంభ మైనది. "నిష్కారణముగ ప్రజలను, తత్ప్రతినిధు లైన పార్లమెంటును, యుద్ధప్రక్రియమున ముంచుట అనెడి దేశద్రోహ మొనర్చిన వాడని అతని మీద నేరము మోపిరి. "ఈ సంగతి యటుండ నిచ్చి, మొదట నన్ను విచారించుటకు ఈ కోర్టువారికి ఏమి యధికార మున్నదో చెప్పు" డని రాజు ప్రశ్నించెను. ఆ ప్రశ్నకు ధర్మసమ్మతి మైన జవాబు ఎవ రీయ గలరు? అహంకార ప్రేరితులై యుద్ధములు సేయు నపుడు, ధర్మసమ్మతి ఎట్లు అనుగమించునో, అట్లే ఈ విచారణ సమయముననను ధర్మసమ్మతి లేకపోయెను. తుదకు చార్లెసునకు శిరఃఖండనము విధించిరి (జనవరి ఇర్వది యేడవ తేదీ). అతడును నిశ్చలుడై ఇట్లనెను. "భగవదనుగ్రహమువలన, నాకు మరణ మనిన వెఱపు లేదు. కత్తివ్రేటునకు నేను సంసిద్ధుడనై యే యుంటిని." మూడు నాళ్లకు (జనవరి ముప్పదవ తేదీ) అతని శిరమెగిరి పోయెను. తుది నిముసము వఱకు అతడు చూపిన మనోనిశ్చలతను ధైర్యమును ఎల్లరు కొనియాడిరి.

క్రాంవెలు, అనాలోచితముగ రాజును చంపింపలేదు. పెక్కువారులు అతడు శాంతముగా తనలో ఆలోచించి చూచుకొనెను. అతనికి ఎన్నో సంకల్పవికల్పములు పుట్టి తుదకు, మరణశిక్ష నిశ్చిత మయ్యెను. చార్లెసు తంత్రజ్ఞు డనియు, అతనిని నమ్మ రాదనియు, అతడు జీవించి యుండగా, తనసేనకు ముప్పు ఘటించు ననియు, క్రాంవెలు ఊహించెను.

ఈ ఘోరకార్యమును చాలమంది ఏవగించుకొనిరి. పాపము చేసితి మని కొందఱు వగచిరి. క్రాంవెలు క్రూరు డని కొందఱు నిందించిరి. కాగా, ప్రజలలో పెక్కురు పూర్వ







**Silver Medal by Thomas Rawlins, commemorating the death of Charles I, 1648–9.**

*Reverse:* "Inexpugnabilis" A Hammer striking a diamond (symbol of fortitude) on an anvil. (Enlarged 1½:1.)

*British Museum.*

రాజునెడ భక్తిచే క్రాంవెలునకు ప్రతికూలు రైరి. ఆ సమయమున పార్లమెంటు సభ ఎన్నికలు జరుగుచో రాజభక్తులే పెక్కుగు సభ నలంకరింతురు. క్రాంవెలు ఆ రహస్య మెఱుగని వాడు కాడు. అతడు ప్రజాప్రాతినిధ్యము గల సభను సమకూర్చడు. అతని సేనయే అతనికి అండ. రాజ్య మేలుటకు అతని కదియే చాలును.

**(4) ఐర్లాండు స్కాట్లుండు దేశములు ఎదురు తిరుగుట.**

చార్లెసు చని పోగానే, అతని కుమారుడు, రెండవ చార్లెసు అను బిరుదు వహించి, రాజ నని ప్రకటించుకొనెను. ఐర్లాండుస్కాట్లాండు దేశములు రెండును అతని రాచరికము నంగీకరించెను. రాజ్యమును, మరల క్షోభ మేర్పడినది. కనుక క్రాంవెలు మునుముందు శత్రుపక్షము చేరిన ఆ రెండు దేశములను అణగ ద్రొక్కి వశముచేసికొన వలెను. 1641-వ సంవత్సరములో బయలుదేరిన, ప్రజావిప్లవము, ఐర్లాండులో నింకను అణగనే లేదు. అచట, ప్రొటస్టెంటులును, కాతలిక్కులును, నాటినుండి ఘోరముగ పోరుచునే యుండిరి. 1649-వ సంవత్సరము నాటికి ఆ కలహములు మఱింత భీషణాకృతి దాల్చెను. ఇంచుమించు, ఆ దేశమున గల జనములో మూడవవంతు నష్ట మయ్యె నట. క్రాంవెలు, ఒక చిన్న దండుతో బయలు దేరి పోయి ఐర్లాండు లోని, "డ్రోఘెడా," "వెక్సుఫర్డు" (Drogheda and Wexford) అను ప్రదేశముల స్వాధీనము చేసికొని, అచటి శత్రుసేనల నన్నిటిని ఊచకోత కోసెను. దానితో ఐర్లాండు లొంగిపోయినది. డ్రోఘెడాలో జరిగిన యుద్ధమును గూర్చి, పిదప ఒకప్పుడు క్రాంవెలు

స్వయముగా నిట్లు వర్ణించెను. "రాజపక్షావలంబు లెల్లరు నా శక్తికి ఎఱుఁగైరి. వారందఱు హతులగుట కేనలము ఈశ్వర కటాక్షము. తత్కారణమున జను లెల్లరు భయ కంపితు లైరి. ఇక నెవ్వరును శత్రుపక్షము చేర సాహసింపరు. వారి గుండె తల్లడము వలన ఇక ముందైనను రక్తపాతము లేకుండగనే కార్యము చక్కబడును."

ఐర్లాండును అణచి, క్రాంవెలు 1650–వ సంవత్సరమున స్కాట్లాండు మీఁది కేగెను. అతని యనుచరులైన ఇర్వురు ఉద్యోగులు, "ఇరెటను" "లడ్లో" (Ireton and Ludlow) అను వారలు స్కాట్లాండును జయించి వశపఱచి కొనిరి. మొదటి నుండియు ఐర్లాండులో ఇంగ్లీషు పరిపాలన చాల అక్రమముగా నున్న దనియు, వారిని సక్రమముగా ఏలుట ధర్మ మనియు క్రాంవెలు ఎఱుఁగును. అయ్యు, అతఁడు కూడ ఆ యక్రమ పద్ధతిని మాన్ప డయ్యెను. పైగా, అచట తొల్లిటి కంటె అధర్మవర్తనము సాగెను. క్రాంవెలు ఐర్లాండు వారి పొలము లన్నియు లాగికొని, యుద్ధవేళ తనకు అప్పు లిచ్చిన వారికి పంచి పెట్టెను. ఆ దేశపు రైతులు చెప్పుకొను దిక్కు లేక, ఏడ్చుచు తమ పొలములను బాసి చనిరి. తినుటకు తిండి లేక, వారిలో కొందఱు విధిని దూఱుకొనుచు "కొనాటు" అడవుల బట్టి పోయిరి. ముప్పది నలుబది వేలమంది పరదేశముల పాలై పోయిరి. మఱి కొందఱు స్పెయిను, ఫ్రాన్సు దేశ ముల సేనలలో భటులుగా ప్రవేశించిరి. ఈ విధముగా క్రాంవెలు ఐరిషువారి పరాభవాగ్నిని మఱింత మండించెను గాని, ఆర్పజాలక పోయెను.



Oliver Cromwell—Painting by R. Walker. By kind permission of National Portrait Gallery, London.

స్కాటులాండు విషయములో, అట్టి ఘోరకార్యములు జరుగలేదు. తొల్త, క్రాంవెలు తన "యుక్కుతునకల"తో

ఎడింబరో మీదికి పోయెను. 1650-వ సంవత్సరము డిసెంబరు ముప్పదియవతేదీని, "డెన్బారు" (Dunbar) నొద్ద జరిగిన యుద్ధములో నతడు స్కాట్లాండు వారిని సుకరముగా ఓడించెను. ఆ మఱునటి యేడు, రెండవ చార్లెసు, ఇంగ్లాండు మీదికి దండెత్తి రాగా అతనిని క్రాంవెలు వార్సెస్టరు నొద్ద తాకెను (Battle of Worcester- 3rd September 1651). అందును అతడే గెల్చెను. ఆ యుద్ధమును గూర్చి క్రాంవెలు స్వయముగా ఇట్లు వ్రాసెను. "చివరకు, నాకు సంపూర్ణ విజయము కల్గెను. శత్రుసేన సర్వనాశ మైనది. వా రెంతమంది హతులైరో సరిగ లెక్కించి చెప్పలేను గాని, బహుసంఖ్యాకులు చచ్చి రని మాత్రము చెప్పగలను. చేతులు చేతులు కలిపి చాల సేపు పోరితిమి గాన, అంతమంది చచ్చుట సహజమే. ఈ జయము గూడ ఈశ్వరుని పరిపూర్ణ కటాక్షమువలన గలిగినదే." ఆ పరాజయమువలన, రెండవ చార్లెసు అప్పటికి రాజ్యాశ వదలుకొనెను. క్రాంవెలు గూడ స్కాట్లాండు వారిని ఐరిషు వారిని వలె బాధింప లేదు. పిమ్మట నెచ్చటను తిరుగుబాటులును జరగలేదు. స్కాటిషు చర్చి సంస్కరింప బడ లేదు. ఇంగ్లాండుతో స్వేచ్ఛగా వర్తకము చేసికొనుటకును, ఇంగ్లీషు పార్లమెంటు సభకు తమ ప్రతినిధుల పంపుటకును స్కాట్లాండు వారికి అధికారము లీయ బడెను. ఎట్టకేలకు రెండు దేశములకును పొత్తు కుదిరినట్లు తోచెను గాని, క్రాంవెలు మరణానంతరము దానికి భంగము వాటిల్లెను.

### (5) ఇంగ్లండు పరిపాలన 1656-వ సంవత్సరమువఱకు.

ఐర్లాండు స్కాట్లాండుల స్థితి సరిచేసి, క్రాంవెలు ఇంగ్లండు వ్యవహారము లోనికి దిగెను. పార్లమెంటున పరి

శిష్టులు మాత్రమే కలరు. నాయను, "రాష్ట్రసభ" (Council of State) అను ఒక సభవారును రాజ్యాధికారము వహించి యుండిరి. 1653-వ సంవత్సరము నాటికి, పరిశిష్టుల ప్రభావము నిరాఘాటముగా సాగుచుండెను. తమ చిత్తము వచ్చినన్నాళ్లు తామే తక్క, ఇంకొక పార్లమెంటు ఏర్పాటు కాజాల దని వారు ఉబ్బి తబ్బిబ్బు లగుచుండిరి. క్రాంవెలునకు వారి యునికియు ఆటంకముగానే తోచి, అతడు, వారిని కామన్సు సభాభవనమునుండి గెంటి వైచి తలుపులు బిగించెను. వారి తరువాత, రాష్ట్రసభవారిని కూడ ఇంటికి పంపివైచెను. దానితో ప్రభువుల సభ, కామన్సు సభ, రాష్ట్ర సభ, అన్నియు అస్తమించెను. క్రాంవెలును అతని సేనయు మిగిలిరి. వారే సర్వాధికారులు. మఱి కొన్నినాళ్లకు క్రమక్రమముగా పూర్వసభ లన్నియు మరల ఉద్భవించెను. ఆ విధమును క్రింద వివరింతుము.

క్రాంవెలు కూడ ఒక పార్లమెంటుసభ యుండితీరవలెనని యూహించెను గాని, తత్సభ్యులు ప్రజాప్రతినిధు లగుట మాత్రము అతనికి గిట్టదు. కావున అతడు చర్చిలో స్వతంత్ర పక్షమునకు చెందిన వారిని కొందఱిని పేర్కొని వారినే పార్లమెంటుగా భావించెను. వారుఋషిప్రాయు లనియు, ఆ పార్లమెంటు అతి పవిత్ర మైన దనియు అతని యుద్దేశము. 1653-వ సంవత్సరము జూలై నెలలో ఆ "ఋషుల పార్లమెంటు" సమావేశ మయ్యెను. అచిరకాలముననే, వారికి రాచకార్యములలో విసువు జనించి, డిసెంబరు నెలలో, తమ యధికారము లన్నియు క్రాంవెలు పరము చేసిరి.

ఈ నెలలోనే సైనికోద్యోగు లెల్లరును గూడి "ప్రభుత్వ సాధనము" అనుపేర ఒక కార్య ప్రణాళికను తయారు చేసిరి. అందు క్రాంవెలునకు "ప్రభువు" అని బిరుద మిచ్చి, అతడు ప్రజా ప్రాతినిధ్యము గల ఒక పార్లమెంటు యొక్కయు మఱి యింకొక కౌన్సిలు యొక్కయు సాయమున రాజ్యమేలవలె నని నిర్ణయించిరి. ఈ పద్ధతికి క్రాంవెలు కూడ అంగీకరించెను. తత్ప్రకారము, 1654-వ సంవత్సరము సెప్టెంబరులో ఒక పార్లమెంటు సభ సమావేశ మయ్యెను. వారు "ప్రభుత్వసాధన" నియమముల మార్చ ప్రయత్నించిరి. సేనాధికారము, క్రాంవెలునకు లేకుండ జేసి తామే పొందవలయు ననియు, మతపరిపాలనమున గూడ తమ మాటే చెల్లవలె ననియు వారి యూహ. మతవిషయమున క్రాంవెలు ఇతరులపై అంతగా నిర్బంధములు ప్రయోగింప లేదు. 'అసమ్మతులు' తమ చిత్తము చొప్పున ఈశ్వరారాధన చేసికొన వచ్చు ననెను. ఇంగ్లీషు చర్చి వారు గూడ, బహుసంఖ్యాకులు గాకుండ, కొలది కొలది మందిగా సమావేశమై తమ పద్ధతి తాము అవలంబించుకొన వచ్చు ననెను. బాహిరముగా కాకుండ, కాతలిక్కులు గూడ తమ దారిని తాము పోవచ్చు ననెను. ఈ పద్ధతు లన్నియు మార్చవలె నని పార్లమెంటువారు సంకల్పించిరి. వారి యునికియు కంటకప్రాయమై, క్రాంవెలు, వారిని ఇంటికి పొండని తఱిమివైచెను. ఈ విధముగా క్రొత్త పార్లమెంటు అస్తమించెను.

ఇక, సేనాసహాయముననే రాజ్యమేల వలెనని యతనికి తోచి యది సాగించెను. 1655-వ సంవత్సరములో, ఇంగ్లండును, వేల్సును పండ్రెండు జిల్లాలుగా విభజించి, ఒక్కొక్క

జిల్లాకు ఒకొక్క సైనికోద్యోగిని అధికారిగా నియమించెను (Major General). క్రాంవెలును ద్వేషించినట్లు ఎవరేని ప్రజలలో కానవచ్చినచో ఆ ద్రోహులను, ఆ జిల్లా యధికారులే విచారించి శిక్షింప గలరు. ఆ జిల్లాయధికారి వశమున కొంత సేన యుండును. ప్రభుభక్తి పరాయణులు కానట్లు ఎవ్వారేని అనుమానింప బడుచో, వారివలన ఆ సేనల కర్చు రాబట్టుదురు. ఈ విధముగా ఆ పరిపాలన సైనికప్రభుత్వ మయ్యెను. ప్రభుత్వమునెడ భయమే కాని, ప్రజలకు భక్తి లేదు. భయము పెంపున ఎల్లరును తల లొగ్గి యుండిరి గాని, లోలో కుమారిల్లుచునే యుండిరి.

## (6) హాలెండు స్పెయిను దేశములతోడి సంబంధము.

సైనికోద్యోగులు జిల్లా అధికారులై ఆ విధమున చండ పరిపాలన సేయుచుండ, క్రాంవెలు పరదేశములతో యుద్ధములు సేయుచుండెను. అందు మొదటి యుద్ధము హాలెండుతోను, రెండవ యుద్ధము స్పెయినుతోను జరిగెను. హాలెండుతోడి యుద్ధమునకు ముఖ్యకారణము "ఓడవర్తకపు చట్టము" (Navigation Act). అది 1651-వ సంవత్సరమున తీర్మానింపబడెను. "ఇంగ్లండు దేశమునకు దిగుమతి యగు సరకు లన్నియు బ్రిటిషు ఓడలలో గాని లేదా సరకు ఎగుమతి సేయు దేశపు ఓడలలో గాని మాత్రమే రావలెను. మఱియు, ఆసియా, ఆఫ్రికా, అమెరికా ఖండములనుండి వచ్చు సరకులు గూడ బ్రిటిషు ఓడలలోనే రావలెను. లేదా బ్రిటిషు వారి వలస రాజ్యములలో కట్టిన యోడలలో రావలెను." ఇది, ఓడవర్తకపు చట్టము యొక్క సారము.

బ్రిటిషు రాజ్యమున ఓడలు కట్టు పని వెంపొందించుటయే ఆ శాసనోద్దేశము. అది హాలెండువారికి నష్టదాయకము. ఏమన యూరపులోని పెడవర్తక మంతయు వారి ఓడల మీాదనే నడుచు చుండెను. వారి నష్టమును వా రొప్పుకొనరు, వీరి లాభమును వీరు మానుకొనరు. కనుకనే వారును వీరును యుద్ధమునకు దిగిరి. ఇంగ్లీషు సేనకు ఆ యుద్ధము ఇష్టము లేదు. కాని నౌకాదళమునకు యుద్ధకుతూహలము కలదు. యుద్ధము చేసి మన లాభమును మనము కాపాడు కొనవలె నని నౌకాదళమువారు పట్టుపట్టిరి. కాగా 1652-వ సంవత్సరమున పోరాటము ఆరంభ మయ్యెను. వారి యోడల వీరును, వీరి యోడల వారును పెక్కు జయించి పట్టుకొనిరి. తుదకు, ఇంగ్లండుకంటె హాలెండే ఎక్కువ నష్టపడెను. యుద్ధవ్యయమునకు క్రాంవెలు ప్రజలమీాద క్రొత్త పన్నులు విధించెను. దానివలన ప్రజలకు యుద్ధ మనిన సమ్మతము లేక పోయెను. అంతట 1654-వ సంవత్సరము ఏప్రిలు నెలలో సంధి చేసికొనిరి.

క్రాంవెలు ఇంగ్లీషు నౌకాదళమును చాల వెంపొందించెను. పరరాజ్యముల జయించుటకు అదియే బలవత్తర మైన సాధన మని యతని యుద్దేశము. స్పానిషువారు తమ వలస రాజ్యములతో ఇంగ్లీషు వారిని స్వేచ్ఛగా వర్తకము సేయ నిచ్చుట లేదు. అదియును గాక వారు కాతలిక్కు లగుట ప్రొటెస్టెంటులను అందిన చోటుల నెల్ల బాధించు చుండిరి. 1655-వ సంవత్సరమున క్రాంవెలు ఆ పద్ధతి మానవలె ననియు, ఇంగ్లీషు వర్తకులు స్పానిషు వలసరాజ్యములతో స్వేచ్ఛగా వ్యాపారము సేయవలె ననియు అడిగెను. వారు

అతనికోర్కి మన్నింపరైరి. ఇది కారణముగా 1655-వ సంవత్సరము ఏప్రిలు నెలలో ఇంగ్లీషు నౌకాదళము "జమైకా"ను పట్టుకొనెను. అంతట స్పానిషువారును యుద్ధమునకు దిగిరి. హాలెండువారితో యుద్ధముచేసి నప్పుడు సమర్థతమై పోరిన వాడు "రాబర్టు బ్లేకు" (Robert Blake). అతడు ఆ కాలపు సముద్రసేనాధిపతులలో మిక్కిలి గొప్పవాడు. క్రాంవెలు, అతనితో "జిబ్రాల్టరు" (Gibraltar) పట్టుకొమ్మని చెప్పెను. అది దుర్ఘటకృత్య మని యేమో బ్లేకు జిబ్రాల్టరు మీదికి పోడయ్యెను. కాని 1657-వ సంవత్సరము జూలై నెలలో అతడు స్పానిషు నౌకాదళమును "టెనిరిఫ్ఫీ" లంకలోని "శాంటాక్రజు" సమీపమున ఓడించి జయము గొనెను (Santa Cruz in the Island of Teneriffe).

జమైకాలో, ఒక క్రొత్త యధినివేశరాజ్యము స్థాపించుటయు, నౌకాదళమును వృద్ధిచేయుటయు, ఆ యుద్ధఫలితములు. క్రాంవెలు ఎన్నో క్రొత్త యోడలు కట్టించెను. నాడు మొదలు, ఇంగ్లీషు వారు, సముద్రసేననే పెంపొందించుకొనిరి.

స్పానిషువారితో నేలమీద కూడ పోరు జరిగెను. 1658-వ సంవత్సరము జూను నెలలో ఇంగ్లీషు వారు స్పెయిను వారిని "డ్యూన్సు" యుద్ధమున (Battle of Dunes.) గెల్చి; "డన్కిర్కు" దుర్గమును స్వాధీనము చేసికొనిరి. ఆ యుద్ధమున ఫ్రెంచివారు ఇంగ్లీషు వారికి సాయముచేసిరి.

## (7) ప్రజాస్వామ్యము అంతమొందుట.

క్రాంవెలు, 1655-వ సంవత్సరమున, సైనికోద్యోగులనే జిల్లా అధికారులుగా జేసి పరిపాలన సాగించిన విధమును,

వారి పాలనా పద్ధతిని మున్నే వివరించితిమి. ఆ పద్ధతి కొన్ని నాళ్లకే మారిపోయి, మామూలు పార్లమెంటు పద్ధతి ప్రారంభమయ్యెను. 1656-వ సంవత్సరమున క్రాంవెలు ఒక పార్లమెంటు సభను సమావేశము చేసెను. ఆ సభవారు ప్రభుత్వవిషయమున ఒక క్రొత్త కార్యప్రణాళికను వ్రాసి, దాని ననుసరింప వలసినదిగా క్రాంవెలును అర్థించిరి. ఆ పత్రమునకు "ఉపదేశపూర్వక విజ్ఞాపనము" అని పేరు. అందు వారు సూచించిన ముఖ్యవిషయము క్రాంవెలు రాజు కావలె ననుట. సైనికోద్యోగులు అది కూడ దనిరి. క్రాంవెలునకును, తాను రాజు కావలె నను కోర్కె లేమి జేసి అతఁడును ఆ పద్ధతికి సమ్మతింపడయ్యెను. అంతట అతని యనంతరము "ప్రభు గోప్త" కాదగిన వానిని అతఁడే ముందు పేర్కొనవలె నని పార్లమెంటు వారనిరి. కిరీటధారి కాడన్న మాటయే కాని నిజమునకు అతఁడే రాజు. పదపడి, ఇంకొక పార్లమెంటు సభను స్థాపించిరి. తత్సభ్యు లందఱు క్రాంవెలుచే ఎన్నుకొనబడిన వారే. వారు తమ జీవితకాల మంతయు సభ్యులుగా నుండదగుదురు. దానికి "అన్యసభ" అని పేరు. అది ప్రభుసభ వంటిది. ప్రభుసభ వంటి దన నేల, అదియే ఇంకొక రూపమున అవతరించిన దన వచ్చును. మరల పార్లమెంటు సభా సృష్టివలన, ప్రజాస్వామ్యమునెడ దేశమునకు విసువు జనించిన దని యూహింపనగును. ప్రజాస్వామ్యము వలన స్వదేశమున మతస్వాతంత్ర్యమును పరదేశముల జయాభ్యుదయములును కలిగెను. కాని దాని యాజమాన్య మంతయు సైన్యము వహించి నడపుటయే దానిలోని ప్రథమలోపము. క్రాంవెలు వంటి ధీరస్వభావుడే పైన లేనిచో, ఆ ప్రజాస్వామ్యము ఎన్నడో అస్తమించియుం

డును. 1658-వ సంవత్సరము సెప్టెంబరు మూడవ తేదీని క్రాంవెలు పరలోకగతు డయ్యెను.

అతని యనంతరము, అతని కుమారుడు "రిచార్డు" తొమ్మిది మాసములు ప్రభు గోప్త యై పాలించి రాజ్యభారము వహించుటకు, తనకు శక్తి చాల దని గ్రహించి తన పదవిని వదలు కొనెను. పైన అదుపు లేకపోబట్టి, సేనయే సర్వ తంత్ర స్వతంత్రమై, తొల్లిటి "పరిశిష్టసభా" సభ్యులను పిలిపించి, పార్లమెంటునుగా జేసెను. పదపడి కొలదిదినములకే పార్లి మెంటునకును సేనకును కలహములు ఉప్పతిల్లెను.

తుదకు, జనరలు జార్జి మాంకు అను సైనికోద్యోగి సార్థక నాము డైన రాజు ఉండి తీరవలె నని యూహించి, రెం డవ చార్లెసు హాలెండులో ఉండగా అతనిని రమ్మని జాబు వ్రాసెను. జార్జి మాంకు (George Monk) క్రాంవెలు పక్షమున స్కాటులాండులో యుద్ధము చేసిన సేనాధిపతి. అతడు 1660-వ సంవత్సరము ఫిబ్రవరి మూడవ తేదీని, ఏడు వేలమంది సైనికులతో వచ్చి లండను నగరము ప్రవేశించెను. రెండవ చార్లెసుగూడ ప్రజలకు పెక్కు వాగ్దానములు చేసెను. మొదటి చార్లెసు నాటి "ఆశ్వికులు" అన బడు రాజభక్తులు మరల బిషప్పులను రాజును యథాస్థానముల ప్రతిష్ఠింపను ఉద్యు క్తులై యుండిరి. ప్రెసిబిటేరియనులు గూడ వారితో నేకీభవిం చిరి. కాగా రెండవ చార్లెసు హాలెండునుండి బయలుదేరి వచ్చి "డోవరు"నొద్ద ఓడ దిగినప్పుడు వారును వీరును గూడి మహా వైభవముతో అతిభక్తితో ప్రత్యుత్థానము చేసి స్వాగత మిచ్చిరి.

ఈ విధముగా స్టూవర్టు రాజవంశము పునఃప్రతిష్ఠిత మయ్యెను. పార్లమెంటునకును, రాజునకును ఆనుకూల్యము

లేమిజేసియు రాజాధికారము తిరస్కృతమగుటచేతను పూర్వము వర్ణించిన ప్రజాయుద్ధము తటస్థించెను. యుద్ధమున జయము సంపాదించినది సేన. ఆ ప్రభావమువలననే సేనయు పార్లమెంటును తిరస్కరించి తానే యాజమాన్యము వహించెను. అనగా రాజును పార్లమెంటు ధిక్కరించినట్లే, పార్లమెంటును సేన ధిక్కరించెను. కాని సేనకు పరిపాలన విషయమున శక్తి లేమిజేసి ఆ ప్రభుత్వము అంతరించెను. ప్రజాస్వామ్య మనునది సత్పరిపాలనా సిద్ధికై తాత్కాలికముగ అనుష్ఠించి చూచిన యొక ప్రయోగము. ఆ ప్రక్రియ నిష్ఫల మగుటచేతనే పూర్వ పద్ధతి ననుసరించి, మరల రాజును, పార్లమెంటును రావలసి వచ్చెను. ఈ తడవ, రాజును కేవలము వశవర్తిని చేసికొనవచ్చు నని పార్లమెంటు తలచెను గాని, రెండవ చార్లెసు అది వట్టి భ్రమ యని నిదర్శనపూర్వకముగా తెలియ జేసెను. శాసనములు, చట్టములు చేయు నధికారము పార్లమెంటునకే కలదు. కాని ఆచరణయోగ్యములు కాని శాసనముల వలన ఫలమేమి? కనుకనే రెండవ చార్లెసును, రెండవజేమ్సును, శాసన నిర్మాణముననే కాక, తత్ప్రయోగమునందు కూడ పార్లమెంటే బాధ్యత వహింపవలె నను నీతి గఱపిరి.

## పదునేడవ శతాబ్ది వాఙ్మయము: మిల్టను: బన్యను

**(Milton and Bunyan.)**

ఆ కాలపు రచయితలలో, "మిల్టను" "బన్యను" మహా ప్రసిద్ధి గలవారు. మిల్టను పద్య రచనయందును, బన్యను గద్య రచనయందును నిపుణులు. జాను మిల్టను 1608-వ సంవత్సరములో లండను నగరమున జన్మించెను.

అతడు చిన్నతనమున "సెంటు పాలు" బడిలో చదువుకొని, పిమ్మట పెద్దచదువులకై కేంబ్రిడ్జికి పోయెను. అతని వంశము శుద్ధమైన ప్యూరిటను వంశము. అతని వ్రాత లన్నియు తత్సంప్రదాయమునకు అనురూపముగానే యుండెను. కేంబ్రిడ్జిలో చదువైన తరువాత, అతడు బకింగుహాముషైరులో నివాస మేర్పఱచుకొని ఆరేండ్లు ఉండెను (1632—1638). అచట నున్న దినములలో అతడు అతి రసవంతమైన కవిత్వము వ్రాయ బూనెను. అతడు సొగసైన చిన్న చిన్న పాటలు రచనలు సేయుటకు అదే మొదలు. పిదపడి రెండు సంవత్సరములు (1638—1640) మిల్టను యూరోపుఖండమున సంచారము చేసెను. ఆ రెండేండ్లలోను ఎక్కువ దినములు ఇటలీలో గడపెను. పదపడి, ఇరువది యేండ్లలో అతడు పెక్కు గ్రంథములు రచించెను. వానిలో పద్యకావ్యముల కంటె గద్యరచనలే యెక్కువ. అవియును రాజకీయ విషయముల గుఱించి వ్రాసినవి. ప్రెస్సు వారికిని వాక్స్వాతంత్ర్యము ఉండవలె ననియు, ఇతర విషయములయందువలెనె మతవిషయములందు గూడ నెల్లరు తమతమ భావముల లోకుల కెఱిగించు స్వాతంత్ర్య ముండవలె ననియు, దానిని ప్రభుత్వము వారు నిరోధింప రాదనియు, అతని గద్య రచనల సారము. ఏదేని వివాదాంశమున బుద్ధి నిర్ణయము పొందుటకు, ఉభయ పక్షములను సావధానముతో విచారింపవలె ననియు, ఆ యలవాటు వలన న్యాయవిచక్షణతా శక్తి కలుగు ననియు, ఎంత మంచివాడయ్యు కూపస్థమండూకము వలె ఇల్లుకదలి పోక మానవ లోకమెట్లు చరించు చున్నదో యెఱుగక తాను పట్టినకుందేటికి మూడే కాళ్లు అని పట్టిన పట్టు వీడక, ప్రతివాదమును చక్కగా ఆలకింపక యుండు

వాడు క్రమముగా బుద్ధిహీనుడై పోవు ననియు, శాశ్వతకీర్తి రావలె నన్న ఎన్ని సంకటములో గడచి, ఎన్నికష్టములో అను భవించి, ఉత్తేజిత చిత్తుడైన గాని రా దనియు అతని యుపదేశము. ఈ వివరమంతయు, నతడు "అరియోపగీతిక" ("Areopagitica") అను గ్రంథమున వ్రాసెను.

1652-వ సంవత్సరములో మిల్టనునకు కండ్లు పోయెను. పదపడి రెండవ చార్లెసు రాజ్యమునకు రాగానే, అతడు రాజకీయ వ్యవహారముల యందు జోక్యము మానుకొని గ్రంథరచనకు బూనెను. ఆ దినములలో నతడు మూడు ఉద్గ్రంథములు రచించెను. సాహిత్య ప్రపంచమున, అతనికి గల మహాకీర్తికి ఆ మూడు గ్రంథములే హేతుభూతములు. "నష్టస్వర్గము" "లబ్ధస్వర్గము" "శామ్సను అగోనిస్టెసు" (Paradise Lost, Paradise Regained and Samson Agonistes) అనునవి ఆ గ్రంథములు. "దైవనియతి ధర్మయుతము" అను న్యాయమే తద్గ్రంథసారము. ధర్మాధర్మ సంఘర్షణము తత్కల్పన. ఆ వస్తువు చాల ఉదాత్తమైనదే కాని, రసవంత మైనది కాదు. అందుచేతనే, ఆ కావ్యములలో అచ్చటచ్చట రసవిహీనత కల్గినది. సహజ గంభీరము లైన ధర్మవిషయములు గూడ, కావ్యవస్తువులుగా గైకొన నౌనని మిల్టనురచనలవలన తెలియ నయ్యెను. అది యునుగాక, ఆ కాలమున ఆ ధర్మోపదేశము గూడ అవసర మయ్యెను. పదునేడవ శతాబ్ది పూర్వభాగమున బయలుదేరిన కవిత్వ మంతయు పేలవతా దూషితమై యుండెను. ఆ రచనల యందు తళుకుబెళుకులే గాని గాంభీర్యము లేదు. అపేలవ మైన వస్తువును గైకొని ఉదార కావ్యరచన చేసి, మిల్టను

మహనీయు డనిపించుకొనెను. నిష్ప్రాస మైన మాలికారచనకు మొంచి ఒరవడి పెట్టినవాడు మిల్టను. నేటికిని కవు లతనిని అనుకరించుచునే యుందురు.

ఇక జాను బనియను విషయము. ఇతడు 1628-వ సంవత్సరములో బెడ్ఫర్డుషైరులోని, ఎల్స్టౌలో జనన మొందెను. (Elstow in Bedfordshire) అతడు కడు పేదవాడు. పాత్రసామగ్రికి మాట్లువేసి జీవిక సమార్జించువాడు. అయ్యు నతనికి దైవభక్తి మెండు. కాగా నతడు ధర్మోపదేశము చేయసాగెను. మతమున అతడు పావనపక్షమునకు చెందినవాడు. అతని యుద్దేశములు క్రాంవెలు నుద్దేశముల వంటివి. స్వర్గ నరక స్థితి సత్యమే కాని కల్పితము కాదని యతని నమ్మకము.

అతనిబోధలు అనర్థకము లని తోచి, ప్రభుత్వమువారు అతనిని నిగ్రహించి చెఱలో బెట్టిరి (1660). కారాగృహమున నున్న దినములలోనే బనియను జగద్విఖ్యాత మైన “పిల్గ్రిమ్సు ప్రోగ్రెసు” (Pilgrim's Progress) అను వచన గ్రంథము వ్రాసెను (1675). ఆ రచన సుబోధకమై విషయమును ప్రత్యక్షగోచరము చేయుచుండును. “గ్రేటుహార్టు” (Mr. Greatheart) అను నొక యుదారచిత్తుడు నశ్వరస్థానమున నుండి బయలుదేరి వినశ్వరపదమునకు చేరబోవు విధము ఆ గ్రంథమున వర్ణింపబడెను. అధర్మము బారి తలగి ధర్మపథము త్రొక్కెడు మానవుని సాధన యంతయు, వ్యంగ్యముగా వర్ణితమగుట బట్టి, ఆ గ్రంథము శ్లేషకావ్య మని చెప్పవచ్చును. ఆ కల్పన బనియనునకు దైవానుగ్రహమున స్ఫురించినదే కాని, పూర్వగ్రంథముల జూచి నేర్చినది కాదు. అతడు మఱి రెండు



JOHN BUNYAN.
Painting by T. Sadler.
(By kind permission of National Portrait Gallery, London.)

ధర్మగ్రంథములు గూడ వ్రాసెనుగాని, అతనికీర్తికి ముఖ్యకారణమైనది యీ గ్రంథమే. “ఈ గ్రంథమున వర్ణింపబడిన పాత్రలన్నియు అద్దమునందు వలె మనోనేత్రమునకు గనుపించుచుండునుగాని, మతతత్వమున్నను మనుజులకు వారు. ప్రధానపాత్రమైన యాత్రికుని వలెనే తక్కిన పాత్రలన్నియు మానవులేగాని వివేకములతో కన్నుల యెదుట గాంపించుచుండును. బుజమున మూటయు, చెవుల వ్రేళ్లను బెట్టుకొని, ఆ యాత్రికుడు. ఉన్మాదుని వలె సర్వనాశపట్టణమునుండి పరుగెత్తి పోవునప్పటి వర్ణన మహోదారమైన బనియను కవితాప్రశస్తికే చెల్లునుగాని యితరులకు చెల్లదు.”



## ఇరువది రెండవ ప్రకరణము



### పునఃప్రతిష్ఠ: ప్రజావిప్లవము (Restoration and Revolution)

రెండవ చార్లెసు, అతి నిపుణుడు. ఇంగ్లీషురాజులలో అంత తెలివిగలవాడు లేడు. అతనికి శాస్త్రములయందు ఎక్కువ ప్రీతి. నాటకాదికళలను చక్కగా ఆనందింపగల రసికుడు. మతమున అతడు కాతలిక్కు అయినను అన్యమత సహనము గలవాడు. రాజకీయ వ్యవహారములయందు గూడ నతడెంతో మెలకువ గలవాడు. కనుకనే, పార్లమెంటును లోపఱచుకొని, తన రాజభావమును సార్థకము చేసికొన గల్గెను.

“ఆశ్వికులును” ప్రెసిబిటేరియనులును కలిసి ఒక పార్లమెంటుగా జేరి “పునఃప్రతిష్ఠ” వ్యవహారములను పరిష్కరించిరి.

1641-వ సంవత్సరములో దేశమున గల శాసనములే, అమలులో నుండవలెను గాని మధ్యకాలమున వచ్చిన వన్నియు పోవలె ననియు, ప్రభుత్వమువారు గాని, చర్చివారు గాని, లోపఱుచుకొన్న భూము లన్నియు తిరిగి ఆ యా రైతుల కిచ్చివేయవలె ననియు ఆ పార్లమెంటువారు నిర్ణయించిరి. మఱియు, చార్లెసు పండ్రెండు లక్షల పౌనుల ఆదాయము రాబట్టుకొనవచ్చు ననిరి. కాని అందులో సగముకంటె ఎక్కువ వసూలయ్యెడిది కాదు. అందుచే చార్లెసు ఎప్పుడును డబ్బు చాలక యిబ్బంది పడుచుండెడివాడు. రాజువశమున చాల సైన్య మున్నచో ఏమి ముప్పు వచ్చునో యని, పార్లమెంటువారు, రెండు దళములు మాత్రమే మూలబలముగా నుండ నంగీకరించిరి.

పార్లమెంటువారి నిర్ణయమునుబట్టి, పల్లెలలోని పెద్ద రైతులకు మరల తొల్లిటి అధికారములు లభించెను. ఇంగ్లీషు చర్చివారు గూడ తొల్లిటి ప్రతిష్ఠను సంపాదింప గలిగిరి. ప్రజాస్వామ్యపు దినములలో, ఇంగ్లీషుచర్చి, ప్రెసిబిటేరియను పద్ధతిమీద నడచుచుండెను. కనుక, రాచచర్చిలోనుండియు, తమమార్గమున తాము నడవవచ్చు నని ప్రెసిబిటేరియనులు ఆశపడిరి. కాని క్రొత్తగా ఏర్పాటైన పార్లమెంటులో ప్రెసిబిటేరియనులకు ఇంచుకయు అధికారము గాని పలుకుబడి గాని లేకపోయెను. ఆ పార్లమెంటులో ముఖ్యపురుషుడు "ఎడ్వర్డు హైడు" అను "క్లారెండను దొర" (Edward Hyde, Earl of Clarendon). అతడు "లార్డు ఛాన్సెలరు" గూడ (Lord Chancellor). అతడు పార్లమెంటుచే కాతలిక్కులకును, అసమ్మతులకును బాధాకరము లైన నాల్గు శాసనములు చేయించెను. ఆ

శాసనములబట్టి వారు ఏ పురపరిపాలనాధికారమునను జోక్యము కలిగించుకొనగూడదు, బహిరంగముగ సభలు చేయకూడదు, ప్రభుత్వమువారి యనుమతి లేక గ్రంథములు ప్రచురింపగూడదు, తన్మతబోధకులును ఉపాధ్యాయులును ప్రభుత్వమున గాని, మతమున గాని ఎన్నడును ఎట్టి సంస్కారప్రయత్నములును చేయమని ప్రమాణముచేసిన గాని, ఏ పట్టణమునకును ఐదు మైళ్ల దూరములో రాగూడదు. 1662-వ సంవత్సరములో చేసిన "సమతాశాసనము" వలన (Act of Uniformity) రెండు వేల మంది అసమ్మతులు, చర్చినుండి తొలగి పోవలసివచ్చెను.

ఈ నాల్గుశాసనములును కలిసి, "క్లారెండను స్మృతి" అని వ్యవహరింపబడెను. అన్ని యెడలను, ఆ శాసనములు గట్టిగా అమలులో లేకపోయినను, ఉద్దిష్టమైన ప్రయోజనము మాత్రము నెరవేరినది. ప్రెసిబిటేరియనులలో పెక్కుమంది ఆ శాసనబాధ పడలేక ఇంగ్లీషుచర్చిలో చేరిరి. తక్కినవారు చేరకున్నను వారి నంతగా బాధింపరైరి. కొన్నినాళ్లకు వారి మతము పట్టణవాసుల యామోదమును బడసెను. భాగ్యవంతులు చాలమంది "అసమ్మతు" లైరి. చార్లెసుగూడ ఆ మతమును ఆమోదించెను. తుదకు, వారి సాయముననే అతడు పార్లమెంటును చర్చిని గూడ తిరస్కరింప యత్నించెను.

## రెండవ డచ్చి యుద్ధము: 1665—1667 సం॥

పదునేడవ శతాబ్దిని గల వర్తకులును, రాజనీతివేత్తలును గూడ దేశమున ఎక్కువ ధనసంపద లేదని గ్రహించి ఇంకొక దేశమునకు దరిద్రత నాపాదించినగాని, యీ దేశమునకు భాగ్యము సమకూరదని యూహించిరి. వర్తక వ్యవహారముల

యందు, ఇంగ్లండునకు ఇతరదేశములతోడి స్పర్థకు ఇదియే హేతువు.

అందును ముఖ్యముగా, డచ్చివారితో ఇంగ్లీషువర్తకులకు స్పర్థ ఎక్కువ. ఖండాంతరములతోడి వర్తకమును గుత్తగొనుటకు మేము మేమని రెండు జాతులవారును ఒండొరుగడచి ముందు నకు దుముకసాగిరి. ఆ స్పర్థ వైరముగా పరిణమించెను. తదను గుణముగా, డచ్చివారు, 1664-వ సంవత్సరములో ఇంగ్లీషు వారి యోడలను బట్టుకొని స్వాధీనము చేసికొనిరి. వీరును, అమెరికాలో గల డచ్చివారి అధినివేశరాజ్య మైన "న్యూ హాలెండు"ను ముట్టడించి జయించిరి. అంతట, వైరము ప్రబ లమై రెండు జాతులకును మహాయుద్ధము తటస్థమయ్యెను (1665). ఆ సంవత్సరము జనవరి 3-వ తేదీని, యార్కు-డ్యూకు యాజమాన్యమున గల ఇంగ్లీషు నౌకాదళము లావెస్ టాఫ్టు (Lowestoft) దగ్గర డచ్చివారిని ఓడించెను. కాని చార్లెసునొద్ద బొత్తుగా ధనము లేదు. అందుచేత నావికులకు ఎన్ని మాసములకును జీతములు ముట్టలేదు. ప్రాత పడవల మరమ్మతు చేయుటయును లేకపోయెను. ఎట్లో వీలుచేసికొని, చార్లెసు కొంత డబ్బు ఇచ్చెను గాని, దానిని అతని యాశ్రి తులే అనుభవించిరి గాని అందఱు నావికులకు ముట్టనేలేదు. అదియునుగాక, కొంత డబ్బు మధ్యవారు అపహరించిరి. తుదకు 1667-వ సంవత్సరములో, నావికు లందఱు కలిసి గుమి గూడి, లండనునగరమును కొల్లగొట్ట దొడగిరి. ప్రభుత్వము వారు, డబ్బు ఈయజాలక, నౌకలను కట్టిపెట్టించిరి. అది డచ్చి వారికి మంచి అనుకూల సమయ మయ్యెను. వారు చేతికందిన ఇంగ్లీషు నౌకలను తగుల బెట్టిరి.

తత్పూర్వము, రెండేండ్ల నాడు లండను నగరమున ప్లేగు వ్యాధి ప్రవేశించి చాల ప్రాణనష్టము గావించెను. అది, తొల్లిటి "కాళరాత్రి" వంటిది. ఆ మహావ్యాధి, పదునాల్గవ శతాబ్దికి తరువాత ఎన్నిసారులో వచ్చినది. దానికి తోడు 1666-వ సంవత్సరములో లండనునగరమును "మహాగ్ని" దహించివైచెను. ఆ ప్లేగువ్యాధి, ఆ యగ్నిదహనము, ఆ డచ్చిపోరు, మూడును దుష్పరిపాలనకు ఈశ్వరుడు విధించిన శిక్షలని జనులు భావించిరి.

పిమ్మట, 1667-వ సంవత్సరము జూలై నెలలో డచ్చి వారితో సంధి కుదిరెను. దానికి "బ్రెడాసంధి" యని పేరు (Treaty of Breda). చార్లెసు గూడ, "క్లారెండను" అను వానిని పనిలో నుండి తొలగించెను. డచ్చివారితో జరిగిన ఆ సంధివలన ఇంగ్లీషువారికి కొంత లాభమే కలిగెను. "ఈస్టు ఇండీసు" అను లంకలలో ఇంగ్లీషువారి వశమున నున్న "పులారూను" (Pularoon) అను లంకను డచ్చివారికి ఇచ్చివైచిరి. అది, మంచి సుగంధవస్తువులు పండు లంక. దానికి బదులుగా, డచ్చివారు, ఉత్తర అమెరికాలోని డిలావేర్, న్యూజెర్సీ, న్యూయార్కు అను మూడు ప్రదేశములను ఇంగ్లీషువారి వశముచేసిరి. (Delaware, New Jersey, and New York). ఈ ప్రదేశములకు "నడిమి వలస భూము" లని పేరు. తత్పూర్వము దక్షిణదిశను, ఉత్తరదిశను గల అధినివేశభూములతో, ఇవియు కలియుటచేత, అఖండమైన క్రొత్త రాజ్యమేర్పడెను.

"క్లారెండను స్మృతి"వలని బాధ పడలేక లేచిపోయిన "అసమ్మతులును," యూరపునుండి లేచివచ్చిన మఱి కొందఱు ప్రొటెస్టెంటులును గూడ, ఆ భూములనే శరణ్యములుగా ఆశ్ర

యుంచిరి. కాగా, "నడిమింవలసభూములు" అనేక మతముల వారికి, అనేక జాతులవారికి ఆశ్రయమైనవి.

### నిగూఢసభ. 1667—1673-వ సం॥ (The Cabal)

1667-వ సంవత్సరములో క్లారెండను పదభ్రష్టు డయ్యె నని చెప్పితిమి. పిమ్మట ఆజేంప్లు, చార్లెసు, ఐదుగురు మంత్రులు గల ఒక చిన్న సభయొక్క సలహాలను గైకొనుచుండెను. ఆ యైదుగురు మంత్రులలో నొక్కడును ఇంగ్లీషుచర్చికి సంబంధించినవాడు కాడు. తత్పూర్వము నూజేంద్ల నుండియు, రాజు ఒక్క చిన్న మంత్రివర్గముతో వ్యవహారవిషయముల ఆలోచించుచుండుట ఆచారమైయే యుండెను. కాని ఆ యాచారము ప్రజలకు నచ్చలేదు. "రాజసభ" అను ఒక పెద్ద సభయుండగా, దానితో ఆలోచింపక, ఆ రహస్యపు టాలోచనలేల యని ప్రజల కోపము. కాని రాజసభలో, సభ్యులు చాలమంది గలరు. ప్రతి విషయమును అంతమందితో ఆలోచించుట కష్టముగా నుండును. కనుక, ఆ నిగూఢసభ ఉపయుక్తమైనది.

చార్లెసుయొక్క నిగూఢసభలోని సభ్యుల నామముల ప్రథమాక్షరములు సి. ఏ. బి. ఏ. యల్ (C. A. B. A. L.) వారిని ఈ సంకేతాక్షరములమీదనే పిల్చెడివారు. వారి అసలుపేర్లు ఏవనగా:—క్లిఫర్డు, ఆర్లింగుటను, బకింగుహాము, ఆష్లీ, లాడరుడేలు, (Clifford, Arlington, Buckingham, Ashley, Lauderdale.) ఈ వర్గము ఇంగ్లీషుచర్చిని కూలద్రోయవలె నని దురాలోచనలు సేయుచుండి రని గ్రహించి ప్రజలు ద్వేషించిరి.

ఈ సందర్భములో చార్లెసు ఫ్రెంచిరాజైన పదునాలవ లూయీతో (Louis XIV) కొన్ని రహస్యపు ఏర్పాటులు చేసికొనదొడగెను. అతడు కొంతకాలము, అసమ్మతులయెడ పక్షపాతము గలవానివలె కానవచ్చెను. అసమ్మతుల యాప్రమాపుటకు కల్పింపబడిన శాసనములను అతడు అమలులో పెట్టనీయలేదు. ఆ సమయమున, రాజునకు వారి అండ అవసరమైనది. బలవంతమైన ఇంగ్లీషుచర్చి పక్షమును అణగద్రొక్కవలెనన్న, అసమ్మతుల సాయముండినగాని కుదరదు. కనుకనే, చార్లెసు అసమ్మతులయెడ పక్షపాతము చూపెను. కాని అతనిమనోరథము వారిని ఉద్ధరించుటకాదు, ఇంగ్లండును కాతలిక్కు దేశమును జేయుట. ఆ కార్యము సాధించుటకే, అతడు ఫ్రెంచిరాజుతో మంతనము సాగించెను. మఱియు, చార్లెసునకు చాలినంత సొమ్ము లేదు. ఫ్రెంచి రాజు చాల ధనవంతుడు. అతనితో మైత్రి నెఱపినయెడ, సొమ్ము లభించునని చార్లెసు నుద్దేశము. కాని ఫ్రెంచిరాజు ఊరకే ధనమిచ్చునా? ఇంగ్లండును మరల కాతలిక్కు దేశమును జేయుదునని చార్లెసు పూచీ పడిన ఇచ్చును. ఆ విధమైన పూచీ యిచ్చుటకు చార్లెసు వెనుదీయలేదు. తదనుగుణముగా, తుదకు 1670-న సంవత్సరములో, డవరు నొద్ద వారి కిర్వురకు ఒక రహస్యపు ఒడంబడిక కుదిరెను (Secret Treaty of Dover). పదునాలవ లూయీ చార్లెసునకు సేనలను, సొమ్మును ఇచ్చునట్లును, ఇర్వురునుగూడి హాలెండును నాశమొనరించి దానిని ఇర్వురును చెఱిసగముగా పంచుకొనునట్లును షరతులు చేసికొనిరి. ఈ షరతులు అందఱికి తెలియవు. చార్లెసుమంత్రులలో, క్లిఫర్డు, ఆర్లింగుటను, అను ఇర్వురకు మాత్రమే ఆ గుట్టు తెలియ జెప్పిరి. తక్కిన వారికి

ఇంకొక విధముగా కల్పనజేసి తెల్పిరి. ఆ సంధివలన, చార్లెసు తనకు వలసిన సొమ్మును లూయీ వలన గ్రహించెను. కాని అతనిస్థితి మాత్రము సంకటావస్థలో పడిపోయెను. అతడు లూయీచేతిలో బొమ్మవలె నయ్యెను. "నేను చెప్పినట్లు చేయనైతివేని, రహస్యపు ఒడంబడికల బయటబెట్టెద"నని లూయీ మాటిమాటికి చార్లెసును బెదిరింపజొచ్చెను.

1672-వ సంవత్సరములో మూడవ డచ్చియుద్ధము ప్రారంభమయ్యెను. ఆ దేశమును, ఇంగ్లీషువారు నేలమీద నుండియు, ఫ్రెంచివారు సముద్రమున నుండియు ఢీకొనిరి. నౌకాయుద్ధములో డచ్చివారే గెల్చిరి. భూయుద్ధములో గూడ ఇంగ్లీషువారు నిలబడు ఆశ లేకపోయినది. ఏమన, చార్లెసు నొద్ద తగినంత ధనములేదు. అర్థబలము లేని యుద్ధయత్నము నిష్ఫలము. కనుక, చార్లెసు ధనముకొఱకు పార్లమెంటు సభను సమావేశము చేసెను. పార్లమెంటువారికి రాజునడవడి అనుమానాస్పదముగా నుండెను గాన, వారు అతని మతవిషయికమైన నీతిని ఖండించిరి. డవరుసంధిషరతులు కూడ వారి చెవి సోకియుండవచ్చును. వారి యనుమానమునకు తగినట్లుగానే అతడును ఒక ప్రకటనను గావించెను. క్లారెండను స్మృతిలోని నియమము లన్నియు, అమలులోనికి రాకుండజేసి, కాతలిక్కులను, అసమ్మతులను, తాను కాపాడుదునని అతడు ప్రకటించెను. రాజునకు అట్టి యధికారములేదని పార్లమెంటువారు ప్రతిఘటించిరి. చేయునదిలేక, యతడును, ఆ ప్రకటనార్థమును ఉపసంహరించుకొనెను.

పిమ్మట 1673-వ సంవత్సరములో పార్లమెంటువారు, పరీక్షాశాసనమును (Test Act) చేసిరి. రాజోద్యోగము కావల

సిన వాడెవ్వడైనను, నుండవచ్చును. కాని, ఇంగ్లీషుచర్చిలోని వాడనే యని ఋజువుచేసుకొనక పోయినచో నర్హతలే దని ఆ శాసనార్థము. కాతలిక్కులకు ఉద్యోగములు లేకుండ చేయుటయే, దాని ముఖ్యప్రయోజనము. కాని అసమ్మతులు గూడ, దాని ఫలమును అనుభవించిరి. ఆ శాసనముతో చార్లెసు యొక్క నిరంకుశసభ విచ్ఛిన్న మైనది. పిమ్మట, డాన్బి దొర (Earl of Danby) ప్రధానమంత్రి యయ్యెను.

### డాన్బీ యధికారము (1673—1678-వ సం॥)

ఇంగ్లీషుచర్చివారికి ఇష్టులై వర్తించినగాని తన ప్రాభవము స్థిరము గానేరదని యెంచి, చార్లెసు వారికి అనుకూలుడై నడచుకొనజొచ్చెను. డాన్బీకి, ఫ్రెంచివారితోడి మైత్రి గిట్టదు. అతడు డచ్చివారికి అనుకూలుడు. కనుకనే అతడు పార్లమెంటు వారికి నచ్చినవాడయ్యెను. డాన్బీ హాలెండు దేశపు ప్రధాన శిష్టాధికారియైన విలియము అనువానికి, యార్కు-డ్యూకుని కుమార్తెయగు మేరీని ఇచ్చి పెండ్లిచేయు ఏర్పాటు, చేసెను. ఆ విలియము, ఆరెంజిప్రభువు (Prince of Orange). ఆ యార్కు-డ్యూకే కొన్ని నాళ్లకు రెండవజేమ్సు అగును. డాన్బీ చేసిన ప్రయత్నము వలన, ఇంగ్లీషువారికిని, డచ్చివారికిని విరోధ మంతరించి మైత్రి నెలకొనెను. 1674-వ సంవత్సరములో ఇరువురును సంధిచేసికొనిరి. ఇంతవఱకు ఆ ప్రధానామాత్యుని యధికారము చక్కగానే సాగినది. కాని మఱి నాలుగేండ్లకు (1678) కాతలిక్కుల వలన లేనిపోని భయమును శంకించి ప్రజలు గజిబిజి పడజొచ్చిరి. తత్ఫలితముగా, డాన్బీ యధికారము పోయినది. కాతలిక్కులు లండను నగరమును తగులబెట్టుటకును,

ఫ్రెంచివారియొక్కయు ఐరిషువారియొక్కయు సాయమును పొంది ఇంగ్లండును జయించుటకును తమమతమును పూర్చు కొననియెడల ప్రోటస్టెంటుల బట్టి వధించుటకును, కుట్రలు పన్నుచున్నారనియు, ఆ రహస్యము తన కెఱుగనయ్యె ననియు, టిటుసు ఓటెసు (Titus Oates) అను నొకడు పార్లమెంటువారికి విన్నవించెను. ఈ కథలో ఇంచుకయు సత్యములేదు. కాని తత్పూర్వము, 1605-వ సంవత్సరములోని తుపాకిమందు కుట్ర వలనను, 1641-వ సంవత్సరములోని ఐరిషు తిరుగుబాటువల నను పదపడి లండనునగరదహనమువలనను కష్టము లనుభ వించి యున్నవారుగాన ప్రజలు వినివినకముందే ఆ కథ నిజ మని నమ్మిరి. దానికితోడు చార్లెసు, లూయితో చేసికొన్న రహస్యసంధివిషయములును కొంతకు కొంత వెల్లడియయ్యెను. కాగా, ఇంగ్లండు ఇక కాతలిక్కుదేశముగా మారిపోవు నని ఎల్లరును భయవిహ్వలులైరి. ఎచ్చట జూచినను "మనకు పోపు వలదు" అను కేకలు మిన్నుముట్టెను. కాతలిక్కు మతస్థుని ముఖదర్శనముగూడ గిట్టకుండపోయెను. చార్లెసునెడ ద్వేష భావముగలవారికి అది మంచి యవకాశ మిచ్చెను. ఈ యుప ద్రవమునకు చార్లెసే మూలభూతుడని వారు వాదు వేయ దొడగిరి.

1678-వ సంవత్సరము, మార్చినెలలో, ఫ్రెంచిరాజైన లూయీ, చార్లెసునకు, సాలునకు మూడులక్షల పౌనుల ధన మిచ్చుటకు అంగీకరించెను. ఈ ఒడంబడిక డాన్బీకి నచ్చలేదు. అతడు వారింపజూచినను, లాభములేకపోయినది. చార్లెసు లూయీమాటకు ఒడబడెను. ఇదంతయు రహస్యముగానే జరిగినది. ఆ రహస్య మెఱిగిన ఇంకొక మంత్రి, డాన్బిని త్రోసి

పృచ్ఛ దలచి, డాన్బీయే యీ యొడంబడిక కుదిర్చెనని ప్రకటించెను. పార్లమెంటువారు ఆ మాట నమ్మిరి. పైగా, రాజు చేసిన పనులకు, ప్రధానామాత్యుడే బాధ్యుడని, వారు, డాన్బీపై నిందారోపణ చేసి, నిగ్రహించి నగరగోపురమున చెఱబెట్టి యుంచిరి.

పదపడి చార్లెసు మంత్రులవలదని, తానే స్వతంత్రుడై వ్యవహారములు చూచుకొనసాగెను. అతని స్వతంత్రవర్తనము ప్రజల కెంతో ఉపద్రవహేతు వయ్యెను.

### చార్లెసు, పార్లమెంటును ఓడించుట (1678—1685-వ సం॥)

డాన్బీమీద మోపబడిన నేరము తొలగించుటకై, చార్లెసు 1679-వ సంవత్సరము జనవరినెలలో పార్లమెంటు సభను రద్దుచేసి, ఆ బంధితుని తప్పు లన్నియు క్షమింపబడెనని ప్రకటించెను. రాజు క్షమించినంతమాత్రమున, అతని నేరములు పోదగినవి కావనియు, అతడు శిక్షార్హుడే యనియు పార్లమెంటువారు పట్టుపట్టిరి. ఈ ప్రతిఘటనలలో ఒక రహస్యమున్నది. ఏమన, రాజుచేసిన పనులకన్నిటికి, మంత్రియే బాధ్యత వహింపవలె ననుసూత్రము ఆచరణయోగ్య మగుట. ఆ సంవత్సరము మార్చినెలలో ఇంకొక పార్లమెంటు సభ కూడెను. అదియు, రాజునకు మునుపటి దానికంటె ఎక్కువ ప్రతికూలముగా నుండెను.

ఆ సభవారు రెండు శాసనములగూర్చి చర్చించిరి. ఆ రెండును చాల ముఖ్యమైనవి. అందు మొదటిది "పరిహార శాసనము" (Exclusion Bill). యార్కుడ్యూకు కాతలిక్కుమతస్థుడు గాన, అత డెప్పుడును, ఇంగ్లండునకు రాజుగా

రాకూడ దనియు, మాన్మత్తు డ్యూకు రాజు కావలె ననియు ఆ శాసనార్థము. ఈ తీర్మానము కామన్సుసభలో మాత్రము నెగ్గెను. రెండవది "హేబీస్ కార్పసు" (Habeas Corpus) అను నది. ఆ శాసనమున మొదటి రెండు మాటలును ఇవి గనుక దాని కాపేరు వచ్చినది. విచారణలేక చెఱసాలలో నుండు వారి విషయమై ఒక ప్రాచీనధర్మము కలదు:—ఏమన, కరణాధికారివలన (Chancellor) ఎవ్వడేని ఒక ఆజ్ఞాపత్రమును గైకొని పోయి, కారాగృహాధికారికి చూపినచో ఆ యధికారి విచారణలేకయే, చెఱ ననుభవించుచున్నవాని యపరాధవివరములను ఆ పత్రిక గొనివచ్చిన వానికి తెల్పవలెను. ఈ ధర్మము మాటమాత్రముననే ఉన్నట్లు తలపవలెను గాని, ఆచరణలో లేనట్లే భావించవలెను. ఏమనగా, అట్టి పత్రము వచ్చినను కారాగృహాధికారి తగిన సమాధానము వెంటనే ఇచ్చెడివాడు కాడు. అత డెంతకాల మేని జాగుసేయవచ్చును. ఇప్పుడు 1679-వ సంవత్సరపు పార్లమెంటువారు చేసిన తీర్మానమువలన, అట్టి జాగుసేయ వలనుపడదనియు, పత్రము వచ్చిన వెంటనే సమాధానము ఈయ వలెననియు ఏర్పడెను. కనుక, విచారణ లేక, ఏనిందితుడును చెఱసాలలో నుండ వీలుకాదు. వానిని వెంటనే విచారించి శిక్షించవలసినదే. ఈ శాసనమును కామన్సుసభయు, ప్రభుసభయు గూడ సమ్మతించెను. దాని మీఁద చార్లెసుగూడ సంతకము పెట్టెను. ఈ విధముగానే "పరిహార శాసనము" గూడ నెగ్గునేమో యని భయపడి చార్లెసు, ఆ పార్లమెంటుసభను గూడ రద్దుచేసెను.

యార్కుడ్యూకునెడ విరోధభావము గల వారందరు కూడి పార్లమెంటును సమకూర్చవలసిన దని రాజునకు ఒక విజ్ఞాప

నము పంపిరి. వారికి "విజ్ఞాపకులు" అని చరిత్రలో పేరు వచ్చెను. రాజపక్షావలంబు లందఱు ఇంకొక పార్లమెంటును సమకూర్చు విషయమున అసహ్యభావము చూపుటచేత వారికి "అసహిష్ణులు" అని పేరువచ్చెను. ఈ అసహిష్ణులు, ఆ విజ్ఞాపకులకు "విగ్గులు" అని ఇంకొక పేరిడిరి. "విగ్గు" అను పదము పూర్వము ప్రజాయుద్ధము జరుగునప్పుడు, స్కాట్లాండులోని ప్రెస్బిటేరియనులలో అతివాదులకు నుపయోగించిన పదము. "విగ్గులు" అసహిష్ణులకు, "టోరీలు" అని పేరిచ్చిరి. "టోరీ" అను పదము మొదట ఐర్లాండులో పుట్టినది. ఆ దేశీయులలో కొందఱు దోపిడీ కాండ్రు, యుద్ధవేళల "తార్ అ రీ" (Tar a Ri) అని అఱచెడివారు. దానికి "ఓ రాజా! రమ్ము" అని అర్థము. ఈ విధముగా విగ్గులు, టోరీలు అను పదములు రెండును ఇంగ్లీషు ప్రజలలో ముఖ్యములైన రెండు పక్షములకు వాచకములయ్యెను. రాజుయొక్క తంత్రస్వాతంత్ర్యతను అంగీకరించువారు టోరీలు. రాజు పార్లమెంటునకు విధేయుడై వర్తింపవలెననెడివారు విగ్గులు.

పిమ్మట రెండుసార్లు పార్లమెంటుసభలు జరిగెను. ఆ రెంటను విగ్గులే ప్రబలులుగా నుండిరి. వారు రెండు తడవలను పరిహారశాసనమును నెగ్గించవలెనని యత్నించిరి. కాని, చార్లెసు, ఆ రెండుసభలను సమయమునకు రద్దుజేసెను. 1681-వ సంవత్సరము మార్చినెల తరువాత, చార్లెసు పార్లమెంటు లేకయే స్వతంత్రుడై ఏలసాగెను. అతడు, తన సేనను ఫ్రెంచిరాజు ఇచ్చు ధనమును నమ్ముకొని స్వతంత్రవృత్తి సాగించెను. ఆ దినములలో అతడు అసమ్మతులకు ప్రతికూలములైన చట్టములన్నియు అమలులో పెట్టెను. కాతలిక్కులకు గూడ అతని వలన ఏమియు లాభము చేకూరనే లేదు. పట్టణవాసులు,

తమ్ము తామే పరిపాలించుకొను నాచారము అనర్థహేతు వని యెంచి, చార్లెసు రెండువందల పట్టణములకు ఆ యధికారము లేకుండజేసెను. వానిలో లండనునగర మొకటి. మఱియు, రాజునకు వ్యతిరేకముగా ఎవ్వడును ఏమేని వ్రాయగూడదు, పలుకకూడదు అని శాసించెను; యార్కుడ్యూకునకు ఎక్కువ అధికారము లొసగెను. ఈ విధముగా, చార్లెసు చండశాసనుడై ప్రజలకు భయావహముగునట్లు ఏలుచుండ దాని నిరోధించుటకు ఎవరికిని సాహసము లేకపోయెను. ఆతని నిరంకుశ ప్రభుత్వము నాలుగేండ్లు సాగినది. తుదకు 1685-వ సంవత్సరము ఫిబ్రవరి నెలలో అతడు మరణించెను. చార్లెసు చేసిన యత్నములవలన పార్లమెంటు తిరస్కృతమై, రాజాజ్ఞ ప్రబలమైనది. రెండవ జేమ్సు (James II) రాజ్యమునకు వచ్చునప్పటికి రాజకీయవ్యవహారముల స్థితిగతులు ఆప్రకారముగా నుండెను.

## రెండవ జేమ్సు: మాన్మత్తు విప్లవము

జేమ్సు రాజగునప్పటికి, రాజాధికారము నిరాఘాటముగా చెల్లుచుండెను. అన్నగారిచ్చిన అధికార ప్రాబల్యముతోపాటు అతనికి ధనసంపదయు అమితముగా గలదు. అతడు ప్రజలకును సమ్మతుడు. పార్లమెంటువారుగూడ అతనికి సాలునకు పందొమ్మిది లక్షలపౌనులధనము నిచ్చుటకు తీర్మానించిరి. మాన్మత్తుడ్యూకు లేవదీసిన విప్లవమును సమర్థతతో అణచుటచేత, జేమ్సు మఱియు శక్తిమంతు డయ్యెను.

మాన్మత్తు అను నాతడు రెండవ చార్లెసునకు కొడుకే గాని, సహధర్మచారిణియందు పుట్టినవాడు కాడు. అతడు తన

తండ్రిరాజ్యము తనకు రావలెనని భ్రమించి నిల్చెను. 1685-వ సంవత్సరము జూనునెలలో అతడు "డార్సెట్టు" (Dorset) నొద్ద ఓడదిగి టాంటను (Tanton) పట్టణమునకు బోయి, అచ్చట తన రాజభావమును ప్రకటించెను. వెంటనే, జేమ్సు పంపిన సేనలు అతని సేనలను మార్కొని సులభముగా తుదముట్టించెను. అదియే సెడ్జిమూరు యుద్ధము. (Battle of Sedgemoor, July 1685). మాన్మత్తు పక్షమున ఏడువేలమంది సైనికులు గలరు. కాని వారు జేమ్సుసేనల ముందు నిల్వలేకపోయిరి. పిమ్మట మాన్మత్తునుగూడ పట్టుకొని రాజద్రోహమునకై తలగొట్టించిరి.

ఆ తిరుగుబాటులో కొన్ని జిల్లాలవారు మాన్మత్తుపక్షము చేరిరి గాన, ఆ జనులందఱిని విచారించి శిక్షించుటకు జేమ్సు, ప్రధానన్యాయమూర్తియైన "జెఫ్రీసు" (Jeffreys) అను నాతని నియోగించెను. వించెస్టరు, డార్చెస్టరు మొదలగు జిల్లాలలో అతడు కోర్టుతీర్చి, విచారించి రాజద్రోహుల నందఱిని పరి క్రూర శిక్షలు విధించెను. మూడువందల యిర్వది నల్వురకు మరణశిక్ష విధించెను. ఎనిమిది వందల నలుబది మందికి ద్వీపాంతరవాస శిక్ష విధించెను. ఆ మందభాగ్యులు, వెస్టు ఇండీసు లంకలలో బానిసలుగా విక్రయింపబడిరి. వారిని అమ్ముటవలన వచ్చినసొమ్మును రాజోద్యోగులు కానుకలుగా గ్రహించి యనుభవించిరి. నార్మనుబాడికి పిమ్మట, అంతమందిని ఒక్కుమ్మడి తలలు గొట్టించిన యధికారి, తాను దక్క, ఇంకొకడు లేడని జెఫ్రీసు గొప్పచెప్పుకొనె నట.

## రెండవ జేమ్సు: కాతలిక్కులు

జేమ్సునకు అమితమైన ధనముగలదు. ప్రబలమైన సైన్యము గలదు. అతని సేనలో ఇరువదివేలమంది భటులు గలరు.

ఇక కావలసినది కాతలిక్కుల రక్షణ. వారికి రాజ్యాన్యవహారముల కొంత ప్రాధాన్య మీయవలె నని యతడు సంకల్పించెను. క్లారెండనుస్మృతివలన కాతలిక్కులు బాధపడకుండ చేయుట ప్రధానకర్తవ్యము. ఏ శాసనమునేని కొన్నినాళ్లు అమలులో నుంచక నిల్పివేయుటకు రాజునకు అధికారము గలదనియు, కొన్ని కేసులలో శాసనార్థము సమన్వితము కాదని ప్రకటించునధికారము న్యాయమూర్తులకు గలదనియు జేమ్సు వాదింపదొడగెను. అనగా, ఎవ్వడేని ఒక కాతలిక్కుమతస్థుడు, శాసనము మీఱి వర్తించినచో, అతనిమీద నేరము మోపబడినప్పుడు, న్యాయమూర్తులు, ఆ శాసనార్థమును తాత్కాలికముగా ఉపేక్షించ వచ్చుననుట. పూర్వరాజులకును వారి న్యాయమూర్తులకును గూడ ఇట్టియధికారము లుండెను. జేమ్సుకూడ వారివలెనే ఆ యధికారముల నుపయోగించుకొనవచ్చును. కాని యతడు అంతతో తృప్తిపడక, తనకు ఆ యధికారము కలదని పార్లమెంటువారిచే అనిపించ నెంచెను.

1687-వ సంవత్సరము ఏప్రిలు నెలలో జేమ్సు "ప్రథమ వాంఛాప్రకటన" గావించెను. అసమ్మతులను, కాతలిక్కులను బాధించు శాసనములన్నియు తాత్కాలికముగా నిల్పివేయబడినవని ఆ ప్రకటనభావము. దానివలన అతనికీర్తి హెచ్చెను. పిదపడి అతడు కాతలిక్కులకు కొన్ని యుద్యోగములు కూడ నిచ్చెను. వారిలో కొందఱు సైనికోద్యోగులు కూడనైరి. ఆ మఱుసటి సంవత్సరము అతడు అట్టిదే రెండవప్రకటన గావించెను. ఆ ప్రకటనలవలన అసమ్మతులకు గూడ కొంత మేలు కల్గెను. అది ఆనుషంగికమే కాని ప్రధానము కాదు. ఏమనగా, జేమ్సు నుద్దేశము కాతలిక్కులకు మేలుచేయుటయే. ఆ రెండు

ప్రకటనలవలనను జేమ్సు ఇంగ్లండును క్రమముగా కాతలికు-దేశము చేయనున్నాడని రుజువయ్యెను. ప్రభుత్వమునగల అధికారిపదవు లన్నియు నతడు కాతలిక్కు-లకే యీయదలచి నట్లు సూచనలు కనుబడెను. కాతలిక్కు-లకు మాత్రము అంతగా అధికారవాంఛలేదు. మతమునెపముగా తమ్ము బాధింప కుండుటయే వారికి చాలును. ఇంతలో రాజునకు పుత్రోదయ మయ్యెను. తండ్రినీతినే కుమారుడును అనుసరింపవచ్చును. కనుక దానిని ప్రజలు ఆ నాడే ప్రతిఘటించవలెను.

రాజుచేసిన ఆ ప్రకటనలను బిషప్పు లెల్లరు తమ తమ చర్చిలో చదువవలెను. అది సర్వజనామోదమునకు సూచన. రెండవ ప్రకటనను చదువ వలసివచ్చినప్పుడు ఏడుగురు బిష ప్పులు చదువ నిరాకరించిరి. ఆ యేడ్వురను నిగ్రహించి రాజ ద్రోహులని నేరముమోపిరి. శాసనములను త్రోసివేయుటకు గాని, నిల్పియుంచుటకుగాని, రాజునకు అధికారము లేదని విచారణసమయమున ఆ బిషప్పులు కోర్టులో ప్రతివాదము చేసిరి. వారి వాదన నంగీకరించి "జ్యూరీ" నిర్దోషు లని తీర్పు చెప్పెను. ఆ తీర్పు బహుప్రజలకు మహోత్సవప్రద మయ్యెను. దానితో, బహుసంఖ్యాకు లైన ప్రజలకు జేమ్సు నేతలు నచ్చుట లేదనుట స్పష్టము. కాతలిక్కు-లు గొప్ప యుద్యోగులుగా నుండుట కూడ ప్రజలకు భయముగొల్పు చుండెను.

ఒక ఇంగ్లీషుసైనికోద్యోగి, ప్రచ్ఛన్నవేషుడై హాలెండు దేశమునకు బోయి, విలియము ఆఫ్ ఆరెంజిని (William of Orange) దర్శించి, పార్లమెంటువారు పంపిన సందేశమును విన్న వించెను. "ఇంగ్లండుసింహాసనము నీ యధీనమొనర్తుము. వచ్చి

దానిని అధిరోహింపుము" అనుటయే పార్లమెంటువారి సందేశము. విలియము, రెండవ జేమ్సునకు అల్లుడే కనుక భార్యాముఖమున అతనికి ఇంగ్లీషు రాజ్యాధికారము గల్గుట కొంతవఱకు న్యాయమే.

అతడును ఆ వార్త విని సంతోషించి తన యంగీకారమును పార్లమెంటువారికి తెలియపఱచెను. విలియము ఈ ఏర్పాటు నంగీకరించుటకు ఇంకొక హేతువున్నది. ఫ్రెంచి రాజగు పదునాలవలూయీ హాలెండునకు ప్రబలవిరోధి. విలియము ఇంగ్లండునకు గూడ రాజగుచో, లూయీ తన దెస రాజాలడని యతని యాస.

**1688**-వ సంవత్సరము నవంబరునెల 5-న తేదీని విలియము టోర్బే యొద్ద వచ్చి దిగెను (Torbay in Devonshire). జేమ్సు సేనలతో సాలిసుబరీ వైపునకు ఎత్తి నడచెను గాని అతని సేనలు తిరిగిపోవుటచేత అతడు అగతికుడై శత్రువులచే జిక్కెను. వారును అతనిని ఫ్రాన్సుదేశమునకు పోనిచ్చిరి.

**1689**-వ సంవత్సరము జనవరినెల **22**-వ తేదీని పార్లమెంటు సభ సమావేశమయ్యెను. ఆ సందర్భమున ప్రభుసభవారు ఇట్లు ప్రకటించిరి. "రెండవజేమ్సు, ప్రజలకును రాజునకును గల ధర్మసంబంధమును ఉల్లంఘించుటచేతను, దుర్మార్గుల దుర్బోధలచేతను, రాజ్యపాలనాదికమున గల ధర్మసూత్రములనెల్ల తారుమారుచేయుటచేతను, తన ప్రభుత్వమును గోల్పోయెను. సింహాసనమిప్పుడు అనధిష్ఠితమై యున్నది."

పిమ్మట ఫిబ్రవరినెల **13**-వ తేదీని, విలియము రాజై సింహాసన మెక్కెను. అతని భార్య మేరీ రాణి యయ్యెను.



# ఇరువది మూడవ ప్రకరణము

## ప్రజావిప్లవ పరిష్కారము

## మేరీ విలియములు: ఆనీ

మేరీవిలియము లిరువురును ఉమ్మడిగా రాజ్య మేలదొడ గిరి. 1694-వ సంవత్సరములో మేరీ గతించెను. పిమ్మట 1702-వ సంవత్సరము వఱకు విలియము ఒక్కడే ఏలెను. అతని యేలుబడియొక్క మొదటినాళ్లలో పార్లమెంటే ఎక్కువ అధికారప్రాబల్యము కలదియై యుండెను. దానికి కారణ మేమనగా, విలియము పరదేశీయుడు. అతనికంటె, మేరీకే ఎక్కువ రాజ్యాధికారము గలదు. మఱియు, పార్లమెంటు వారు అతనిని పిల్చి రాజును జేసిరి. కనుక విధిగా పార్లమెంటు సభకు రాజుమీద ప్రభావము ఉండితీరును. కనుకనే 1688-వ సంవత్సరమున లేచిన ప్రజావిప్లవము పరిష్కారముచేయు సందర్భమున, పార్లమెంటువారు తమ కిష్టమైన శాసనములు చేయ గల్గిరి. రాజాధికారము పరిమితమే కాని, నిరంకుశము కాదని చూపుటకు ఆ శాసనము లన్నియు నిదర్శనములు; వానిలో ముఖ్యమైనది "హక్కులచట్టము" (Bill of Rights).

### హక్కుల చట్టము (1689-వ సం॥)

ఆ చట్టముప్రకారము కాతలిక్కుమతస్థు డెవ్వడును ఎప్పుడును ఇంగ్లండునకు రాజు కాగూడదు; కాతలిక్కుమతస్థుని పెండ్లియాడిన యే స్త్రీగాని, ఆ మతస్థురాలిని పెండ్లియాడిన యే పురుషుడుగాని రాజ్యార్హుడు గాడు; మేరీ విలియము లిర్వురును సంతానము లేక చనిపోవుదు రేని, రాజ్యము, రెండవజేమ్సు

కుమార్తె యగు ఆనుకి చెందవలెను. ఇవి రాజ్యాధిష్ఠానము గురించిన నియమములు. మఱియు పార్లమెంటునకును రాజునకును ఉండ వలసిన సంబంధమును గురించికూడ ఆ చట్టమున కొన్ని నియమములు ఉన్నవి. ఆ నియమములు అన్నియు రాజును పార్లమెంటునకు విధేయుని జేయుట కేర్పడినవే. పార్లమెంటువారియొక్క సమ్మతి పొందక రాజు ప్రజలపై క్రొత్తపన్నులు విధింపరాదు. అతని సైనికవర్గసంఖ్యయు పార్లమెంటు అనుమతించిన దానికంటె నెక్కువ ఉండకూడదు; సైనికులను అదుపులో నుంచుటకు రాజు "సైనికశాసనమును" (Martial Law) ప్రయోగింపవలెను. అదియు పార్లమెంటువారి సమ్మతి పొందియే ప్రయోగింపవలెను; ఆ సమ్మతికూడ ఏటేట ఎప్పటికప్పుడు పొందుచుండవలెను. అమితమైన ధనమును సేనయు ఉన్నచో రాజు నిరంకుశుడై వర్తించు నని యీ నియమములు చేసిరి.

అదియునుగాక, శాసననిర్మాణవిషయమునకూడ పార్లమెంటే పైచేయిగా నుండవలె నని, చట్టముల నిల్పియుంచుట, రద్దుచేయుట అను రాజాధికారములను తీసివైచిరి. "కోర్టు ఆఫ్ హై కమిషను" (Court of High Commission) అను న్యాయస్థానము గూడ తీసివైచిరి. కాని, జడ్జీలను నియమించు నధికారము ఇంకను రాజునకే కలదు. అందు రాజు స్వతంత్రుడే. అందు పార్లమెంటువారి జోక్యము లేదు. దానికి తోడు రాజమంత్రులను పార్లమెంటునకు విధేయులను జేసికొను దారియు పొడకట్టలేదు. పార్లమెంటువారికి ఆ మంత్రుల ఉద్యోగ వ్యవహారముల మీద అధికారము లేనంత వఱకు, ఎన్ని నియమములు ఏర్పఱిచినను, రాజు తనయిష్టము వచ్చినట్లే నడుచుకొనవచ్చును. రాచకార్యము లన్నియు చక్క-

బెట్టు మంత్రివర్గము అతని వశమున నుండగా, రాజు ఏ నియమము నైనను తిరస్కరింపగలడు.

## ఆనాటివే మఱికొన్ని చట్టములు

"మతసహనశాసనము" (Toleration Act) 1689-వ సంవత్సరములో పుట్టెను. "అసమ్మతులు," తమ మతధర్మము ప్రకారము, సభలు చేసికొనవచ్చు ననియు, ఆ సభలు బహిరంగముగ నుండదగునే కాని, రహస్యముగ జరుగగూడదనియు, ఇంగ్లీషుచర్చికి రానందులకు, వారు, శిక్ష లనుభవింప నక్కర లేదనియు, రాజునకు విధేయులై యుండి, స్వామిభక్తి శపథము చేసి, అతడు ఇంగ్లీషుచర్చికి యజమాని యని అంగీకరించుచో, వారి కేవిధమైన శిక్షలును ఉండవనియు ఆ శాసనమున వ్రాసిరి. కాని యీ సావకాశములు, కాతలిక్కులకు కలుగజేయరైరి. అవుగాక, అంతమాత్ర మేని చాలును.

రాజభక్తికిని మతవిశ్వాసమునకును సంబంధములేదని, ప్రభుత్వమువారు అప్పటికేని గ్రహించిరి. అది శుభసూచకము. రాజకీయవ్యవహారములు వేరు, మతధర్మములు వేరు. ఆ రెంటికిని పొత్తు కలుపుటచేతనే ఆ దినములలో నిరపరాధులైన సాధుజనులెందఱో ఘోరశిక్ష లనుభవించిరి. "మతసహనశాసనము" వలన ఆ పొత్తు విడిపోవమొదలిడెను.

## త్రైవార్షిక శాసనము

ఇది 1694-వ సంవత్సరములో చేయబడినది. ఏ పార్లమెంటుగాని మూడేండ్లకు మించి యుండరాదనియు, ఒక పార్లమెంటు రద్దయినపిమ్మట రెండవదాని యెన్నికలు జరుగుటకు

మూడేండ్లకు మించిన వ్యవధి యుండకూడదనియు ఆ శాసన నియమములు.

పార్లమెంటు లేనిదే రాజ్యతంత్రము నడువదు. ఆ కారణమున రాజులుగూడ మాటిమాటికి పార్లమెంటు వ్యవహారములలో జోక్యము కలిగించుకొనక మానరైరి. ఊరక జోక్యము కలిగించుకొనుటయే కాదు. తమపరముగా ఓట్లు ఇచ్చుటకు రాజులు కామన్సుసభలోని సభ్యులకు లంచములు కూడ ఇచ్చెడివారు. రాజులే కాక మంత్రులుగూడ లంచము లిచ్చెడివారు. ఆ దురాచారము పదునెనిమిదవ శతాబ్దిని సర్వసాధారణమై పోయెను. ప్రభుసభలో లంచములిచ్చి ఓట్లుసంపాదించుట కష్టవిషయము కనుక రాజులు, తమ యిష్టులైనవారిని ఎక్కువ మందిని సభ్యులుగా జేర్చి తమపక్షము నెగ్గునట్లు జేసెడివారు.

1693-వ సంవత్సరములో ముద్రాలయనిర్బంధము తొలగింపబడెను. దానివలన అసమ్మతులు మొదలగువారు, తమ యిచ్చవచ్చిన వ్రాతలు వ్రాసి ప్రచురించవచ్చును. కాని యితరులపై నిందావాక్యములు గల వ్రాతలు వ్రాయుదురేని ఎట్టివారేని శిక్షార్హు లగుదురు. దీనివలన ఎల్లరకును రచనా స్వాతంత్రత లభించినదిగాని, ప్రభుత్వలోపములను విమర్శించు అవకాశము మాత్రము కల్గలేదు.

## స్కాట్లాండు: ఐర్లాండు

ప్రజావిప్లవమువలన ఇంగ్లండులో రక్తపాతము కల్గలేదు గాని స్కాట్లాండులోను, ఐర్లాండులోను అది తప్పదయ్యెను. తన యధికారమును నిల్పుకొనుటకు రాజు ఆ దేశములలో

యుద్ధములు చేయవలసివచ్చెను. 1689-వ సంవత్సరములో స్కాటులాండులోని మిట్టభూములవారు, జేమ్సుపక్షమవలంబించి పల్లపుభూముల వారిపై దాడినడచిరి. "జాను గ్రహాము" (John Graham) అను నతడు ఆ దాడికి నాయకుడు. "కిల్లిక్రాంకీ" యుద్ధములో అతడు వధింపబడెను. (Battle of Killei Crankie: July 1689). పల్లపుభూములవారు శాంతముగా నుండిరిగాని మిట్టభూములవారు మాత్రము పూర్వమువలెనే వర్తించుచుండిరి.

"పునఃప్రతిష్ఠ" యైనప్పటినుండియు, ఇంగ్లీషు ప్రభుత్వము వారు ఐర్లాండుదేశమును మిక్కిలిగా పీడించిరి. ఇంగ్లండునకుగాని, ఇంగ్లీషువారి వలసభూములకుగాని, ఐర్లాండునుండి పశువులు ఎగుమతి కాగూడదని పార్లమెంటువారు ఒక నిషేధశాసనము చేసిరి. ఐర్లాండులో పశువులపెంచి అమ్ముకొను ఆచారము గల వారికి ఆ శాసనము అనర్థహేతువయ్యెను. ఆ పశువ్యాపారము చేయువారుగూడ ప్రొటస్టెంటులే. ఇక కాతలిక్కులు పడుచుండిన యిబ్బందులకు అంతేలేదు. అవి మొదటనుండియు అట్లేయుండెను. ఆ స్థితిలో 1688-వ సం॥లో ఐరిషు కాతలిక్కులు జేమ్సుపక్షముచేరి ప్రొటస్టెంటుల పట్టణమైన "లండనుడెర్రీ"ని ముట్టడించిరి (Londonderry). కోటలోని మూక తిండి నీరు లేక మాడిపోవుటకు సిద్ధమయ్యెను. అప్పటికి విలియము రాజుయొక్క సేనలువచ్చి శత్రువుల తరిమి తత్పట్టణవాసుల రక్షించెను. కాతలిక్కులు అంతతో పోరుమానలేదు; 1690-వ సంవత్సరములో వారు మరలపోరాట సాగించిరి. అదియు జేమ్సుకొఱకే. "బోయినీ" అను ప్రదేశమున, జేమ్సుపక్షమునకును, విలియముపక్షమునకును పెద్ద యుద్ధమయ్యెను. అందు

జేమ్సు నిశ్శేషముగా ఓడిపోయెను. అంతట ఐర్లాండులో కూడ విలియముపని భద్రమయ్యెను.

అయినను ఐరిషుప్రజలకు కలిగిన మేలు లేశమును లేదు. ఆ దేశమున కాతలిక్కులును ప్రొటెస్టెంటులును గూడ సంకటల పడుచునేయుండిరి.

న్లారెండసుస్మృతి, ఇంగ్లండులో స్థాపితమైనను ఐర్లాండులో చెల్లుచునే యుండెను. ఆ స్మృతిప్రకారము ఐరిషుకాతలిక్కులు పెక్కు శిక్షలకు లోనగుచుండిరి. అదియునుగాక, ఐరిషు ప్రొటెస్టెంటులలో, మంచి బట్టలనేతపనివాండ్రు గలరు. ఇంగ్లండు దేశపు పడమటిరాష్ట్రములలో గూడ నేతపని జరుగుచుండును. కాని ఐరిషువారి బట్టలు మంచినాణ్యముగలిగి యుండును. వారి సరకుముందు ఇంగ్లీషుసరకు నిల్వజాలదు. తమ దేశీయులకు నష్టము వచ్చునని భయపడి పార్లమెంటువారు, ఐరిషుబట్టలసరకు ఇతరదేశములకు ఎగుమతికాగూడదని నిషేధశాసనమొకటి పుట్టించిరి. ఆ శాసనము ఐరిషునేతపనికి గొడ్డలిపెట్టువంటిది. మఱియు, ఇంగ్లండులో ఆచరణయోగ్యమైన "మతసహనశాసనము" ఐర్లండులో లేదు. అది ఇంగ్లండునకేకాని, ఐర్లండునకు వర్తింపదనిరి. ఆ బాధ పడలేక ఇరువదివేలమంది ఐరిషుప్రజలు ఇండ్లు వాకిండ్లు విడిచి, ఆలుబిడ్డలతో అమెరికాకు పోయి తల దాచుకొనిరి.

## జాతీయఋణము (1692-వ సం॥)

ఎక్కువ పన్నులు వైచి ధనము గణించుట మంచినీతి కాదని విలియము తొల్తనే గ్రహించెను. కాని ఎక్కువధనము కావలయునన్న ఎట్లు? దానికై యతఁడు "జాతీయఋణము"

అను ఒక పద్ధతి యూహించెను. ధనము గల ప్రజలు తనకు అప్పులీయదగు ననియు ఆ యప్పు కొన్ని సంవత్సరములకు వడ్డీతో తీర్చబడు ననియు అతడు తెలిపెను. ప్రజలిచ్చు ఈ అప్పునకే జాతీయఋణ మని పేరు. దీనివలన ప్రభుత్వమువారికి ధనము లభించినది సరియే. కాని ఋణముపుచ్చుకొన్నవాడు విలియముగనుక, ఋణదాతలు అతని రాజభావమును వేయి కన్నుల కాపాడవలసివచ్చును. అతనికి పదభ్రంశమగుచో, వారికి ధననాశమగును. కనుక ప్రజలు తిరుగుబాటుచేసి రాజును తొలగించుట, తమ ముప్పుతాము తెచ్చుకొనుటయే. అట్లగుట రాజుస్థితి స్థిరమైనది. మరల ఇంకొక విఘ్నము రాదని యెల్లరును నమ్మిరి.

## ఇంగ్లండు బ్యాంకు (The Bank of England)

ఈ బ్యాంకు 1694-వ సంవత్సరములో స్థాపింపబడెను. "ఆమ్‌స్టెరుడము"న డచ్చివారికి ఒక బ్యాంకు గలదు (The Dutch National Bank at Amsterdam). దానిని చూచియే ఇంగ్లీషువారును ఆ బ్యాంకును నెలకొల్పిరి. అది ప్రభుత్వపు బ్యాంకు అనియే చెప్పవచ్చును. దానికి కొన్ని ప్రత్యేకపు స్వత్వము లొసగి, ప్రభుత్వమువారు దానినుండియే అప్పు గైకొనెడివారు. అది ప్రభుత్వపుబ్యాంకు అన్న పేరేకాని దాని వ్యవహారమున ప్రభుత్వమువారికి సంపూర్ణాధికారము లేదు. ఆ బ్యాంకు ఇప్పటికిని నిల్చియున్నది. దానిగౌరవము నానాటికి వృద్ధిపొందెను. వడ్డీవ్యాపారముచేయు ధనికులకును, బ్యాంకులకును గూడ ఆ బ్యాంకు నేడు ఋణము లిచ్చుచుండును.

## ఫ్రాన్సుతోడి యుద్ధము (1689—1697-వ సం॥)

ఫ్రెంచిరాజగు, పదునాలవలూయీకి రెండు దురాశ లుండెను. ఒకటి హాలెండును ఫ్లాండర్సును ఆక్రమించుకొని ఫ్రెంచిభూముల విస్తరింపవలయుట; రెండవది, ఇంగ్లాండును కాథలిక్కుదేశము జేయనెంచుట. విలియమునకు హాలెండుతోగూడ సంబంధముగలదు గనుక లూయీయొక్క యీ రెండుకోర్కెలును, అతనికి అనిష్టదాయకములే. కనుక విలియము లూయీని అణగద్రొక్కవలెను. అతడు అదియే తనకు పరమ ప్రయోజనముగా భావించెను. కాని ఫ్రెంచిరాజు మిగుల ప్రబలుడు. అతని మార్కొనుటకు ధనము చాలకావలెను. జాతీయఋణమువలనను బ్యాంకువలనను విలియమునకు ఆ ధనము లభించినది. ఇంగ్లీషుసైన్యములను సాయము పంపి హాలెండును లూయీబారినుండి రక్షించుటయు, ప్రొటెస్టెంటు మతప్రతిష్ఠ నాశము గాకుండ కాపాడుటయు విలియమునకు పరమధర్మములు. ఆస్ట్రియాచక్రవర్తి, విలియమునకు బాసటగా వచ్చెను. విలియము రాజ్యమునకు వచ్చిన మొదటియేడే, యుద్ధము మొగిసెను. భూమిమీద జరిగిన రెండుపోరాటల లోను ఫ్రెంచిరాజే గెలిచెను. (Battle of Steinkirk and Battle of Landen.) ఓడిపోయినను, ఇంగ్లీషువారి సేనలు మాత్రము నాశముగాలేదు. సేనలు నాశముగాకుండ నిల్చియున్నంతవఱకు లూయీ, హాలెండును జయింపజాలడు. ఓటమి వచ్చినను సేనల గోల్పోలేదు గనుకనే కాబోలు, విలియమును గూర్చి పూర్వు లిట్లు చెప్పిరి. "అత డొకయుద్ధమును గెల్వలేదు. ఒక దళమును గోల్పోలేదు" అని.

సముద్రయుద్ధములలో ఇంగ్లీషువారికి కొంత జయము కొంత అపజయము గలిగెను. 1690-వ సంవత్సరములో బీచి హెడ్డు (Beachy Head) అనుచోట ఇంగ్లీషు నౌకాదళమును డచ్చి నౌకాదళమును పరాజయమే పొందెను. కాని మఱి రెండేండ్లకు "లాహేగ్" (La Hague) అను చోట ఫ్రెంచివారే ఓడి పోయిరి. మొదటి యుద్ధములో లూయీకి ఎంత లాభము కలిగెనో, రెండవ యుద్ధములో అంతనష్టము కలిగెను. మొత్తము మీద చూచినచో, ఇంగ్లీషువారికే ఎక్కువ నష్టముకలిగెను. లూయీ సేనలు చాలగొప్పవి. అతని నౌకాదళములును చాల గొప్పవి. ఆ రెంటిని పోషించుట అతిదుర్ఘటమైనకార్యముగా తోచి, అతడు సముద్రసేనలను ఉపేక్షించెను. అందుచేతనే ఇంగ్లీషువారి సముద్రసేనలపని సుకరమైనది. అదియునుగాక నానాటికి అది మిగుల వృద్ధిలోనికి వచ్చెను. లూయీ తన నౌకాదళమును ఉపేక్షించి చెడగొట్టుకొనగా, విలియము తన దానిని వృద్ధిచేసికొనెను.

తుదకు 1697-వ సంవత్సరములో "రిస్విక్కు"నొద్ద సంధి చేసికొనిరి (Peace of Ryswick). దానితో, అప్పటికి ఆ యుద్ధములణగినవి. ఆస్ట్రియావలన గెల్చుకొన్న "స్ట్రాసుబర్గు" (Strassburg) తప్ప, తాను జయించిన తక్కిన ప్రదేశము లన్నియు ఎవరివి వారికి తిరిగి యిచ్చివేయుటకు లూయీ అంగీకరించెను. అతని పొత్తులు వీరును అట్లే ఇచ్చివేయుట కియ్యకొనిరి. ఈ షరతులతో సంధి యయ్యెను. అప్పటికి, హాలెండు యొక్కయు, స్పెయినుయొక్కయు ముప్పుతప్పినది. కాని ఆ సంధి నిత్యముగాదని ఆ నాడే సూచనలుగానవచ్చెను. "ఆంటు వర్పు" (Antwerp) అయినను జయించితీరవలె నని లూయీ

గట్టిగా సంకల్పించెను. ఆ ప్రదేశము వయుంచినచో, బెల్జియము సముద్రతీరమున ఫ్రెంచివారి ప్రభావము అప్రతిహతముగా చెల్లితీరును. ఆ స్థానబలముచేత వారు, నాటినాటికి ఇంగ్లండును బెదరించుచుందురు. కనుక "ఆంట్వెర్పు" ఫ్రెంచివారి యధీనము కాకుండ జూచుట ఇంగ్లీషువారికి పని కాగా, మరొక ఒకవంకను, భయమొకవంకను పీడింపగా, ఇరుజాతులవారు మరల యుద్ధమునకు తారసిల్లెను. "రిస్విక్కు" సంధి జరిగిన నాలుగేండ్లకు మరల క్రొత్త యుద్ధములు మొదలయ్యెను.

## నిర్ణయశాసనము

విలియము సంతానరహితుండు. అతనికి సంతానము కల్గుట వట్టిదనియు. అతని యనంతరము "ఆన్" రాజ్యమునకు వచ్చుననియు తేలినది. అటుపిమ్మట రాజ్యాధిపతులను గురించి మరల తగాయిదాలు పొడమకుండుటకై 1701-వ సంవత్సరములో ఒక కట్టుబాటుచేసిరి. అదియే "నిర్ణయశాసనము."

ఆనీ కూడ సంతానరహితయై చనిపోవునెడల ఇంగ్లీషు రాజ్యము సోఫియా (Sophia) వారసునకు దక్కవలెనని ఆ శాసననియమము. సోఫియా యనునామె మొదటి జేమ్సు మనుమరాలు. ఆమెకు "ఎలెక్ట్రెసుఆఫ్ హానోవరు" (Electress of Hanover) అను బిరుదుగలదు. "ఆర్వురితో కలిసి, రోమను చక్రవర్తిని ఎన్నుకొను హక్కు గలది" యనుట ఆ బిరుదునకు అర్థము. ఆస్ట్రియా రాజవంశీయులలో నొకనిని ఆ చక్రవర్తిపదవికి ఎన్నుకొనుట ఆచారము. సోఫియావారసు ఇంగ్లీషుసింహాసనమెక్కుటయనగా, రాజ్యమును పరదేశీయు డేలుటయే యని యర్థము. ఆ రాజు, ఇంగ్లీషుసైన్యములను, తన జన్మస్థాన లాభ

మునకై ఉపయోగించుకొనవచ్చును. అట్టి నష్టము కలుగకుం డుటకై నిర్ణయశాసనమున ఇంకొక నియమమేర్పఱచిరి. విలియము ఫ్రాన్సుతో చేసిన యుద్ధములు ప్రజాసమ్మతములు గావని ఆ నియమమువలన గ్రహింపనయ్యెను.

ఆ శాసనములోని రెండవనియమ మేమనగా పార్లమెం టులోని రెండు కక్షులును, అనగా, కామన్సుసభయు, ప్రభుసభయు గూడ కోరిననే తప్ప, రాజు ధర్మాధికారులను పదభ్రష్టుల జేయరాదనుట. ఒక రాజమంత్రిపై నిందారోపణ చేసి విచారించు నప్పుడు అతడు రాజానుగ్రహావ్యాజమున రక్షితుడు కాగూడదనుట ఆ శాసనములోని యింకొక నియమము.

రాజమంత్రులు, పార్లమెంటునకు విధేయులై యుండుటకును న్యాయస్థానములలో రాజు తన ప్రభావముచూపి ధర్మభంగము గావింపకుండుటకును ఈ రెండు నియమములును ఏర్పడినవి. స్టూవర్టు వంశపురాజులు, కోర్టు వ్యవహారములలో గూడ జోక్యము కలిగించుకొని, ధర్మనిర్ణయపద్ధతికి కళంకము తెచ్చిరి. భావిరాజులు గూడ అట్టివారు కాకుండుటకై ఆ నియమ మేర్పడెను.

## విలియముమరణము

**1702**-వ సంవత్సరము మార్చినెల ౮-వ తేదిని విలియము మరణించెను. అతడు నిరంతరము రాజకార్యవ్యగ్రుడై యుండెను కాని ప్రమత్తుడైయుండెడివాడు కాడు. వేట అతని ప్రధాన వినోదము. అతడు మితభాషి. మితభాషియే కాదు మహానవ్రతుడు. అతని నీతి అతిగంభీరము. అతడు శక్తిసంపన్నుడు, ధైర్యశాలి. ఏ కార్యము నందును ధైర్యసాహసములు ప్రకటించెడివాడు.

ప్రజలకు పరతంత్రతపోయి స్వాతంత్ర్యత కల్గుటకు పతిని నాంది బడిప్రారంభదశ.

ఆని (Anne 1702—1714)

డెన్మార్కు రాజపుత్రుడు జార్జి యాన్నాడు, ఆనీయొక్క పెనిమిటి. రెండవచార్లెను, ఒకసందర్భమున ఆ జార్జిని గురించి యిట్లు చెప్పెను. "తెగత్రాగి మతితప్పియున్నప్పుడును, త్రాగక మతిమతిలో నున్నప్పుడును గూడ నేను జార్జిస్వభావమును పరీక్షించితిని. రెండింటను అతని స్థితి నిర్విశేషమే."

చర్చిలు దొరసాని (Lady Churchill) అను నామె ఆనీకి ప్రాణతుల్యమైన మిత్రము; ఆ కారణమున ఆమె భర్తయైన జాను చర్చిలు (John Churchill) గొప్ప పదస్థుడయ్యెను. అతడు కడు సమర్థుడు కూడ. ఆ శతాబ్దిని, అటువంటి సేనానాయకు డింకొకడు లేడు. భార్య రాణికి సర్వసఖియగుటయు, భర్త ఉన్నతపదస్థుడగుటయు కారణములుగా ఆ దంపతులు రాజాస్థానమున అఖండమైన ప్రభావమునెఱపిరి. ఆనీ ఆ యిర్వురి మాటను జవదాటి యెఱుగదు. ఉన్నట్లుండగా, 1706–వ సంవత్సరములో ఆనీకిని చర్చిలుదొరసానికిని విరోధము కలిగెను. దానితో జానుచర్చిలు ప్రభావము గూడ కొంతతగ్గెను. ఈ జానుచర్చిలే "మార్లుబరో డ్యూకు" (Duke of Marlborough). చర్చిలు దొరసాని మిత్రస్థానమునుండి తొలగిన పిదప మాషమ్ దొరసాని (Mrs. Masham) రాణికి మిత్రమయ్యెను.

## స్పెయినురాజ్యార్హతను గూర్చి యుద్ధము
## (The War of the Spanish Succession)

స్పెయిను రాజైన రెండవచార్లెను, 1700 సంవత్సరములో చనిపోయెను. అతనికి సంతానములేదు, అప్పటికి స్పానిషు

రాజ్యము అతివిస్తృతమై యుండెను. స్పెయిను, హాలెండుడెన్మార్కులలో కొంతభాగము, మిలాను, నేపిల్సు, సిసిలీ, దక్షిణపు అమెరికాలో చాలభాగము, ఇవన్నియు అతని రాజ్యములోనివే. అనపత్యుడగుటచేత, చార్లెసు, ఒక మరణశాసనము వ్రాసి, రాజ్యమంతయు ఫిలిప్పు ఆఫ్ ఆంజో (Philip of Anjou) అనువాని పరముచేసెను. ఆ ఫిలిప్పు, ఫ్రెంచిచక్రవర్తియైన పదునాలవ లూయీకి మనుమడు. కనుక చార్లెసు, ఫిలిప్పుపరమున వ్రాసిన మరణశాసనమువలన, స్పానిషుసామ్రాజ్య మంతయు ఫ్రెంచి వారి ప్రభావమునకు లోనయిపోవును. అట్లే యగుచో యూరపుఖండ మంతయు ఎద్దడిపాలగును. అందును ముఖ్యముగా, ఇంగ్లీషువారికి తీరని బెడద వాటిల్లును. హాలెండు డెన్మార్కులలోని స్పానిషుభూభాగములు ఫ్రెంచివారి వశమై, వారేలుకొనుట, ఇంగ్లీషువారికి పక్కలోని బల్లెము వంటిది. మూడవవిలియము, తాను చనిపోవకమున్ను ఇంగ్లండు, హాలెండు, ఆస్ట్రియా, దేశముల నడుమ ఒక యొడంబడిక కల్పించి ఆ మూడురాజ్యములును "మహామైత్రి" నెఱపుకొనునట్లు ఏర్పాటుచేసెను. నానాటికి వృద్ధిపొందుచున్న ఫ్రెంచి ప్రాభవమును అరికట్టుటయే ఆ మిత్రవర్గమువారి యుద్దేశము. ఆ యొడంబడికలోని నీతియు అదియే. ఆస్ట్రియాచక్రవర్తికి రెండవ కుమారుడైన చార్లెసు స్పెయినుదేశమునకు రాజగునట్లును ఆ స్పానిషుసామ్రాజ్యమును, సర్వసమముగా, పంచుకొనునట్లును నాడే ఏర్పాటయ్యెను.

**1701**-వ సంవత్సరములో ఆస్ట్రియాచక్రవర్తిసేనలు తరలిపోయి ఇటలీదేశము ప్రవేశించెను. ఆ మరుసటి సంవత్సరము, ఇంగ్లండుహాలెండుదేశములును యుద్ధరంగమునకు ఉరికెను.

బవేరియాను లోగొని, ఆస్ట్రియాను కాపాడెను. 1706-వ సంవత్సరములో రామిలీసు నొద్ద జరిగిన యుద్ధములో అతనికే జయముకలిగెను. ఆ జయమువలన, హాలెండు రాష్ట్రములలో గల స్పానిషు రాష్ట్రములు మిత్రవర్గము వారి పరమయ్యెను. ఆ సంవత్సరమే, యూజినీ మిలాను నేపిల్సు జయించెను. స్పెయినులో లభించిన జయము తాత్కాలికమే గాని, చిర స్థాయి కాలేదు. అయినను 1708-వ సంవత్సరములో ఔడె నార్డె (Oudenarde) యొద్ద జరిగిన యుద్ధమువలన మార్ల్ బరో ఫ్రాన్సుమీదికి దండెత్తిపోవు నవకాశ మేర్పడెను.

ఆ సమయమున పదునాలవ లూయీ సంధిమాటలు మొదలిడెను. కాని ఇంగ్లండులోని "విగ్గు గవర్నమెంటు" వారు దుర్భరమైన షరతులు చెప్పుటచే ఆ సంధి పొసగలేదు, మరల పోరాటలు సాగెను.

1709-వ సంవత్సరములో "మాల్ప్లాకెటు" (Malplaquet) నొద్ద ఒక గొప్ప పోరాట జరిగెను. అందు మిత్రమండలివారే జయించిరని చెప్పుకొనిరి గాని ఫ్రెంచివారి కంటె వారి జనమే ఎక్కుడు హతమగుటచే, అది యంతగా కొనియాడు కొనదగిన జయము కాదు.

### పక్షప్రభుత్వము (Party Government 1702—1713)

ఆనీ పరిపాలనలో నాలుగేండ్లు (1702—1706) పొత్తుల యేలుబడి సాగెను (Mixed Government). పిమ్మట, విగ్గులు ప్రభుత్వమునకు వచ్చిరి. 1709-వ సంవత్సరములో ఫ్రెంచి రాజు సంధికి రాగా, ఆ విగ్గుప్రభుత్వమువారు సంధి నిరాకరించిరి. అది కేవలము స్వార్థపరతచేత చేసిన పని. ఏమనగా

విగ్గులలో చాలమంది వర్తకులు. యుద్ధమువలన తమ వర్తకము బాగుగా సాగుననియు, అది ముగిసిన, ఇది మందగించు ననియు వారి యుద్దేశము. అదియునుగాక, ఫ్రెంచివారిని నిశ్శేషముగా ఓడించినచో, తమ కాంట్రాక్టులలో అంత మహా కార్యము జరిగిన జనము కీర్తి సంపాదించినట్లు యుండకో మూర. వారి యుద్దేశము లక్ష్యింపక, టోరీలు సంధికావలెనని అల్లాడుచుండిరి. ఈ స్థితిలో రాణియును టోరీలు ప్రభుత్వము వహించుటకు తటస్థించెను (1710). ఎట్లనః—డాక్టరు సాచెవరెలు (Dr. Sacheverell) అను నొకడు సెంటుపాలు కెథెడ్రలులో, ఒక సందర్భమున ఉపన్యసించుచు, 1688-వ సంవత్సరములో జరిగిన మహావిప్లవమును గూర్చి నిరసన వాక్యములు పలికెను. ఆ సంభాషణ దేశద్రోహాత్మక మనియు, ఆ యుపన్యాసకుడు దండనార్హుడనియు, ఎంచి, విగ్గుప్రభుత్వమువారు అతనిమీద నిందారోపణచేసి, విచారించి శిక్షింప దొరకొనిరి. నిజమునకు ఆ యుపన్యాసము ద్రోహాత్మకముగాదు; అయినను దానివలన పుట్టిన మునుగుడియు లేదు. కేవలము ఉపేక్షణీయమైన గోరంత విషయమును కొండంత చేసి, విగ్గుప్రభుత్వమువారు తమ బుద్ధిలేమిని వెల్లడించుకొనిరి. దానితో వారి పలుకుబడి పోయెను. ప్రజలు వారి నడతను మెచ్చరైరి. ప్రజానురంజకులు కానివారు ప్రభుత్వము సాగింపలేరు గనుక, క్రొత్త యెన్నికలు కావలసివచ్చెను. ఆ తడవ టోరీలు బహుసంఖ్యాకులు ఎన్ను కొనబడిరి. అంత ప్రభుత్వము వారిదయ్యెను.

టోరీపక్షమునకు నాయకుడు "సెంటు జాను" అను నతడు. అతడే "వైకౌంటు బాలింగుబ్రోకు" (St. John, Viscount Bolingbroke). అతడు ఫ్రాన్సుతో సంధి చేసికొన యత్నించెను

కాని పార్లమెంటుసభలో టోరీలకు, విగ్గులు ప్రతిపక్షులుగా నుండిరిగనుక, అతని సంధియత్నములు నిరాతంకముగా నెర వేరవు. అదియునుగాక, ఆస్ట్రియావారికిని సంధిమాట యిష్టము కాదు. అందుచే బాలింగుబ్రోకు గూఢయత్నములు సాగిం చెను. ఎట్లును సంధిపొసగుట శ్రేయమని యెంచి యతడు ఫ్రాన్సుతో ఉత్తరప్రత్యుత్తరములు నడపి సంధికుదిర్చెను. మాటవరస కైనను అతడు ఆస్ట్రియారాజుతో సంప్రతించలేదు. కాని తుదకెట్లో, ఆ నిర్భాగ్యసంధి యయ్యెను.

### యూత్రెక్టు సంధి: 1713 (Treaty of Utrecht)

ఫ్రాన్సుతోచేసికొన్న సంధినిబట్టి ఇంగ్లండు యుద్ధము విరమించెను. తమకిష్టములేకున్నను, వారినిబట్టి మిత్రమండలిలో తక్కినవారును యుద్ధము మానుకొనవలసివచ్చెను. ఆ సంధి వలన, ఆస్ట్రేలియాకు, యూరపుఖండమునకుగల స్పానిషురాష్ట్రము లన్నియు వచ్చెను. ప్రత్యేకము స్పెయినుదేశమును, అమెరికా లోని స్పానిషుభూములును, ఫిలిప్పునకు మిగిలెను; న్యూఫౌండు లాండు, నోవాస్కోటియా, హడ్సను అఖాతముచుట్టునుగల ఫ్రెంచిభూములు, ఇంగ్లండునంతునకు వచ్చెను.

హాలెండుడెన్మార్కులలోని స్పానిషుభూములు ఆస్ట్రియాకు దక్కుటచేత, ఇంగ్లీషువారికి సముద్రమునగల బలము సురక్షిత మయ్యెను. ఇక ఫ్రెంచివారికి భయపడవలసిన ఆవశ్యకములేదు. ఫ్రాన్సు, యూరపునంతను వశపరచుకొనును నేమో యను భీతి తొలగినది. మరల నూరేండ్లదనుక అట్టి భీతి పొడము నవకా శము లేకపోయినది. అమెరికాలోని స్పానిషురాష్ట్రములకు నీగ్రోబానిసలను సప్లయిచేయు నధికారము ఇంగ్లండునకే

యుండు పర్యాయముకూడ ఆ సంధిషరతులలో నొకటి. ఆ సంధి అందఱకు కొంచెమో గొప్పయో లాభకారిగానే యుండెను గనుక ఎల్లర మనస్సుల కసకసలు మఱచి, కొంతకాలము నిర్విరోధముగా వర్తించిరి.

## ఆన్ అంత్యకాలము

యూత్రెచ్చిసంధిచేత మహా ఘనకార్యము చేసిన పిమ్మట టోరీప్రభుత్వమువారు, తమ దృష్టి అసమ్మతులమీఁదను ప్రసరింపజేసిరి. పూర్వము చేసిన మతసహన శాసనమును మన్నించుట యెల్లరకును ధర్మము. టోరీప్రభువులు, ఆ శాసనమును మన్నించుచున్నట్లు నటించిరే కాని నిజముగా వారికి మతసహనము లేదు. అసమ్మతులను ఎట్లయినను అణచివేయవలెనని వారి దురుద్దేశము. అందుకై క్రీ. 1714-వ సంవత్సరములో "విచ్ఛేదశాసనము" (Schism Act) అను ఒక దుశ్శాసనము చేసిరి. "అసమ్మతులు, తమ పిల్లలకు విద్యను చెప్పించుకొనగూడదు" అనుట దాని సారము.

అటుపిమ్మట టోరీలు భావిరాజ్యాధికారమునుగూర్చి విచారింప దొడగిరి. ఆన్ రాణికి చాలమంది పిల్లలు కలిగిరిగాని, దైవవశమున వారందఱును చిన్ననాఁడె గతించిరి. "ఆన్, అనపత్యయై చనిపోవుచో, హానోవరు వంశ్యుఁడైన జార్జి రాజ్యమునకు రావలెను" అని పూర్వనియమముకలదు. ఆ జార్జి విగ్గుల యెడ పక్షపాతము కలవాఁడు. టోరీలయెడ అతనికి అభిమానము లేదు. ఆ కారణముచేత అతఁడు రాజగుట, టోరీలకు గిట్టదు. అతఁడే రాజగుచో మరల విగ్గులప్రభావము విజృంభించును. కనుక, ఎట్లయినను జార్జికి రాజ్యము దక్కకుండ చేయ

వలెనని బొలింగుబ్రోకు ఎన్నో తంత్రములు పన్నెను. రెండవ జేమ్సుకొడుకైన జేమ్సును తెచ్చి సింహాసన మెక్కించవలెనని ఆ మహామంత్రితలంపు. ఆనీ మఱికొంతకాలము బ్రతికి యున్నచో అతని తంత్రములు నెఱవేరునేమో కాని, ఆమె అకస్మాత్తుగా చనిపోవుటచేత అతని యత్నము లన్నియు భగ్నము లయ్యెను. ఆనీ 1714-వ సంవత్సరము, ఆగస్టు 1-వ తేదీని మరణించెను.

ఆమెమరణమునుగూర్చియు, తన మనోరథభంగమును గూర్చియు, బొలింగుబ్రోకు స్విఫ్టు పేర ఇట్లు వ్రాసెను (Dean-Swift).

"మిత్రుడా!

గురువారమునాడు, "ఆక్సుఫర్డు ఎరల్" ఈ లోకము బాసి పోయెను; ఆదివారమునాడు రాణి గతించెను. ఏమి ప్రపంచమిది! చూడుము, విధి తిరస్కారము, ఎంతచిత్రముగా నున్నదో."

పిమ్మట, హానోవరుజార్జి నిరాటంకముగా రాజయ్యెను.

## ఇంగ్లండు స్కాటులాండుల సంయోగశాసనము

ఆనీరాణిపరిపాలనకాలములో జరిగిన రాజకీయవ్యవహార ములలో కొనియాడదగిన విశేషము, ఇంగ్లండుస్కాటులాండు దేశముల కలయిక అది యొకమహాకార్యమని చెప్పుటకు రవంతేని సందేహములేదు. కాని ఆ కార్యసిద్ధికి ఎన్నో ఆటంకములు గలవు. మొదలు, స్కాటులాండుదేశము సమృద్ధముకాదు. తత్ప్రజలు ఎంతో పేదవారు. ఇంగ్లండునెడవారికి విరోధభావమేకాని, స్నేహభావము లేదు. దానికిని ఇంగ్లీషు

వారే కారకులు. వీరు వారి నెన్నో [illegible] పెట్టిరి. ఎన్ని మాఱులలో ఘోరయుద్ధములు చేసి ప్రజలను నాశనమొనర్చిరి. వానిలో, కిల్లీ క్రాంకీ యుద్ధము (Battle of Killie Crankie) అతి ఘోరము. విలియముకాలపు 1692-వ సంవత్సరములో గ్లెన్కోలో పెక్కుమంది స్కాటులాండువారిని, ఇంగ్లీషువారు చిత్రవధ చేసిరి. ఇవన్నియు స్కాటులాండు మఱచిపోవునా? మఱియు ఇంగ్లీషువర్తకులు, స్కాటులాండువారి వర్తకమును నిర్మూలము చేయవలెనని సంకల్పించిరి. ఇదియు గుణముగా. ఇంగ్లీషు ప్రభుత్వమువారు గూడ, స్కాటులాండును పరదేశము గానే భావించిరి గాని తమవారిగా చూడరైరి. రాజ్యసంయోగ ముయొక్క ఫలితముగా, స్కాటులాండు ఇంగ్లీషు వలసరాష్ట్ర ములతో స్వేచ్ఛగా వర్తకముచేయుటకు వీలుకలిగెను. ఈ యుపకారములన్నియు మఱచిపోయి పొత్తుకలిపికొనుట సాధ్య మా? అథవా, కలిపికొనవలెనన్నను, ఆ సంయోగమువలన స్కాటులాండువారి పార్లమెంటు నశించును. వారి చర్చి అస్త మించును. వారి ఆచారవ్యవహారములు భ్రష్టములగును. ఇక వారికి, ఇంగ్లీషుపార్లమెంటు ఆ చర్చి, ఆ యాచారములు, ఆ ధర్మములు శరణ్యములగును. ఈ ముప్పునకు ఒప్పుకొనక స్కాటు లాండువారిలో పల్వురు పొత్తు ఒల్లరైరి.

ఇంగ్లండులోగూడ పల్వురకు ఈ రాజ్యసంయోగము ఇష్టములేదు. అందును, ముఖ్యముగా, వర్తకులు, దానిమీద విముఖులు. సంయోగమువలన, స్కాటులాండు, ఇంగ్లండుతోను, తక్కిన వలసరాష్ట్రములతోను స్వేచ్ఛావర్తకము సాగించుననియు, అది తమ వర్తకమునకు నష్టదాయకమనియు వారి యభిప్రాయము.

కాని బలవత్తరమైన ఒక్క కారణముచేత విగ్గులు, ఆ సంయోగమును అభిలషించిరి. స్కాటులు హానోవరుజార్జిని రాజుగా అంగీకరింపరనియు, ఆనీమరణానంతరము, వారు స్టూవర్టువంశీయుడైన జేమ్సును రాజుగా వరింతురనియు, అప్పుడు దేశములు బొత్తుగా విడిపోవుననియు విగ్గులకు శంక కలిగెను. అట్లే యగుచో కేవలము అనర్థకము వాటిల్లునని భయపడి విగ్గులు స్కాటులాండువారిని మెప్పించు షరతులతో పొత్తుమాటలు మాటలాడిరి. ఇంగ్లండుతోను, ఇంగ్లీషుకాలనీలతోను స్కాటులాండు స్వేచ్ఛావర్తకము చేసికొనవచ్చుననిరి. మఱియు వారి చర్చికిని వారి యాచారవ్యవహారములకును భంగము కల్గకుండుటకు అవి యథావిధిగ కొనసాగవచ్చుననియు ఇంకొక షరతు నిర్ణయించిరి. ఈ షరతులు అనుకూలములుగానే యుండుటనుబట్టి స్కాటులాండు సంయోగమునకు అంగీకరించెను. అందును స్వేచ్ఛావర్తక సమయము వర్తకులకు ఆశాజనకమైనది. తుదకు దానివలననే ఆ దేశవర్తకులు, ఇంగ్లీషువర్తకులవలె అచిరకాలముననే సంపన్నులైరి.

కాని, స్కాటులాండువారి పార్లమెంటు మాత్రము అస్తమించినది. ఆ దేశమునుండి, ఇంగ్లీషుపార్లమెంటుకు ప్రతినిధులు రాదగునని యేర్పాటయ్యెను. పదునార్గురు ప్రతినిధులు ప్రభుసభకును, నలుబదియైదుమంది కామన్సుసభకును వచ్చు నేర్పాటు జరిగెను. తత్పూర్వము ఆ దేశమున నొకటియు, ఈ దేశమున నొకటియు రెండు పార్లమెంటులుండుటచేత కొన్నియెడల రాజునకు సంకటముగానే యుండెను. పరదేశమునకు సంబంధించిన నీతి నిర్ణయవిషయమున స్కాటిషుపార్లమెంటు ఒకమతము నిర్దేశించుచో, ఇంగ్లీషుపార్లమెంటు ఇంకొక

గాని, అతని వ్యాసమునకును, పదునెనిమిదవశతాబ్ది వ్యాస మునకును చాల భేదమున్నది. బేకను వ్యాసములు, ఏవో కొన్ని తలపులకు, మనోవస్థలకు, భావనాకల్పనలకు ఆశ్రయ ములేగాని విషయౌదార్యము కలవికావు. అతడు వ్యాసమును ఒక ఉదాత్తప్రక్రియగా భావించలేదు. ఇక పదునెనిమిదవ శతాబ్దిని గల రచయితలు వ్యాసరచనకు ఔదాత్యముసంపా దించి, ఆ రచనాప్రక్రియను ప్రచారమునకు తెచ్చిరి. ఆ కాలము వారిలో, అడిసను, స్టీలు అను నిద్దరు మిక్కిలి ముఖ్యులు. వారివలె ప్రౌఢవ్యాసరచన చేసిన వారు ఇంకె వ్వరులేరు. ఆ యిద్దరకు వాఙ్మయమున చిరకీర్తి నిల్పుటకు హేతువు వారి వ్యాసరచనా కౌశలమే.

### రిచర్డు స్టీలు (Richard Steele, 1672—1729)

ఇతడు ఆక్సుఫర్డులో కొన్నిదినములు చదువుకొని, పిమ్మట సేనలో ఉద్యోగిగా చేరెను. అటుపిమ్మట, స్టీలు, విగ్గులపక్ష మున పార్లమెంటుసభ్యుడయ్యెను. తఱచుగా నతడు రాజ కీయ వ్యవహారముల విమర్శించుచు కరపత్రములు వ్రాయు చుండెను. ఆ దినములలోనే కొన్ని నాటకములుగూడ రచిం చెను. కాని అవి యేవియు అతనికీర్తికి కారణములుకావు. "టాట్లరు, స్పెక్టేటరు" (Tatler and Spectator) అను రెండు వార పత్రికలు అతని వ్యాసరచనాకౌశలతకు నిదర్శనములై, మహా కీర్తి కెక్కినవి. ఆ రెండుపత్రికలును వివిధవ్యాసభూయిష్ఠములు.

ఆంగ్లదేశమున మొదటవెలసిన వార్తాపత్రిక, "వీక్లీ న్యూసు" (Weekly News) అనునది. అది 1622-వ సంవత్స రములో ప్రారంభమయ్యెను. పిమ్మట మఱికొన్ని వెలసినవి.

అటుపిమ్మట 1702-వ సంవత్సరములో "డెయిలీ కోరంటు" (Daily Courant) అను ఒక దినపత్రికకూడా బయలువెడలెను. కాని ఆ పత్రికలన్నియు లోకవార్తలను మాత్రము ప్రకటించునవేకాని, భాషాగౌరవము, రచనానిపుణత కలిగినవికావు. అట్లుండగా, 1709-వ సంవత్సరములో స్టీలు, టాట్లరు పత్రిక ప్రారంభించెను. వార్తలను ప్రకటించుట అతని యుద్దేశముకాదు. అతని కంటబడిన, నచ్చిన ప్రతి విషయమును గురించి చక్కని వ్యాసములు వ్రాయుట అతనిపని. ఆ పనిని లోకము మెచ్చునట్లు, వింతపడునట్లు, నెరవేర్చెను. కొన్నినాళ్లకు ఆ పత్రిక నిలిచిపోయెను.

మఱికొంతకాలమునకు, స్టీలు, స్పెక్టేటరు పత్రిక ప్రారంభించెను. అందు అతనికి అడిసను సహచరుడై, తానుగూడ కొన్నివ్యాసములు వ్రాయనొడగెను. ఆ పత్రికాయశమునకు వారిద్దరు కారకులే కాని అడిసను యశమునకు ఆ పత్రికయే కారణము.

**జోసెఫ్ అడిసను (Joseph Addison 1672—1719)**

ఇతడును, ఆక్స్‌ఫర్డులోనే చదివెను. చదువు ముగించి, నానాదేశయాత్ర సేవించి వచ్చుట ఆనాటి సంపన్నుల యాచారము. అడిసను సంపన్నుడు కాకపోయినను, లోకవృత్తజ్ఞానము పడయుటకై నాలుగేండ్లు యూరపుఖండమున నానాదేశములు తిరిగివచ్చెను. పిమ్మట అతడును స్టీలువలెనే రాజకీయరంగమున ప్రవేశించెను. స్టీలువలెనే అతడును కొన్ని నాటకములు, పద్యములు వ్రాసెను. కాని అవి యంతగా చెప్పుకొనదగినవి కావు. వ్యాసరచనయే అతనికి తగినది. అతడును, అదియే తన ధర్మముగా గ్రహించి సేవించెను.

ఈ యిద్దరు సహచరులును తత్పత్రికల మూలమున ఆంగ్లలోకమునకు చక్కని ధర్మోపదేశములు చేసిరి. "నాటకశాలలలోగాని, చర్చిలోగాని, మఱి యెందుచోట గాని జనసన్నివేశముల మనుజులు ఎట్లు సభాసాధువులై వర్తింపవలెనో, ఎట్లు వర్తింపగూడదో, నాగరకతాలక్షణ మెట్టిదో, ఎట్టి గ్రంథముల చదువవలెనో, ఎట్టివి చదువకూడదో, ఉద్గ్రంథముల సారము గ్రహించుటయెట్లో, చిల్లరపుస్తకముల నిరసించుటయెట్లో, స్త్రీయులు, దంపతులు, పితృపుత్రులు, మిత్రులు, పరస్పరము ఎట్లు నడచుకొనవలెనో మొదలగు నీతులన్నియు ఆ పత్రికలు బోధించెను. భోగలాలసత్వము కూడదనుట, సాహిత్యమును ధర్మముగా సేవించవలె ననుట, అన్యమతసహనముగలిగి, మూఢవిశ్వాసములు వదలి, ప్రోటస్టెంటుమతమును యథోచితముగా అనుసరింపవలె ననుట, హానోవరు వంశమునెడ భక్తికలిగి యుండవలె ననుట లోనగు ధర్మములుగూడ వారుపదేశించిరి. ఇంతయేల సాధుజనలక్షణము లన్నియు నిదర్శనపూర్వకముగా ఆజంటకవులు వివరించిరి.

## డేనియల్ డిఫో (Daniel Defoe 1659—1731)

ఇతనితండ్రి, లండనునగరమున మాంసము అమ్మి జీవించెడివాడు. అతడు కొడుకునకు చదువుచెప్పించి, అసమ్మతుల ధర్మమును బోధించు మతగురువుగా చేయవలెనని సంకల్పించెను. కాని డిఫో, చదువు ముగించిన పిమ్మట వర్తకము సేయ ప్రారంభించెను. ఆ సమయమున విజృంభించిన మాన్మత్తువిప్లవమున పాల్గొని, యతడు రాజదండభయముననో, మరేకారణము చేతనో, పెక్కేండ్లు పరదేశములు పట్టిపోయెను. కాలమును

కూలించిన పిమ్మట, డీఫో స్వదేశమునకు తిరిగివచ్చి (1697) రాజకీయప్రబోధముచేయు కరపత్రములు వ్రాయుచుండెను. ఆ రచనలు, ప్రహసనరూపములుగా నుండుటచే బహుజనరంగమములయ్యెను. అంతట, మఱికొన్నాళ్లకు అతడు "రివ్యూ" (Review) అనెడి యొక పత్రికాప్రచురణము నారంభించెను (1704). ఆ పత్రిక తొమ్మిదియేండ్లు నడచెను. అంతకాలమును ఇతరుల సాయమపేక్షింపక తానే సమస్తవ్యాసములు వ్రాసికొనుచు, అతడు పత్రికను నడపెను. పరదేశవ్యవహారములు, మతకము, స్కాటులాండుతోడి కలయిక, మొదలగు ముఖ్యవిషయములు ఆపత్రికాముఖమున విమర్శింపబడెను.

పిమ్మట 1719-వ సంవత్సరములో, డీఫో "రాబిన్సన్ క్రూసో" (Robinson Crusoe) అనెడి ఒక గ్రంథమును వ్రాసెను. అది వచనకావ్యము, కథ కల్పితము. "రాబిన్సన్ క్రూసో" అనువాడు తత్కథానాయకుడు. ఆ కల్పితపురుషుని పరాక్రమకృత్యములన్నియు, నాటకోక్తిగా, జరిగినవానివలె వర్ణింపబడెను. ఇంగ్లీషుభాషలో అదియే మొదటి నవల యని చెప్పవచ్చును.

బనియను వ్రాసిన "పిల్గ్రిమ్సు ప్రోగ్రెసు" కూడ ఇంచుమించు రాబిన్సన్ క్రూసోవంటిదే. అదియు కల్పితకథయే. అందుగూడ విషయవర్ణన ప్రత్యక్షగోచరమువలెనే యుండును. కాని బనియను ఉద్దేశము ధర్మోపదేశముచేయుట. డీఫో యుద్దేశము ఆనందము కలిగించుట. కనుకనే రాబిన్సన్ క్రూసో నవల యనిపించుకొన్నది. బనియను గ్రంథము నవలకాదు. మఱియు, డీఫో నవల గాథాప్రధానమేకాని, భావప్రధానముకాదు. భావప్రధానములైన నవలలు తరువాత వెలసినవి.

—:o:—

# ఇరువదినాలుగవ ప్రకరణము

## విగ్గులయధికారము

## మొదటి జార్జి 1714—1727 సం॥

## రెండవ జార్జి 1727—1760 సం॥

మొదటిజార్జి, తెలివిగలవాడుకాడు, చురుకుదనమును లేదు. అతని మాంద్యము, ప్రక్కనున్నవారినిగూడ మందమతుల జేయునని చెప్పుకొనెడివారు. తెలివి లేకపోయినను ఒకొక్కప్పుడు ఎద్దువలె పాటుపడెడువాడు. అతని హృదయము మంచిదేకాని పనులు నిరర్థకములు. ఇది యతనిస్వభావము. ఇక యతని రాజభావమన్ననో అదియు తదనుగుణముగానే యుండెను. ఇంగ్లండుదేశమునెడ అతనికి అభిమానములేదు. ఈ దేశచరిత్రను గూర్చికాని ఆచారవ్యవహారములను గురించిగాని అతనికి బొత్తుగా తెలియదు. ఇంతయేల, అతడు ఇంగ్లీషుభాష మాటలాడజాలడు.

### బొలింగుబ్రూకుమువను ఆక్సుఫర్డుప్రభువుమీవను నిందారోపణ

మొదటిజార్జి రాజ్యమునకువచ్చిన పిమ్మట, మొదటిసారి సమావేశమైన పార్లిమెంటుసభ జరిగిన వ్యవహారములలో పైనపేర్కొన్నయిర్వురు ప్రభువులమీదను నిందారోపణచేసి, శిక్షింపనెంచుట ప్రధానవిషయము. ఫ్రెంచిరాజుతో, యూట్రెచ్చిసంధి చేసికొనుటే వారొనర్చిన ద్రోహము. ఆ సంధి విగ్గులకు ఇష్టములేదు. తమకు సమ్మతముకాని పని గనుకనే, వారు దానిని దేశద్రోహముగా మహాపరాధముగా భావించిరి.

ఈ నిందారోపణ సహేతుకమైనది కాకపోయినను, దాని వలన గ్రహింప దగిన పరిస్థితి యొకటి గలదు. ఏమనగా, మంత్రులు మొదలగు పెద్దయధికారులు, రాజనీతి సమర్థ విదులై వర్తించవలెనుగాని, పొరపాటున నైనను నీతిమార్గమును విడనాడగూడదనియు, అట్లు విడనాడుట మహాపాతకమనియు పార్లమెంటువారిని మెజారిటీచేయుటకు కడనాటి యుక్తి గావల్పు టనే అందలి రహస్యము. మరియు, ఈ సంఘటన, ఆ రాజకీయము ఒప్పుకొనెను. కాని "రాజకీయమంత్రవర్గ విధానమనే మహాసంస్థ" చేసిన మంచి ఆ యపరాధములు తప్పకపోవ గలుగలేదు. రాజు చేసిన పనులకు, రాజమంత్రియే బాధ్యతవహించవలె నని నిర్ణయించు పట్టుపట్టుట చిరకాలాగతవిషయము. ప్రధానబాధ్యత యందు తరువు మంత్రిదే యగు పద్ధతియు ఇప్పటికి స్థిరమైనది. అది యింకొక రహస్యము. ఇక ఆ బాధ్యత సరికొత్త సమానముగా కనిపెట్టవలెను. మంత్రిసభ్యులకు సమష్టిబాధ్యత - పరార్థము.

## జాకొబైటు విప్లవము (Jacobite Rebellion 1715.

మొదటిజార్జికి సింహాసనాధికారము లేదనియు, స్టూవర్టు వంశస్థుడైన తనకే రాజ్యము రావలె ననియు, జేమ్సు తలచెను. ఇంగ్లీషుప్రజలలో చాలమందికి, జార్జియెడ భక్తి లేదనియు, అట్టి వారందఱు తన పక్షము పూనుదురనియు అతని యూహ. మఱియు జార్జికి పెద్ద సేనలేదు. కనుక అతని తన సేనల నెదిరించి గెల్వవచ్చుననియు, తనకు ఫ్రెంచివారు సాయము చేయుదురనియు ఇంకొక యాశ. తుదకు జేమ్సు పెక్కు కుట్రలు పన్ని ఒక విప్లవము లేవదీసెను. అది స్కాట్లాండులో ప్రారంభమయ్యెను. ఆ దేశమున కొన్ని తెగలవారు గలరు. వారు

అసహాయశూరులు, మృత్యువునైనను ఎదిరించి పోరగలరు. ఆ తెగలు జేమ్సునకు అండయయ్యెను. ఉభయదేశములను పొత్తు కలిపికొనె నన్న మాటయే గాని, ఆ పొత్తువలన, ఆ తెగలవారి స్థితి యేమియు మారలేదు. అదియునుగాక, ఆ పొత్తుకూడ సర్వజనసమ్మతము కాలేదు. కనుకనే, జేమ్సు యత్నమునకు స్కాటులాండు అనుకూలక్షేత్రమైనది. కాని యతడు దానిని సమర్థతతో నడపలేకపోయెను. విగ్గుప్రభుత్వము, ఆ తిరుగుబాటును అతినిపుణతతో, శక్తితో, ఎదిరించి అణచి వైచెను.

1715-వ సంవత్సరము ఆగస్టునెలలో తిరుగుబాటు జరుగవలెనని జేమ్సు, తనయనుచరులకు మొదట ఆదేశించెను. వారందులకు సన్నద్ధులై యుండిరి. కాని యేకారణముచేతనో యతడు ఆనిర్ణయమును మార్చి, ఇంకొక కాలమును నిర్దేశించెను. ఈ రెండవనిర్దేశమును అతని యనుచరులు పాటింపనైరి. ఈ సంగతు లన్నియు గూఢచారులవలన ఇంగ్లీషుప్రభుత్వమువారు, ఎప్పటికప్పుడు గ్రహించుచు తదనుగుణముగ యత్నములు సేయుచునే యుండిరి. మార్ దొర (Earl of Mar) స్కాటులాండులో తిరుగుబాటు ప్రారంభించెను. (1715-వ సంవత్సరము సెప్టెంబరునెల) అతనిక్రింద పంత్రెండువేలమంది సైనికులు గలరు. అత డాసేనల నడుపుకొని పోయి, పర్తునొద్ద (Perth) విడిసి యుండెను. కాని యచట చేయవలసిన పని యేమియు తోచక ఆ సేన యంతయు వ్యర్థముగా కాలయాపన చేయుచుండెను. ఈ లోగా ఇంగ్లీషుప్రభుత్వమువారు హాలెండునుండి ఆఱువేలమంది యుద్ధనిపుణులను పిలిపించి సర్వసన్నాహములతో నుండిరి. మార్ దొరయొక్క సేనలో కొందఱు

తను సహించినది. ఆ సంవత్సరము ఏడేండ్లకాలపరిమితి ఏర్పాటు చేసిరి.

## వాల్‌పోలు సభ్యాదయము (Walpole)

రాబర్టు వాల్‌పోలు అనునతడు నార్‌ఫోకులో ఒక సంపన్నుడు. అతడు 1676-వ సంవత్సరములో జననమొందెను. కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయమున చదువుకొని యతడు మంచి జ్ఞానము సంపాదించెను. పిమ్మట పార్లమెంటుసభ్యుడై, 1708-వ సంవత్సరములో యుద్ధతంత్రకార్యదర్శి యయ్యెను. ఆ పనిలో ఏడేండ్లు ఉండి, 1715-వ సంవత్సరములో అతడు కోశాధికారి యయ్యెను. ఆ యుద్యోగము చేయుచుండగనే, జార్జి రష్యాతో యుద్ధముసేయ సమకట్టగా అతని కిష్టములేక, ఉద్యోగమునకు రాజీనామా యిచ్చెను (1717). పదపడి నాలుగేండ్లకు రాజ్యము మునిగిపోదగిన అర్థనష్టము సంభవింప, విధిలేక జార్జి వాల్‌పోలును మరల పిలిపించి కోశాధికారిని జేసెను.

1711-వ సంవత్సరములో ఒక ఉమ్మడి వ్యాపారసంఘము వెలసెను. అది దక్షిణసముద్రముల గల దేశములతో వర్తకము చేయుటకు తగిన సదుపాయములను, ప్రత్యేకాధికారములను ప్రభుత్వమువారివలన సంపాదించెను. ఆ కారణమువలన ఆ సంఘమునకు దక్షిణసముద్రవర్తకసంఘమని పేరుగలిగెను. కొంతకాలమునకు ఆ సంఘమువారు, వెనకముందు లాలోచింపక, వ్యాపారములో చేసిన ప్రమాదమువలన ఇంగ్లండునకు అర్థనష్టము సంభవించెను (1721).

1719-వ సంవత్సరములో ఆ సంఘమువారు గవర్నమెంటు వారితో ఒక ఏర్పాటుచేసికొనిరి. ఆ యేర్పాటుప్రకారము,

జాతీయఋణములో ఉన్న వాటాలకు బదులు, తమ కంపెనీలో వాటాలు ఇచ్చెదమని చెప్పఁబడిరి. అనఁగా గవర్నమెంటు లోకులకు బాకీయున్న ఒక కోటి సమారైన పదుల పౌనుల సొమ్మునకును, కంపెనీవారు లోకులకు ఇచ్చుకొనుటయు, గవర్నమెంటువారు కంపెనీకి అంతసొమ్మునకు బాకీపడుటయు అని ఆ యొడంబడికె యొక్క షరతులు. ఈ యొడంబడికవలన ఉభయపక్షములకును లాభమే కలదు. ఎట్లన, గవర్నమెంటు లోకులకు ఈయవలసిన దానికంటె, కంపెనీకి తక్కువవడ్డీ ఈయ వచ్చును. కంపెనీసొమ్ము గవర్నమెంటుమీఁద ఉంచుటచే, అదియు పదిలముగానుండినట్లు అగును.

ఒక్క యేఁడాదిలో కంపెనీపరపతి హెచ్చిపోయినది. వారు నూరుపౌనులవాటాను ఒక వేయిన్నూఱువది పౌనులకు పెంచిరి. ఆ కంపెనీ పొందుచున్న అమితలాభమును చూచి ఇట్టి కొన్ని మఱి పెక్కుసంఘములు వెలసెను. వానిలో పెక్కింటికి మూలధనములేదు, పరపతిలేదు. ప్రజలు ముందువెనుక లాలోచింపక, ప్రతిసంఘమునను వాటాలు కొనిరి. నిలుకడమీఁద పెక్కు కంపెనీలు బూటకములని నిజము బయలుపడెను. దక్షిణసముద్ర సంఘముకూడ అట్టిదే యను వదంతులు వ్యాపించెను. వాటాదారులు తమ తమ వాటాలు అమ్ముకొని దక్కినంతవఱకే చాలునని సొమ్ముచేసికొన ప్రారంభించిరి. అందఱును అమ్మువారే యగుచో కొనువా రెవ రుందురు? వాటాల నిలువ తగ్గిపోయినది. 1720-వ సంవత్సరము, 21-వ సెప్టెంబరునాటికి లెక్కలు చూడఁగా, దక్షిణసముద్రసంఘమువారి నిలవ నూటయేఁబదిపౌనులు నికరము తేలెను. ఆ దెబ్బలో ఎన్నోకొంపలు కూలిపోయినవి. ఎందఱో సంపన్నులు దరిద్రులైరి. పత్రిక

వ్యాపారములు అణఁగంటినవి. గవర్నమెంటునకు తలయెత్తు
కొని తిరుగు స్థితి తప్పినది. ఆ సంకటసమయమున జార్జి, వాల్
పోలును బిలిపించి కోశాధికారిపదవి యిచ్చి ఆపద గడవబెట్టు
మని అర్థించెను.

1721-వ సంవత్సరము మొదలు 1742-వ సంవత్సరము
వఱకు వాల్‌పోలు, ప్రభుత్వమున అధికభారము వహించిన
అధికారిగా నుండెను. ఆ కాలమున సంపన్నులైన భూస్వాము
లకు ఏయే అలవాట్లు, అభిరుచులు, ఆచారములు కలవో,
అవియన్నియు అతనికిని గలవు. ఆ భూస్వాములు కొంచెము
వ్యసనపరులు. త్రాగుట, వేటాడుట, పరుషాక్షరములుపలు
కుట, మోటుగా ప్రవర్తించుట, వారి యలవాట్లు. వాల్‌పోలు
కూడ తెగత్రాగెడు వాఁడు, విసువులేక వేటాడువాఁడు; అతనికి
మృదువాక్కులేదు. ఐననేమి, అతని వ్యవహారదక్షత, కష్ట
సహిష్ణుత, ప్రశంసార్హములు. ఎంత కష్టపు పనినైనను, అతఁడు
విసువులేక నిర్వహించెడివాఁడు. ఎంత వ్రాతపని నైనను స్వయ
ముగా తనచేతులతో వ్రాసెడివాఁడు. ఆనాఁడు అతఁడు తన
చేతులతో వ్రాసిన యుత్తరములు, లెక్కలు మిక్కిలిగానై, నేటి
కిని కానవచ్చుచున్నవి. అతఁడు అతిప్రతిభాశాలి కాఁడుగాని
మంచి వ్యవహర్త. మంచివివేకి. అతనితోడి చెలిమి కడు మధు
రము. దేశకాలపాత్రవివేచనచేసి, తదనుగుణముగా రాజ్య
తంత్రమును నడపుటలో అతఁడు అద్వితీయుఁడు. వాల్‌పోలు,
విగ్గులపక్షమువాఁడేయయ్యు, వారిలో చాలమందికి అతఁడు
గిట్టఁడు. లంచము లిచ్చుననియు, లంచములు పుచ్చుకొను
ననియు, అతనికొక నిందగలదు. అతఁడు లంచము లిచ్చినమాట
నిజమే కాని పుచ్చుకొన్నట్లు ఎప్పుడును రుజువుకాలేదు.



SIR ROBERT WALPOLE.
Painting by J. B. Van Loo.
(By kind permission of National Portrait Gallery, London.)

లంచములిచ్చుట ఆ దినములలో సర్వసామాన్యమైన ఆచారము. ఒకొక్క యెడ అది మన్నించుటగా కూడ భావించెడివారు. అతనిమీద ఇంకను ఎన్నో లేనిపోని నిందలు ఉన్నవి. కాని అవియన్నియు శత్రుజనకల్పితములుగాని నిక్కమములు కావు.

## వాల్పోలు కార్యములు

విగ్గులు, పదునెనిమిదవశతాబ్దిని ఇంచుమించు ఏబది సంవత్సరములు నిరాటంకముగా అధికారప్రాభవము లనుభవించిరి. వారి యేలుబడిలో కొన్ని లోపములు లేకపోలేదు. అయినను, ప్రభుత్వమున, వారు బహుసంఖ్యాకులు కాకపోవుటచేత, పరిమతస్థులను బట్టి బాధించుటకు వీలులేకపోయెను. అందుచేతనే, వారికాలమున ఆంగ్లేయులకు, రాజకీయస్వాతంత్ర్యతయు, మతస్వాతంత్ర్యతయు సంపూర్ణముగా లభించెను. చర్చివారికి గల అధికారముల జోలికి పోకుండ వారిదారిని వారిని పోనిచ్చుటయు, జనపదస్థానముల ధర్మపరిపాలన మంతయు, టోరీలైన న్యాయమూర్తుల పరముచేయుటయు జరిగినచో, విగ్గులు నిరాతంకముగా ప్రభుత్వము నడప వచ్చుననియు, హానోవరు వంశమునుండి రాజ్యము తొలగిపోదనియు, వివేకసంపన్నుడైన వాల్పోలు గ్రహించి యాప్రకారము వర్తించెను. విగ్గులు, అధికారము వహించియున్న ఆ కాలములో, చర్చివారును, భూస్వాములును ఎల్లెడల తమ తమ యిష్టముల చొప్పున వర్తింపగలిగిరి.

యుద్ధములు దేశమునకు అనర్థకములనియు, శాంతి శ్రేయస్కరమనియు వాల్పోలు నీతి. అతడు అధికారమునకు వచ్చిన తరువాత పదునెనిమిదేండ్లవఱకు పరదేశములతో యుద్ధములే

లేవు. కాని యతని ప్రతిపక్షుల ప్రోద్బలముచేత 1739-వ సంవత్సరములో స్పెయినుతో యుద్ధమునకు దిగవలసివచ్చెను. అయినను అతడు మనసార యుద్ధము నడుపలేదు. అందుచేతనే 1742-వ సంవత్సరములో అతని యధికారము పోయినది. చిరకాలము, వాల్‌పోలు శాంతిభద్రతలు నిర్ధిష్టము చేసెను. అందుకనే, ఆ శతాబ్ది ఉత్తరార్ధమున సంభవించిన కష్టదశలకు దేశము తాళుకొనగలిగెను. రాజకోశము సమృద్ధిగా నుండుటయు, వ్యాపారము విరివిగా సాగుటయు దేశక్షేమకరములని యూహించి, వాల్‌పోలు ఆ రెండు కార్యములను సాధించుటకు ఎంతో యత్నించెను. కోశాభివృద్ధి చేయవలెనన్న ముందు జాతీయ ఋణము పోవలెను. అతని ప్రయత్నములవలన ఆ ఋణము సగమువఱకు తగ్గిపోయెను. ఇక వ్యాపారాభివృద్ధి చేయుట, ఒక్కనాటను జరిగినపని కాదు. అందులకై వాల్‌పోలు, క్రమక్రమముగా ఒకొక్క కల్పనమే చేసి ఆ కార్యము సిద్ధించునట్లు చేసెను.

పూర్వకాలపు వర్తకసంఘములు నశించిపోయిన తరువాత వర్తకవ్యాపారనియమములు అన్నియు గవర్నమెంటువారే చేయుచుండిరి. కాని ఆ నియమములు అన్నియు అమలుజరుగుచున్నవో లేదో విచారించుటకు, గవర్నమెంటునకు అవకాశము చాలదు. అందుచే ఆ పద్ధతి బాగుకాదని పదునేడవ శతాబ్ది యంతమున ఇంకొక పద్ధతి సాగించిరి. ఎగుమతి దిగుమతులలో కొన్నిసరుకుల మీద సుంకము వైచి వసూలు చేయుట ఆ పద్ధతి. వర్తకులు ఆ సుంకపుబాధ పడలేక దొంగదారుల ఎగుమతిదిగుమతులు ప్రారంభించిరి.

వాల్‌పోలు కోశాధికారము పూనునప్పటికి వర్తకస్థితి యట్లుండెను. అతడు మునుముందు చేసిన సంస్కారము సుంక

ములను చాలవఱకు తగ్గించుట. అట్లు చేయుటచేత దొంగదారుల ఎగుమతిదిగుమతులు చేయుటకు అగు కర్చుకంటె, గవర్నమెంటున కిచ్చు సుంకములే తేలికయయ్యెను. అందుచే ఎల్లరును దొంగపని మాని సుంకములు చెల్లించి బాహిరముగానే సరకులు నడపుకొనిరి. వాల్‌పోలు చేసిన రెండవ సంస్కారము బహుమానములిచ్చుట. అనగా, దేశాభ్యుదయహేతువులైన సరకులుచేయు కంపెనీలకు సాలునకు ఇంత యని కొంత రొక్కమిచ్చుట. అది వస్తునిర్మాణమునకు మిక్కిలి ప్రోత్సాహకము. రాజసన్మానసంపాదనార్థము, ఒండొరు గడవ స్పర్ధ వహించి, వర్తకులు కడు జాగరూకతతో వర్తించిరి.

వాల్‌పోలు అవలంబించిన ఆర్థికనీతిరహస్యము పెక్కుమందికి తిన్నగా అర్థముకాక విపరీతాభిప్రాయములుపడిరి. అది వారి తెలివితక్కువయేకాని, ఆ మంత్రివర్యుని వివేకలోపము కాదు. ఒకదృష్టాంతము చూడుడు:—పొగాకుమీదను బ్రాందిమీదను వేయవలసిన సుంకము, సరకు దేశములో దిగుమతియై కొట్టులకు చేరిన పిమ్మట వేయవలెనుగాని, తత్పూర్వము వేయగూడదని, వాల్‌పోలు 1733-వ సంవత్సరములో ఒక ప్రతిపాదనము చేసెను. అందలి రహస్య మేమనగా, దొంగదారుల సరకులు వచ్చినను, సుంకము పడితీరునని వర్తకులకు తెలియజెప్పుటయు, దొంగవర్తకము మాన్పించుటయు. ఈ రహస్యము తెలియక పొగాకువర్తకులందఱు గగ్గోలు పడిరి. తమ సరకులకు ఎక్కువ సుంకములు తగిలింతురని వారి భయము. పార్లమెంటు సభ్యులలో పెక్కుమంది వర్తకులవలెనే బుద్ధిహీనులైరి. అందుచే వాల్‌పోలు తాను ప్రవేశపెట్టనెంచిన చట్టమును ఉపసంహరించుకొనెను.

మైనయెడ, రాజు ఆ రహస్యసభతో సంప్రతించుట దుష్కరముగా నుండెను. ఏమన, అందఱుసభ్యులు వెంటనే కూడుటయు కష్టమే, ఒకవేళ కూడినను వ్యవహారము శీఘ్రముగా పరిష్కారమగుటయు కష్టమే. కనుక అట్టియెడల, రాజు ఆ సభ్యులలో కొందఱిని మాత్రమే చేకొని వారి సలహాలను అడుగుచుండువాడు. ఆ కొందఱు కలిసియున్న సభకే పరిమిత మంత్రివర్గము అని పేరు వచ్చెను. ప్రధానములైన రాజ్యవ్యవహారము లన్నియు వారే విచారించుచుండిరి. అట్టివన్నియు వారి వశమున జరగవలసినదే.

మొదటిజార్జికి ఇంగ్లీషుభాష రాదు. అందుచే నతడు ఆ మంత్రివర్గసమావేశమునకు పోయెడివాడు కాడు. ఆ నాటి నుండియే, ఆ వర్గమునకు ప్రస్తుతముగల యర్థము ప్రారంభమైనది.

ఇప్పుడు మంత్రివర్గపరిపాలన యనగా, ఒకే పక్షమునకు చెందిన కొందఱు పార్లమెంటుసభ్యులు సమస్తకార్యభారమును వహించి రాజ్యతంత్రము నడపుట. పార్లమెంటు సభకు ఇష్టులుగా ఉండినంతవఱకే వారి యధికారము సాగును. ఎప్పుడు పార్లమెంటువారికి ఆ మంత్రులలో నెవ్వడేని ఒక్కడైనను ఇష్టుడుకాడో, అప్పుడు ఆవర్గమంతయు తన అధికారమును వదలుకొనవలసినదే. రాజుచేయు అన్నిపనులకు వారే యుత్తరవాదులై యుందురు. వారిలో అన్నివిధముల పెద్దయైనవాడు ప్రధానమంత్రి యగును. అతడు తక్కినవారికి నియంత. ఆ ప్రధానమంత్రిని రాజు నియోగించును. అతడు తక్కిన తన సహచరులను తానే నియమించుకొనును.

వాల్ పోలునాటికి మంత్రివర్గపరిపాలనాపద్ధతి అంత వృద్ధిపొందలేదు. అప్పటికి, కామన్సుసభలో, గట్టిగా రెండు పక్షములు ఏర్పడలేదు. ఇప్పటిప్రధానమంత్రివలె, అప్పుడు వాల్ పోలు తనసహచరులను తాను నియమించుకొనలేదు. అనాటి కామన్సుసభలో పెక్కుతెగ లుండెను. ప్రతితెగకు ప్రత్యేక ఒక నాయకుడుండెను. అతడు చెప్పినట్లు అతని మనుష్యు లందరు ఓట్లు ఇచ్చుచుండిరి. మఱియు ఇప్పటివలె, అప్పుడు మంత్రివర్గము రాజుచర్యలకు బాధ్యత వహింపనక్కరలేదు, పరిపాలనమునందు ఉమ్మడితనమును లేదు. అనగా ఏమంత్రిపనికి ఆమంత్రియే బాధ్యుడుగాని ఒక్కనిబట్టి తక్కినవారి పదవులుండుటయును పోవుటయు ననునది లేదు. విశేషసంపన్నుడగు వాల్ పోలు, మంత్రి వర్గమున ఉమ్మడితనము ఉండవలెనని గ్రహించి తన సహచర మంత్రులను తానె నియమించు కొనుటకును వారు తనతో కూడి వర్తించునట్లు చేయుటకును యత్నించెను. అతని యత్నములు కొంతవఱకు ఫలించినవి. అతని సహచరులను అతడే నియమించుకొనెను. కాని యీ వర్గమున సహావర్తనము కుదరలేదు. అప్పట్లు వాల్ పోలు తనమాట వినని వానిని పదభ్రష్టుని జేసెను. ఆ రీతిగా, వాల్ పోలుసహచరులలో కార్టరెట్టు (Cartaret) అను నతడు 1724-వ సంవత్సరమునను, పల్టెని (Pulteney) అను మంత్రి, 1725-వ సంవత్సరమునను, టౌనుషెండు (Townshend) అనువాడు, 1730-వ సంవత్సరము లోను పదభ్రష్టులైరి. ప్రధానమంత్రికి తక్కిన మంత్రులపై ఎట్టి యధికారముండవలెనో, వారు అతనితోకూడి ఏల వర్తింపవలెనో వాల్ పోలు విశదము చేసెను.

## స్పెయిను లోడీయుద్ధము 1739 సం॥

1713-వ సంవత్సరములో జరిగిన యూట్రెచ్చిసంధిలో దక్షిణఅమెరికాలో స్పెయినుదేశమునకుగల వలసరాజ్యములతో వర్తకము చేయుటకు, ఇంగ్లండునుండి ఏటేట ఒక యోడ పోవచ్చునని యొడంబడిక చేసికొనిరి. పేరునకుమాత్రము ఒక్కయోడయే బయలుదేరిపోయెడిదిగాని, నాటిమాటికి చాటుమాటున మఱికొన్ని పడవలసరకు గూడ ఆయోడలో వైచి మరలమరల పంపుచుండెడివారు. ఈపద్ధతి సంధిసమయమును ఉల్లంఘించుట. ఆ వలసరాష్ట్రములవారికి ఇది యక్రమమని తోచలేదు. ఆ పద్ధతి గ్రహించియు వారు ఆమోదించిరి. కాని స్పానిషుగవర్నమెంటువారు మాత్రము దొంగి పని కూడదని నిరోధించిరి. అది ఆంగ్లవర్తకులకు వెనుబాటుగా తోచెను. దానికితోడు ఇంగ్లీషునావికులను స్పెయినుదేశపు సముద్రతీర రక్షకులు పట్టి బాధించుచుండిరని ఒకనేరము బయలుదేరెను. ఈ రెండుకారణములచేతను ఇంగ్లీషువారు స్పెయినుతో యుద్ధముచేయ సంకల్పించిరి. వాల్‌పోలు యుద్ధము తగదని ఒత్తిచెప్పెను. అతనిమాట ఎవరును విన్నారేరి—తుదకు 1739-వ సంవత్సరములో యుద్ధము మొగిసెను. అప్పటికి ఇంగ్లీషువారి నౌకాదళము మంచిస్థితిలో లేదు. అయినను ఎట్లో కష్టించి అనేక స్పెయినువారి "పోర్టోబెల్లో" (Porto Bello) అను స్థలమును పట్టుకొనగల్గెను (1740). అటుపిమ్మట ఇకజయించిన సందర్భమే లేదు. ఆయుద్ధము వలదని వాల్‌పోలు సర్వవిధముల చెప్పుటయు, అతనిమాట నెగ్గకపోవుటయునుబట్టి 1742-వ సంవత్సరములో అతడు తనమంత్రిపదవికి రాజీనామా యిచ్చెను.

ఇంతలో ఇంగ్లండునకు ఫ్రాన్సుతోను, ప్రష్యాతోను గూడ విరోధము సంఘటిల్లెను. కాగా స్పెయినుతో మొదట పెట్టిన చిన్న తగవు, తుదకు మహాయుద్ధరూపముగా పరిణమించెను. ఆ మహాయుద్ధము, ఆస్ట్రియారాజ్యార్హతను గురించి.

## ఆస్ట్రియారాజ్యార్హతకై యుద్ధము.

ఆస్ట్రియాచక్రవర్తియైన ఆరవ చార్లెసు 1740-వ సంవత్సరములో మరణించెను. తదనంతరము, ఆతనికుమార్తె మేరియా తెరెసా (Maria Theresa) రాణియై, ఆ సామ్రాజ్యమేలుకొనవచ్చునని తత్పూర్వమే ఒక ఒప్పందము జరిగెను. దానికి ఫ్రాన్సు ప్రష్యా, బ్రిటను దేశములును ఒప్పుకొనెను. కాని చార్లెసు మరణానంతరము, ప్రష్యారాజైన ఫ్రెడరిక్ (Frederick the Great) ఆ యొడంబడికను తిరస్కరించి రాజ్యాశచే సైలీషియా (Silesia) రాష్ట్రమును ముట్టడించెను. ఆ రాష్ట్రము ఆస్ట్రేలియా సామ్రాజ్యమున ఒక భాగము. ఆ యుద్ధకార్యమున ఫ్రాన్సు కూడ చేరి, ఫ్రెడరిక్కునకు చేయూత యిచ్చెను. ఫ్రాన్సుతో, స్పెయినునకు మైత్రి కలదుగనుక, ఆ దేశముకూడ పోయి ఫ్రెడరిక్కునకు తోడ్పడెను. అంతకుపూర్వమే, చిరకాలమునుండి, ఫ్రెంచివారును, ఇంగ్లీషువారును అమెరికాలోను, ఇండియాలోను అనేకకారణములచే తగవులాడుచుండిరి. కాన, అదియె అదనని యెంచి, ఇంగ్లండు ఆస్ట్రియాపక్షమున ఫ్రాన్సుతో పోరాడసమకట్టెను. ఇంగ్లండునకు హాలెండు తోడువచ్చెను. కాగా, ఫ్రాన్సు, ప్రష్యా, స్పెయిను దేశములు ఒకపక్షమునను ఇంగ్లండు, ఆస్ట్రియా, హాలెండు దేశములు రెండవపక్షమునను యుద్ధముసాగించెను.

ఫ్రాన్సు దేశము హానోవరువంశమునకు ఆజన్మశత్రువు. రెండవజార్జి సేనలను తానే స్వయముగా నడపుకొని ఫ్రాన్సు మీదికి దాడివెడలెను. డెట్టింగెను (Dettingen) అను చోట జరిగిన యుద్ధములో (1742) ఇంగ్లీషుసేనలును హానోవరు సేనలును కలిసి, ఫ్రెంచివారిని ఓడించి వారిని దక్షిణపుజర్మనీనుండి తరిమివైచెను. మఱి మూడేండ్లకు (1745) ఫ్రెంచివారు హాలెండు కౌన్నార్క్కులమీదికి దాడినడచి ముట్టడించిరి. పిమ్మట వారు ఇంగ్లండుమీదికి గూడ పోవుటకు యత్నించుచుండగా, రెండవ జార్జికొడుకు- చిన్నకుమారుడైన, కంబరులాండుడ్యూకు (Duke of Cumberland) ఫ్రెంచివారిని ఫాంటెనాయి (Fontenoy) యొద్ద తాకి నిశ్శేషముగా పరాజితుల జేసెను. ఆ యుద్ధమున కంబరులాండు పక్షమున పోరుసల్పిన, ఇంగ్లీషుసేనలును, డచ్చిసేనలును మిక్కిలి విక్రమసాహసములు ప్రకటించెను. ఆ మహాయుద్ధములలో జరిగిన తుది పెద్దపోరు అదియే.

సముద్రముమీద గూడ ఇంగ్లీషువారే గెల్చిరి. కాని, హిందూదేశములోని చెన్నపట్టణము, ఫ్రెంచివారి వశమయ్యెను. తుదకు 1748-వ సంవత్సరమున సంధియయ్యెను. దానికి ఎయిలాషాపెల్లిసంధి యనిపేరు (Treaty of Aix-la-Chapelle) ఆ సంధివలన, పోయినరాజ్యములు, ఎవరివి వారికి లభించెను. కాని యుద్ధమునకు పూర్వమున్న పరస్పర విరోధ భావములు అట్లే యుండెనుగాని ఆ సంధివలన లోనిపొత్తు కుదురలేదు. కలహకారణము సకెంపజేయని సంధివలన ప్రయోజనమేమి? అదనువేచి యిద్దరును మరల కయ్యమునకు దిగుదురుగదా! ఇచ్చోటగూడ అట్లే యైనది. అచిరకాలముననే మఱియొకయుద్ధము తటస్థించెను.

## ఇంకొక జాకబైటు విప్లవము 1745-వ సం॥

ఫాంటెనాయి యుద్ధము జరిగినయేడే, మూడవజేమ్సు కుమారుడైన చార్లెసు ఎడ్వర్డు స్టూవర్టు అనునతడు (Charles Edward Stuart) ఇంగ్లండుమీదికి దండెత్తి వచ్చెను. పూర్వము వలెనే ఇప్పుడును స్కాటులాండులోని మిట్టదేశములవారు ఆ పక్షమునకు సాయమై వచ్చిరి. ఫ్రాన్సుకూడ, సాయముచేయు నని చార్లెసు ఆసించెనుగాని, ఆదేశము ఆవల ఇంకొక యుద్ధ సముద్రమున మునిగి యుండుటచే అతనికి సాయము రాద య్యెను. చేతనున్న అయిదువేలమంది సైనికులతోనే అతడు ఎడింబరోమీదికి నడచెను. ఆపట్టణసమీపమున రాజపక్షమున కును అతనికిని పోరుజరిగెను. అందు అతడే గెల్చెను. అది ప్రెస్టొన్పాన్సు యుద్ధము (Battle of Prestonpans). జయ గర్వితుడై, యతడు డెర్బి (Derby) మీదికి పోయెను. అచట అతని నెదిరించెడివారే లేకపోయిరి. ఆదాడి లండనునగరము మీద వచ్చిపడునని యెల్లరును గగ్గోలుపడజొచ్చిరి. అంతలో ఫ్లాండర్సునుండి సేనలు పరుగుమీద వచ్చిదిగెను. చార్లెసు, ఇక ముందడుగుపెట్టక వెనుదిరిగి స్కాటులాండునకు పోయెను. దారిలో రాజసేనలు ఎదుర్కొనగా, అతడు వానిని గూడ ఓడించెను. అది ఫాల్కర్కుయుద్ధము (Battle of Falkirk). ఆ మఱుసటియేడు కంబరులాండుడ్యూకు కల్లోడెనుమూరు (Cullodenmoor) నొద్ద చార్లెసును మూకొనిని శ్లేషముగా ఓడిం చెను (1746-వ సంవత్సరము, ఏప్రిలునెల 16-వ తేది.)

ఆయుద్ధముజయించి, కంబరులాండు, చార్లెసుపక్షము వహించిన ప్రజల నివాసభూములమీద పడి, వారిని అష్ట కష్ట

ములు పెట్టి సర్వనాశ మొనర్చెను. స్కాటులాండులోని మిట్ట దేశముల ప్రజలు వశమైనగాని, రాజ్యమునకు భద్రతలేదని ఇంగ్లండు ఈతడవ గ్రహించెను. ఆ నీతి ననుసరించి ఆ తెగల నన్నిటిని విచ్ఛిన్నము చేసిరి. ఆ యా తెగల దొరలను అణచి వైచి, వారి దొరతనము పోగొట్టి, మనుగడకు కొన్ని భూము లిచ్చి రైతులను జేసిరి—వారి వశమున నున్న తెగల జనులు, ఆ భూస్వాములకు పాలికాపులై బ్రతికిరి. అట్టి సదుపాయములు కొందఱకే గాని ఎల్లరకు లభింపనయ్యెను. పెక్కుమంది కూడు గుడ్డలకు లేక అల్లాడి పరదేశములు పట్టిపోయిరి. సుమారు ముప్పదివేలమంది అమెరికాకు లేచిపోయిరి. అంతతో, స్కాటు లాండుకూడ వర్ధిల్లెను. వ్యవసాయము, వర్తకము, చేతిపనులు సర్వవిధముల పెంపొందెను. దేశమెల్లయెడల మంచి రోడ్డులు పడెను. తత్ప్రజలును అచిరకాలముననే విద్యా వివేక సం పన్నులైరి.

## విలియము పిట్టు (William Pitt)

**1745**-వ సంవత్సరమున చార్లెసు లేవదీసిన తిరుగుబాటు భగ్నమై పోవుటచేత, ఇంగ్లండునకు స్టూవర్టువంశమువలని ఉపద్రవము తప్పినది. ఇక ఎన్నటికిని ఆవంశీయుడు, స్కాటు లాండుగాని ఇంగ్లండుగాని స్వాధీనముచేసికొను యత్నములు చేయలేడని విదిత మయ్యెను. కనుక స్టూవర్టువంశము విష యమై ఇక విగ్గుప్రభుత్వమువారు, నెమ్మదిపై యుండవచ్చును. కాని వాల్‌పోలు పతనముతో, ఆ పక్షమునకు పరువుపోయి నది. వారు, అనేకరీతుల తమ గౌరవాధికారములను పోగొట్టు కొనిరి. వారుచేసిన లోపపుపనులలో ముఖ్యమైనది లంచము



WILLIAM PITT, FIRST EARL OF CHATHAM.
Painting by or after R. Brompton.
(By kind permission of National Portrait Gallery, London

లిచ్చుట. కామన్సుసభలోగాని, తమకు కావలసిన పనులను, వారు లంచములిచ్చి చేయించుకొనుచుండిరి. ఆస్థితిలో తిరిగి ఆపక్షమునకు పేరుప్రతిష్ఠలు తెచ్చినవాడు విలియము పిట్టు.

పిట్టు 1708-వ సంవత్సరములో జననమొందెను. అతని తాత ఒకప్పుడు చెన్నపట్టణపు గవర్నరు. పిట్టు ఆక్సుఫర్డులో చదువుకొని మంచి విద్య సంపాదించెను. పదపడి అతడు సైనికోద్యోగి యయ్యెను. అట కొంతకాలము పనిచేసి, పిమ్మట అతడు పార్లమెంటుసభ్యు డయ్యెను (1735). విగ్గుపక్షమున, వాల్‌పోలునకు ప్రతిపక్షులుగా నున్నవారితో చేరి, పిట్టు పది మందిలో మెప్పువడసెను. కామన్సుసభ పుట్టినది మొదలు, నేటివఱకు గతించిన సభ్యులలో మంచి వాగ్మిత్వము కలవారు ఏ కొలదిమంది మాత్రమో కలరు. వారిలో పిట్టు ఒకడు. అతని యుపన్యాసములు, సరసముగ, గంభీరముగ, హృదయంగమముగ, ప్రతివాదభేదకములుగ నుండును. ఆ నిపుణతయే, అతనికి గొప్పపేరు వచ్చుటకు హేతువు. దానికితోడు అతని బుద్ధిజాతియు మిక్కిలి మంచిది. బుద్ధివిశేషమును వాక్యవిభవము ను ఉన్నవానికి ప్రజానాయకత్వము క్షణములో వచ్చును. ఇంగ్లీషుసొమ్మును, హానోవరుసైన్యములకు వెచ్చించుట అధర్మమని పిట్టు పెక్కుసారులు సభలో వాదించెను. అందుచే రెండవజార్జి అతనిని మెచ్చెడు వాడుకాడు. మెచ్చకపోవుటయే కాదు, ద్వేషించెడివాడు కూడ. అయినను 1746-వ సంవత్సరములో పిట్టు ఐర్లాండునకు ఉపకోశాధికారి యయ్యెను. నాడు మొదలు 1756-వ సంవత్సరములోగా, అత డెన్నో ఉద్యోగములు చేసెను. ఏ పదవియందున్నను లంచములు దరిజేర నిచ్చెడివాడు కాడు. లంచములు పుచ్చుకొనుట దుర్నీతి

యనియు, ఉద్యోగిజనము ప్రజావిశ్వాసమును భంగపుచ్చి భాగ్యము చేర్చుకొనరాదనియు అతనిమతము. ఆ దినములలో అట్టి సద్బుద్ధిగల ఉద్యోగులు చాల అరుదు. అందుచేతనే పిట్టునకు మంచిపేరు వచ్చినది.

“కూలినాలి చేసికొని జీవించు పేదజాతులకును, సామాన్యులకును అతనియెడ మిక్కిలి యభిమానము. వారికి అతడు విశ్వాసపాత్రుడు. అతనివలె ప్రజాసామాన్యముయొక్క ప్రేమకు పాత్రుడైన అధికారి యింకొకడు లేడు.....బ్రిటిషు సామ్రాజ్యముయొక్క దిశావిదిశామయమైన మూర్తి యతనికివలె యింకొక రాజపురుషునకు ఎన్నడును ప్రత్యక్షగోచరము కాలేదు. నిరంతరము, అతనిచేతిలో సామ్రాజ్యపటమును, హృదయములో సామ్రాజ్యలక్ష్మీమూర్తియు ప్రకాశవించెను. అమెరికావలసభూముల నున్న ప్రజల స్వతంత్రతేచ్ఛ అతడు గ్రహించినట్లుగ ఇంకొక మంత్రి గ్రహింపలేదు......విగ్గుల పూర్వప్రతిష్ఠను కాపాడి, తత్సంప్రదాయములను కొనియాడినవాడతడే...1688-వ సంవత్సరమున జరిగిన ప్రజావిప్లవఫలితముగా లభించిన ప్రజాస్వామ్యతంత్రమునెడ విశ్వాసము, పార్లమెంటుసభయెడ అభిమానము, ఆ సభ ప్రజాప్రాతినిధ్యలక్ష్యమను గౌరవభావము, రోమను కాతలిక్కు-మతమునెడను తన్మతావలంబులగు రాజ్యములయెడను ద్వేషము, ఇంగ్లీషుజాతియొక్క భావిభాగ్యోదయమునెడ ఆశ, ఇవి విగ్గులకు సంప్రదాయాగతములైన భావములు.”

**1756**-వ సంవత్సరములో ఇంగ్లండు ఇంకొక క్రొత్త యుద్ధములో దిగి నష్టపడుచుండెను. పార్లమెంటుసభ్యులు పలువురు గూడి, పిట్టును సామ్రాజ్యకార్యదర్శిగా చేయుమని

రెండవజార్జికి విన్నవించిరి. ఆపని జార్జికి ఇష్టములేదు. అయి నను ఆ సభ్యులు బలవంతపెట్టుటచేత, అతడు పిట్టునకు కార్య దర్శిత్వము ఇచ్చెను. ఆ దినములలో రాజ్యకార్యదర్శి యనగా, ఇంచుమించు ప్రధానమంత్రి యన్నమాట. మనసులో ఇష్టము లేదుగనుక, జార్జి నాలుగు మాసములకే అతనిని పనినుండి తొలగించెను. అయ్యు మరల ఒక మాసమునకే పిలిచి పునః ప్రతిష్ఠితుని గావించెను. పిట్టు కార్యదర్శికాగా, న్యూకాసిలు డ్యూకు (Duke of Newcastle) ప్రధానకోశాధిపతి యయ్యెను (First Lord of the Treasury). ఆ యిర్వురి యాజమాన్య మునను దేశస్థితి చక్కబడునని అందఱును ఆసించిరి. అది యట్టి దియే. పిట్టు అతి ప్రతిభాశాలి. అతని ప్రజ్ఞయు ఉత్సాహ శక్తియు, ప్రజలను దేశసేవాపరాయణులుగను, జయశీలురుగను జేయును. అతని మంత్రప్రభావమువలన దేశమునకు కష్ట దశయు తొలగును. ఇక న్యూకాసిలుకూడ చాల సమర్థుడు. పార్లమెంటును ఒక్క సూత్రముమీద నడపవలెనన్న అంతవా డింకొకడు లేడు. వారిర్వురును కలిసి రాజ్యతంత్రభారము వహింపగా ఏలోటు వాటిల్లును?

## ఏడేండ్ల యుద్ధములు (The Seven Years' War 1756—1763-వ సం॥)

ఎయిలాషాపెల్సంధివలన, తాత్కాలికముగ కొంత ప్రయోజనము కలిగినదేకాని, ఐరోపీయజాతులకు అంతర్వైర ములు తగ్గలేదు. అందును ముఖ్యముగా, ఇంగ్లాండుఫ్రాన్సు దేశములకు కనడాలోను, హిందూదేశములోను కలిగిన కలహ కారణములు నానాటికి ప్రబలజొచ్చెనుగాని తగ్గలేదు.

కనడాలోని ఫ్రెంచివారి ప్రదేశములు, ఇంగ్లీషువారి భూములను ఆనుకొని వెనకప్రక్కగా నుండెను. ఇంగ్లీషువారివి సముద్రతీరము వెంట నుండెను. అటునుండి పడమటగా వ్యాపించి క్రొత్తభూములు సంపాదించవలెనని వారి యుద్దేశము. వారు చేయు పశ్చిమదిశాక్రమణము తమకు నష్టముగానున్న వారిని అటునుండి కదలకుండ చేయవలెనని ఫ్రెంచివారి యుద్దేశము. అందులకై ఫ్రెంచివారు ఒహియో, మిస్సిసిపీ నదుల నాశ్రయించి వరుసగా కొన్ని కోటలు కట్ట ప్రారంభించిరి. దాని వలన ఇంగ్లీషువారు వెనకవైపునకు పోవుటకు వీలుండదు. అదియునుగాక, ఫ్రెంచికనడాయును, ఫ్రెంచి "లూయిసియానా" యును సన్నిహితములగును. ఆ ప్రయత్నమే సాగినచో, ఇంగ్లీషు వారు సముద్రతీరమును ఆశ్రయించి యుండవలసినదేకాని, ఇక కదలుటకు వీలులేదు.

హిందూదేశములోగూడ, ఆ రెండుజాతులకును వైరము విజృంభించుచుండెను. ఇర్వురును వర్తకమునకే ఆదేశము చేరిరి. వర్తకము పోటీయే స్పర్ధకు మొదటికారణము. పిదప ఇర్వురకును రాజ్యసంపాదనాశ కలుగుటచే ఆ స్పర్ధ మరింత హెచ్చినది. ఆ దినములలో డూప్లే అను ఫ్రెంచిసర్దారుడు, కర్ణాటకదేశమున అప్రతిహతప్రతాపము చూపుచుండెను. ఇంగ్లీషుసేనలు అనేకపర్యాయములు వాని చేతులబడి నశించెను. అంతలో రాబర్టు క్లైవు అనెడి ఇంగ్లీషుసర్దారుడు బయలుదేరి ఇంగ్లీషు వారికి జయముచేకూర్పదొడగెను. ఏడేండ్ల యుద్ధములు ప్రారంభమగునప్పటికే, హిందూదేశమున ఫ్రెంచివారి ప్రాభవము క్షీణదశలో నుండెను.

ఆ మహాయుద్ధములో, ఇంగ్లీషువారు జోక్యము కలుగజేసి కొనుటకు ముఖ్యకారణము, ఫ్రెంచివారికిని వారికిని కనడాలోను హిందూదేశములోను గల వైరమే.

రెండువందల యేబది సంవత్సరములనుండి బద్ధవైరముతో నున్న ఆస్ట్రియా ఫ్రాన్సుదేశములు రెండును 1756-వ సంవత్సరమున సంధిచేసికొని మిత్రము లయ్యెను. ఫ్రెంచివారితో మైత్రి చేసి, తొల్లి తాము పోగొట్టుకొన్న సైలీషియాను మరల సంపాదించుకొనవచ్చునని ఆస్ట్రియావారు ఆసించిరి. ఇంగ్లండును జయించుటకు ప్రబలమైన ఆస్ట్రియా అండయై నిలిచినచో తమకు మంచిదని ఫ్రెంచివారు ఆసించిరి. వారిపొత్తు తమకు అపాయకరము గనుక, ఇంగ్లీషువారు ప్రష్యాతో పొత్తుజేసిరి. ఆసంవత్సరమే పోరు మొగిసెను.

రాజ్యతంత్రాధికారము పూర్తిగా పిట్టువశ మగువఱకు ఇంగ్లీషువారు, ఫ్రెంచివారిచేతులలో ఓడిపోవుచునే యుండిరి. ఒక్క హిందూదేశములో మాత్రమే ఫ్రెంచివారు ఓడు చుండిరి. పిట్టునకు అధికారప్రాబల్యము 1757-వ సంవత్సరమున కల్గినది. అంతదనుక యుద్ధతంత్రము సరిగా నడపదగిన నీతినిపుణుడగు మంత్రిలేక ఇంగ్లీషువారు కనడాలో ఎన్నో పరాజయములు పొందిరి.

1755-వ సంవత్సరము జూలైనెలలో, బ్రాడకుసేనాపతి (General Braddock) కనడాలో ఫ్రెంచివారి చేతులలో ఓడిపోయెను. 1756-వ సంవత్సరము మేనెలలో, మినోర్కా (Minorca) అనెడి ఇంగ్లీషువారి ప్రదేశమును వారు వశపఱచికొనిరి. అది యూట్రెచ్చిసంధి జరిగినపుడు ఇంగ్లీషువారికి లభించినదేశము. పిట్టు అధికారియైన మూడేండ్లలో జయా

పజయములు తారుమారయ్యెను. ప్రతియుద్ధమునందును ఇంగ్లీషువారికి జయమును ఫ్రెంచివారికి అపజయమును గలిగెను. ఆ విజయపరంపరకు ఆ మంత్రిశేఖరుడు పన్నిన తంత్రములే కారణము. ఇంగ్లీషు నౌకాదళములు ఫ్రెంచివారిని సముద్రము మీదనే తాకి వారి వలసరాజ్యములకు సాయము పోనీయకుండ జేయుట ఒకతంత్రము. రెండవది ప్రష్యారాజైన ఫ్రెడరిక్కునకు ధనసహాయముచేసి, అతనిచే యుద్ధముచేయించుట. ప్రజ్ఞాకల్పితములైన ఆ యుపాయములవలన 1757-వ సంవత్సరములో నిరంతరజయములు కలిగెను. ఆ సంవత్సరమునకు చరిత్రమున "అభ్యుదయ సంవత్సరము" అని పేరుకలిగెను. ఆయేడు, ఇంగ్లీషుప్రజలు ప్రతిదినమును, నిద్రలేచిన వెంటనే, నిన్నటి జయమెచ్చోటట, అని విచారించిరట.

1759-వ సంవత్సరము ఆగష్టు 1-వ తేదీని జరిగిన మిండెను యుద్ధమున (Battle of Minden) ఇంగ్లండునకు అఖండ విజయము కలిగెను. ఆ జయమువలన, ఫ్రాన్సు, ప్రష్యాను జయించునేమో యను భయముతీరినది. అది భూమిమీద జరిగిన యుద్ధము. సముద్రముమీద కూడ వారు రెండుచోట్ల గెల్చిరి. ఒకటి లాగోసు బే దగ్గర (Logos Bay; August 18th) రెండవది క్విబెరను బే దగ్గర (Quiberon Bay; November 20th) ఆ జయములతో ఇంగ్లీషువారి నౌకాదళములు బహుపరాక్రమసంపన్నము లనియును, యూరపుఖండమున వానిని మించజాలినవి లేవనియు లోకవిదిత మయ్యెను. 1758-వ సంవత్సరములో, క్రమముగా కేపు బ్రెటను లంక, టికండెరోగా, డ్యూకెసునీ (Cape Breton Island, Ticonderoga, and Fort-Duquesne) అను ఫ్రెంచివారి ప్రదేశములు ఇంగ్లీషువారి వశ

మయ్యెను. ఆ సంవత్సరమే, సెప్టెంబరు 12-వ తేదీని వుల్ఫు (Wolfe) అను సేనానాయకుడు క్వెబెక్కు (Quebec) ను ముట్టడించెను గాని, ఆ పట్టణము ఇంచుమించు స్వాధీన మైనంతనే అతడు మరణించెను. ఆ జయమును అతడు కన్నులార గాంచలేదు. అతడు మరణించిన రెండుమూడు నాళ్లకే ఆ పట్టణము స్వాధీనమయ్యెను. (సెప్టెంబరు 18-వ తేది) ఆ జయమువలన, ఫ్రెంచికనడానంతను జయించుటకు దారి యేర్పడెను.

## యుద్ధము ముగియుట

1761-వ సంవత్సరము, అక్టోబరు 25-వ తేదీని రెండవ జార్జి మరణించెను. అతని పిమ్మట రాజైన మూడవజార్జి టోరీల పక్షమునెడ అభిమానము కలవాడు. కనుక అతడు యుద్ధము మానవలె ననెను. కాని కనాడాలోను, హిందూదేశములోను గూడ అఖండవిజయములు కల్గి, ఇంకను కలుగు సూచనలు కనబడుచుండగా, చేసేతుల జరుగుచున్న యుద్ధము ఆపుట నీతిగాదని పిట్టు నొక్కి చెప్పెను. మఱియు ఆ యేడే స్పెయిను దేశము ఫ్రాన్సుతో గూడెను. ఆ సమయమున సంధిచేయుట వివేకము గాదని పిట్టుయొక్క యూహ. మూడవ జార్జి స్పెయినుదేశమునకు ఇష్టుడు. అందుచేతనే అతడు సంధికావలెనని మరి మరి పట్టు పట్టెను. అభిప్రాయభేదము కలిగినది గనుక, పిట్టు తన పదవికి రాజీనామా యిచ్చెను. అతని స్థానమున బ్యూటు దొర మంత్రి యయ్యెను. (Lord Bute) అతడు స్కాటులాండు దేశీయుడు. కారణాంతరమున, అతని మంత్రిత్వమునగూడ సంధి పొసగలేదు. తుదకు 1762-వ సంవత్సరములో స్పెయినుమీద కత్తికట్టవలసివచ్చెను. కొన్ని

యుద్ధములు జరిగెను. అందు ఇంగ్లీషువారే జయించిరి. కాని బ్యూటుమంత్రి కూడ సంధికే యిచ్ఛగించుటచేత 1763-వ సంవత్సరము, ఫిబ్రవరి 10-వ తేదీని పారిసులో సంధిచేసికొనిరి (Treaty of Paris).

పారిసు సంధివలన, ఇంగ్లండునకు, కెనడా, ఫ్లొరిడా, మినోర్కా, టొబాగో, డొమినికా, గ్రెనడా (Canada, Florida, Minorca, Tobago, Dominica, and Grenada) అను రాష్ట్రములు లభించెను. హిందూదేశములో ఫ్రెంచివారికి గల ఓడరేవులు వారివి వారి కిచ్చిరి. కాని వారు ఆ కోటలు గట్టిగా కట్టించు కొనుటకు వీలులే దనిరి. సంధి కుదిరినదనియు, చాల రాష్ట్రములు లభించె ననియు పలువురు సంతోషించిరి గాని, పిట్టు మాత్రము, ఆ సంధిని ఆ షరతులను మెచ్చడయ్యెను. ఫ్రెంచివారికి గల వలసరాజ్యము లన్నియు జయించు నంతవరకు యుద్ధము మానరాదనియు, అట్లు జయించిననే తక్క ఇంగ్లీషువారి వలసరాజ్యములకు భద్రత చేకూర దనియు అతని వాదము. దూరదర్శియగు నతడు ఊహించినది యథార్థమే యయ్యెను. ఫ్రెంచివారికి ఇంకను కొన్ని వలసభూములు మిగిలియున్నవి గనుకనే, అమెరికావారు స్వతంత్రత కొఱకు యుద్ధములు చేసినపుడును పిమ్మట నెపోలియను యుద్ధములు చేసినపుడును ఇంగ్లీషువారు ఫ్రెంచివారితో పోరాడవలసి వచ్చినది.



## ఇరువదియైదవ ప్రకరణము

## రాజు స్వతంత్రుడై వర్తించుటకు చేసిన కడపటి యత్నము

### మూడవ జార్జి 1760—1820-వ సం॥

1688-వ సంవత్సరములో తటస్థించిన మహావిప్లవము నాటినుండియు, రాజునకును, పార్లమెంటునకును గల వైర భావము కొంత తగ్గినది. మంత్రివర్గపరిపాలనాపద్ధతి క్రమముగా వృద్ధి యగుచుండుట బట్టియు, దానిబట్టి రాజుయొక్క నిరంకు శాధికారభావమును, పార్లమెంటు అరికట్ట గల్గుటయు దానికి కారణము. రాజు చేయు కార్యములకు, రాజమంత్రులే బాధ్యత వహింపవలసి వచ్చుటయే, రాజు, పార్లమెంటువారికి విధేయు డగుట. కాని మంత్రివర్గపరిపాలన, పూర్తిగా మంచి స్థితికి రాలేదు. దానిలో ఇంకను కొన్ని లోపములు గలవు. పార్లమెంటువారు జాతికి అంతకును ప్రతినిధు లగుటయు, మంత్రి వర్గము ఆపార్లమెంటునకు, విధేయమై యుండుటయు, అను ధర్మములు నెలకొనిననే తప్ప మంత్రివర్గపరిపాలన నిర్దుష్టము కాజాలదు. పదునెనిమిదవ శతాబ్ది పార్లమెంటుసభలు, ప్రజా ప్రాతినిధ్యము కలవిగావు. ఆ సభలలో గొప్ప గొప్ప భూస్వా ముల ప్రాతినిధ్యమే కాని, ప్రజాసామాన్య ప్రాతినిధ్యము లేదు. అదియునుగాక, మంత్రివర్గ పాలనము చక్కగా నెరవేరవలె నన్నచో, పార్లమెంటులో సమర్థములైన రెండు పక్షములుండ వలెను. ఆనాడు అట్టి పక్షములును లేవు. టోరీపక్షము ఇంచు మించు అస్తమించిపోయినది. విగ్గులలోగూడ భిన్నభావములు ప్రబలియున్నవి గాని, ఐక్యములేదు. కాగా, పార్లమెంటు అం

తయు, చిన్న చిన్న వర్గములుగా విభజింపబడి, ఒక్కొక్క వర్గము నకు ఒక్కొక్క పెద్దభూస్వామి నాయకత్వము వహించి యుండుటయు జరుగుచుండెను. ఆ చిన్న వర్గములవారు గూడ ఆ యా భూస్వాముల దయవలననే సభ్యు లగుటయు గలదు. మఱియు, పార్లమెంటువ్యవహారములు నియమబద్ధములుగా నుండవలె నన్నచో ఆ యా పక్షసభ్యులు తమ పక్షముయొక్క యభిప్రాయమునకు అనుగుణముగా గాని, లేనిచో తమకు ఇష్ట మని తోచిన విధమునగాని, ఓటులీయవలసి యుండును. ఆనాడు అట్టి పద్ధతియు లేదు. సభ్యులలో చాలమంది, లంచములు పుచ్చుకొని ఓట్లు ఈయదొడగిరి. ఏ పక్షమువారు ఎక్కువ లంచము లిచ్చెదరో ఆ పక్షమువారు జయించుచుండిరి.

ఆ నాటి మంత్రివర్గపాలనము ఇన్ని లోపములతో నున్నది గనుకనే, మూడవజార్జి, పరిపాలనాధికారమును పిత్రార్జిత పజుకు దక్కించుకొనవలెనని, యత్నించెను. అదియే, రాజు స్వాతంత్ర్యుడై వర్తించుటకు చేసిన కడపటి యత్నము.

జార్జి విగ్గులను మెచ్చడు. వారియెడ నతనికి మిక్కిలి యసహ్యభావము. అందుచే మంత్రివర్గమున అందఱు టోరీలే యుండవలె నని యతని కోర్కె. ఆ కోర్కె కొనసాగుటకు అతడు పది సంవత్సరములు గట్టియత్నము చేసెను. కామన్సుసభ, తనకు విధేయమై యుండి, తన యిష్టముచొప్పున వర్తించుచుండవలెనని యతని అభిప్రాయము. పార్లమెంటులో పక్షము లుండుటయు, ఆ పక్ష బలమునుసరించి వ్యవహారములు నడచుటయు, అను ధర్మమును ఆవలనుంచి, తన మనోరథములే ధర్మములుగా కొనసాగించుచుండ వలె నని యతని యుద్దేశము. మంత్రులు, లంచములిచ్చి సభ్యుల ఓట్లు కొను నలవాటు కలదని చెప్పితిమి. ఆ విధ

ముగా కొంతమందికి చాల డబ్బు దక్కెడిది. జార్జి కూడ ఆ పద్ధతినే అవలంబించి తనకార్యములు నెగ్గించుకొన జొచ్చెను. అతడును లంచము లిచ్చి పిట్టు కొనదొడగెను. ఆ లంచములు పుచ్చుకొను గుంపునకు "రాజమిత్రవర్గము" అని పేరు. ఆ వర్గమున అధికసంఖ్యాకులు గలరు. వారు రాజునకు ఇష్టము లేని బిల్లును ఓడించుటయు, ఇష్టమున్నదానిని గెల్పించుటయు, తమ ధర్మముగా వర్తించిరి. వారి బలమున కామన్సుసభలో జార్జికోర్కెలు కొనసాగుచుండెను.

ఈ విధముగా మూడవజార్జి, పదియేండ్లు, నిరంతరకృషి చేసి తుదకు, పార్లమెంటులో తన యిచ్చలెల్ల కొనసాగునట్లు చేయగలిగెను. విగ్గుల అధికారబలము అస్తమించినది. ఆ సందర్భములో పిట్టు ఛాతము దొర (Earl of Chatham) బలములేని విగ్గులతో గలిసి వ్యవహరింపలేకపోయెను. రాజు యొక్క స్వేచ్ఛావర్తనమును అరికట్టలేక పోయెను. అంతట 1766-వ సంవత్సరములో రాజు అతనిని బిల్చి క్రొత్తమంత్రి వర్గమును ఏర్పాటుచేయు మనెను. కాని యప్పటికే అతనికి శరీరబలమును మనోబలమును తగ్గి శక్తిహీనుడై యుండుటబట్టి మంత్రిపదవీభారమును వహింపలేకపోయెను. మొదలు, చిన్ననాటనుండియు నతడు దుర్బలశరీరుడు; నిరంతరము రక్తవాతముచే బాధపడుచుండువాడు. ఆ వ్యాధి నానాటికి ఎక్కువయై తుదకు అతనిని శక్తిహీనుని జేసివైచెను. అంతట విగ్గుపార్టీ కూలి పోయెను (1770). అంతట నార్తుప్రభువు (Lord North) ప్రధాన మంత్రియయ్యెను. అతడు రాజునకు చిరమిత్రుడు, కనుకనే అతనికి ఆపదవి లభించినది. అయినను నార్తునకు మంత్రిత్వము నెడ కుతూహలము లేదు. లేకపోయినను రాజుయొక్క మనసు

నొచ్చునేమో యని అతని యిష్టానుసారము పదవి వహించి పండ్రెండేండ్లు వర్తించెను. అదిదుర్భరమైన కాలము. పండ్రెండు సంవత్సరములలోను ఇంగ్లండు ఎంతో నష్టము పొందెను. అమెరికాలోని కాలనీలు పోయినవి.

## అమెరికను కాలనీలతోడి తగవు

వలసభూములు సంపాదించిన తక్కిన దేశము లన్నియు తమ కాలనీలను పాడియావులుగా నెంచుకొనెడివి. పదునెనిమిదవ శతాబ్దిని బ్రిటను దేశముకూడ కాలనీలను తనవస్తుసామగ్రి నమ్ముకొనుటకు అనువైన యాపణములుగా నుపయోగించుకొనుచుండెను. కాలనీలతోడి వర్తకమువలన బ్రిటను దేశపు ఓడలకు మంచి కేవుగూడ లభించెడిది. కాలనీలనుండి యూరపునకు, యూరపునుండి బ్రిటను దేశమునకు సరకులను తొల్లి డచ్చినావలు చేరవేయుచుండ 1651-వ సంవత్సరమునను 1660-వ సంవత్సరమందును బ్రిటను దేశము శాసనము లొనర్చి యాగుత్తకమును మాన్పయత్నించెనని యింతకుమున్ను ప్రస్తావించుకొంటిమి. 1660-వ సంవత్సరమున చేసిన శాసనములో కొన్ని కొన్ని ముఖ్యవస్తువులు కాలనీలనుండి బ్రిటనుకే పంపవలయునని కూడ నిర్దేశించిరి. అవి యెవ్వియన, అల్లము, నీలిమందు, రంగులు, దూది, చక్కెర, పొగాకు.

ఈశాసనములచే బ్రిటను ఆత్మలాభమునే యర్థించె నని స్థూలదృష్టిచే గోచరించుచున్నది. కాని యించుక విచారించి నచో నీయేర్పాటులు కాలనీలకు కూడ లాభదాయకములే. ఎట్లన, బ్రిటిషునావలు అను పదము కాలనీలనావలకు గూడ వర్తించును, కాబట్టి కాలనీల కెట్టి నష్టము లేమియు గాక,

ఈశాసనములచే నచట నోడలు నిర్మించు బేహారులకు మిగుల లాభింపదొడగెను. అదియును గాక నిర్దిష్టవస్తువులలో ముఖ్యతమములగు పొగాకు, చక్కెర, ఆంగ్లదేశముననే అధికముగా నమ్ముడుపోవును. యూరపుఖండమున నొక్క జర్మనీ, స్కాండినేవియాలలో తప్ప, అన్యదేశములందు పొగాకునకు చక్కెరకు మంచి బేరమురాదు. ఇంతకు నీశాసనములు ఎవ్వరికధికముగా క్షోపకారణ మయ్యెనో ఆ 'న్యూఇంగ్లండుస్టేట్సు' (New England States) కాలనీవారు పొగాకును చక్కెరను పండించరు. ఏది యెటులున్నను, ఈ శాసనములు నిర్మించుటతో బ్రిటను మొదట తనలాభము విచారించుకొని, పిమ్మట కాలనీలలాభమును విచారించె ననుట మాత్రము నిస్సంశయము. కాలనీలకు ఇందేమియు వైపరీత్యము గోచరింపకపోవుటచే అవి యంతగా అసంతృప్తి వహింపవయ్యెను. ఈశాసనములను ఆనలకు ద్రోచి కాలనీలు చాటుచాటున వాని వ్యాపార మవి చక్కబెట్టుకొనుచునే యుండెను. 1763–వ సం॥లో ఆర్థికమంత్రియగు 'గ్రెనువిలుప్రభు'వు (Lord Grenville) ఈ రహస్యవ్యాపారము నరికట్టనెంచెను. కాలనీల కది క్రోధకారణ మయ్యెను.

ఈక్రోధబీజమును పెంచుట కింకొకటి తోడయ్యెను. అమెరికాలో ఉత్తరదిక్కున నుండు ఇండియనులయొక్కయు ఫ్రెంచివారియొక్కయు బారినుండి రక్షించుకొనుటకు ఉత్తర అమెరికను కాలనీలవారికి మూలబల ముండుట అవసరమని గ్రెనువిలు ప్రభువు తలంచెను. అట్టి మూలసైన్యమును నిర్మించుట కగు వ్యయములో మూడవవంతు కాలనీల వారిపై వేసి, దానిని రాబట్టుకొనుటకు 1764–వ సం॥లో నొక మార్గమును సూచించెను. దస్తావేజు లన్నిటికి స్టాంపు లతికించవలయు నను

నిర్బంధమే యీమార్గము. నానిపిలుచు మూడుపెన్నీలు మొదలు కొని పదిసవరనులు వరకునుండును. ఈపన్నువలన నొక లక్ష పౌనులు లభించునని అంచనావేయబడెను. కాలనీలచే ఈస్టాంపు పన్ను అంగీకృతము కానిపక్షమున ఆ ధనము లభించుటకు ప్రత్యామ్నాయమార్గము సూచించుట కొక సంవత్సరము గడువొసంగిరి. అట్టి దేమియు కాలనీలు సూచింపకుండగనే ఆ వత్సరము గడచెను. మరు సంవత్సరమున (1765) స్టాంపు పన్ను (Stamp Act) శాసించిరి.

కాలనీలన్నియు క్రోధఘూర్ణితములయ్యెను. తమకు ప్రాతి నిధ్యము వహింపని పార్లమెంటునకు తమపై నిట్టిపన్ను విధించు నధికారములేదని తీవ్రముగు నాందోళనము గావించిరి. "మా నర్థక సౌకర్యముకొఱకు విధించిన పన్నులందురా? వానిని సంతోషముగ నొసంగుదుము. అంతియేకాని కేవలము బ్రిటిషుకోశమును నింపుట కుద్దేశించిన యీ పన్ను నెంత మాత్రము చేయబోము" అని పట్టుబట్టిరి. అచట నింగ్లండులో గూడ నీ విషయమున భిన్నాభిప్రాయములు పొడమెను. ఒక వంక మూడవజార్జియు, గ్రెనువిలుప్రధానియు, పార్లమెంటునకు కాలనీలపై పన్ను విధించు నధికారముగలదని వాదింపదొడ గిరి. రెండవవంక ఛాతము ప్రభృతులు పార్లమెంటున కట్టి యధికారము లేదు పొమ్మనిరి. ఈ యిరువాగు లిటుల వాదింప, మూడవదెస, మహావక్తయగు 'ఎడ్మండు బర్కు' (Edmund Burke) ప్రభృతులు మరియొక మధ్యమార్గము ద్రొక్కి, పార్లమెంటున కట్టి యధికారము నంగీకరించుచు, ప్రస్తుత మా యధికారము నమలులో బెట్టుట యనుచితమనిరి. తుదకు ఈ మూడవపక్షము వారి మాటయే నెగ్గి స్టాంపుపన్ను 1766-వ సం॥లో రద్దయ్యెను.

1767-వ సం॥లో ఛాతెము ప్రధానామాత్యుడయ్యెను. అతడు మంచముపట్టియున్న తరుణమున, ఆర్థికమంత్రియగు 'టౌనుషెండు', (Townshend) అమెరికను కాలనీలలో దిగుమతి యగు తేయాకు, కాగితము, గాజు ఈ మూడింటిపై పన్ను విధించి, కాలనీలీపన్ను నాక్షేపింపకూడదనెను. కాని కాలనీలు ఆక్షేపించియేతీరెను. తుదకు 1770-వ సం॥లో నార్త్ప్రభువు గాజుమీదను కాగితముమీదను పన్ను తొలగించి, తేయాకుపై పన్నుమాత్రము నిలిపియుంచెను. ఆ తేయాకుపై పన్నువలన సాలునకు 300 పౌనులకంటె అధికము లభింపకపోయినను. వలయుచో పన్నువిధించు నధికారము బ్రిటనునకు గలదని నిరూపించుటకా కొలదిపన్ను నిలిపియుంచెను. ఇది కేవల మవివేకము. ఏలనందురా? ఈ పన్నువలన లభించునదియా అత్యల్పము. దీనిచే కాలనీలకు గలిగిన క్రోధమందుమా? నిజముగా దుర్భరమగు పన్ను విధించుటచే కలుగుదానికన్న నధికము.

1773-వ సం॥లో ఈస్టు ఇండియాకంపెనీ (East India Co.) వ్యాపారము బొత్తుగా మందగించుట చూచి, ఇంగ్లండునకు పంపకుండగనే, తేయాకును సరాసరి అమెరికాకు ఎగుమతిచేయుట కనుమతినిచ్చిరి. తత్కాలమున తేయాకు చవుకయయ్యెను. తేయాకుపై విధించిన పన్నును తామంగీకరించునట్లు చేయుటకు బ్రిటను ఈ పన్నుగడ పన్ని తేయాకు చవుక చేసెనని కాలనీలు తలచెను. అట్లు పంపబడినదానిలో 340 పెట్టెల తేయాకును 'బోస్టను' (Boston) పురవాసులు సముద్రములో పడద్రోసిరి. ఈ 'బోస్టను టీపార్టీ'తో వ్యవహారము విషమించెను. బోస్టనురేవు మూసివైచి, 'మాసచుసెట్సు' (Massachusetts) మండలమున పరిపాలనావ్యవహారమును నిలిపివేసిరి. బ్రిటనునుండి సైన్యములు

వచ్చి పడెను. ఒక్క జార్జియా (Georgia) తప్ప తక్కిన కాలనీల వారందరు 'ఫిలడెల్ఫియా' మహాసభ జరిపి కాలనీలు బ్రిటిషు పరిపాలనమునుండి విడినడు విషయమునుగూర్చి చర్చించిరి. 'నార్తు' మంత్రి యుద్ధము మాన్పజూచెనే కాని 1775-వ సం॥లో యుద్ధము సంప్రాప్తించెను. 1776-వ సం॥లో జూలైనెల 4-వ తేదీని కాలనీలమహాసభ యిట్లని 'స్వాతంత్ర్యప్రకటనము' (Declaration of Independence) గావించెను. "కాబట్టి ఈ మహాసభ యందు సమావిష్టులమైన అమెరికా సంయుక్తరాష్ట్ర ప్రతినిధుల మగు మేము, ఈ కాలనీలలోని ప్రజల అనుమతిని వారి పక్షమున ప్రకటించునది యేమనగా ఈ కాలనీలసంఘాతము సర్వ స్వాతంత్ర్యములగు రాష్ట్రములకిరాటము. ఆంగ్లసామ్రాజ్యము నెడల బాధ్యతయు సంబంధమును ఈ రాష్ట్రములకు పరాస్తమై పోయినది."

## అమెరికా స్వాతంత్ర్యసమరము 1775—1783-వ సం॥

బ్రిటనుతోడి ఈ వైరమున కాలనీలప్రజలలో వైకమత్యము కుదరలేదు. ప్రబలమగు రాజభక్తపక్షము మొందంగూడ నేర్పడెను. రాజద్వేషివర్గమునకు 'జార్జి వాషింగ్టను' (George Washington) నాయకుడయ్యెను. తాను సృష్టింపనున్న జాతి ఆ మహాపురుషునకు ముందుగనే సాక్షాత్కరించెను. ఈ సమరమున బ్రిటిషువారి యోటమికి కారణములు మూడు. బ్రిటనునకు కాలనీలకు చాల దూరమగుట యొకటి; అపరిమేయ పరిమాణములగు ఆ కాలనీలలో సైన్యముల నీ దెసనుండి ఆ దెసకు కొనిపోవుట కనునగు దండుబాటలులేమి రెండవది. అట ఇంగ్లండులో మంచి పరామరిక లేకపోవుట మూడవ

కారణము. అట్లయ్యు 'బంకర్సు హిల్' (Bunkers Hill) అను యుద్ధమున (1775) బ్రిటిషువారే జయించిరి. కాని 1777-వ సం॥లో 'హౌ' (Howe) 'సేనాని' సైన్యము, 'బర్గాయిను' (Burgoyne) సేనలతో కలిసికొనజాలకపోవుటచే 'సారటోగా' (Saratoga) లో 'బర్గాయిను' అమెరికనులకు 'జితోస్మి' యన వలసినవాడయ్యెను. అమెరికను లిట్లు విజయమందుట చూచి ఫ్రెంచివారు, స్పెయినువారు అమెరికనులతో చేతులుగలిపి బ్రిటను నెదిర్చిరి. 1781-వ సం॥లో వాషింగ్టను 'యారుక్-టౌను' నగరమును బ్రిటిషు సర్వసేనానియగు 'కారనువాలిసు' (Cornwallis) తో గూడ ముట్టడించెను. బ్రిటిషుసైన్యములకు సముద్రమార్గముతప్ప గత్యంతరములేదు. ఆ స్థితిలో 1781-వ సం॥ సెప్టెంబరునెలలో పురరక్షణము సల్పుచున్న అల్పమగు నౌకాదళమును, ఫ్రెంచినౌకాదళము చుట్టుముట్టి జయించుటచే యారుక్-టౌనునగరము నిక రక్షించుకొనజాలక, 'కారన్‌వాలిసు' (అక్టోబరునెల 18-వ తేది) జితోస్మి యనియెను. దీనితో సమర పర్యవసానము విదితమయ్యెను. పిమ్మట (1782-వ సం॥ ఏప్రిలునెల 12-వ తేది) 'రోడ్నీ' సేనాని ఫ్రెంచినౌకాదళమును 'సెయింటెసు' (Saintes) యుద్ధములో నోడించెను. కాని అప్పటికే తరుణము తప్పిపోవుటచే ప్రయోజనములేకపోయెను. అనంతరము 'వర్సైలిసు' (Versailles) సంధి (1783) వలన శాంతి నెలకొల్పబడెను. అంతటితో బ్రిటనుపాలనమునుండి విడివడి అమెరికా సంయుక్తరాష్ట్రములు స్వతంత్రములయ్యెను. 'స్పెయిను' తన 'మైనార్కా' (Minorca) 'ఫ్లారిడా' (Florida) లను తిరిగి పొందగలిగెను. 'సెనిగాల్' (Senegal) 'టొబాగో' (Tobago) లు (పశ్చిమాఫ్రికాలోనివి) తిరిగి ఫ్రాన్సుకు లభించెను. తుదకీ

విధముగా అమెరికా ఆవిర్భవించెను. కాని ప్రపంచమునకు ఈ మేటిలిగ్గు బ్రిటనుతోడియుద్ధ మను ఎగ్గునగాక లభింపద య్యెను.

### చిన్నపిట్టు ప్రభుత్వమున కెక్కివచ్చుట
### (Rise of William Pitt the Younger)

ఈ యమెరికను కాలనీల నష్టము ఇంగ్లండుపాలిటికి పెద్ద ముప్పయ్యెను. ఇంతటితో మూడవజార్జియొక్క వ్యక్తిపాలన మంతరించినదనియే చెప్పవలెను. ఛార్లెసు జేమ్సు ఫాక్సు (Charles James Fox) అను విగ్గు, టోరీయగు నార్తుప్రభువుతో గూడి మంత్రివర్గము నేర్పరిచెను. ఈస్టుఇండియాకంపెనీ వ్యవహారములను, లండనులో నొక పరిపాలకవర్గముయొక్క పరిశీలనకు లోబరచుటకుగాను పార్లమెంటులో నాతడొక బిల్లు ప్రవేశపెట్టెను. అంతట రాజు "ఈ యిండియా బిల్లున కనుకూలురైనవారు నా మైత్రి గోల్పోవుటయేగాదు, నాకు శత్రువులగుదురు." అని ప్రభుసభకు కబురంపెను. ఇదియే (నవంబరునెల 1783-వ సం॥) ఆతడు పార్లమెంటునెడల సలిపిన కడపటి అత్యాచారము. పార్లమెంటులో బిల్లు వీగిపోయెను. ఆ సంవత్సరమే డిసెంబరునెలలో జార్జి, యా మంత్రు లిరువురకు స్వస్తిచెప్పెను. పార్లమెంటు నింక తన యదపులో నుంచుకొనజాలనని యాతడెఱుగును. రాజునెడల ప్రజలకుగూడ కోపము పెరుగసాగెను. కాని యాతనికి విగ్గుమంత్రులనిన తల కంటగించును. ఇంతలో చిన్నవిలియము పిట్టు టోరీవర్గమును పునరుద్ధరింప రా జాతని మరుగుజొచ్చెను.

ఈ చిన్నపిట్టు ఛాతముమంత్రికి రెండవ కుమారుడు. 1759-వ సం॥ ఈతని జననము. బాల్యమున అనారోగ్య



WILLIAM PITT (THE YOUNGER)
Painting by J. Happner.
(By kind permission of National Portrait Gallery, London.)

ముచే చదువు సాగకున్నను, పదునైదవయేంట కేంబ్రిడ్జిలో చేరి యేడేండ్లు విద్యావ్యాసంగము సలిపెను. 1780-వ సం॥లో న్యాయశాస్త్రము చదివి పార్లమెంటులో నడుగుపెట్టెను. నిజ వక్తృతానైపుణ్యముచే వెంటనే ప్రసిద్ధికెక్కి 1772-వ సం॥లో ఆర్థికమంత్రియై, తక్కు మంత్రిమండలితోపాటు 1783-వ సం॥లో వైదొలగెను. అప్పటి కాతని వయస్సు 24. జార్జి రాజు కోరికపై ఆత డప్పుడు మంత్రిమండలి నేర్పరచి తాను ముఖ్యామాత్యుడయ్యెను. కామన్సుసభలో వరుసగా మూడు మాసములోటమి పాలగుచువచ్చెను. తుదకు పార్లమెంటు రద్దయ్యెను. పిమ్మట జరగిన ఎన్నికలలో ప్రబలమగు టోరీవర్గముతో పిట్టు గెలుపొందెను. ఈ యద్వితీయవిజయమున కాతని నీతిప్రయోగనిపుణత కొంతవరకు కారణమగునుగాని, ప్రజలలో చాలభాగ మా బాలమంత్రిపక్షముననే యున్న మాటమాత్రము నిజము. పురోహితులు, భూస్వాములు నాతనికి ముఖ్యబలము. వణిగ్వర్గముకూడ కొంతవరకు ఆతని నభిమానించెను. ఆ కాలమునందలి వాణిజ్యవిదులలోను, అర్థనీతిజ్ఞులలోను ఆతడు నిరుపమాను డని యెన్నదగును. అంతటితో టోరీవర్గమునకు 'రాజమిత్రులు' అను దుష్ప్రథ తొలగి, అర్థబలము సంఘబలము నేర్పడెను. పార్లమెంటులో కొన్నిస్థానములు వారు చేజిక్కించుకొనిరి.

వెనుకటికి 'వాల్పోలు' మంత్రివలె, పిట్టుగూడ ప్రధానామాత్యపద గౌరవమును సుప్రతిష్ఠితమొనర్చి, కేవల ప్రభుచిత్తానుసారిగాక, దేశమున నిజమునకు తానే నాథుడై, అమాత్యప్రాభవమును వెలయించెను. సర్వస్వతంత్రమగు

పార్లమెంటుచిత్తము ననుసరించి అమలుజరుపుటయే బ్రిటిషు మంత్రివర్గముయొక్క ఆశయము. తదాశయ పరిపూర్తికి పిట్టే పితామహుడన జెల్లును.

## పిట్టుయొక్క సంస్కారనీతి (Pitt's Policy of reform)

పిట్టు పాలనము రెండు భాగములు చేయనగును. అందు మొదటిది 1784-వ సం॥తో ప్రారంభించి 1793-వ సం॥ వరకు సాగెను. ఆ దశలో 1789-వ సం॥ వరకు నాతడు అమెరికాయుద్ధముచే ఇంగ్లండునకు కలిగిన కష్టనష్టములను కూడ దీసికొనివచ్చుటకై అవిరతమగు కృషిసల్పెను. 1789-వ సం॥లో 'ఫ్రెంచి విప్లవము' అను పెనుభూత ముదయించి ఫ్రాన్సుతో యుద్ధమెప్పుడు వాటిల్లునోయను దిగులు తోడనే సరిపోదొడగెను. అనుకొన్నట్లు 1793-వ సం॥లో ఫ్రాన్సుతో యుద్ధము దాపరించెను. అదిమొదలు పిట్టునకు యుద్ధవిజయమే ప్రధానలక్ష్యమై, ఇల్లు చక్కబెట్టుకొను యత్నము వెనుకబట్టెను.

ప్రథమమున నాతడు చేయనెంచిన సంస్కారములు మూడు: జాతీయ ఋణము తగ్గించుట మొదటిది; ఎగుమతి దిగుమతులపై సుంకము తగ్గించుట రెండవది; మూడవది, పార్లమెంటును గొప్పగొప్ప భూస్వాముల చేతులనుండి తప్పించి, ఇతర ప్రజలకు ప్రాతినిధ్యము వహింపజేయుటకై ఎన్నికల పద్ధతి మార్చుట.

ఋణభారము తగ్గించుట కాతడీ యేర్పాటుచేసెను. 1786-వ సం॥లో 'క్షేమనిధి' (Sinking Fund) యను పేర నాతడొక నిధిని నెలకొల్పి తత్పరిపాలనము నొక కమీషనరు వర్గ

మున కల్పించెను. ప్రభుత్వ మేఁటేట పదిలక్షల పౌనులా నిధికి చెల్లింపవలెను. తన్నిధిపాలకులా సొమ్ముతో ఋణపత్రములు కొనుచుండవలెను. ఆ పత్రములపై వచ్చు వడ్డీని నిధికి జమ కట్టుచున్నచో నది వృద్ధిచెందును. ఈ క్షేమనిధినిగూర్చి యెన్నియో అసంగతాక్షేపములు బయలుదేరెను గాని ఋణ భారమును మాన్పుట కాతఁడొనర్చిన యీ యత్నములు నిజముగా ప్రశంసాపాత్రములు. ఆ నిధిపేర కొనిన పత్రములపై వడ్డీలేకుండా రద్దుచేసినచో నింక నెంతయో ప్రయోజనముం డెడిది.

చాటు చాటు బేరములుమాన్పి వర్తకమును పెంపొందింప వలయునని యాతఁడు సరకు దినుసులపై సుంకములు తగ్గించెను. తేయాకుపై నూటికి 119 సుంక ముండెడిది. దానిని 12½ కు తగ్గించెను. ఇట్లే తక్కు సుంకములుగూడ తగ్గించెను. ఈ నష్టమును కోశమునకు కూడదీయుట కాతఁడు గవాక్షములపై క్రొత్తగా పన్ను విధించెను. అందుచే ప్రతి గృహస్థు తన యింటి కిటికీల సంఖ్యనుబట్టి పన్ను చెల్లింపవలసివచ్చెను. 1798–వ సం॥లో విధించినరాబడిపన్ను ఇంతకన్నను ఆలోచనతో కూడినది. దానిచే, సాలుసరు 200 పౌనులకు మించిన ఆదాయముగలవారెల్లరు ప్రతిపౌనులోను యేబదవవంతు పన్ను చెల్లింపవలెను. అంతకు తగ్గిన రాబడిపై తక్కువపన్ను. 60 పౌనులకు తగ్గిన రాబడిపై పన్నే లేదు. ఈ పన్ను యుద్ధ వ్యయములకై యుద్దేశింపబడెను. ప్రజలలో దీనివలన కలవరము పుట్టుటచే 1816–వ సం॥లో నీ పన్ను తొలగింపబడెను.

ఎన్నికల పద్ధతి సవరించుటకై పిట్టు 1784–వ సం॥లో నొక బిల్లు సిద్ధముచేసెను. పల్లెలలోని ప్రజలందరు క్రమక్రమ

ముగా పట్టణములకు చేరుచుండిరి గాన తొల్లి పార్లమెంటునకు సభ్యుల నెన్నుకొను హక్కుగల కొన్ని కొన్ని 'బరోలు' (Boroughs) నిర్జనములు కాజొచ్చెను. ఆ బరోలచటి భూస్వాముల హస్తగతములయ్యెను. కావున నట్టి బరోలలో 36-కి పిట్టు ఎన్నిక హక్కును తొలగించెను. లండను నగరమునను, వెస్టుమినిష్టరులోను, మరికొన్ని క్రొత్త మండలములలోను నూతనముగ 72 నియోజనస్థానములను కల్పించెను. ఎన్నిక హక్కుగోల్పోయిన బరోలకు పది లక్షల పౌనుల సొమ్ము పంచిపెట్టు నట్లేర్పాటుచేసెను. 1785-వ సం॥లో ఈ బిల్లు పార్లమెంటుచే నిరాకరింపబడెను. కావున మరి 47 ఏండ్లవరకు ఆ సంస్కారము నిలిచిపోయెను. ఆ యుద్ధపుటలజడిలో పిట్టు ఈ సంస్కరణమునకై మరల యత్నింప నేరడయ్యెను.



## ఇరువదియారవ ప్రకరణము



## ఫ్రెంచి విప్లవముతో పోరాటము

### (The Struggle against revolutionary France)

ఫ్రాన్సుదేశములో (1789) మహా విప్లవ ముత్పత్తిల్లెను. పదునాలుగవ లూయీ మున్నగురాజులు ఫ్రెంచిదేశమనిన యూరపు ఖండమంతయు కంపమందునట్లు చేసిరి. దుర్భరములగు పన్నులు విధించి, ప్రజాపీడనము సల్పుటచే నా రాజులట్టి శౌర్యప్రతాపములు చెల్లించుకొనిరేగాని, నిజమునకు ఫ్రాన్సు జాతి అనేక శతాబ్దములుగా క్రుంగి కుమిలిపోయి నిస్తేజమై యుండెను. ఆ దేశములో రైతు నూరు ఫ్రాంకులు సంపా

దించినచో 81 ఫ్రాంకులు పన్నిచ్చుకొనుచుండెను. ఈ భారమునకు తోడు పూర్వాచారముచొప్పున భూస్వామికి రైతు సల్పవలసిన వివిధములగు సేవ లన్నియు నిలిచియుండెను. పోనీ ఆ భూస్వాముల స్థితియైన బాగుగ నున్నదేమో యనిన అదియు నట్టిదే. దేశమునకు వారివలన నయ్యెడిది కాసువీసము లేదు. ఆంగ్లభూస్వాములవలె, పరిపాలనమున వారికి చోటులేదు. రాజసభ నలంకరించుచు సౌఖ్యము ననుభవించుకొనుటయే వారి పని. అదియే రాజు అభీష్టము. అసలు పరామరిక లేక వారి జమీనులు పాడగుచుండెను. వారికి పన్నుల బాధలేదు. న్యాయస్థానములలో వారికి కొన్ని ప్రత్యేక స్వత్వములుండెను. ఇక నగరములోని వ్యాపారము చూతమన్న అది నానాటికి తీసికట్టుకాదొడగెను. నగరపాలనమున స్వాతంత్ర్యము లోపించెను. క్రమముగా దేశమున నర్థస్థితి యడుగంటదొడగెను. పరాసు కేనితో నొక గ్రంథకర్త యిట్లు పల్కెనట. "దేశమును దరిద్రదేవత పాలుచేసితివి. మిన్నంటుపొగడ్త లందుచుంటివి. ప్రకృతి జనుల యెమ్ములపై సింహాసనము నిర్మించుకొంటివి."

చిరకాలమునకు మరల 1789-వ సం॥లో ఫ్రెంచి పార్లమెంటు సమావేశమయ్యెను. కర్షకులును సామాన్య గృహస్థులు నేకమై రాజ్యతంత్రమును మార్చుటకు కృతనిశ్చయులైరి. పారిసునగరమున నాకటి కల్లాడి పోవుచున్న మూకలు వీరికి ఆలంబనమును గుదిబండయు గూడ నైరి. ఎట్టులో నూతనరాజ్యతంత్రము నిర్మించి రాజుయొక్క అధికారములకు మితి యేర్పరచిరి. అంతట 1792-వ సం॥లో ఆస్ట్రియా, ప్రష్యా దేశములు ఫ్రాన్సుపై దండెత్తెను. ఫ్రాన్సునకు వాటిల్లిన ఆ విపత్సమయమున, విప్లావకులలో నతివాదులగు వారికి ప్రభుత్వము వశమయ్యెను.

1792-వ సం॥ సెప్టెంబరునెలలో ఫ్రాన్సుదేశమున ప్రజాతంత్రము (Republic) చాటబడెను. రాజును చెరబెట్టిరి. ఆ సంవత్సరాంతమునకే ఫ్రెంచి సైన్యములు ఆస్ట్రియా ప్రష్యాదేశములపై పోయి పడెను. రాజగు పదునారవ లూయి 1793-వ సం॥ జనవరినెలలో నురికంబమెక్కెను.

## ఇంగ్లండు యుద్ధములో దిగుట (1-2-1793)

**(England joins the war—February 1st 1793)**

పిట్టుకు ఫ్రాన్సుతో యుద్ధమునకు డీకొనవలయునను కోరిక లేదు. చూడుడు 1792-వ సం॥ ఫిబ్రవరినెలలో నేమనిచెప్పెనో:- "యూరపులోని స్థితిగతులచే మున్నెన్నడు లభింపని చక్కని యవకాశము మన దేశమునకు లభించినది. పదునైదు వర్షముల పాటు మనము శాంతిమై కాలము గడపవచ్చును." ఆంగ్లప్రజలలో చాలమందికి ఫ్రెంచి విప్లావకులపై నాదరాభిమానములు కలవు. అంతలో ఫ్రెంచివారు ఆస్ట్రియాలో నెదరులాండ్సు (Netherlands) నాక్రమించి, మీ మీ రాజుల పీడ వదల్చుకొనుడని యూరపులోని ప్రజల నెల్లరిని హెచ్చరించిరి. ఫ్రెంచిసైన్యములు బెల్జియములో కాలిడగనే, ఎప్పటివలె ఇంగ్లండుకు కాకపుట్టెను. ఫ్రెంచిప్రభువుల నెందఱనో హతమార్చుటయు, పదునారవలూయి నురిదీయుటయుగూడ నా సమయముననే సమకూడెను. 1793-వ సం॥ ఫిబ్రవరినెల మొదటి దినమున ఇంగ్లండు హాలండు దేశములపై కాల్ద్రవ్వెను (యుద్ధము ప్రకటించెను.) పిట్టు కీయుద్ధ మిష్టములేదు కాని యుద్ధము త్వరలో ముగియు నని తలచెను.

ఈ పోరాటములో 1793, 1795 వత్సరముల మధ్య ఇంగ్లండు కొంతకాలము ఆస్త్రియా, ప్రష్యాలతోగూడియు, మఱొకప్పుడు స్పెయినుతో నేకీభవించియు ఫ్రాన్సుతో పోరెను. ఈ రణమున భూమిపై నెచటను ఇంగ్లండు జయింపలేదు. కాని 1794-వ సం॥ జూన్ నెల 1-వ తేదీని అట్లాంటికు సముద్రమున ప్రవర్తిల్లిన యుద్ధములో 'హోవు' సేనాని (Admiral Hove) జయమందెను. ఆ వత్సరమే ఏప్రిలు నెలలో ప్రష్యాదేశము ఫ్రాన్సుతో సఖ్యపడెను. త్రికాలములయం దింతటి సేనాధిపతి లేడనిపించుకొన్న ఫ్రెంచి సేనాధిపతి 'నెపోలియను బోనపార్టి' (Nepoleon Bonaparte) ఆ సంవత్సరమే ఒక్క యుదుటున ప్రసిద్ధివడసెను. నెపోలియను ఇరువది దినములలో ఇటలీదేశమును జయించి, 1797-వ సం॥లో ఆస్త్రియాను పాదాక్రాంత మొనర్చుకొనెను. అంతట ఇంగ్లండు ఫ్రాన్సుతో నొంటిమై పోరవలసివచ్చెను. 1797-వ సం॥ అక్టోబరు నెలలో నెపోలియను "మన మీ ఆంగ్లరాజ తంత్రమును తుదముట్టింపకుంటిమేని, ఆ ద్వీపవాసులు మిన్నకుండక మన ప్రజాతంత్రమును రూపుమాపగలరు. కావున నావికాదళమును పెంపొందించుకొని ఇంగ్లండు రూపుమాపుటయే మనకు కర్తవ్యము. ఈ పని దీర్చితిమేని యూరపు మనకు పాదాక్రాంతమగును" అని చెప్పెను.

ఇంగ్లండు ఏకాకియై ఫ్రాన్సును భూమిపై జయింపనోపదు. దాని యాశలన్నియు నావికాదళముపై నున్నవి. ఫ్రెంచి నావికాదళము సుస్థితిలో లేకున్నను, స్పెయిను, హాలండు దేశముల సముద్రదళములు ఫ్రాన్సువశమునందే యుండెను. సెయింటు విన్సెంటు (St. Vincent) కడ, స్పానిషుదళమును

(1797–వ సం॥ ఫిబ్రవరినెల) కాంపరుడౌను (Camperdown) చెంత డచ్చిదళమును (1797–వ సం॥ అక్టోబరునెల) ఇంగ్లండు జయించెను. అట్లు జయశీలమయ్యును ఆంగ్లనౌకాదళము సుస్థితిలో లేదు. 1797–వ సం॥ ఏప్రిలునెలలో 'స్పిట్ హెడ్' (Spithead) చెంత ఆంగ్లనావికులు తిరుగుబాటు సల్పి తమ జీతములు హెచ్చించి క్రమముగా నీయవలెనని పట్టుబట్టిరి. 1797–వ సం॥ మేనెలలో థేమ్సునదీముఖమున మరల నట్లే తిరుగబడిరి. ఫ్రెంచి విప్లవము గాలి ఇంగ్లండునకుగూడ సోకుటయే యీ తిరుగుబాటులకు మూలకారణము. ఈ తిరుగుబాటులు సాధింపగలిగిన దేమియు లేదుగాని, అవి అసంతృప్తికి లక్షణములు. సైన్యమున నిట్టి తిరుగుబాటులు క్షేమకరములుగావు. వీనికన్న విప్లవమే నయము.

ఇంగ్లండుపై దండెత్తవలయు నని నెపోలియను ముఖ్యాభీష్టము. ఆ కోర్కె నెరవేరవలయునన్న ఆంగ్లనావికాదళమును ఏమరించి దూరదేశముల కంపవలయును. కావున నాతడు 1798–వ సం॥ మేనెలలో ఈజిప్టుదేశమునకు బయనమయ్యెను. తెప్పపాటంతలో ఈజిప్టు నాక్రమించెను. కాని యుత్తరక్షణముననే యనర్థముకూడ జనించెను. 1798–వ సం॥ ఆగస్టు ప్రథమ దివసమున, మధ్యధరాసముద్రములో నున్న ఆంగ్లనౌకాదళమునుగొని, నెల్సను సేనాని (Admiral Nelson) ఫ్రెంచి నౌకాదళమును నైలు యుద్ధమున (Battle of the Nile) నోడించెను. ఆ విజయముచే ఆంగ్లనౌకాదళ ప్రతిష్ఠ యినుమడించుటయు, నెపోలియను ఈజిప్టులో నిస్సహాయతమై చిక్కుటయు తటస్థించెను. ఫ్రెంచి సంగ్రామచరిత్రమున నీ విజయము

అతి ముఖ్యము. నెపోలియను సంతతము సిరియాదేశమును జయింప జూచెను కాని వెండియు ఏకరు (Acre) చెంత ఆంగ్లనౌకాదళ మడ్డుపడెను. ఇంతలో ఇటలీదేశము ఫ్రాన్సు చేతులనుండి జారిపోయెనని వార్త వచ్చుటచే నెపోలియను వెంటనే స్వదేశ మునకేగి ప్రధానోద్యోగిత్వ (First Council) ప్రభుత్వమును వశమొనర్చుకొనియెను.

1798-వ సం॥లో ఇంగ్లండు, ఆస్ట్రియా, రష్యాదేశములచేగూడ ఫ్రాన్సుపై సమ్మె గట్టించెను. కాని మరెంగో (Marengo) హోహెన్‌లిండెను (Hohenlinden) ల కడ నెపోలియను ఆస్ట్రియా సైన్యములను రూపుమాపుట (1800) చే ఆస్ట్రియా, ఫ్రాన్సుతో మరల సంధి యొనర్చుకొనెను. రష్యాకూడ నస్ట్రియా ద్రొక్కిన త్రోవనే యనుగమించెను. అంతట ఇంగ్లండు ఫ్రాన్సు దేశములుగూడ అమియెన్సు (Amiens) కడ 1802-వ సం॥లో సంధి గావించుకొనెను. ఉభయులును తాము ఆక్రమించిన ప్రదేశములను వదలుకొనిరి. 'పీడుమాంటు' (Piedmont) 'లంబార్డీ' (Lombardy) 'హాలండు'లు మాత్రము ఫ్రెంచివారికి విడిచిపెట్టబడెను. కాని ఈ సంధి పదునాలుగు మాసముల కాలముమాత్రమే నిలిచి మరల యుద్ధము ప్రారంభమయ్యెను.

## గ్రేటుబ్రిటను ఐర్లండు ఏకమగుట—1800 సం॥

**(The Union of Great Britain and Ireland)**

ఈవల ఫ్రాన్సుతోడ పోరాటమున చిక్కియుండగనే పిట్టునకు ఆవల ఐర్లండున నింకొక సంకట ముదయించెను. పదు నెనిమిదవ శతాబ్ది పూర్వభాగమున మిన్నకయున్న ఐర్లండు, ఉత్తరార్ధమున 'హెన్రీగ్రాటను' (Henry Grattan) అను ప్రొటె

స్టంటు ముఖమున తన మనోభీష్టమును వెల్లడించెను. బ్రిటనుతో స్వేచ్ఛావాణిజ్యము సలుపవలయు నని ఐరిషుప్రజాసభచే నాతడు తీర్మానింపజేసెను. 1780-వ సం॥లో బ్రిటిషుపార్ల మెంటు కూడ, వ్యాపారవిషయమున ఐర్లండునకు సమత నంగీకరింపవలసినదాయెను. 'పాయినింగ్సు ఆక్టు' (Poynings Act) వలన ఐరిషుపార్లమెంటు, బ్రిటిషుపార్లమెంటునకు లోబడి యుండెను. ఈ యాక్టును రద్దుసలుపుటకు గ్రాటను కృతనిశ్చయుడయ్యెను. కాథలిక్కులు, ప్రొటెస్టంటులుగూడ నాతని కండయై నిలిచిరి. తుదకు బ్రిటిషుపార్లమెంటు లొంగిపోయెను. 1782-వ సం॥ మొదలు 1801-వ సం॥ వఱకు ఐరిషు పార్లమెంటు స్వేచ్ఛగా వ్యవహరించెను. కాని కాథలిక్కులకా పార్లమెంటులో ప్రవేశములేమి జేసియు, ఎన్నికల పద్ధతి ఇంగ్లండులోవలెనే లోపభూయిష్ఠమగుటచేతను, వైస్రాయి ప్రముఖులగు కొందఱు పార్లమెంటును హస్తగతమొనర్చుకొనుటచేతను, ఆ స్వేచ్ఛ యథార్థము కాక నామమాత్రమే యయ్యెను.

ఈ స్థితిలో ఫ్రెంచి విప్లవ ఝంఝామారుతము ఐర్లండున్ఝూతలూచెను. ఐర్లండును సర్వస్వతంత్ర మొనర్చుటకై ప్రొటెస్టంటులు కాథలిక్కులు నేకమై, చాటుచాటున ఆలోచనలు సల్పిరి. ఇట్లు రహస్యముగ రాజిరాజి తుదకు 1798-వ సం॥లో గుప్పుమనియెను. ఈ తిరుగుబాటునకు 'ఉల్ఫుటోను' (Wolfe Tone) 'లియొనార్డు ఎడ్వర్డు పిట్జుగెరాల్డును (Leanard Edward Fitzgerald) అను నిర్వురు ప్రొటెస్టంటులు నాయకులైరి. ఫ్రెంచి దేశీయులు త మ్మాదుకొందురని వారియాశ. కాని మతభేదములు దీని కడ్డువచ్చెను. ఐరిషు ప్రజాతంత్రము పురోహితవర్గముచే జిక్కుట చూచి ప్రొటెస్టంటులు సహింపజాలరు.

బ్రిటనుసంగ్రామమున జిక్కియుండుటచే ఈ తిరుగుబాటు నడంచుటకు సహాయ మవసరమయ్యెను. కాథలిక్కు ప్రతి పక్షులగు ఐరిషు రాజభక్తులపుడు బ్రిటనునకు తోడ్పడిరి. వీరు ప్రతి పక్షులగు నా ఐరిషు కాథలిక్కులను దారుణవ్యథల పాల్పరచిరి. అపుడు ప్రవర్తిల్లిన యీ పరస్పరహింసలు కాథలిక్కులకు ప్రొటెస్టంటులకు తీరని వైరమును తెచ్చిపెట్టెను.

ఈ తిరుగుబాటుతో ఐరిషుపార్లమెంటు నాయకుల కెట్టి జోక్యమును లేకున్నను, పిట్టు ఆ పార్లమెంటును స్వేచ్ఛగా నుంచుట క్షేమముకాదని తలచెను. సంకటసమయమున తల చూపిన యీ తిరుగుబాటునకు, శాంతిస్థాపనమే అవసర ప్రతి క్రియగా నూహించి, తక్షణమే యాతడు ఐర్లండు నింగ్లండుతో కలుప నిశ్చయించెను. ఆ యైక్యము ఐరిషు పార్లమెంటుద్వార మున సిద్ధింపవలయునుగాన 1799-వ సం.లో ఎన్నికలు జరిపించిరి. ఐరిషు ప్రభుత్వమువారు తమ పక్షమే నెగ్గవలయునని గట్టి యత్నములు చేసిరి. కాథలిక్కు మతాచార్యు లీ యైక్యమునకను కూలురు. ఈ యైక్యముచే తమకు బాధాకరములగు శాసనము లెల్ల తొలగిపోవునని వారి యాశయము. ప్రభుత్వపక్షమున కిది బలము చేకూర్చెను. రెండు సభలు నీ యైక్యము నంగీకరించుటచే 1801-వ సం॥ జనవరినెల ప్రథమదినమున ఐరిషు పార్లమెంటు అంతరించెను. అదిమొదలు బ్రిటిషుపార్లమెంటులో ప్రజాసభకు రెండువందల మందిని, ప్రభుసభకు ముప్పది యిద్దఱను ఐర్లండు ఎన్నుకొనుచుండెను.

దీనితోపాటు ఐర్లండులోని ప్రొటెస్టంటు చర్చియు, ఇంగ్లండు చర్చియు నేకమయ్యెను. అట్టి స్వతంత్రతనే కాథలిక్కుల కొసగుటకు మూడవ జార్జికిని, టోరీలకును ధైర్యము

చాలకపోయెను. 28 సంవత్సరములపాటు వారికి బ్రిటీషు పార్లమెంటులో ప్రవేశము లభించలేదు. తుదకు 'కాథలిక్కు రిలీఫు బిల్లు' (Catholic Relief Bill) నకు జార్జి యంగీకరింపక పోవుటచే 1801-వ సం॥లో పిట్టు మంత్రిత్వమును చాలించుకొనెను. ఆ బిల్లువలన కాథలిక్కులకు ఉభయదేశములందును పౌరస్వాతంత్ర్యములు పూర్ణముగా లభించెడివి. ఆ సమయముననే ప్రజాసభలో మరల భిన్నవర్గములు తలచూపెను. విగ్గుల పక్షము ప్రబలముగా లేదు. టోరీలలో బహు నాయకత్వము. తుదకు 1807-వ సం॥లో నెపోలియను ఉపద్రవము నెదుర్కొనుటకు టోరీలందఱు మరల నేకమైరి.

## యుద్ధము మరల ప్రారంభించుట 1803-వ సం॥

1803-వ సం॥ మేనెలలో యుద్ధము మరల ప్రారంభమయ్యెను. 1804-వ సం॥ ఏప్రిలునెలలో పిట్టు మరల మంత్రియై 1806-వ సం॥లో మరణించెను. 1805-వ సం॥లో నాతడిట్లో రష్యా, ఆస్ట్రియా, స్వీడను దేశములనుకూడగట్టుకొని ఫ్రాన్సుపై కత్తి గట్టెను. ప్రష్యా కొంతకాలము తటస్థముగా నుండెను. బవేరియా, జర్మనీ, ఇటలీ దేశములలో నొక్కటూరిగా ఫ్రెంచిదళములనాక్రమింపవలయునని రష్యా తన మిత్రవర్గమును నూల్కొలిపెను.

నెపోలియను ఇంగ్లండుపై దాడివెడలు ప్రయత్నము వీడలేదు. అందులకు ప్రబలమగు సైన్యము వలయును. ఆ సైన్యము నింగ్లండు చేర్చుటకు తగినన్ని యోడలు కావలయును. ఆ యోడలను రక్షించుటకు సముద్రదళము అవసరము. సైన్యమున్నదిగాని యోడలు చాలవు. నావికాదళ

లోపమును సవరించువాడై, అందులకు ప్రతారణము సాధనముగా నవలంబించి తన నావికాబలమును అట్లాంటికు సముద్రముపై నటునిటు త్రిప్పదొడగెను. ఆంగ్లదళములు వానిని వెంటాడెను. ఫ్రెంచిదళములు వెన్నిచ్చిపాఱి తుదకు తమ రేవులలో తల దాచుకొని నడపాడలేకుండ బోయెను. పిమ్మట ట్రఫాల్గరు (Trafalgar 21-10-1805) యుద్ధములో నెల్సను, ఫ్రెంచి, స్పానిషు నావికాదళములను రూపుమాపెను. ఆంగ్లనావికాదళములుదుర్జయము లనిపేరు మ్రోగెను. భూభాగమునమాత్రము, ఆంగ్ల మిత్ర మండలికి నలుదెసల నపజయమే వాటిల్లెను. ఆస్టర్లిట్జి (Austerlity 1805) చెంత ఆస్ట్రియా సైన్యములును, జీనా (Gena 1806) కడ ప్రష్యా బలములును, రూపుమాసిపోయెను. అనంతరము రష్యాకూడ ఫ్రీడులాండు (Friedland 1807) చెంత నోడిపోయి, నాలు గేండ్లపాటు ఫ్రాన్సునకు మిత్రమయ్యెను. రష్యా, ప్రష్యా, ఆస్ట్రియా, హాలండు, బెల్జియం, ఇటలీదేశములను నెపోలియను తనచేతి కీలుబొమ్మలుగావించుకొనెను. 1804-వ సం॥లో నాతడు చక్రవర్తియయ్యెను. "అంతటను ఇంగ్లండే కలదు. ఇక దానితోడనే మనకు పోరాటము" అని నెపోలియను అనెనట.

## కాంటినెంటలుపద్ధతి: తత్ఫలితము

నెపోలియను, ఇంగ్లండును వంచుటకు తద్వాణిజ్యమును మాపనెంచెను. బ్రిటను తోడను దానికాలనీలతోడను ఎవ్వరును వర్తకము నలుపగూడదని, యాతడు యూరపుపై నాంక్షవైచెను. (1806—1807) సం॥ ఫ్రెంచి స్వాధీనమందున్న యూరపులోని భాగములతో నెవ్వరును వర్తకము నలుపకుండ చేయుదు పని



HORATIO VISCOUNT NELSON
Painting by L, F. Abbott.
(By kind permission of National Portrait Gallery, London.)

ఇంగ్లండు మారుపలికెను. ఈ యాంక్షలు కొనసాగవలయు నన్న సముద్రప్రదేశము అవసరము. ఇంగ్లండునకు చాలినంత నావికాబలముండుటచే అది వైచిన యాంక్షనెగ్గెను, ఫ్రాన్సు వేసిన యాంక్షనెగ్గదయ్యె. ఫ్రాన్సునకు తేయాకు కాఫీ, చక్కెర, దూది చాలినంత లేదు. ఇంగ్లండు సరకులను అమెరికానుండి యూరపులో దిగుమతి కాకుండ చేసెను. నెపోలియను తన సైన్యమునకు గావలసిన కొన్ని దుస్తులు యార్కుషైరునుండి చాటుగా తెప్పింపవలసివచ్చెను.

ఈ లోపల ప్రష్యా, రష్యాదేశములకు, ఫ్రాన్సు కనుసన్నలో మెలగుట దుస్సహమయ్యెను. ప్రష్యాజాతిలో నూతన భావప్రచారము చెలరేగెను. రష్యా కాంటినెంటలు పద్ధతిని మీరి ఆంక్షను భంగపరచెను. నెపోలియను వెంటనే రష్యాను శిక్షింప సమకట్టెను. అది యాతడొనర్చిన రెండవ పొరబాటు. స్పెయిను దేశమును జయింపనెంచుట యాతని మొదటి పొరబాటు.

## పెనిన్సులాయుద్ధము (Peninsular War)

ఇంగ్లండునకు పోర్చుగలుకు చిరమైత్రి. 1807-వ సం॥లో నెపోలియను పోర్చుగలుపై దండెత్తెను. 1808-న సం॥ స్పెయిను రాజగు నాలుగవ చార్లెసును పదభ్రష్టునొనర్చి, తన తమ్ముడు జోసెఫు బోనపార్టు నాగద్దెపై నెక్కించెను. స్పానిషుప్రజలు ఈ యవమానము సహింపజాలక క్రోధవివశులై యొక్కుమ్మడి తిరుగబడి, తమకు సుపరిచితములగు కొండదారులలోను లోయలలోను మూడులక్షల ఫ్రెంచిసైన్యము కలయించుచు ముప్పతిప్పలు పెట్టిరి. నెపోలియను స్వయముగావచ్చి దండు



DUKE OF WELLINGTON.
Painting by J. Jackson
(By kind permission of the National Portrait Gallery, London.)

నడఫుటకు తీరదయ్యెను. అతడు వచ్చినను వారితో డీకొనుట దుస్తరమయ్యెడిదే.

వెలింగ్టను ప్రభువు (Duke of Wellington Arthur Wellesley) తొమ్మిదివేల సైన్యమును వెంటగొని 1808-వ సం॥లో పోర్చుగలుదేశములో నడుగుపెట్టెను. 1803-1805 సంవత్సరముల మధ్యఇండియాలో వాసికెక్కిన యోధుడితడు. సైన్యములను చక్కనియదుపు ఆజ్ఞలలో నిలుపుటయందును, సైన్యసంచారమునందును ఈయనకు మంచినైపుణ్యము కద్దు. ఈతని సర్దారులుపోర్చుగలుదేశపు ముక్కుడి మూకలను సుశిక్షితములు గావించుకొని, ఫ్రెంచివారినా దేశమునుండి శీఘ్రముగా తరిమివేసిరి. ఈ విధముగా పోర్చుగలు సందజేసికొని వెల్లింగ్టను, 30,000 బ్రిటిషుసైనికులతో 1809-వసం॥లో స్పెయినుతో ప్రవేశించెను. ఇంతలో ఆంగ్లనౌకావ్రజము, వలయు వస్తుసామగ్రిని, సైన్యములను గొనివచ్చి పోర్చుగలుచేర్చెను.

1807-వ సం॥లో వెల్లింగ్టను 'తలవీర' (Talavera) చెంత జోసెఫు బోనపార్టును నిర్జించి, మరల పోర్చుగలుచొచ్చి సురక్షితముగా నుండెను. తుట్టతుదకు 'సాలమంకా' (Salamanca) యుద్ధమున (1812), నిస్సంశయమగు విజయమునంది, 1813-వ సం॥లో విట్టోరియా (Vittoria) విజయముతో ఫ్రెంచివారిని పిరనీసు పర్వతములు దాటకొట్టెను. 1814-వ సం॥లో ఫ్రాన్సు పైదండు విడియుట కాతని కవకాశము కలిగెను. ఒక వంక నిట్లు పెనిన్సులా యుద్ధములో మునిగియుండియు, నెపోలియను రెండవవంక రష్యా నాక్రమింపవెడలెను. రెండు గొప్పదేశముల నొక్కతూరి యాక్రమించుట సామాన్యముకాదు. ఈ దుర్ఘట కార్యమునకై ఫ్రెంచిసైన్యములను ప్రబలములగు రెండుభాగ

ములుచేయవలసివచ్చెను. అట్లు విభజించుటయే అపాయ కరమయ్యెను. రష్యా పెనిన్సులా యుద్ధములు రెండును ఫ్రెంచి విజయములు కాజాలవు. ఈవల వెల్లింగ్టను, స్పానిషుబలముల యొక్కవోని యుత్సాహమునకుతోడై ఫ్రెంచివారి నోడింప, రెండవవంక రష్యాదేశమునందలి దారుణశైత్యము విజయమందెను.

## నెపోలియనుపై తుదిదాడి

రష్యాపై దాడిలో ఫ్రెంచిసేనలలో, మృతులు వ్రణితులు మొత్తము 5 లక్షలు నష్టమైరి. 1813-వ సం॥లో మరల 7 లక్షల సైన్యమును గూర్చుకొని నెపోలియను సాక్జనీ (Saxony) పైనెత్తి విడిసెను. ఆస్ట్రియా, రష్యా, ప్రష్యా, బవేరియా సైన్యము లాతని నెదిర్చెను. ఉభయసైన్యములకు 'లీప్‌జిగు' (Liepzig 18-10-1813) చెంత సమరము ప్రవర్తిల్లెను. నెపోలియను వెనుకకు మరలవలసివచ్చెను. అవ్వల వెల్లింగ్టను స్పెయినులో విజయపరంపరల నందుచుండెను. ఫ్రెంచిసైన్యములకు వైరి సైన్యము లైదింతలుండెను. వైరులు ఫ్రాన్సుపై నెత్తివచ్చిరి. తుదకు 31-3-1813 నాడు వైరిమండలి పారిసునగరమున బ్రవేశించెను. 13-4-1814 తేదీని నెపోలియనుకు ఫ్రాన్సు దేశము విడిచి 'ఎల్బా' (Elba) దీవియందు నివసింపుమని కట్టడ చేసిరి. పదునెనిమిదవ లూయీని ఫ్రాన్సు సింహాసనము నెక్కించిరి. మేనెల ముప్పదవ దినమున జరిగిన పారిసు సంధితో యుద్ధము ముగిసెను.

ఆత్మ రాజ్యమును కైవస మొనర్చుకొనువాడై నెపోలియను మరల (1-3-1815) ఫ్రాన్సులో దిగెను. ఆతని పూర్వసైనికులు రెండులక్షలమంది యాతని ననుగమింప సంసిద్ధు

నైరి. ఆ సైన్యముతో బెల్జియము జేరఁబోయెను. శత్రు దేశముల సైన్యములెల్ల నచట వెల్లింగ్టను నాయకత్వమున ఆతని నెదుర్కొనియెను. వానిలో నెల్ల 'బ్లుచరు' (Blucher) సేనానియొక్క ప్రష్యను సైన్యములు చాల గట్టివి. జూన్ నెల 16-వ తేది 'లిగ్నీ' (Ligny) చెంత బ్లుచరు పరాజితుం డయ్యెను. 'క్వాట్రబాస్' (Quatre Bas) చెంత ఫ్రెంచి సేనాపతియగు 'నే' (Ney) తో వెల్లింగ్టను పోరెను. కాని జయ మెవరిని వరింపదయ్యె. వాటర్లూ (Waterloo) చెంత నెపోలియను అనుకూల ప్రదేశమున దన మొనలదీర్చి యుండెను. బ్లుచరు తూర్పుదిక్కుగా పారిపోవుచుండెనని ఆతని యూహ. (జూన్ నెల 15-వ తేది) నెపోలియను వెల్లింగ్టనుల సైన్యము లైదు గంటలసేపు పోరాడెను. ఆ సమయుద్ధమున విజయ మాంగ్ల పక్షముననే యించుక మ్రొగ్గుచున్నట్లుండెను. సాయంత్రము 4 గంటలవేళకు బ్లుచరు తన సైన్యములతో వచ్చి పడి ఫ్రెంచివారి యపజయమును నిర్ణయించెను. జూలైనెల 7-వ తేదీని బ్లుచరును వెల్లింగ్టనును తమ సేనలతో పారిసునగరమునఁజొచ్చిరి. జూలైనెల 15-వ తేది నెపోలియను లొంగిపోయెను. ఆయనను 'సెయింటు హెలీనా' (St. Helena) దీవికి పంపిరి. ఆతడచటనే 5-5-1821-వ సం॥న మరణించెను.

## వియన్నా కాంగ్రెసు

యూరపునందలి ప్రభువులందఱు వియన్నానగరమున సమావిష్టులై రెండు సంవత్సరము లాలోచించి తుదకు 1815-వ సం॥ జూన్ నెల 9-వ తారీఖున యూరపుఖండ భావిభాగ్య నిర్ణయ విషయమున ఏకాభిప్రాయులై సంధిపత్రమున సంతకములు

పెట్టిరి. పదునెనిమిదవ లూయీ ఫ్రాన్సుప్రభువుగా చేయబడెను. ప్రష్యాకు కొంత నూతన రాజ్యభాగము చేర్పబడెను. జినోవా (Genoa) వెనిసు (Venice) తక్క తక్కిన యిటలీరాష్ట్రములు ఆయా ప్రభువుల కొసగబడెను. బెల్జియమును హాలండుదేశమున కలిపిరి. అట్లే నార్వేస్వీడనులు ఏకచ్ఛత్రము క్రిందికి తేబడెను. మరి 15 వత్సరములకు బెల్జియము హాలండులు మరల విడిపోయెను. 1915-వ సం॥లో నార్వేస్వీడనులుకూడ చీలిపోయెను. ఉత్తర సముద్రము (North Sea) నందలి 'హెలిగోలాండు'ను, (Heligoland) మధ్యధరా సముద్రమునందలి మాల్టాద్వీపమును, గుడ్‌హోపు కేపును (Cape of Good Hope) సింహళద్వీపమును ఇంగ్లండు వంతునకు వచ్చెను. న్యాయమైన రుసుములిచ్చినచో యూరపునందలి అన్ని దేశములవారికి, అన్ని నదులయందును వ్యాపారము చేసికొను నధికారముండు నని ఆ కాంగ్రెసులో నంగీకరింపబడును. మఱియు యూరపునందన్ని ప్రభుత్వములును బానిసలవ్యాపారమునెడల అసమ్మతి దెలిపెను.

1812, 1814-వ సంవత్సరములమధ్య ఇంగ్లండు, అమెరికా నుండి వచ్చు ఓడలను పరిశీలింపసాగుటచే ఉభయదేశములకు కయ్యముసాగెను. ఘెంటు (Ghent) సంధితో (24-12-1814) నా కయ్య మంతరించెను.

---

# ఇరువది రెండవ అధ్యాయము

## చర్చి. పారిశ్రామిక పరివర్తనము, జార్జి మూఁడవరాజు సంస్కరించుట

## చర్చి. జానువెస్లీ (The Church and John Wesley)

పదునెనిమిదవ శతాబ్దిలో చాలమంది పురోహితుల స్థితిగతులు బాగుపడజొచ్చెను. వారి యాస్తులలో పనికివచ్చు వస్తువు పురోహితుల కాదాయము. ఆ యాస్తుల విలువ హెచ్చుచుండుటచే పల్లెలందలి భూస్వాములు మెల్లగా తమ బిడ్డలను పురోహిత (Clergy) వృత్తిలో ప్రవేశపెట్టసాగిరి. చర్చి పూజారులకు పురోహితులకు (Clergy) సంఘమునందు మన్నన యధికమయ్యెను. కాని మతాభినివేశము, మతభక్తి సన్నగిలుచుండెను. మతబోధలు నిస్సారములై హృదయాకర్షకము లగుటకుమారు పాండిత్య ప్రకర్షద్యోతకములు కాజొచ్చెను. విద్యాగంధమును, సంసారసౌఖ్యమును లేని పేదలకు చర్చి నిరుపయోగమయ్యెను. జానువెస్లీయను నతఁడు పేదల నుద్ధరించువాఁడయ్యెను.

జాను వెస్లీయు, అతని తమ్ముఁడు చార్లెసును, మరి పంద్రెండుగురు కూడి ఆక్సుఫర్డులో 1729-వ సంవత్సరమున నొక చిన్న సంఘముగా నేర్పడి దీనజనోద్ధరణమునకై కృషి సల్పసాగిరి. రోగుల కుపచారము సల్పుట, కారాగారములయందు భయంకరావస్థలపాలైయున్న ఖైదీల పరామర్శించుట వారిపని. జీవితమునం దొక్కొక్కప్పుడు విచిత్రమగు మార్పు కలుగుటచే ప్రజలకు ఆస్తిక్యమును ఈశ్వరారాధనరతియు నలవడు నని వెస్లీ యుద్దేశము. జార్జి వైటుఫీల్డు (George Whitefield) అను నొక గొప్ప బోధకుడు వెస్లీమతమును చక్కఁగా ప్రచారము చేయ

దొడగెను. మతబోధకుల పాండిత్యముతో పనిలేని దీన మానవకోటికి హృదయములు కరగించు వెస్లీమతప్రచారము కర్ణరసాయనమగుడు తన్మతావలంబన మొనర్పజొచ్చెను. ఇంగ్లండు చర్చియందు వెస్లీకి విశ్వాసము లేకపోవుటచే వెస్లీయను పద్ధతి నొక చర్చి స్థాపింపబడెను. ఆ చర్చి ఇంగ్లండు వేల్సు, అమెరికాలలో నతిశీఘ్రముగా ప్రచారమయ్యెను. తద్బోధలచే పేదసాదలు తమ కష్టములు మఱచి యీశ్వరభక్తులుగా దొడగిరి. ఈశ్వరభక్తి వారి దుఃఖమయ జీవితములయెడ క్రొత్త యింపు సంపాదించిపెట్టెను. అప్పుడప్పుడే తలచూపుచున్న పారిశ్రామిక పరివర్తనముచే, పల్లెలలోను పట్టణములలోనుగూడ పేదసాదల యవస్థ దుర్భరమై, భయంకర విప్లవ సూచనలు కనుపట్టుచున్న తరుణమున, వెస్లీయను పద్ధతి, తద్విప్లవ మేఘములకు ఝంఝామారుతమువలె నడ్డపడియెను.

## పారిశ్రామిక పరివర్తనము (The Industrial Revolution)

పదునెనిమిదవ శతాబ్ద మధ్యమున ఆంగ్ల వ్యవసాయ వృత్తియందు మార్పులు పొడచూపెను. చిన్న చిన్న రైతులను తొలగించి, పెద్ద పెద్ద ఖండముల నాకట్టుకొని కొందఱు వ్యవసాయమున నూతన పద్ధతుల నవలంబించి, భూసారమును వృద్ధిచేయ దొడగిరి. బీజారోపమునందును, సస్యరక్షణమునందును క్రొత్తమార్గములు వెలసెను. క్రొత్తగా టర్నిప్పులను పండింపదొడగుటచే పశువులకు మంచి యాహారము లభించి పాడికూడ వృద్ధియయ్యెను. ఈ మార్పులచే కొలదిపాటి వ్యవసాయకులకు నష్టము వాటిల్లుట నిజమేగాని, దేశమునకు వలసిన పాడిపంటలు వృద్ధియగుటచే, ఫ్రాన్సుతోడి

యుద్ధముచేయు దినములలో ఇంగ్లండు నీ పద్ధతి చాల ఆదుకొనెను.

ఈ వ్యవసాయ పరివర్తనముతోపాటు ప్రాచ్యపు పరిశ్రమలు కూడ క్రొత్త రూపము దాల్చసాగెను. చాలకాలమునుండి ప్రవాహవేగముచే యంత్రములు నడుపుచుండెడివారు. ఆ యంత్రములు కొయ్యతోను, రాతిముక్కతోడను చేసెడివారు. ఈ యంత్రములచే సామగ్రి యధికముగా నుత్పత్తిచేయుటకు వలనుపడదు. పట్టునేత మున్నగు కొన్ని పరిశ్రమలు మాత్రము ఆ నీటిమరల సాయముననే అధికముగా సాగుటయు కలదు. ఎంత కష్టించినను చేతులమీద పనులు పూర్తికావలయును గనుక పదార్థోత్పత్తి చాల తక్కువగా నుండెడిది. ఈ స్థితిలో పదునెనిమిదవ శతాబ్ది చివరభాగమున కాయకష్టము తొలగి, లోహయంత్రములచే వస్తువు లుత్పత్తిచేయుట ప్రారంభమాయెను. యంత్రసాహాయ్యమున నెప్పటికప్పుడు క్రొత్త యంత్రములు విరివిగా సిద్ధముకాజొచ్చెను. ఈ యంత్రము లన్నియు వస్తువుల నపరిమితముగా నుత్పత్తి చేయుచుండెను. ఈ వస్తువులన్నియు విడుదలయగు మార్గము కనుపడదయ్యె. యుద్ధకాలమున బ్రిటిషు సరకులను కొనుగోలుచేసిన దేశము లన్నియు, యుద్ధము ముగిసినపిమ్మట నాయా వస్తువులను స్వయముగా నుత్పత్తి చేసికొనజొచ్చెను. దీనిచే ఆంగ్లదేశ నగర ప్రజలు నిర్వ్యాపారులు కాసాగిరి. దీనికి తోడు గోరుచుట్టుపై రోకటిపోటువలె, అన్యదేశములనుండి, ఇంగ్లండునకు ధాన్యము దిగుమతి కాకుండ నిషేధింపబడెను. 1816-వ సం॥లో పంటలు బొత్తుగా పోయినవి. అపుడుగూడ ధాన్యపు ధర అమితముగా పెంచియుంచబడెను.

ఈ విధముగా యుద్ధముయొక్క దుష్పరిణామమునకు పారిశ్రామిక పరివర్తనముతోడై ప్రజలలో నింతంతనరాని యసంతృప్తి కలిగించెను. పల్లెలలోను పట్టణములలోను అశాంతి ప్రబలి ప్రజలు ధాన్యపురాసులు తగులబెట్టి యంత్రముల నిర్మూలింపసాగిరి. ఈ దుండగముల గాంచి, ఫ్రెంచి విప్లవము స్మృతికిదగుల ప్రభుత్వము కలవరమందెను. 1819-వ సం॥లో మాంచెస్టరుదగ్గఱ 'సెయింటు పీటర్సు పొలములు'లో బ్రహ్మాండమగు సభ జరిగెను. సైనికులు తుపాకులు ప్రేల్చి జనులను చెదరగొట్టిరి. పదునొకండుగురు మరణించిరి. సైనికుల యీదుండగమునకు ప్రజలు 'పీటర్లూ హత్య'లని నామకరణము చేసిరి. ఈ యశాంతికిగల మూలకారణములు విచారింపక ప్రభుత్వము 'శాసనషష్ఠకము' నొనరించి, సభలను నిషేధించెను. శాసనవిరుద్ధమగు కవాతు నిషేధించెను. ఈ విప్లవమునకు దోహదమొసగుచున్న వార్తాపత్రికలను పేదలు చదువుకొనుట కందుబాటులో లేకుండ చేయవలయునని పత్రికలన్నిటిపై నాల్గు పెన్నీల పన్ను వేయబడెను. 'విలియము కాబెటు' (William Cobbett) మున్నగువారు ప్రజల కష్టములనువివరించు వ్రాతలమూలమున నమితమగు ప్రచారము సలిపి పార్లమెంటును సంస్కరించుటకు త్రోవ చదును చేయుచుండిరి. భూస్వాముల చేతుల జిక్కియున్న పార్లమెంటు ప్రజాసామాన్యమునకు వశమైనచో ప్రజాక్షేమకరములగు శాసనముల నిర్మింపవలనుపడు నను విషయము నానాటికి తేటతెల్లము కాజొచ్చెను. కాని 1832-వ సం॥వఱకు పార్లమెంటు సంస్కారమునకు సుముహూర్తము రాలేదు.

## అంతరంగ బహిరంగ వ్యవహారములు 1820—1830 సం॥

1810–వ సం॥లో పిచ్చివాడవజార్జికి మతిచెడి 1820–వ సం॥లో మరణించెను. కుమారుడగు నాల్గవజార్జి రాజయ్యెను. లివరుపూలు ప్రభుని నాయకత్వమున 1812–వ సం॥ మొదలు 1827–వ సం॥వఱకు టోరీలే పరిపాలనా భారము వహించిరి. 1822–వ సం॥ 'జార్జికానింగు' (George Canning) అను ప్రతిభాశాలి విదేశాంగ మంత్రియయ్యెను. ఆయన హయాములో దక్షిణ అమెరికాలో, మెక్సికో, పెరు, చిలీ యను స్పానిషు కాలనీలు స్పెయినుపై తిరుగబడగా కానింగు మంత్రి ఆ కాలనీలను స్వతంత్రములుగా పరిగణించుట కంగీకరించెను. అట్లే గ్రీసు, టర్కీపై తిరుగబడగా నితడు ఆంగ్లనావలను గ్రీసుకు సాయమంపెను. తత్సహాయమున 'నవారినో' (Navarino) యుద్ధమున (1827–వ సం॥) గ్రీసు జయమంది స్వతంత్రయయ్యెను. ఆ వత్సరమే కానింగు పదభ్రష్టుడయ్యెను.

ఆ కాలముననే అంతరంగ మంత్రి (Home Secretary) యగు 'సర్ రాబర్టు పీలు' (Sir Robert Peel) కొన్ని ముఖ్య సంస్కారములు లొనర్చెను. వివిధములగు నేరము చేసినందులకు 160 మందికి మరణశిక్ష విధింపగా, ఆ దారుణశిక్షలను జూరీ సమ్మతింపదయ్యెను. పీలుమంత్రి చాలమంది శిక్షల నప్పుడు తగ్గించెను. లోగడ పిట్టు హయాములో కార్మికులు సంఘములుగా నేర్పడకుండుటకు చేయబడిన 'సమ్మేళన నిషేధమును' (Combination Acts) 1824, 1825–వ సం॥లలో పీలుమంత్రి తొలగించెను. జీతములు పెంచుడనియు, పనిచేయవలసిన కాలము తగ్గింపుడనియు కార్మికులు శాస్త్రసమ్మతముగా నాందోళ

నముసల్పుట కపుడు అవకాశము లభించెను. మరియు లండను నగరమున నూతనపద్ధతిని పోలీసుదళము నిర్మించెను. అది చూచి దేశమంతయు నా సంస్కారము నవలంబించెను. ఇంగ్లండు చర్చికి వ్యతిరేకులైన 'నాన్ కన్ఫరమిస్టుల (Non-conformists) పైగల నిషేధమును 1828-వ సం॥లో తొలగించి ప్రభుత్వ సైన్యములలో వారికి ప్రవేశావకాశ మొసంగెను. 1829-వ సం॥లో కాథలిక్కులకుగూడ నట్టి సదుపాయముల నేర్పరచి పార్లమెంటులో ప్రవేశమునకు త్రోవచేసెను. అదిమొదలు పార్లమెంటును సంస్కరించు విషయమున దేశము నిరతమయ్యెను. 1830-వ సం॥లో నాలవజార్జి యనంతర మతని సోదరుడు నాలవ విలియము రాజయ్యె.

## సంస్కరణశాసనము 1832-వ సం॥

పార్లమెంటునకు సభ్యుల నెన్నుకొను కొన్ని ప్రదేశములకు 'రాటెనుబరో' (Rotten Boroughs) లనియు, 'పాకెటుబరో' (Pocket Boroughs) లనియు పేరువచ్చెను. ఓటరులందఱు, మండలాంతరములకు లేచిపోవుటచే మిగిలిన యే కొలది మందియో సభ్యుని నెన్నుకొనుట జరుగుచుండెను. అట్టి ప్రదేశమే రాటెనుబరో. సాలిస్బరీచెంత 'ఓల్డుసారెము' (Old Sarem) అను బరో గలదు. ఆ పేరుగల పట్టణ మంతరించిపోయినను, దానిపేరుమీద నిద్దఱు సభ్యు లెన్నుకొనబడుచుండిరి. ఇది రాటెనుబరోకు చక్కని దృష్టాంతము. ఆ యా ప్రాంతము లందలి ధనికులగు భూస్వాముల యనుగ్రహాముపై నాధారపడి, వారి చిత్తమువచ్చిన సభ్యులను పంపుట కనువైన పట్టణము లకు పాకెటుబరోలని పేరువచ్చెను. 1760-1832-వ సంవత్సర

ములమధ్య పార్లమెంటున కెన్నుకొనబడినవారిలో నగరసంపన్న సభ్యులిట్లు ధనికుల యనుగ్రహముచేతనే విజయమందుచుండిరి. ఓటరులకు స్వేచ్ఛయున్నట్లు పైకి కనుపించు ప్రాంతములందును గూడ లంచములప్రభావమే జయము చేకూర్చుచుండెను. పారిశ్రామిక పరివర్తనముచే నూతనముగా నభివృద్ధిచెందిన మాంచెస్టరువంటి పట్టణములకు సభ్యులే లేరు. ఈ విధముగా నానాటికి పార్లమెంటు ఎన్నికల పద్ధతి విరుద్ధమైపోయెను. ఒక వంక వాణిజ్యకౌశలముచే సామాన్యప్రజలు ధనికులై బలము బడి సంపాదించుకొనసాగిరి. రెండవవంక వెస్లియనుమతస్థులగు నాన్ కన్ఫర్మిస్టులు ప్రబలమగు మరియొక వర్గముగా నేర్పడిరి. ఈ రెండు తెగలవారును పార్లమెంటు సంస్కరణవిషయమును పట్టుబట్టి తీవరింపసాగిరి. విగ్గువర్గమునందలి రాచవారు వీరికి నాయకులు. అసంతృప్తిచే నల్లాడు దరిద్రులందఱు వీరి వెనుక నండగానై నిలిచిరి.

ఈ స్థితిలో 1830-వ సంవత్సరమున 'గ్రే' ప్రభువు (Lord Grey) ప్రధానమంత్రియై 'రాటెనుబరో' లను నియోజనస్థానములనుండి తొలగింప సంకల్పించెను. అతడు విగ్గువర్గమువాడేయైనను టోరీలుగూడ కొందఱు సాయపడుటచే ఆ బిల్లు ప్రథమానువాదము (First Reading) ఎట్టకేలకు ఒక్కవోటు భేదముతో నెగ్గెను. 1831-వ సం॥లో క్రొత్తపార్లమెంటు ఏర్పడుటచే 156 ఓట్ల భేదముతో బిల్లు నెగ్గెను. కాని ప్రభుసభ దానిని నిరాకరించెను. దాన దేశమంతయు నట్టుడుకు నట్లుడికి తిరుగుబాటులు దొమ్మిపోరులు చెలరేగెను.

1832-వ సం॥లో ప్రజాసభ మరల నొక క్రొత్తసంస్కరణశాసనము చేయగా, ప్రభుసభ దానినిగూడ తిరస్కరించు

టకు సిద్ధమయ్యెను. అపుడు నాలవవిలియము, బిల్లున కనుకూలురగు ప్రభువుల గొందఱిని ప్రభుసభలో చేర్చి బిల్లును నెగ్గింతునని బెదరించెను. అంతట ప్రభుసభ దారికివచ్చి బిల్లు నంగీకరించెను. ఇరువుర నెన్నుకొనెడి బరోలలో 56 కి ప్రాతినిధ్యములేకుండ చేయబడెను. మరి 31 బరోలలో ఒక్క సభ్యుడుమాత్రము నిలిపియుంచబడెను. ఇట్లు తగ్గించిన సభ్య స్థానములు కౌంటీలకు, క్రొత్తపట్టణములకు నొసగబడెను. కౌంటీలలో 'పట్టాదారులకు' (Copy holders) కవులుదారులకు, ఈనాందారులకు (Free-holders) గూడ నియోజనాధికారము (Vote) ఒసగబడెను. బరోలలో, సాలుకు పదిపౌనులకు పైబడిన అద్దె వచ్చెడి గృహస్థులకు, అట్టి గృహములలో కాపురముండువారికిగూడ వోటొసగబడెను. పూర్వము కేవలము భూస్వాములచేతనే యెన్నుకొనబడు పార్లమెంటు ఈ శాసనమువలన భూస్వాముల కందఱకును, మధ్యరకమువారగు సామాన్యగృహస్థులకుగూడ ప్రాతినిధ్యము కల్పించెను.

ఇంత శ్రమవహించి పార్లమెంటును సంస్కరించినందులకు మంచిఫలమే కలిగెను. 1833-వ సం॥లో బ్రిటిషుసామ్రాజ్యమందంతటను బానిసీలవ్యాపారము నిషేధింపబడెను. తొమ్మిదేండ్ల ప్రాయమునకు లోబడిన బాలురచే ఫాక్టరీలలో పని చేయింపగూడదని శాసన మొనర్పబడెను. పాటుబడజాలియు, పనిలేకయున్నవారి కందఱకు ప్రభుత్వ కర్మాగారములలో పని చెప్పబడెను. (1834 సం॥) అట్లు వారు పాటుబడనిచో అన్యమగు సాహాయ్య మొనర్పబడదు. ఈ విధముగా పేదలచట్టమును (Poor Law) సంస్కరించుటచే, నిండుకూలి లభింపనివారికి ప్రభుత్వము కొంత ధనమిచ్చు దురాచారము మాసిపోయెను.

1835-వ సం॥లో పురపాలకసంఘములు సంస్కరించుట కొక్క శాసన (Municipal Reform Act) మొనర్పబడెను. అంతకు మున్ను, అవినీతులగు కొందఱు ధనికులచేతులలో జిక్కియున్న పురపాలనాధికారము నియోగకర్తృత్వముచే నెన్నుకొనబడిన సభ్యులవశ మొనర్పబడెను.

## ఇరువది యెనిమిదవ అధ్యాయము

### విక్టోరియారాజ్ఞి పాలనము

1837-వ సంవత్సరము జూను ఇరువదియవ తారీఖున నాలవవిలియము మరణించెను. అతని యనంతరము, సోదర పుత్రియగు విక్టోరియా రాణి యయ్యెను. సింహాసన మధిష్ఠించు నప్పటికి ఆమెకు పదునెనిమిదేండ్ల ప్రాయము. హానోవరు రాజ్యముయొక్క ఉత్తరాధికారము విక్టోరియా మేనమామకు సంక్రమించెను. 1866 వ సం॥లో హానోవరు ప్రష్యారాజ్యములో కలిసిపోయెను.

### ఛార్టిస్టులు (Chartists)

పార్లమెంటు సంస్కరణశాసనము అతివాదుల కించుకయు తృప్తిగొలుపకపోయెను. 1838-వ సం॥లో వారు మరల నాందోళనప్రారంభించి 'ప్రజాధికారపత్రము' (People's charter) నొండు సిద్ధముచేసిరి. అందలికోరిక లివి;—(1) ఆస్తియున్నను లేకున్నను, గృహమున్నను లేకున్నను 21 ఏం॥ వయస్సుగల పురుషుల కందఱకు నియోజనాధికారము (Vote) ఉండవలయును. (2) పార్లమెంటులోని సభ్యులందఱును సమానసంఖ్యా

లగు వోటర్లచే నెన్నుకొనబడవలయును. (3) ఓటు రహస్యముగా నొసగబడవలయును. (4) ప్రతిసంవత్సరము క్రొత్త పార్లమెంటు నెన్నుకొనవలయును. (5) ఇండ్లు, పొలములు లేనివారలకుగూడ సభ్యులగుట కధికార మొసగవలయును. (6) సభ్యులకు జీతము లొసగవలయును. ఆ కాలమున నీ కోరికలెల్ల వికటితములుగా కాన్పించినను, వీనిలో రెండు తప్ప తక్కిన కోరికలు ఇటీవల కాలక్రమమున శాసనరూపము దాల్చెను. ఈ యాందోళనము పదిసంవత్సరములవఱకు జరుగగా ప్రయోజనకారి కాలేదు. 1848-వ సం॥లో మరల ఫ్రాన్సులో విప్లవముదయించుటచే నీ ఛార్టిస్టుల యాందోళనమునకుగూడ బలము చేకూరెను. దేశములో నల్లడల నేరి తిరుగుబాటులుప్పతిల్లెను. సుశిక్షణములేమియు, బహునాయకత్వము వీరి లోపములు. దానికితోడు సామాన్యగృహస్థుల యభిమానమును వీ రర్జింపరైరి. కావున ఛార్టిస్టుల యాందోళనము ఫలవంతము కాలేదు.

## సర్ రాబర్టుపీలు మంత్రిత్వము

1836-వ సం॥ మొదలు 1841-వ సం॥ వఱకు మంత్రిగానున్న 'మెల్బోర్న్ ప్రభువు' (Lord Melborne) లేతవయసునందున్న విక్టోరియారాణి మనస్సునకు వచ్చినవాడు. ఈతడు విగ్గు. ఆమె రాజనీతియం దాతనికడ సుశిక్షితయయ్యెను. 'సాక్సుకోబర్గు గోథా' (Saxe Coburg-Gotha) రాజకుమారుడగు ఆల్బర్టును 1840-వ సం॥లో విక్టోరియా పెండ్లియాడెను. మరువత్సరమున మెల్బోర్నుప్రభువు మంత్రిత్వము చాలించుకొనగా, ఆల్బర్టు విక్టోరియాకు అంతరంగిక మంత్రి యయ్యెను. టోరీప్రముఖుడగు 'పీలు' ముఖ్యమంత్రి యయ్యెను.

పీలు, బ్రిటిషువాణిజ్యమును, పరిశ్రమలను బాగుపరచు టకు తొలుదొల్త పూనుకొనెను. ఎగుమతిపన్నుల భారముచే పరిశ్రమలు రెక్కోనకుంట గాంచి 1823-వ సం॥లో వాణిజ్య సంఘాధ్యక్షుడగు 'హస్కిసన్' (Huskisson) వానిని చాలవఱకు తగ్గింపగా, మిగిలినవానిని 1842-వ సం॥లో పీలు నామావశేష మొనరించెను. ఈ పన్నులు తగ్గించుటచే కలిగిన లోటును సవరించుట కాతడు ఆదాయపుపన్ను పునరుద్ధరించెను. వెనుక యుద్ధసమయమున పిట్టుమంత్రిచే వేయబడిన యీ పన్ను ప్రజాదరము బడయకపోవుటచే 1816-వ సం॥లో వదలుకొన వలసివచ్చెను. కాని యీతూరిమాత్రము వెనువెంటనే దాని సత్పరిణామము తెలియవచ్చెను. 1842-వ సం॥లో బ్రిటిషు ఎగుమతుల విలువ 470 లక్షల పౌనులు. మరి నాల్గువత్సరము లలో నా విలువ కోటిపౌను లధికమయ్యెను.

విదేశములనుండి బ్రిటనులోనికి ధాన్యము దిగుమతి కాకుండ నిషేధించుటకు వెనుక శాసనము లొనర్పబడియెను. వీనిని ధాన్యశాసనము (Corn Laws) లందురు. బ్రిటిషుధాన్యము ధరలు అపరిమితముగానుండిననే తప్ప విదేశధాన్యము బ్రిట నులో దిగకుండచేయుటయే వీని ప్రయోజనము. ఈ యేర్పాటు భూస్వాములకు లాభకారిగానున్నను, పేదలు దీనిచే చాల నిడుములు గుడుచుచుండిరి. కావున 'కాబ్డెను' (Cobden) 'బ్రైటు' (Bright) అను మహనీయులు ధాన్యశాసన నిషేధకసంఘము స్థాపించి విపరీతమగు నాందోళన మొనర్పదొడగిరి. సుశిక్షిత మగు నీ యుద్యమమున కార్మికులు, ధనవంతులగు వర్తకులు నేకీభవించిరి. ఈ ధాన్యశాసనములు తొలగించుట అవసరమని గ్రహించియు పీలుమంత్రి 1842—1845-వ సంవత్సరముల

మధ్య ఆ పనికి పూనుకొనడయ్యెను. ఆతడు మంత్రిత్వము స్వీకరించునపుడు, ఈ ధాన్యశాసనములు రద్దుచేయనని టోరీ భూస్వాములకు మాటయిచ్చెను. కావున క్రొత్తయెన్నికలు వచ్చువఱకు నూరకొని, యపుడు తన యభిప్రాయము మారిన సంగతి విశదమొనర్చి, తిరిగి తాను ప్రధానియైనచో ఈ శాసనము తొలగింతునని ప్రకటింపదలచెను. కాని తలపనితలంపుగా ఐర్లండున కరవువచ్చి ఉర్లగడ్డలపంట నాశనమయ్యెను. ఇంగ్లండులోకూడ ధాన్యపుపంటలు చెడెను. ఇపుడు ధాన్యశాసనము రద్దుచేయనిచో ఐర్లండు తిండిలేక మలమల మాడిపోవును. కావున పీలు వానిని రద్దుచేయ యత్నింపగా మంత్రివర్గమునందొక మంత్రి సమ్మతింపడయ్యె. పీలు గత్యంతరము లేక మంత్రిత్వము వదలుకొనెను. కాని విగ్గులు పరిపాలనాభారము వహింప నంగీకరింపకపోవుటచే 1845-వ సంవత్సరాంతమున తిరిగి పీలే మంత్రిత్వమువహించి 1846-వ సం॥లో ధాన్యశాసనములు రద్దుచేసెను. టోరీవర్గమువారంతట నాతని స్వపక్షద్రోహియని నిందించిరి. వారిలో భేదములుకూడ జనించుటచే పీలు మరల మంత్రిత్వము చాలించుకొనియెను. పీలు ప్రతిపక్షులలో 'డిస్రాలీ' (Disraeli) యను నొక పడుచువాడు గలడు. ఆతనివాచాలత నిరుపమానము. ఇరువదివత్సరములవఱకు మరల తొంటిబలము చేకూరక నవసియున్న టోరీవర్గమునకే డిస్రాలీ కన్సర్వేటీవు (Conservatives) లను నామకరణమొనర్చి పునఃప్రతిష్ఠ సలిపెను.

## పామర్స్టనుమంత్రి విదేశవ్యవహారములు

పామర్స్టనుప్రభువు (Lord Palmerston) 1830-వ సం॥లో విదేశాంగమంత్రియైనది మొదలు, మధ్యకాలమున ఉద్యో

గము చాలించుకొన్నప్పుడు తక్క, 1865-వ సం॥ వఱకు విదేశ వ్యవహారములలో నాతని మాటయే చెల్లుచుండెను. ఆతని పద్ధతులు అప్పటికప్పుడు వెల్లడియగుచు, విలక్షణములై, ఇత రులకు మనసు నొప్పించుచుండెడివి. అట్లయ్యు ఆతని మాట నెగ్గించుకొనెడివాడు. యూరపుఖండ వ్యవహారములలో బ్రిటను కధికమగు జోక్యముండవలయునని యాతని యుద్దేశము. ఆయాశయముతోడనే, యూరపులో స్వతంత్రములగు నూతన జాతులేర్పడుటకు ఆతడు కారణభూతుడయ్యెను. 1830-వ సం॥లో బెల్జియము, హాలండునుండి చీలిపోగోరినపుడు, పామ ర్స్టను ఫ్రెంచిప్రభుత్వముతో నేకీభవించి హాలండును సమ్మ తింపజేసెను. 1839-వ సం॥లో, బ్రిటను, ఫ్రాన్సు, రష్యా, ఆస్ట్రియా, ప్రష్యా దేశములుగూడి, బెల్జియము సార్వకాలికముగ స్వతంత్రమై తటస్థదేశముగా నుండవలయునని సమయ మొన ర్చుకొనెను.

**1833, 1840**-వ సం॥ల మధ్య స్పెయినురాణియగు ఇస బెలా (Queen Isabella) కు ఆమె పినతండ్రితో రాజ్యాధికార విషయమున తగువువచ్చినపుడు పామర్స్టను ఇసాబెలా కెంత యేని సాయమొనర్చెను. మెహమతాలి (Mehemet Ali) యను నతడు టర్కీ సుల్తానుపై నెదురుతిరిగి సిరియా నాక్రమించు కొనగా పామర్స్టను సుల్తానుపక్షము వహించి, ఆస్ట్రియాదేశపు నావలును, బ్రిటిషు నావికాదళమును టర్కీకి సాయమంపి **1849**-వ సం॥లో మెహమతాలీని సిరియానుండి తరిమివేయిం చెను.

1841-వ సం॥లో పామర్స్టను మంత్రిత్వము చాలించు కొని, తిరిగి 1846-వ సం॥లో మంత్రియయ్యెను. స్పెయిను

దేశపు రాణిని ఫ్రాన్సు రాజకుమారుడగు లూయీ ఫిలిప్పు (Louis Philippe) న కిచ్చి పెండ్లిచేయవలయునని ప్రయత్నించిన సందర్భమున పామర్ స్టనును స్పెయినుపక్షమున నిలిచి ఫ్రాన్సుతో విరోధమున కియ్యకొనెను. 1848-వ సం॥లో హంగేరీ, ఇటలీ, ఫ్రాన్సు, ప్రష్యాదేశములలో నొక్కుమ్మడి విప్లవములు చెలరేగగా, పామర్ స్టనును, విక్టోరియారాణి యాగ్రహమును గూడ లెక్కగొనక విప్లవవాదులయెడ సానుభూతిఁజూపెను. 1851-వ సం॥లో నాతడు పదభ్రష్టుడయ్యె (Dismissed) 1852-వ సం॥లో తిరిగి మంత్రియయ్యెను. మరి రెండు వత్సరములకు సమీప ప్రాచ్యదేశములందు (Near East దారుణకలహము లంకురించెను.

## క్రిమియాసంగరము 1854—1856 సం॥ (The Crimean War)

రష్యాచక్రవర్తియగు మొదటి నికోలస్ (Nicholas I) తురుష్కసామ్రాజ్యము పతనముకానున్నదని సంభావించి, తద స్తమయమును శీఘ్రముగా నెరవేర్పవలయునని సంకల్పించెను. ఆతడు కాన్స్టాంటునోపిలు (Constantinople) నగరము నాక్రమించునని యందఱు నూహించిరి. మధ్యధరాసముద్రమున రష్యా కధికబలము చేకూరుటకు ఫ్రాన్సు సహింపజాలదు. రష్యాచక్రవర్తి హిందూదేశముపై కన్నువేసెనని బ్రిటను కనుమానము. నిజమునకు రష్యాయుద్ధమునకు కాల్దువ్వుచుండుట లేదు. ఉభయపక్షముల నింగితజ్ఞానమును, కార్యసాధన దక్షతయు లోపించి వ్యవహారము చక్కబడక యుద్ధముగా పరిణమించెను. సుల్తాను ఏల్బడిలోనున్న క్రిస్టియనులను రక్షించు భారము తనపైనున్నదని రష్యావాదము. ఈ విషయమున

తాము గట్టిపట్టు పట్టినచో బ్రిటను ఆగ్రహించి యుద్ధమునకు సిద్ధమగునని రష్యాచక్రవర్తి గ్రహింపజాలడయ్యెను. డాన్యూబు (Danube) నదీ పరిసరములందలి తురుష్కభూములను రష్యా యాక్రమింపగనే బ్రిటను యుద్ధమును ప్రకటించెను. (1854-వ సం॥ మార్చి నెల). ఫ్రాన్సుకూడ బ్రిటనుతోచేరి రష్యా కెదిరి నిలిచెను.

డాన్యూబు పరిసరములనుండి రష్యా నతి శీఘ్రముగ సాగనంపి పిమ్మట ఫ్రాన్సు బ్రిటనులు క్రిమియాలో (Cremea) నున్న 'సెబాస్టపోలు' (Sebastopol) అను రష్యను దుర్గమును పట్టుకొన నిశ్చయించెను. సైన్యసముదయములు క్రిమియాలో దింపిరిగాని, ముందునకు సాగివెళ్లుట చాల విలంబమయ్యెను. బ్రిటను తన యుద్ధసామగ్రిసంతయు 'బాలక్లావా' (Balaclava) యందు నిలువచేసెను. 1854-వ సం॥ అక్టోబరు నెలలో రష్యనులు బాలక్లావాను పట్టుకొనజూచిరి. కాని, చరిత్రప్రసిద్ధమగు 'లైటు పటాల పరాక్రమము' (Charge of the Light Brigade) నకు రష్యనులు తాళజాలక విఫలమనోరథులైరి. పిమ్మట పక్షము దినములకు రష్యనులు 'ఇంకరుమన్' (Inkerman) పట్టణము నాక్రమింపవచ్చినపుడు ఇరువాగులకు దారుణరణము ప్రవర్తిల్లెను. రష్యనులందుగూడ నోడిపోయిరి. అంతలో శీతకాలము వచ్చెను. పొట్టకు బట్టకు చాలక యిడుములుపడు బ్రిటిషు సైన్యములకు, కలరా, రక్తాతిసారము, స్కర్వీ యను వాతరోగము పొడమి చలిబాధకు తోడై బాధింపదొడగెను. ఆ విపత్సమయమున 'ఫ్లారెన్సు నైటింగేలు' (Florence Nightingale) అను ఆంగ్లనారీమణి, ధీరయై, ఆ యుద్ధరంగమున రోగగ్రస్తులై పడి

యున్న సైనికులకెన్నియో యుపచారములొనర్చి, వైద్యాలయ ముల స్థితిని చక్కబరచి సుస్థిరమగు యశమార్జించుటయేగాక, అద్భుతమగు ఉపచారికా వృత్తిని (Profession of Nursing) సృష్టించిన పుణ్యము గట్టుకొనెను. ఎట్టకేలకు 1855-వ సం॥ సెప్టెంబరు నెలలో సెబాస్టపోలు నాక్రమించిరి. అనంతరము పారిసులో 1856-వ సం॥లో జరగిన సంధితో యుద్ధము అంత మందెను. తురుష్క సామ్రాజ్యము విచ్ఛిన్నముకాకుండ నిలి చెను. తన యేల్బడిలోనున్న క్రిస్టియనులను సాదరముగా పాలింతునని సుల్తాను మాటయిచ్చెను.

తదుపరి యిరువది సంవత్సరములపాటు బ్రిటను, కలహ ములలో దిగక శాంతిమై కాలక్షేపమొనర్చెను. 1859-వ సం॥లో ఇటలీ, ఆత్మరక్షణార్థము ఆస్ట్రియాతో పోరునప్పుడు బ్రిటను కేవలము శుష్కోపచారవాక్యములనే యంపెను. 1870—1871-వ సం॥లో ప్రవర్తిల్లిన ఫ్రాంకో ప్రష్యను యుద్ధ మున దిగవలసిన యవసరమేమియు నింగ్లండునకు కలుగలేదు. 1861-వ సం॥లో అమెరికాలో ఉత్తరరాష్ట్రములకు దక్షిణరాష్ట్ర ములకు యుద్ధము పొసగెను. 'ట్రెంటు' అను బ్రిటీషునావను, ఉత్తరరాష్ట్రములవారు అన్యాయముగా పరిశోధించిరి. దానిపై దక్షిణరాష్ట్రములవారికి సాయమంపవలయునని బ్రిటను 'ఆల బామా' యను నావను నిర్మించిరి. వారు వీరి నావను పరిశో ధించుట యెట్టి అన్యాయమో వీరీ నావను నిర్మించుటయు నట్టి యధర్మమే. కాని తుదకెట్లో వ్యవహారము విషమింపకుండ సామముపై పరిష్కరించుకొని సఖ్యపడిరి.

డిస్రాలి గ్లాడ్‌స్టనులు, (Disraeli and Gladstone)

1865-వ సం॥లో పామర్స్టను ప్రభువు మరణించిన పిమ్మట వీరిరువురు ఆంగ్లరాజ్యతంత్రమున సూర్యచంద్రులవలె నొప్పారిరి. ఈ యుభయులకు స్వభావముచే నెట్టి సామ్యమును లేదు. గ్లాడ్‌స్టను స్కాచివంశమువాడు. విద్యాభ్యాసదినములలో నిరుపమ ప్రతిభాశాలియని పేరు వడసెను. 23-వ యేటనే పార్లమెంటు సభ్యుడై పీలుమంత్రికి అనుచరుడయ్యెను. ధాన్యశాసనములు రద్దయినపిమ్మట నీతడు టోరీవర్గము (కన్సర్వేటీవు) ను బాసి, లిబరలువర్గములో చేరెను. టోరీపక్షము కన్సర్వేటీవులు కాగా, విగ్గులు తమ పక్షమును సంస్కరించుకొని లిబరలు నామము గైకొనిరి. అబర్డీనుప్రభువు (Lord Aberdeen) హయాములోను (1852 — 1855) పామర్స్టను హయాములోను (1855 — 1858) ఈతడు ఆర్థికమంత్రిగా నుండెను. గాఢమగు దైవభక్తియు కార్యములయెడ చిత్తశుద్ధియు, నీతనికి సాజములు. అభినివేశముతో గూడిన నిరంతర కార్యోత్సాహము, తేటలుదీరిన ప్రవాహమువంటి వాచాలతయు వాని కలంకారములు.

ఇక డిస్రాలీయన్ననో ఇటాలియను యూదు (Jew) వంశీయుడు. కళాశాలయందు విద్యావ్యాసంగము చేసినవాడుకాడు. చిత్రవర్ణశోభితములగు నడుపులన్నవానికి మిగుల ప్రీతి. 1837-వ సం॥లో నాతడు పార్లమెంటుసభలో నడుగుపెట్టినపుడు వాని వింతవేసమున కందఱు నవ్వుకొనిరి. శాంతమగు శైలిలో నాతడెన్నియో యాఖ్యాయికలు (Novel) రచించెను. చమత్కారకారిణియై, విచిత్రమగు వాగ్ధోరణి వానికి తోడబుట్టినది. 1846-వ సం॥లో పీలుమంత్రి, ఆత్మపక్షమును విడనాడినందులకు

పక్షద్రోహియని యధిక్షేపించిన సుముహూర్తముననే డిస్రాలీని భాగ్యదేవత వరించెను.

ఇరువది సంవత్సరములలో (1846 — 1866) కన్సర్వేటీవులకు డిస్రాలీ ప్రతిభావిశేషము తెలియవచ్చెను. అతని బుద్ధిసంపద, పక్షమునకు మిక్కుటముగ నక్కఱకు వచ్చి అలంకారప్రాయమగుచుండెను. 1866-వ సం॥లో నాతడు పక్షనాయకులలో నొకడాయెను. "గ్లాడ్‌స్టను సుభాషితముల చేనలె, దుర్ఊహ్యమగు డిస్రాలీ యాలోచనాశక్తిచే గూడ ప్రపంచము ముగ్ధమయ్యెడిది."

## సంస్కరణశాసనము 1867-వ సం॥

ఎన్నికల విధానము నింకను సంస్కరింపవలయునను డి యాందోళనము నానాటికి అధికమగుచు, 'జాన్ రసెలు ప్రభువు' (Lord John Russel) క్రొత్త సంస్కరణ శాసనము పార్లమెంటులో ప్రవేశపెట్టజూచెను గాని లాభము లేకపోయెను. 1866-వ సం॥లో డెర్బీప్రభువు మూడవతూరి ప్రధానమంత్రి యయ్యెను. క్రొత్త సంస్కరణ శాసనము ప్రవేశపెట్టవలయునని డిస్రాలి పట్టుబట్టుటచే 1867-వ సం॥లో ప్రవేశపెట్టబడెను. గ్లాడ్‌స్టను బిల్లులో నెన్నియో మార్పులను చొప్పింప యత్నించెను. తుదకు ఆ శాసనముచే బరోలలోని గృహయజమానులకు సాలునకు పది పౌనుల కధికమగు ఇంటియద్దె నిచ్చువారలకు ఓటు వచ్చెను. కౌంటీలలో సాలునకు 12 పౌనుల ఆదాయము వచ్చు ఇండ్లుగాని, భూములుగాని అనుభవించువారెల్ల ఓటరులైరి. ఈ విధముగ పట్టణములలో చాలమంది కార్మికులు నియోజకులైరి. కాని పల్లెలలో వ్యవసాయమొనర్చు కార్మిక

లకు ఓటురామిచే క్రమముగా వారు పల్లెలవిడిచి పట్టణములు చేరదొడగిరి. పల్లెలింకను దారిద్ర్యముచే హీనుగుపడియున్నను పట్టణము లైశ్వర్యముచే తులదూగసాగెను. రైల్లు స్టీమర్లు రాకపోకలకు సౌకర్యములను గల్గించుటచే సరకులు దూరభాగములకు సులభముగా నేగనై, వాణిజ్యము వృద్ధియై, పం దొమ్మిదవ శతాబ్దమధ్యమున బ్రిటను పరిశ్రమలు ప్రపంచము నందెల్ల అగ్రగణ్యమై యలరారెను.

## గ్లాడ్‌స్టనుయొక్క మొదటి హయాము

నూతన సంస్కరణ శాసనఫలముగా 1868-వ సం॥లో లిబరలు వర్గము పార్లమెంటులో ప్రబలమగుటచే, ఆ సంవత్సరారంభముననే మంత్రియైన డిస్రాలి దొలగుటయు గ్లాడ్‌స్టను ప్రధానమంత్రియగుటయు తటస్థించెను. గ్లాడ్‌స్టను మంత్రి ఆరు సంవత్సరములపాటు ఎడతెరపిలేకుండ ఎన్నియో మహా కార్యము లొనర్చెను. మొదటేది విద్యాభివృద్ధి. విద్యావిషయమున ఇంగ్లండు, జర్మనీ స్కాటులాండులకన్న వెనుకబడి యుండెను. నూటికి ఏబదిమంది, పిల్లలుమాత్రమే యేకొంచెమో చదువునేర్చిరి. పాఠశాలలన్నియు సాధారణముగా చర్చులపాలనలో నుండెడివి. ప్రభుత్వమొనర్చు సాయ మత్యల్పము. ప్రజలకు నియోజనాధికార మధికమగుకొలది విద్యావ్యాప్తికి అవసరము హెచ్చదొడగెను. 1870-వ సం॥లో 'ఫార్స్టనర్' (W. E. Forster) అను నతడు విద్యాశాసన మొకటి ప్రవేశపెట్టెను. అప్పటికి ఉన్న చర్చిస్కూళ్లు నిలిపియుంచి, వానికి ప్రభుత్వసాహాయ్యము ద్విగుణము సల్పి, ఆయా చర్చులకు సంబంధించిన ప్రత్యేక మతబోధన లాస్కూళ్లలో చేయ

కుండునట్లు కట్టడచేసి, అట్టి చర్చిస్కూళ్ల అభావమున ప్రభుత్వము క్రొత్త స్కూళ్ల నెలకొల్పవలయునని ఆ బిల్లు నుద్దేశము. ఆ బిల్లును గ్లాడ్‌స్టను సంతోషపూర్వకముగా నామోదించుటచే నెగ్గెను. కాని చర్చిపాఠశాలలు నిలిపియుంచవలయునను నేర్పాటుచే 'జోసెపు ఛాంబర్లను' (Joseph Chamberlain) మున్నగు నాన్‌కన్ ఫర్మిస్టు లిబరలు ప్రముఖుల కాగ్రహము కలిగెను. తన్మూలమున లిబరలుపక్షమున భేదము జనించెను. 1870-వ సం॥ మొదలు 1890-వ సం॥లోపల స్కూళ్లలో హాజరగు పిల్లల దామాయిషా సంఖ్య 12,50,000 నుండి 45,00,000 వఱకు పెరిగెను. 1880-వ సం॥ నుండి ప్రారంభ విద్య నిర్బంధముగా గణింపబడెను. 1891-వ సం॥లో దాని నుచితముగా నేర్ప మొదలిడిరి.

పిమ్మట గ్లాడ్‌స్టను యూనివర్సిటీలను సంస్కరించువాడై కేంబ్రిడ్జి, ఆక్సుఫర్డులలో నేమతమువానినైనను సరే, తుదకు నాస్తికునైనను సరే చేర్చుకొనవలయునని 1881-వ సం॥లో నిర్బంధ మేర్పాటుచేసెను. తన్మూలమున తొల్లిటి యభ్యంతరములు రూపుమాసి యచట విద్యార్థుల సంఖ్య పెరిగి, విద్యాసౌష్ఠవముగూడ వృద్ధిచెందెను. కళాశాలలలో గడి దేరిన విద్యార్థులకు పోటీపరీక్ష లేర్పాటుచేసి అందగ్రగణ్యులుగా తేరినవారికే సివిలు సర్వీసులో ప్రవేశమొసగు నేర్పాటు 1870-వ సం॥లో సలిపెను. పదునెనిమిదవ శతాబ్దిలో పలుకుబడిగల రాజతంత్రవేత్తలు తమ యనుగ్రహపాత్రులను సివిలు సర్వీసులో నుద్యోగము లొసగి బహూకరించెడివారు. గ్లాడ్‌స్టను చేసిన యేర్పాటుచే బ్రిటిషు సివిలుసర్వీసు సుశిక్షితమై ప్రపంచమున సంస్తుతిపాత్రమై వన్నెకెక్కెను.

గ్లాడ్‌స్టను ఈ మొదటి హాయాములోనే కార్మికసంఘములు (Trade Unions) శాస్త్ర సమ్మతములుగా నంగీకరించెను. పార్లమెంటు ఎన్నికలలో ఓటు రహస్యముగా నిచ్చు ఏర్పాటుకూడ చేసెను. బ్రిటిషు సైన్యములందు నజరానా యిచ్చి ఉద్యోగములు సంపాదించు పద్ధతి తొలగించెను. 1874-వ సం॥లో మంత్రివర్గమున భేదములు పొడముటచే గ్లాడ్‌స్టను మంత్రిత్వమును చాలించుకొనెను. క్రొత్త యెన్నికలలో కన్సర్వేటీవులు విజయమందుటచే డిస్రాలీ ప్రధాన మంత్రియయ్యెను.

## డిస్రాలీ హాయాము 1874—1880 సం॥

ఐర్లండు వ్యవహారములు బొత్తుగా చెడుచుండుటచే, పార్లమెంటులోనున్న ఐరిషుసభ్యులు, ముందు తమ వ్యవహారములు చక్కబరచుకొననెంచి, తక్కిన పనులు సాగకుండ పార్లమెంటులో నడుగడుగున నడ్డపడసాగిరి. అందువలన కన్సర్వేటీవులు సంకల్పించిన కార్యములు చక్కసాగనయ్యెను. అప్పటికి కొన్ని శాసనములు చేయగలిగిరి. యంత్రాగారములలో స్త్రీలచే, బాలురచే పని చేయించుచున్నది లేనిది పరిశీలించుటకు ప్రభుత్వమున కధికార మొసగబడెను. కార్మిక సంఘముల స్థితిని న్యాయశాస్త్రదృష్ట్యా నిర్ణయించిరి. బేహారుల యోడలలో నావికుల క్షేమము విచారించు శాసనమొకటియు, కార్మికులకు నివాసగృహముల నిర్మింపజేయు శాసనమొకటియు నొనరించిరి. 1876-వ సం॥లో విదేశ వ్యవహారములలో జిక్కుకొనుటచే మంత్రివర్గమున కితర కార్యములు విచారించుటకు తీరికలేకపోయెను.

1856-వ సం॥లో పారిసులో చేసికొనిన సమయము లను రష్యా, టర్కీ దేశములు పూర్ణముగ పాలింపవయ్యెను. 1875-వ సం॥లో హెర్జగోవినా (Herzegovina) టర్కీపై తిరుగుబాటు సల్పెను. మఱువత్సరము బల్గేరియాకూడ ఎదురు తిరిగెను. ఇదే సమయమని సర్వియా, మాంటినీగ్రో (Montenegro) రాష్ట్రములుగూడ తిరుగుబాటుచేసెను. ఈ యవినయమును శిక్షించునదియై టర్కీ, వేలకొలది బల్గేరియా ప్రజలను హింసించియు, చంపియు, అక్కసు తీర్చుకొనెను. ఈ యత్యాచారములు సహింపజాలక గ్లాడ్‌స్టను పార్లమెంటులో ప్రవేశించి, ప్రభుత్వ తాటస్థ్యము నధిక్షేపించెను. దుండగు లగు నీ తురుష్కులను యూరప్పునుండి వెంటనే తఱిమివేయ వలయునని వాదించెను. డిస్రేలి, రష్యా భయముచే టర్కీనే యభిమానించెను. 1877, 1878-వ సం॥లో రష్యా టర్కీలకు యుద్ధము పొసగెను. అందు రష్యాయే మేలు చేయియై, కాన్‌స్టాంటినోపిలు నగరమును పట్టుకొని, టర్కీని దైన్యము పాల్పఱచి, తత్ప్రతికూలమగు సంధికై బలాత్కరించు చుండెను. ఈ స్థితిలో ఇంగ్లండు, ఇక ఉపేక్షింపజాలక, కాన్‌స్టాంటినోపిలుకు నావికాదళమును, మాల్టాకు సైన్యములను పంపెను.

తుదకెట్లో యుద్ధప్రమాదము తప్పెను. 1878-వ సం॥లో బెర్లిను నగరమున సమాధాన సభ జరిపిరి. రుమేనియా (Roumania) సెర్వియా (Servia) మాంటినీగ్రోలకు స్వతంత్రము నంగీకరించిరి. బాస్నియా (Bosnia) హెర్జగవినా రాష్ట్రములు ఆస్ట్రియా పరిపాలనక్రిందకు గొనిరాబడెను. బల్గేరియాకుగూడ

స్వాతంత్ర్య ప్రదానము చేయబడెను; కాని టర్కీకి సామంతమై యుండునట్లు నిబంధించిరి. డిస్రాలీ యప్పటికే 'బీకన్సుఫీల్డు' ప్రభు (Lord Beaconsfield) వయ్యెను. ఈ సంధి విషయమును ప్రస్తావించుచు నాతడు 'బ్రిటను గౌరవమును శాంతిని రక్షించితి' ననెను. ప్రాచ్యఖండ విషయమున కొంతకాలము బ్రిటనుకు అలజడి తప్పెను.

### గ్రేటు బ్రిటను, ఈజిప్టు

'మెహామతాలీ' మనుమడగు 'ఇస్మయిల్ పాషా' 1863-వ సం॥లో ఈజిప్టుకు 'ఖేడివు' (ప్రభువు) అయ్యెను. ఈజిప్టున కప్పటికి ముప్పదిలక్షల పౌనుల ఋణముండెను. దాని నాతడు పదునాలుగేండ్లలో పదికోట్ల పౌనులు చేసెను. ఆ యప్పులు తీర్చు మార్గములేక యెగబెట్టెను. ఋణదాతలు ఫ్రెంచి, బ్రిటిషు ప్రజలగుటచే, ఆ ప్రభుత్వములు రెండును జోక్యము కలిగించు కొనవలసివచ్చెను. బ్రిటను దృష్టిలో ఈజిప్టు హిందూదేశమునకు సోపానమువంటిది యగుటచే, డిస్రాలీ, అప్పటికే, క్రొత్త సూయజుకాలువను త్రవ్వించు సంఘములో 40 లక్షల పౌనుల విలువగల వాటాలను ఇస్మయిల్ పాషాకడ కొనెను. 1879-వ సం॥లో ఇస్మయిలుపాషాను దింపి, అతని పుత్రుని సింహాసనమెక్కించిరి. బ్రిటిషు, ఫ్రెంచి ఉద్యోగులు ఈజిప్టులో ఆర్థిక వ్యవహారములను సవరించుభారము వహించిరి. అరాబి పాషాయను ఈజిప్టు సైనికోద్యోగి యొకడు 1881-వ సం॥లో తిరుగుబాటుచేసెను. అలెగ్జాండ్రియాకడ బ్రవర్తిల్లిన దొమ్మిపోరులో నేబదిమంది ఐరోపియనులు హతులైరి. బ్రిటిషువా రంతట నావికాదళముతో అలెగ్జాండ్రియా నగరమును

ముట్టడించిరి. దేశమున శాంతి నెలకొల్పబడెను. ఖేదీవు బ్రిటిషు
సైన్యముమీదనే ఆధారపడియుండెను. ఆ సంవత్సరమే, ఖేదీవు
పాలనలోనున్న 'సూడాను' (Soudan) రాజ్యములో 'మహాదీ'
(Mahdi) యను మతాచార్యుడొకడు తిరుగుబాటు చేయుచుండెను.
బ్రిటిషువారపుడు సూడానునుండి ఈజిప్టు సైన్యములను తొల
గింప నిశ్చయించినవారై, ఆ పని దీర్చి, సూడాను పరిపాల
నము చక్కబెట్టుమని 'గార్డను' (Gordon) సేనాని నంపిరి.
గార్డను, 'ఖార్టూము' (Khartoum) చెంత తన స్కంధావారము
లతో విడిసి, మున్ముందు మహాదీని పరాజితుం జేయబూనెను.
ఖార్టూము పరిసరముల నివసించు కొన్ని తెగలవారు తిరుగు
బాటొనరించిరి. గార్డను, ఖార్టూమును ముట్టడించెను. కాని
అయిదు నెలలవరకు ప్రభుత్వమువారు సాయమంపక నాలసిం
చిరి. ఇంక రెండు రోజులకు సాయము వచ్చుననగా గార్డను
హతుడయ్యెను. ఖార్టూమును దానితోపాటు సూడానును
చేజారిపోయెను. ఈజిప్టు పరిపాలనాభారము ఖేదీవు వహింప
జాలడని అంతటితో తెల్లమయ్యెను. కావున ఈజిప్టు స్వయ
ముగా తన వ్యవహారములను చక్కదిద్దుకొనగ నేర్చువరకు
బ్రిటిషు సైన్యములును, ఉద్యోగులును దేశము నాక్రమించి
యుండిరి. ఈజిప్టునకా శక్తి ఇప్పుడిప్పుడే చేకూరినది. కాబట్టి
పేరునకు టర్కీ సార్వభౌమునికి సామంతుడై ఖేదీవు ఈజిప్టును
పాలించుచున్నా డనుకొనుటయేగాని, నిజమున కిప్పటివరకు
బ్రిటిషు కాన్సలు జనరలే ఈజిప్టునకు ప్రభువై, బ్రిటిషు సైన్య
మునండగొని బ్రిటిషు ఉద్యోగులతో పరిపాలనము సాగించు
చుండెను.

## గ్లాడ్‌స్టను, ఐర్లండు స్వపరిపాలన (Home Rule for Ireland)

"ఆకటనల్లాడు ప్రజయు, విమతప్రచారము, ప్రవాసులగు భూస్వాములు" అని ఐరిషు సమస్యను డిస్రాలీ మూడు ముక్కలలో పూరించెను. 1846-వ సం॥లో సప్పతిల్లిన క్షామముచే బ్రిటిషు రాజనీతి యెట్లు తలక్రిందులైనదో కనుగొంటిమి. ఐరిషు ప్రజలలో నించుమించుగా నందఱు కాథలిక్కు-మతానుయాయులు. చర్చియేమో విమతమగు ప్రాటెస్టంటు చర్చి. విమతమగు నీ చర్చిని తొలగించి, ఐర్లండును స్వతంత్ర మొనర్పవలసినదని 1833-వ సం॥ నుంచి 'ఓకానెలు' (O'Connell) అను నొక దిట్ట ఆందోళనము సల్పుచుండెను. అతడు 1847-వ సం॥లో మరణించినను, అతడు నాటిన యీ మొక్క వృద్ధియగుచుండెను. ఇది యిటుండ ఐర్లండులో కొలదిపాటి రైతులు భూముల నమ్ముకొనుటకు ఆంగ్ల ప్రభుత్వము సౌకర్యములు కలిగించెను. ఆ భూములను కేవల కర్షకులు కొని బాగుపడుదురని ప్రభుత్వమాసించెను. కాని తుదకా భూములను క్రొత్త క్రొత్త ధనవంతులు కొని, చిన్న భూస్వాముల నందఱను తొలగించి, పెద్ద పెద్ద ఖండ్రికలుగా కట్టుకొని, పసుల మేతకు బీళ్లుగా నుపయోగింప దొడగిరి. ఈ భూస్వాముల దుండగములకు 1848-వ సం॥లో క్షామదేవతకూడ తోడు పడగా ప్రజలు తిరుగుబాటు సలిపిరి. ఐర్లండున ప్రజాతంత్రము (Republic) నెలకొల్పు నుద్దేశముతో 1859-వ సం॥లో ఫెనియను (Fenian) సంఘము బయలుదేరెను.

1869-వ సం॥లో గ్లాడ్‌స్టను ఐర్లండుకు చికిత్స మొదలు పెట్టెను. మున్ముందుగా, ఐరిషు చర్చికి రాజాదరణమును తొలగించి దాని యాస్తిని కొంత ఊడబెఱికికొనెను. 1870-వ

సం॥లో భూస్వాముల అత్యాచారముల నరికట్టుటకొక శాసనము (Land Act) చేసెను. రైతులను భూములనుండి వెడలించు నపుడు వారికి భూస్వాములు పరిహార మొసంగవలయునని ఆ శాసనము శాసించెను. కాని దాని ప్రజా క్లేశములన్ నంతగా నుపయోగముకలుగలేదు. 1878-వ సం॥ లో పార్నెలు (Parnell) అను నతడు బ్రిటిషు పార్లమెంటులోని ఐరిషు సభ్యు లకు నాయకుడయ్యెను. 1800-వ సం॥లో నేర్పడిన బ్రిటను ఐర్లండుల కేర్పడిన సంయోగమును అంతమొందించి, ఐర్లండు నకు స్వపరిపాలనము సంపాదించుటకై యాతడు కృషిచేయ సాగెను.

1880-వ సం॥ మొదలు 1885-వ సం॥ వరకు గ్లాడ్‌స్టను రెండవతూరి మంత్రిత్వము వహించెను. ఆకాలమున, ఐరిషు కవులుదారులకు ఇంకను సౌకర్యములు చేకూర్చుటకై మరి యొక శాసనము (Land Act) చేసెను. కాని ఐరిషు ప్రజలు దానిచేగూడ శాంతింపక దుండగము లొనర్పసాగిరి. అంతట గ్లాడ్‌స్టను మంత్రికూడ సామముచే ప్రయోజనము గానక, దండోపాయము నవలంబించి యొక శాసనము (Coercion Act) చేసి 'పార్నెలు'ను నిర్బంధించెను.

1882-వ సం॥లో 'ఫ్రెడ్రిక్ కావెండిషు' ప్రభువు (Lord Frederick Cavendish) ఐర్లండు రాజ్యాంగమంత్రియై, ఐర్లండులో నడుగు పెట్టీపెట్టక మున్నె వధింపబడెను. ఐర్లండు నకు స్వపరిపాలన మొసగక తీరదని 1886-వ సం॥ నాటికి గ్లాడ్‌స్టను మంత్రికి తెలియ వచ్చెను. ఐర్లండునకు ప్రత్యేకము పార్ల మెంటు అవసరమనియు, ఆంతరంగిక వ్యవహారములు చక్క బెట్టుకొనుటకు దానికి సంపూర్ణమగు స్వేచ్ఛ యవసరమనియు

నాతడు గ్రహించెను. సైన్యము, విదేశములతో సంబంధము, ఎగుమతి దిగుమతులపై సుంకములు, వీని పరిపాలనమును మాత్రము ఐరిషు పార్లమెంటు బ్రిటిషు పార్లమెంటునకు లోబడి యుండవలయునని ఆతని యాశయము. పార్లమెంటులో ఐరిషు ప్రతినిధుల సాయములేకుండ లిబరలు వర్గము, కన్సర్వేటివుల నోడింపజాలదు గాన, గ్లాడ్స్టను ఐరిషు సభ్యుల సాయమును నిలుపుకొనువాడై వారి దేశమునకు స్వపరిపాలన మిచ్చు చుండెనను నింద కాతడు పాత్రమయ్యెను. ఆతని యాశయ మేమియైన నేమి; ఐరిషు స్వపరిపాలనశాసనము ముప్పది ఓట్ల భేదముతో పార్లమెంటుచే నిరాకరింపబడెను. ఐర్లండులో నుత్తరదిక్కుననుండు ప్రొటెస్టంటులకు ఇంగ్లండునుండి విడి పోవుట కిష్టములేదు. కావున స్వపరిపాలన విషయమున ఐర్లండులోనే ఏకవాక్యత కుదరకపోయెను. ఈ ఐరిషు శాస నముచే లిబరలు కక్షలోగూడ భేదములుదయించెను. శాసన మునకు వ్యతిరేకించిన లిబరలు కక్షకు 'జోసెఫు చాంబర్లేను' (Joseph Chamberlain) 'హార్టింగ్డను ప్రభువు' (Lord Harting-don) నాయకులైరి. పదపడి యీ హార్టింగ్డను ప్రభుడే 'డివాను షైరు'కు డ్యూకు (Duke of Devonshire) అయ్యెను. ఈ విభే దములకు ఫలముగా క్రొత్తయెన్నికలు జరుగుటయు, కన్స ర్వేటీవులు జయమందుటచే 'సాలిస్బరీ ప్రభువు' (Lord Salisbury) ప్రధానమంత్రి యగుటయు సంభవించెను.

సాలిస్బరీ ప్రభువు ఐర్లండులో శాంతి నెలకొల్పెను కాని, స్వాతంత్ర్యవాదము నడంపజాలడయ్యెను. 1892-వ సం॥లో గ్లాడ్స్టను రెండవతూరి ఐరిషు స్వపరిపాలనశాసనము పార్ల మెంటులో ప్రవేశపెట్టెను. అదియు నెగ్గెట్లో ప్రజాసభలో

నెగ్గెను కాని 1893-వ సం॥లో ప్రభుసభచే నిరాకరింపబడెను. 1890-వ సం॥కు పిమ్మట పార్నెలు పక్షీయులగు ఐరిషు సభ్యులలోగూడ భేదములు పుట్టుటచే, క్రమముగా ఉద్యమము చల్లబడినదనియే చెప్పవచ్చును. ఇనుపదారులు విశేషముగా నిర్మించుటయు, 1898-వ సం॥లో స్థానిక పరిపాలనము (Local Government) నేర్పడుటయు జరిగెను. 1903-వ సం॥ అనంతరము కృషీవలుల స్థితిగతులుకూడ చక్కచేయబడియెను.

## 19-వ శతాబ్దియందు కాలనీల విస్తృతి

1858-వ సం॥లో బ్రిటిషు కొలంబియా (Columbia) కాలనీయై 1871-వ సం॥లో కనడాతో కలుపబడెను. 1870-వ సం॥లో 'మానిటోబా' (Manitoba) రాష్ట్రముకూడ కనడాతో చేరెను. పిమ్మట కనడాకు డొమినియను ప్రతిపత్తి యొదవుటయు, 1873-వ సం॥లో 'ప్రిన్సు ఎడ్వర్డు ద్వీపము' (Prince Edward Island) కనడా డొమినియనులో చేరెను. అంతరంగిక వ్యవహారములలో స్వాతంత్ర్యమే డొమినియను ప్రతిపత్తి. 1871-వ సం॥ వరకు 'హడ్సను బే కంపెనీ' (Hudson's Bay Company) క్రిందనున్న 'పశ్చిమోత్తరరాష్ట్రములు' (North West Territories) కూడ 1876-వ సం॥లో రాజ్యతంత్రము (Constitution) ను పొందెను. ఈ విధముగా కనడాదేశమున ఆంగ్లాధికారము తిర్యక్ప్రసారియై పసిఫికుమహాసముద్రము నంటుదాకెను.

1769—1775-వ సంవత్సరములమధ్య 'కుక్ కప్తాను' (Captain Cook) ఆస్ట్రేలియా యను భూభాగమును కనుగొనిన పిమ్మట, బ్రిటిషుప్రజలు కొంద ఱచటికి వలసపోయి నెమ్మదిగా

స్థావరము లేర్పరచుకొనిరి. ప్రథమమున 1829-వ సం॥లో నాక్రమించిన భాగమునకు 'పశ్చిమాస్ట్రేలియా' (West Australia) అను నామ మేర్పడియెను. 1836-వ సం॥లో దక్షిణాస్ట్రేలియా యను రాష్ట్రముకూడ నేర్పడెను. ఆ శతాబ్ది మధ్య భాగమున, 'న్యూ సౌత్ వేల్సు' (New South Wales) 'విక్టోరియా' అను ప్రదేశములలో బంగారు గనులు లభించుటయు, బ్రిటిషు ప్రజలు తండోపతండములుగా నాస్ట్రేలియాకు వలస రా దొడగిరి. 1851-వ సం॥లో విక్టోరియా ప్రత్యేక కాలనీగా యేర్పడెను. 1859-వ సం॥లో 'న్యూ సౌత్ వేల్సు' నుండి, 'క్వీన్సులాండు' (Queensland) అను భాగము ప్రత్యేకింపబడెను.

1840-వ సం॥లో 'న్యూజీలండు' (New Zealand) అను రెండు దీవులను గ్రేటుబ్రిటను వశపరచుకొనెను. 1841-వ సం॥లో బ్రిటిషుప్రజ యా దీవులకు వలసపోదొడగెను. 1885-వ సం॥లో న్యూజీలండుకుగూడ డొమినియను ప్రతిపత్తి లభించెను.

దక్షిణాఫ్రికాలో మాత్రము బ్రిటిషువారి రాజ్య విస్తృతి యింత సుఖముగా నెరవేరలేదు. 1652-వ సం॥ అనంతరము, 'గుడ్ హోప్ అగ్రమును' (Cape of Good Hope) డచ్చివారు ఆక్రమించిరి. నెపోలియను హయాములో హాలండు ఫ్రెంచివారి చెప్పు చేతలలో నుండుటచే, బ్రిటను, డచ్చివారి కేపు కాలనీ నాక్రమించిరి. డచ్చిప్రజ యంత నా కాలనీని విడిచి యేగక అచటనే వసించియుండిరి. 1833-వ సం॥లో బ్రిటిషుసామ్రాజ్యమునందంతట దాస్యము (Slavery) నిషేధింపబడుట విదితము. అప్పటికి అయిదేండ్లక్రితమే దక్షి

దాక్షిణాఫ్రికాలోని ఆదిమవాసులకు (Natives) పరదేశీయులతో సమానమగు ప్రతిపత్తి యొసగబడెను. ఈ విధముగా దాస్యవృత్తి నిషేధింపబడుటచే తమ బానిసలందఱును కోల్పోవలసి వచ్చుటయు, నేటివులకు సైతము తమతో సమానాధికారము లొసగుటయు డచ్చివారికి కంటకము లయ్యెను. అంతట బోయర్లు (Boers) అనబడు నా డచ్చివారు కేపు కాలనీని విడిచిపెట్టి (1836) ఉత్తరదిక్కునకు కొందఱు, తూర్పు దెసకు కొందఱు లేచిపోయిరి. అందు కొందఱు 'నేటాలు' (Natal) ప్రాంతమున కేగిరి. 1843-వ సం॥లో ఆ నేటాలుగూడ బ్రిటిషు కాలనీ యయ్యెను. ఆరంజి (Orange) వాలు (Vaal) నదులమధ్య ప్రదేశముల కొందఱును, వాలునదికి ఉత్తరదిక్కునను భూములందు మరికొందఱును నివాసమేర్పరచికొనిరి. ఈ విధముగా 1836-వ సంవత్సరమునకు పిమ్మట ఏర్పడిన యీ బోయరు కాలనీలకు 'ట్రాన్సువాలు' (Transvaal) 'ఆరంజి ఫ్రీస్టేటు' (Orange Free State) అను నామము లేర్పడెను. వీనిలో మొదటి దానిని 1852-వ సం॥లోను, రెండవదానిని 1854-వ సం॥లోను బ్రిటిషు ప్రభుత్వము, స్వతంత్రములుగా నంగీకరించెను.

ఇట్లు కొంతకాలము చెల్లుచు, 'కింబర్లీ' (Kimberley) పరిసరములందు రత్నములు లభింపదొడగెను. బోయరు కాలనీలు రెండును, ఈ రత్ననిధులు తమ యదృష్టముచే లభించెనని యుబ్బితబ్బిబ్బగుచుండ, 1871-వ సం॥లో బ్రిటిషువారు కింబర్లీ పరిసరభూములను స్వాధీన మొనర్చుకొనిరి. దీనితో బోయర్లకు కడుపు మండిపోయెను. ఇది యిటులుండ, ట్రాన్సువాలు వృద్ధినందుటలేదను మిషచే 1877-వ సం॥లో బ్రిటిషు

ప్రభుత్వ మాకాలనీనిగూడ డిగ్రమ్రింగెను. ఇవియెల్ల కారణ ములుగా 1879-వ సం॥ లో జూలూల (Zulus) తోడను, 1881-వ సం॥లో ట్రాన్సువాలు బోయర్లతోడను బ్రిటనుకు యుద్ధము పొసగెను. 1881-వ సం॥ లో 'మజూబా' కొండ (Majuba Hill) చెంత బ్రిటిషువారి అల్పసైన్యమొకటి ఓడింప బడియెను. రాజనీతివిదుడగు గ్లాడ్‌స్టను ప్రధాని ట్రాన్సు వాలును సర్వతంత్ర స్వతంత్రము (Independent Republic) గా నంగీకరించెను.

పిమ్మట 1886-వ సం॥లో ట్రాన్సువాలులో బంగారు గనులు దొరకెను. అంతట క్రొత్త ప్రజ తండ తండము లుగా నచటికి వచ్చి వడుటచే బోయర్ల సంఖ్య లొచ్చుయ్యెను. బోయర్లు ఆనూతనాగతులకు తమతోపాటు సమానస్వత్వముల నంగీకరింపరైరి. ప్రభుత్వాధిపతియగు 'క్రూగరు' (President Kruger) ప్రభుత్వవ్యయమునకు సరిపడునట్లు పన్నులన్నియు ఆ క్రొత్తవారినుండియే గ్రహింపజొచ్చెను. కేపుకాలనీలో ప్రధా నామాత్యుడగు 'సెసిలు రోడ్సు' (Cecil Rhodes) అను నతడు, 1895-వ సం॥లో ట్రాన్సువాలునం దంకురించిన విప్లవాగ్నికి వాయువై చేయూత యొసగెను. అనాలోచితముగా ట్రాన్సు వాలుపై సల్పిన 'జేమ్సను దాడి' (Jameson Raid) నాబడు ఆక్రమణము బొత్తుగా నిష్ఫలమైపోయెను. అంతియకాని ట్రాన్సువాలులో నూతనాగతుల స్థితిని చక్కబఱచు యత్న మేమియు కానరాదయ్యె. తుదకు 1899-వ సం॥ లో బ్రిటిషు వారు కత్తిగట్టి రణభేరి మ్రోయించిరి. ఆరంజి ఫ్రీస్టేటు, ట్రాన్సువాలుకు సాయపడెను. విక్టోరియా రాజ్ఞి యనంతర మునగూడ నా యుద్ధము చల్లారలేదు. ఎట్టకేలకు 1902-వ

సం॥ లో నా సంగ్రామము ముగిసి, స్వతంత్రములగు బోయరు రాష్ట్రములు రెండును బ్రిటనుకు విధేయములయ్యెను.

19-వ శతాబ్ది పరభాగమున, 'బెచూనాలాండు' (Bechuanaland) 'రొడీసియా', (Rhodesia) 'నైజీరియా,' (Nigeria) 'బ్రిటిషు ఈస్టు ఆఫ్రికా,' (British East Africa) 'ఉగాండా' (Uganda) యను ఆఫ్రికా భాగములెల్ల బ్రిటిషు పరిపాలన క్రిందికి వచ్చెను.

## కాలనీల విషయమై నూతన రాజనీతి

ఈపగిది పుత్త్రికా సంతతి (Colonies) తామర తంపర యగుచుండ, తల్లిదేశమగు బ్రిటను, వానివిషయ మవలంబించెడు రాజనీతియందు క్రమముగా మార్పు లొనర్చుకొనుచుండెను. 17, 18-వ శతాబ్దులయందు, కాలనీలు కేవలము బ్రిటనుయొక్క ముల్లెమూటగా పరిగణింపబడెను. విక్టోరియా రాణి హయాములో నా యభిప్రాయము మార్పునొంది, కాలనీలు ఆత్మక్షేమముగూడ నారసికొనుట యవసరమని గుర్తింపబడియెను. కావున కాలనీలకు చాలభాగము పరిపాలనా స్వాతంత్ర్యము లభించెను.

1837-వ సం॥లో, కనడాయందు తిరుగుబాటు పొడమగా, శాంతి నెలకొల్పుటకై 'డర్హాము' ప్రభువు (Lord Durham) నచటికంపిరి. ఆతడు పరిస్థితులు మూలముట్టుగా పరిశీలించి, 'కనడాకు పెద్దతన మంగీకరించి, దానివ్యవహారము లది చక్క బెట్టుకొనుట కంగీకరించినచో, తల్లి దేశమునెడల తొంటికంటె భక్తిమై నడచుకొను' నని నివేదించెను. అదిమొదలు బ్రిటను కాలనీలయెడ తన నీతిని మార్చుకొని, సామ్రాజ్యక్షేమమునకు సంబంధించిన విషయములలో తప్ప, తక్కిన విషయములలో

కాలనీలకు స్వేచ్ఛనొసంగెను. ఆప్రకారము, ఎల్జిన్‌ప్రభువు గవర్నరుగా నున్నకాలమున (1847—1855 సం॥) కనడాకు ఆంతరంగిక వ్యవహారములలో పూర్ణమగు స్వేచ్ఛ లభించెను. 1867-వ సం॥ లో 'అన్టేరియో' (Ontario) 'క్వెబెక్' (Quebec) 'నోవాస్కోషియా' (Nova Scotia) 'న్యూబ్రన్సువిక్' (New Brunswick) రాష్ట్రములను కనడాతో చేర్చి, ఆ రాజ్యమునకు 'డొమినియను' ప్రతిపత్తి యొసంగిరి.

1855-వ సం॥లో ఆస్ట్రేలియా, న్యూజీలండులకుగూడ స్వపరిపాలనము లభించెను. 1860-వ సం॥లో న్యూజీలండు డొమినియనయ్యెను. 1900-వ సం॥లో ఆస్ట్రేలియాయందలి రాష్ట్రములన్నిటి నేకమొనర్చి 'కామన్‌వెల్తు' (Commonwealth) అని నామకరణము సల్పిరి.

డర్హాముప్రభునిపుణ్యమా యని, యీ నూతన రాజనీతి సత్ఫలప్రదమయ్యెను. ఇక యావద్బ్రిటిషుసామ్రాజ్య క్షేమ విచారణమునందుగూడ కాలనీలకు భాగస్వామ్యము కల్పించుటయే మిగిలియుండెను. ఆ కొఱతగూడ తీర్చుటకై 1887-వ సం॥లో మహారాజ్ఞీ పరిపాలనోత్సవ (Jubilee) సందర్భమున కాలనీల మహాసభ జరపబడెను. ఆ విషయమున సంప్రదింపులింకను ముగియలేదు. సామ్రాజ్యపాలనమున కాలనీలకింకను పాలు పుట్టలేదు.

## మహారాజ్ఞి షష్టిపూర్తి (1897-వ సం॥)

23-9-1896-వ సం॥ నాటికి విక్టోరియాపాలనము తొంటి రాజులయెల్లరి పాలనముకంటె దీర్ఘమైనదయ్యెను. 1897-వ సం॥లో మహారాజ్ఞి పాలనమునకు షష్టిపూర్తి మహోత్స

వము లేర్పాటుచేయబడెను. తన పాలనమున సామ్రాజ్య మతి విస్తృతమగుటచే, ఆ శుభమునకు చిహ్నముగా [illegible] యన్నుకూడ ఆ మహోత్సవమున పాల్గొనెను. 'బకింగుహాము' రాజ ప్రాసాదమునుండి వెడలి యూరేగింపు బయలుదేరెను. కాలనీలమంత్రులందఱు సాయము నడచిరి. ఇండియా ప్రతినిధియు, ఇతర సామంతరాజ్య ప్రతినిధులు నా యూరేగింపున భక్తితో పాల్గొనిరి. పరమానందముతో యూరేగింపు అప్పు సెయింటుపాలుగుడిరొద్ద కరిగెను. అచట ప్రార్థనాదికము నిర్వర్తింపబడెను. ఆ ప్రకారము పదిదినములు బ్రిటనునందంతట ఆనందోత్సవము ప్రవర్తిల్లెను. ప్రతి పట్టణము దీపికాసహస్రములచే విరాజిల్లెను. దేశమంతట పర్వతములపై, గుట్టలపై ప్రజలు నెగళ్లు వెలిగించి ఆనందకోలాహలమున మైమఱచిరి. మహారాజ్ఞియొక్క చల్లని పాలనమును స్మరించుచు సామ్రాజ్యమంతయు భక్తిభావమున వెల్లివిరిసెను. 22-1-1901-వ సం॥ న మహారాజ్ఞి పరమపద మలంకరించెను.

## బ్రిటను—యూరపు 1878—1901-వ సం॥

ఈ మధ్యకాలమున యూరపుఖండమున సాగుచు వచ్చిన యుద్ధములలో బ్రిటను దిగకున్నను, అన్యరాష్ట్రసంబంధములలో చాల చిక్కులేర్పడెను. ఈ చిక్కులన్నియు టర్కీని పురస్కరించుకొని సంఘటిల్లెనని చెప్పవచ్చును. ఇతర ఐరోపీయరాష్ట్రములతో బ్రిటనుగూడ నేకీభవించి, టర్కీరాజ్యమునందలి క్రైస్తవులకు న్యాయము కలిగించుటకై టర్కీసుల్తానును నయమున భయమున మందలించుచుండెను. ఈలోపల జర్మనీ టర్కీతో నానాటగాఢమైత్రి నెరపుచుండెను. జర్మనీవర్తకులు,

టర్కీరాజ్యమందలి 'కాన్స్టాంటి నోపిలు' లోను, 'ఆసియామైనరు' (Asia Minor) లోను ముఖ్యములగు వసతులు, సౌకర్యములు సంపాదించుచుండిరి. 1899-వ సం॥లో జర్మనులు, ఆసియా మైనరునుండి 'బాగ్దాదు' (Bagdad) నగరమునకు, పిమ్మట పారసీకసముద్రమునకు (Persian Gulf) రైల్వే నిర్మించుటకు సుల్తాను అనుజ్ఞబడసిరి. బ్రిటను ఇది యెల్లగాంచి, జర్మనీ, ఇండియాపై కన్నువైచె నని అనుమానించెను. దీనికితోడు, జర్మను చక్రవర్తియగు రెండవ విలియము అపారముగ నౌకాదళము నిర్మింపసాగెను. ఆ ప్రయత్నము కొలదికాలములో ఆంగ్ల నౌకాదళమును మించునేమో యనునట్లుండెను. ఆయా కారణములచే పూర్ణముగ అనుమానము, భీతియు నెలకొన్నవికాని, ఇంగ్లండు జర్మనీలకు పోరుపులు పుట్టకుండనే 19-వ శతాబ్ది గడచిపోయెను.

ఐరోపీయరాజ్యములలో వేనితోడను గాఢమగు సంధిబంధములలో దిగకుండుటయే బ్రిటను నీతిపద్ధతి. కాని రెండు ముఖ్యమగు సంబంధము లేర్పడకతప్పలేదు. అది యెట్లన- జర్మనీ, ఆస్ట్రియా, ఇటలీదేశములు మూడును ఏకమై స్నేహపు ముడివైచుకొనియెను. వీనిలో ఆస్ట్రియా, ఇటలీలకు ఆంతర్యమున శుద్ధిలేకున్నను, ఈ మూడింటి మైత్రియు, ఇతరులకు ముప్పైతోచెను. 1871-వ సం॥లో రష్యాతో జర్మనీ యేర్పరచుకొన్న స్నేహబంధము, 1888-వ సం॥లో రెండవ విలియము రాజైనపిమ్మట సడలి భేదములుపుట్టెను. రష్యాయంతట ఫ్రాన్సుతో చేరి సఖ్యమొనర్చుకొనెను. ఈ విధముగా యూరపునందు ప్రబలమగు రాజ్యపంచకము, రెండుపక్షములుగా నేర్పడెను. ఒకరినిమించి యొకరు భూసైన్యములను, జలసైన్యములను పెంచుకొన

సాగెను. పరస్పరము అసూయలు అనుమానములు హెచ్చుపెరుగు చుండెను. యూరోపుఖండమంతయు అగ్నిపర్వతముపై కాపురి మున్నట్లుండెను. ఉండియుండి, ఆ యగ్నిపర్వతము 1914-వ సం॥లో బ్రద్దలయ్యెను. ఇంగ్లండునకు, ఫ్రాన్సు, రష్యాలతో స్వల్పములగు విభేదములు కలవుగాని అవి యుద్ధమునకు దారి తీయలేదు. బ్రిటను, బోయర్లతో పోరాడుచున్నప్పుడు, జర్మని తేటతెల్లముగా బోయర్ల నభినానించెను. బ్రిటనుకిది పూర్తిగా క్రోధకారణమయ్యెను. తుదకు 1902-వ సం॥లో బ్రిటను జపానుదేశములు రెండును మైత్రిబంధము నేర్పరచుకొనెను. ఇది మొదటి సంబంధము. తదుపరి, బ్రిటను, రష్యా ఫ్రాన్సు దేశములకు గాఢతమమైత్రి కాకున్నను, స్నేహభావము వర్ధిల్లెను.

## 19-వ శతాబ్దిలో సాహిత్యము శాస్త్రవిజ్ఞానము

ఈ శతాబ్దిలో, శాస్త్రవిషయముల అద్భుతమగు కృషి జరుగుటయేకాక, సాహిత్యముగూడ మిగుల వర్ధిల్లెను. ఈ యుభయమునుగూర్చి యెంత యల్పముగా పరామర్శించుటయైనను ఇట సాధ్యముకాదు. కావున ఆ వ్యవసాయములందు గడి దేరినవారిలో ముఖ్యుల నామములుమాత్రమిట ప్రశంసింప బడును. ఈ శతాబ్దమున, కవితావిషయమున, 'కీట్సు' (Keats: 1795—1821) 'షెల్లీ'లు Shelley: (1792—1823) వర్డ్సువర్తు (Wordsworth: 1770—1850) టెన్నిసను (Tennyson: 1809—1892) బ్రౌనింగులు (Browning: 1812—1889) మాత్రము గణనీయులు. అందు కీట్సు షెల్లీలు, అపరూప భావనా వశంవదులై, తులలేని రసవత్కవితారచనము సలిపిరి.

న్గ్సన్వర్తు తేటమాటలతో, నిరాడంబమగు ఆంగ్లజన పదమా ధుర్యములను రుచిచూపెను. ఆతనిజూచి తరువాతి కవులెల్ల సృష్టిమహిమను కీర్తించుట పరిపాటియయ్యెను. టెన్నిసను కవితయందు వృత్తులు, శయ్యలు, పాకములు పరిణతినొంది యేకీభవించెను. సకలపదార్థములు ఆతని కవితకు విషయము లగుటచే ఆతడు శతాధిక గ్రంథనిర్మాతయై ఆంగ్లకవులలో మిన్న యని పొగడ్తకెక్కెను. శయ్యారీతులయందు బ్రౌనింగుకూడ ముక్కాకలు తీరినవాడయ్యెను, ఆతని కవితహృదయము నంతగా కరగింపక బుద్ధిని ముగ్ధమొనర్చెను.

గద్యరచనములందు ఆఖ్యాయిక (Novel) యను రచనా భేదము పరిణతిసందెను. ఆఖ్యాయికలు రచించినవారిలో 'డికెన్సు' (Dickens) 'థాకరే' (Thackeray) ముఖ్యముగా గణనీయులు. 19-వ శతాబ్ది మధ్యకాలమునందలి శ్రీమంతుల జీవితములను యథాతథముగా చిత్రించి థాకరే ప్రస్తుతి కెక్కెను. ఆ జీవితమునకు లక్ష్యములనదగిన 'బెకీ-షార్పు' (Beckey Sharp) 'బియాట్రిక్సు ఎస్మండు' (Beatrix Esmond)ల పాత్రము లీతని సృష్టిలో ప్రథమగణనీయములు. డికెన్సు లక్ష్యము సంఘసంస్కారము. హాస్యరస మాతని కవితకు ప్రాణము. ఆతనికాలమున సంఘము నావరించిన దోషముల నతడత్యంత రమణీయముగ గేలియొనర్చెను. ఆంగ్లసారస్వత మున మణిపూసలనదగిన హాస్యరసపాత్రములెన్నిటినో యాతడు సృజించెను. హాస్యరసప్రధానములగు నాతని పాత్రములు జీవితప్రతిబింబములు కాకున్నను ఆంగ్లప్రజల ప్రేమానురాగ ముల కవి అత్యంతము నాకరములు. ఇతిహాసరచనమునను, వీర చరిత్రకథనమునను, సంఘమునందలి కుళ్లు వెళ్లబెట్టుటయందును

'కార్లైలు' (Carlyle) లేఖిని అతనిచేతను. ఇతని సమకాలికు నాతడు ఆత్మప్రతిభాగ్నియందు క్రొక్కి పుటమువెట్టుచున్నాడు. కళ్హారహాస్యములను, అందలి రసములను విప్పిచెప్పుటలో (Ruskin) అగ్రగణ్యుడు. రసగ్రహణవిషయమున ఆతని రచనలచే ఎందఱకో చక్కని యభిరుచి యలవడెను. 'స్టీవెన్సను' (Stevenson: 1850—1894-వ సం॥) అనునతడు నేఁటికిని చిత్రలమునగు శైలియలరార అనేక ఆఖ్యాయికలు వ్యాసములు రచించెను. గద్యపద్యరచనలయందు ప్రాముఖ్యముగ వీరితో తులదూగువారింక నెందఱో కలరు. ఈ శతాబ్దియం దెందరో శాస్త్రజ్ఞులు అనేక నూతనపరిశోధనలు గావించి, ధర్మప్రచారమును తలక్రిందులొనర్చు క్రొత్తవిషయము లెన్నియో కనుపెట్టిరి.

1830-1880-వ సం॥ల మధ్య ఇనుపదారు లమితముగా పెఱిగిపోయెను. ఈ శతాబ్ది పరభాగముననే ఆవిరితో ఓడలు నడపుట నెఱింగిరి. కావున రాకపోకలకు, ఎగుమతి దిగుమతులకు అనేక సౌకర్యము లేర్పడెను. 1820-1830-వ సం॥ల మధ్య విద్యుచ్ఛక్తి ప్రయోగమునుగూర్చి పరిశోధనములు జరిగెను. 1846-వ సం॥లో విద్యుద్వార్తాహరణ సంఘము (Electric Telegraph Company) బయలుదేరెను.

1851-వ సం॥లో ఫ్రాన్సునకు సముద్రముగుండా వార్తలు (Cable) పంపబడెను. 1865—1875-వ సం॥ల మధ్య మహాసముద్రము లన్నిటియందు వార్తాహరణ తంత్రులమర్పబడెను. శతాబ్దాంతమున విద్యుద్దీపములు వెలిఁగెను. టెలిఫోను వార్తలు వినిపించెను. చమురుతో పెట్రోలుతో యంత్రములు నడపబడియెను. రాకపోకలు సులభాతి సులభములై, ఖండాంతరములవారు ఒండొరులతో మాటలాడు నద్భుతము పుట్టెను.

శారీరశాస్త్ర పరిశోధనచే రోగనివారణము సులభము కావొడగెను. మానవ శరీరము నితర జంతు శరీరములతో పోల్చిచూచు కృషి ఫలించి, 'చార్లెసు డార్విను (Charles Darwin: 1809—1882-వ సం॥) అను విజ్ఞాని 'సృష్టివిధానము' (Origin of Species) అను గ్రంథము రచించెను. అనంతకాలము నుండియు సృష్టివికాసము ప్రవర్తిల్లుచుండెననియు, భూతసంతానము అనేక శతసహస్రాంతములు గడచి తుదకు మానవ శరీర పరిణామమందెనేకాని, ఒక్కతూరిగా మానవసృష్టి జరగ లేదనియు డార్విను పండితు డాగ్రంథమున సిద్ధాంతీకరించెను. "మనుష్య జ్ఞానము నొక్కపెట్టున పరమావధికి గొంపోయి, ప్రాత విశ్వాసములను తలక్రిందులు సల్పుటలో నీ గ్రంథము నకు 'ఐసాకు న్యూటను' (Isaac Newton) రచించిన 'ప్రిన్సిపియా' (Principia) అను గ్రంథ మొకటియే సాటి. విజ్ఞాని ప్రపంచ మొక్కపెట్టున ఈ గ్రంథముపై ఖండన మండనములు గురిపించెను. ఈ గ్రంథమునందలి పరమార్థమును గ్రహింప జాలకపోవుటలో శత్రులు మిత్రులుగూడ సమానులే. ఇట్టి చిత్రము కని విని యెఱుగము."

ఈవిధముగా శాస్త్రజ్ఞానము క్రొత్తదారులు త్రొక్కి కొలది యూరపుఖండ స్వరూపస్వభావములే మారజొచ్చెను. ఈవిధముగా 19-వ శతాబ్దిలో విజ్ఞానభానుడు పునర్జన్మమెత్తెను. ఈ విజ్ఞాన సర్వస్వము ఇరువదియవ శతాబ్దికి హస్తగత మయ్యెను. ఈ జ్ఞానసంపదచే మనుష్యుడు ఊర్ధ్వగతిదై బాగుపడునో! అధోగతిదై నశించునో! రెండును వాని యధీనములే



## మూడవ యెడ్వర్డుయొక్క ఫ్రెంచిరాజ్యార్హత.

- మూడవ ఫిలిప్పు హయాము 1270—1285.
  - నాల్గవ ఫిలిప్పు హయాము 1285—1314.
    - పదియవ లూయీ హయాము 1314—1316.
      - ఒకటవ జాను హయాము 1316.
    - ఐదవ ఫిలిప్పు హయాము 1316—1322.
    - నాల్గవ చార్లెసు హయాము 1322—1328.
    - ఇసాబెలు ఇంగ్లండు రాజగు రెండవ యెడ్వర్డుకు భార్య.
      - మూడవ యెడ్వర్డు (ఇంగ్లండురాజు).
  - చార్లెసు వెలాయిసు (Count of Valois) 1325 మరణము.
    - ఆరవ ఫిలిప్పు హయాము 1328—1350.
      - రెండవ జాను హయాము 1350—1364.

32

రిచార్డు నెవిలు, "రాజవిధాత," 1471-వ సం॥లో హతుడయ్యెను. (భార్య) ఆనీ బ్యూచాంపు, వార్విక్కు-నుత్తరాధికారిణి.

- నాల్గవ ఎడ్వర్డు.
- ఎడ్మండు, 1460-వ సం॥లో హతుడయ్యెను.
- జార్జి, క్లారెన్సు ప్రభువు. (భార్య) ఇసాబెలు నెవిలు.
- మూడవ రిచార్డు
  - ఆనీ నెవిలును పెండ్లియాడెను.
- ఎలిజబెతు.

# ఆంగ్లరాజవంశావళి.

## నార్మనువిజయుఁడగు మొదటి విలియము

జననము 1007 మృతి 1087 (భార్య) మాటిల్డా, ఫ్లాండర్సు రాకుమారి.

- రాబర్టు, నార్మండీ డ్యూకు జ. 1051, మృ. 1134.
  - విలియము, ఫ్లాండర్సుకౌంటు.
- రెండవ విలియము జ. 1060, సుమారు, మృ. 1100
- మొదటి హెన్రీ జ. 1068, మృ. 1135 భార్య, స్కాట్లండు రాకుమారి మాటిల్డా.
  - మాటిల్డా, మృ. 1167 (భర్త) అంజౌకౌంటు జెఫ్రీ.
    - రెండవ హెన్రీ. జ. 1133, మృ. 1189. అక్విటైను రాకుమారి ఎలీనరును పెండ్లాడెను.
- అడీలా (భర్త) స్టీఫను, బ్లాయి కౌంటు మృ. 1137.
  - స్టీఫను మృ. 1154. బౌలోను ప్రభువునారి మాటిల్డాను పెండ్లియాడెను.
    - యుస్టేసు, బౌలోను కౌంటు. మృ. 1153.
    - విలియము, బౌలోను కౌంటు. మృ. 1160.

హెన్రీ. జ. 1155, మృ. 1183.

మొదటి రిచార్డు జ. 1157, మృ. 1199.

జియాఫ్రీ జ. 1158, మృ. 1186.

ఆర్థరు, బ్రిటనీ డ్యూకు.

జాను. జ. 1166, మృ. 1216.

మూడవ హెన్రీ జ. 1207, మృ. 1272. ప్రావెన్సు ప్రభుకుమారి, ఎలీనరును పెండ్లియాడెను.

మొదటి ఎడ్వర్డు. జ. 1239, మృ. 1307, కాస్టైలు ప్రభుకుమారి ఎలీనరును పెండ్లియాడెను.

రెండవ ఎడ్వర్డు. జ. 1284, 1327 సం॥లో హతుడయ్యెను. ఫ్రాన్సు రాకుమారి ఇసాబెలును పెండ్లియాడెను.

మూడవ ఎడ్వర్డు జ. 1312, మృ. 1377, హైనాల్టు ప్రభుకుమారి ఫిలిప్పాను పెండ్లియాడెను.

ఓవెనుట్యూడరు

ఆరవ హెన్రీ, జ. 1421, మృ. 1471.

ఎడ్మండు ట్యూడరు రిచమండు ప్రభువు.

ఏడవ హెన్రీ జ. 1456, మృ. 1509, ఎలిజబెతు. (భార్య)

నాల్గవ ఎడ్వర్డు జ. 1442, మృ. 1483.

ఐదవ ఎడ్వర్డు

మూడవ రిచార్డు, జ. 1452, మృ. 1485.

ఎడ్వర్డు, వేల్సురాకుమారుడు.

ఎడ్వర్డు, వేల్సురాకుమారుడు, జ. 1453, మృ. 1471.

ఎనిమిదవ హెన్రీ, జ. 1491, మృ. 1547.

భార్యలు

మార్గరెటు, జ. 1489, మృ. 1541, స్కాట్లండు రాజగు నాల్గవ జేమ్సును పెండ్లియయ్యెను

మేరీ, జ. 1498, మృ. 1533. సఫోక్ప్రభువైన చార్లెసు బ్రాండనును పెండ్లియాడెను.

1. కాథరిను ఆఫ్ ఆరాగన్. — మేరీ, జ. 1516, మృ. 1558.

2. ఆనీ బొలిను. — ఎలిజబెతు, జ. 1533, మృ. 1603.

3. జేను సీమూరు. — ఆరవ ఎడ్వర్డు, జ. 1537, మృ. 1553.

4వ జేమ్సు, స్కాట్లండు రాజు.
|
మేరీ, స్కాట్లండు రాణి.
|
మొదటి జేమ్సు, జ. 1566, మృ. 1625.

హెన్రీ గ్రేను పెండ్లి యాడెను.
|
లేడీ జేను గ్రే.

## ఆంగ్లరాజ వంశావళి.

- **మొదటి జేమ్సు.**
  - మొదటి చార్లెసు, జ. 1600, మృ. 1649. (భార్య) ఫ్రాన్సు రాకుమారి హెన్రీటా.
    - రెండవ చార్లెసు, జ. 1630, మృ. 1685.
    - రెండవ జేమ్సు, జ. 1633, మృ. 1701. భార్యలు
      - 1. ఆనీ హైడు.
        - మేరీ, జ. 1662, మృ. 1694. (భర్త) మూడవ విలియము.
        - ఆనీ, జ. 1665, మృ. 1714.
      - 2. మేరీ ఆఫ్ మోడెనా.
        - జేమ్సు ఫ్రాన్సిసు ఎడ్వర్డు స్టూవర్టు "ప్రాత ప్రిటెండరు" జ. 1688, మృ. 1766.
    - మేరీ, జ. 1631, మృ. 1660. (భర్త) ఆరంజి ప్రభువు, విలియము
      - మూడవ విలియము, జ 1650, మృ. 1702. (భార్య) మేరీ
  - ఎలిజబెతు (భర్త) ఫ్రెడెరికు. పాలటైను ఎలెక్టరు.
    - సోఫియా, మృ. 1714. (భర్త) హానోవరు ఎలెక్టరు.
      - మొదటి జార్జి, జ 1660, మృ. 1727.
        - రెండవ జార్జి, జ. 1683, మృ. 1760.
          - ఫ్రెడెరికు, వేల్సు రాకుమారుడు. జ. 1707, మృ. 1751.

చార్లెసు ఎడ్వర్డు స్టూవర్టు
"చిన్న ప్రిటెండరు,"
జ. 1720, మృ. 1788.

హెన్రీ స్టూవర్టు,
మృ. 1807.

నాల్గవ జార్జి,
జ. 1762, మృ. 1830.

షార్లోటి,
మృ. 1817.

నాల్గవ విలియము,
జ. 1765, మృ. 1837.

మూడవ జార్జి,
జ. 1738, మృ. 1820.

ఎడ్వర్డు, కెంటు
ద్యూకు,
జ. 1767, మృ. 1820.

విక్టోరియా,
జ. 1819, మృ. 1901.
(భర్త)
సాక్సుకోబర్గుగోథా,
నాఘాని యువరాజగు
ఆల్బర్టు.

ఎర్నెస్టు
అగస్టసు,
హానోవరు రాజు,
మృ. 1851.

# 410-వ సం॥ మొదలు 1558-వ సం॥ వరకుగల మధ్య కాలమున ముఖ్య సంఘటనములు.

| సంవత్సరము. | రాజుల పేర్లు. | అన్యదేశముల వ్యవహారములు, యుద్ధములు. | ఆంతరంగిక వ్యవహారములు. |
|---|---|---|---|
| 410 | | గాథులు (Goths) రోమును ముట్టడించిరి. | రోమక సైన్యములు బ్రిటను విడచి యేగ మొదలిడెను. |
| 450 | | 476 పశ్చిమరోమక సామ్రాజ్యాంతము.<br>450—550 మధ్య, బ్రిటనులకు, ఆంగ్లో సాక్జన్లకు ఘోరయుద్ధము. | 449 ఆంగ్లోసాక్జనులు బ్రిటను నాక్రమించుట. |
| 500 | | | |
| 550 | కెంటు రాజగు ఎథెల్బర్టు 565—616. | యుద్ధతీవ్రత తగ్గెను. బ్రిటన్లు చాలమంది పలాయనమగుట.<br>డియోర్హ్యాము యుద్ధము 577. | 597 సెయింటు ఆగస్టీనుయొక్క మిషను. (Mission of St. Augustine) |
| 600 | నార్తంబ్రియా రాజు ఎడ్విను 616—633. | 613 చెస్టరు యుద్ధము. | 616—685 నార్తంబ్రియా యొక్క ఆధిపత్యము. |
| 650 | | | 664 విట్ బి పరిషత్తు. (Synod of Whitby) |

| సంవత్సరము. | రాజుల శ్రేణి. | అన్యదేశముల వ్యవహారములు, యుద్ధములు. | అంతరంగిక వ్యవహారములు. |
| --- | --- | --- | --- |
| 650 | | 685 నెక్టాన్సుమియరు యుద్ధము. (Battle of Nechtansmere.) | 685—796 మెర్సియా యొక్క ఆధిపత్యము. |
| 700 | | 733 మెర్సియా, వెసెక్సు నోడించుట. | జారోయొద్ద బీడు (Bede at Jarrow) |
| 750 | మెర్సియా రాజగు ఒఫా 758—794. | | 787 మొదటి డేనిషు దాడి. |
| 800 | వెసెక్సు రాజగు ఎగ్బర్టు. 800—836. | | 802—1017 వెసెక్సు యొక్క ఆధిపత్యము. |
| 850 | | | 851 చలికాలమును డేనులు షెప్పీ ద్వీపమున గడపిరి. 867 నార్తంబ్రియాను డేనులు జయించిరి. 870 డేనులు, ప్రాగాంగ్లియాలో స్థావరము ఏర్పరచుకొనిరి. 874 మెర్సియాను డేనులు జయించిరి. |
| 900 | ఆల్ఫ్రెడు 871—901. | 878 ఎథాన్డన్యుద్ధము. | 878 డేనులు వెసెక్సుపై నెత్తి చనుట. |

| సంవత్సరము. | రాజుల పేళ్లు. | అన్యదేశముల వ్యవహారములు, యుద్ధములు. | ఆంతరంగిక వ్యవహారములు. |
|---|---|---|---|
| 900 | పెద్ద ఎడ్వర్డు 901—925. | వెడ్మోరుసంధి 893—897 ఆల్ఫ్రెడు, డేనులతో చేసిన చరమ యుద్ధములు. | |
| | ఎథెల్‌స్టను 925—940 | 937 బ్రునానుబరు యుద్ధము. | 943 డన్‌స్టను, గ్లాస్టనుబరికి ఆచార్యుడగుట. |
| 950 | శాంతిప్రవణుడగు ఎడ్గారు (Edgar the Peaceful) 958—975. | | 961 డన్‌స్టను, కాంటర్బరీకి ముఖ్యాచార్యుడగుట. |
| 1000 | అసజ్జుడగు ఎథెల్రెడు (Ethelred the Un-ready) 978—1016. | | 1002 సెయింటుబ్రైయిసు దినమున ఊచకోత (Massacre of St. Brice's day) 1013 స్వేను (Sweyn) ఇంగ్లండును జయించుట |
| | కనట్ (Cnut) 1017—1035. | | 1017—1042 డేనులు ఇంగ్లండును పాలించుట. |
| 1050 | ఎడ్వర్డు 1042—1065. | 1054—1060 దక్షిణ ఇటలీని నార్మనులు జయించుట. | 1051 గాడ్విను ప్రభువునకు ప్రవాస శిక్ష. |

| సంవత్సరము. | రాజుల పేర్లు. | అన్యదేశముల వ్యవహారములు, యుద్ధములు. | అంతరంగిక వ్యవహారములు. |
|---|---|---|---|
| 1150 | | | 1170 బెకెట్టు చావు. |
| | | | 1174 ఫాలైజు (Falaise) సంధి. |
| | | | 1181 ఆయుధ విచారణ. (Assize of Arms) |
| | మొదటి రిచార్డు 1189—1199. | 1190 మూడవ ధర్మయుద్ధము. | |
| | జాను 1199—1216 | 1204 ఫ్రెంచివారు నార్మండీ అంజోలను జయించుట. | |
| | | 1209—1213 జాను పోపుతో కలహించుట. | |
| | | 1214 బోవైన్సు యుద్ధము. (Battle of Bovnines) | 1215 అధికార ప్రదాన పత్రము. |
| 1250 | మూడవ హెన్రీ 1216—1272. | 1264 లూయిసు యుద్ధము. (Battle of Lewes) | 1219—1232 హ్యూబర్టు పరిపాలన. |
| | | 1265 ఎవెషాము యుద్ధము. | 1258 ఆక్స్ఫర్డు నియమములు. |

| సంవత్సరము. | రాజుల పేర్లు. | అన్యదేశముల వ్యవహారములు, యుద్ధములు | ఆంతరంగిక వ్యవహారములు. |
|---|---|---|---|
| 1350 | | 1356 పాయిటీర్సు యుద్ధము.<br>1360 బ్రెటిగ్నీసంధి. | 1349 కాళరాత్రి విజృంభణము.<br>జాను వైక్లిఫు. |
| 1400 | నాల్గవ హెన్రీ 1399—1413. | | 1376 మంచి పార్లమెంటు.<br>1381 కర్షకుల తిరుగుబాటు.<br>1338 దయమాలిన పార్లమెంటు (The merciless Parliament).<br>1400 — 1403 నాలవ హెన్రీపై తిరుగుబాటు. |
| | ఐదవ హెన్రీ 1413—1422. | ఏజినుకోర్టు యుద్ధము (Battle of Agin-Court,) 1415.<br>ఆర్లీన్సు ముట్టడి, 1429. | |
| 1450 | ఆరవ హెన్రీ 1422—1461. | 1455 సెయింటు ఆల్బన్సు మొదటియుద్ధము.<br>1460 వేకుఫీల్డు యుద్ధము.<br>1461 టౌటను యుద్ధము. | 1450 'జాకుకేడు' తిరుగుబాటు (Jack Cade's rebellion.) |

| సంవత్సరము. | రాజుల పేర్లు. | అన్యదేశముల వ్యవహారములు, యుద్ధములు. | ఆంతరంగిక వ్యవహారములు. |
|---|---|---|---|
| 1450 | నాల్గవ ఎడ్వర్డు 1461—1483. | 1471 బార్నెటు యుద్ధము. | |
| | | 1471 ట్యూక్స్‌బరీ యుద్ధము. | 1476 'కాక్స్టను' ఇంగ్లండులో ముద్రణ కొనితెను. |
| 1500 | మూడవ రిచర్డు 1483—1485. | 1483 మార్టిను లూథరు జననము. | 1480-1535 సర్ థామస్ మోర్. |
| | | 1485 బాస్వర్తు యుద్ధము. | ఆక్స్‌ఫర్డులో 'కోలెటు' 'ఎరాస్మసు'లు (Colet and Erasmus at Oxford.) |
| | ఏడవ హెన్రీ 1485—1509. | 1402 అమెరికాను కనుగొనుట. | |
| | | 1500 యువరాజగు హెన్రీకి ఆరగను ప్రభు కుమారియగు కాథరెనుతో వివాహము. | |
| | ఎనిమిదవ హెన్రీ 1509—1547. | 1514 ఫ్రాన్సుతో చెలిమి. | 1529 — 1536 రిఫర్మేషన్ పార్లమెంటు. |
| | | 1519 స్పెయినులో ఐదవ చార్లెసు చక్రవర్తి యగుట. | |

| సంవత్సరము | రాజుల పేర్లు | అన్యదేశముల వ్యవహారములు, యుద్ధములు. | అంతరంగిక వ్యవహారములు. |
|---|---|---|---|
| 1550 | ఆరవ ఎడ్వర్డు 1547—1553. | 1547 పింకీ యుద్ధము, (Battle of Pinkie) | 1448 ఆరవ యెడ్వర్డు యొక్క మొదటి ప్రార్థనా గ్రంథము. |
| | | 1558 'కెలెయి' నష్టమయ్యెను. | 1552 ఆరవ యెడ్వర్డు యొక్క రెండవ ప్రార్థనా గ్రంథము. |
| | | | 1556 క్రాన్మరు మరణము. |
| | మేరీ 1553—1558 | | |
| 1575 | ఎలిజబెతు 1558—1603 | ఫ్రాన్సులో మత యుద్ధములు, 1562. | 1558—1559 ఇంగ్లండులో మతనిర్ణయము. |
| | | 1572 'నెదరులండ్సు' స్పెయినుపై తిరుగబడుట. | 1564 షేక్సుపియరు జననము. |
| | | 1577—1581 'డ్రేకు' యొక్క భూప్రదక్షిణము. | 1568—1587 ఇంగ్లండులో కుట్రలు. |
| | | 1588 ఆర్మాడా. | 1587 స్కాట్లండు రాణియగు మేరీని ఉరిదీయుట. |
| | | 1594 డ్రేకు, కాడిజును ముట్టడించుట. | |

| సంవత్సరము. | రాజుల పేళ్లు. | అన్యదేశముల వ్యవహారములు, యుద్ధములు. | అంతరంగిక వ్యవహారములు. |
|---|---|---|---|
| 1625 | | 1645 'నాస్బి' యుద్ధము. | 1649 మొదటి చార్లెసు మరణము. |
| 1650 | రెండవ చార్లెసు 1660—1685. | 1652 మొదటి డచ్చి యుద్ధము. | 1660 పునః ప్రతిష్ఠ. |
| | | 1665 రెండవ డచ్చి యుద్ధము. | 1665 మహామారి. 1666 లండను తగులబడెను. |
| 1675 | | 1672 మూడవ డచ్చి యుద్ధము. | 1667 'కాబలు.' |
| | | 1685 మాన్మౌతు తిరుగుబాటు. | 1679 హేబీసు కార్పసు శాసనము. |
| | | | 1681 ఆక్స్ఫర్డు పార్లమెంటు రద్దగుట. |
| | రెండవ జేమ్సు. 1685—1688 | | 1688 ఆచార్య సప్తకాపరాధ విచారణము. |
| 1700 | మూడవ విలియము, (మేరీ రాణి.) 1688—1702. | 1689—1697. ఫ్రాన్సుతో యుద్ధము. | 1689 స్వత్వశాసనము. Bill of Rights.) 1694 మేరీరాణి మృతి. |
| | | స్పానిషు వారసత్వపు యుద్ధము 1702—1713. | 1694 ఇంగ్లండు బాంకు. 1701 సెటిలుమెంటు శాసనము. |

| సంవత్సరము. | రాజుల శ్రేణి. | అన్యదేశముల వ్యవహారములు, యుద్ధములు. | ఆంతరంగిక వ్యవహారములు. |
|---|---|---|---|
| 1700 | ఆనీరాణి.<br>1702—1714. | | 1707 స్కాట్లండుతో ఐక్యము. |
| 1725 | మొదటి జార్జి.<br>1714—1727. | 1715 స్కాట్లండులో తిరుగుబాటు. | 1716 సెప్టెనియలు శాసనము. (Septennial Act.)<br>1720 దక్షిణసముద్ర వర్తక సంఘముల దివాలా. (South Sea Bubble.)<br>1721—1742 వాల్పోలు మంత్రిత్వము. |
| 1750 | రెండవ జార్జి.<br>1727—1760. | 1739 స్పెయినుతో యుద్ధము.<br>1742—1748 ఆస్ట్రియను వారసత్వపు యుద్ధము.<br>1745 స్కాట్లండులో తిరుగుబాటు.<br>1756—1763 ఏడేండ్ల యుద్ధము.<br>1759 విజయవర్షము. | 1733 వాలుపోలుయొక్క ఎక్సైజు శాసనము.<br>1756 పిట్టు, స్టేటు సెక్రటరీ యగుట. |

| సంవత్సరము. | రాజుల పేళ్లు. | అన్యదేశముల వ్యవహారములు, యుద్ధములు. | అంతరంగిక వ్యవహారములు. |
|---|---|---|---|
| 1775 | మూడవ జార్జి. 1760—1820. | 1775—1783 అమెరికా స్వాతంత్ర్యయుద్ధము. | 1761 బ్రిడ్జివాటరు కాల్వ ప్రారంభము. |
| | | 1776 స్వాతంత్ర్యోద్ఘోషణము. | 1764 హారుగ్రీవుయొక్క నూలువడుకు యంత్రము. |
| | | 1782 ఐరిషు పార్లమెంటుకు స్వాతంత్ర్యము. | 1766 స్టాంపుశాసనము రద్దగుట. |
| | | 1789 ఫ్రెంచి విప్లవారంభము. | 1768 ఆర్క్రైటుయొక్క నేతయంత్రము. |
| 1800 | | 1793—1802 ఫ్రాన్సుతో యుద్ధము. | 1776 క్రాంప్టనుయొక్క నూలువడుకు యంత్రము. |
| | | 1800 ఐర్లండుతో ఐక్యశాసనము. | 1783 చిన్న 'పిట్టు' మంత్రియగుట |
| | | 1803—1815 నెపోలియనుతో యుద్ధము. | 1785 మరిమగ్గము. |
| | | 1805 ట్రఫాల్గరు యుద్ధము. | 1806 చిన్న పిట్టు మృతి. |
| | | 1808 వెల్లింగ్టను పోర్చుగలులో ప్రవేశించుట. | 1807 బానిస వ్యాపార నిషేధము. |
| | | 1809 వెల్లింగ్టను స్పెయినులో ప్రవేశించుట. | 1819 శాసన షట్కము. |

| సంవత్సరము. | రాజుల పేళ్లు. | అన్యదేశముల వ్యవహారములు, యుద్ధములు. | అంతరంగిక వ్యవహారములు. |
|---|---|---|---|
| 1800 | | 1815 వాటర్లూ యుద్ధము. | |
| 1825 | నాలవ జార్జి. 1820—1830. | 1821—1829 గ్రీకులు స్వతంత్రతకై పోరాటము. | 1829 కాథలిక్కులకు స్వాతంత్ర్యప్రదానము. |
| | | 1830 ఫ్రాన్సు, బెల్జియము దేశములలో విప్లవములు. | 1830 మాంచెస్టరు, లివర్పూలు రైల్వే ప్రారంభము. |
| | | | 1832 మొదటి సంస్కరణశాసనము. |
| | నాల్గవ విలియము. 1830—1837. | 1836 దక్షిణ ఆస్ట్రేలియా కాలనీ యైనది. | 1833 బ్రిటిషు డొమినియన్లలో బానిసవ్యాపార నిషేధము. |
| | | 1837 కెనడాలో తిరుగుబాటు. | |
| 1850 | విక్టోరియా. 1837—1901. | 1840 న్యూజీలండు బ్రిటిషుసామ్రాజ్య గతమగుట. | 1846 ధాన్యశాసనములు రద్దగుట. |
| | | 1848 విప్లవ పరంపర. | 1848 చార్టిస్టుల ఆందోళనము. |

| సంవత్సరము. | రాజుల పేర్లు. | అన్యదేశముల వ్యవహారములు, యుద్ధములు. | ఆంతరంగిక వ్యవహారములు. |
|---|---|---|---|
| 1850 | | 1854 — 1856 క్రిమియా యుద్ధము. | 1859 డార్విను 'సృష్టిపరిణామ' గ్రంథము ప్రకటించెను. |
| | | 1867 'కనడా' డొమినియనగుట. | 1861 విక్టోరియా భర్త మరణించెను. |
| 1875 | | 1876 బల్గేరియా దారుణములు. | 1867 రెండవ సంస్కరణ శాసనము. |
| | | 1878 బెర్లిను సంధి. | 1870 విద్యాశాసనము. |
| | | 1886 ఐర్లండునకు స్వరాజ్యమిచ్చు మొదటి బిల్లు. | 1884 మూడవ సంస్కరణ శాసనము. |
| 1900 | | 1900 ఆస్ట్రేలియా ఫెడరేషను. | 1897 డైమండు జ్యూబిలీ మహోత్సవము. |
| | | 1899—1903 దక్షిణాఫ్రికా యుద్ధము. | |

PRINTED AT THE DIOCESAN PRESS, MADRAS.—1931 A 989.